# ఆత్మ

(జనన-మరణ చక్రభ్రమణంలో మనిషి ఆత్మ ఎలాంటి స్థితి-గతులను పొందుతుంది? అన్న నిగూఢ అంశాన్ని వివరంగా తెలియజేసే అపూర్వ పరిశోధనాత్మక గ్రంథము)




**Sreedharan Kanduri**

M.A. Economics, M.A. English, M.A. Journalism, I.R.P.M.



ప్రకాశకులు: Ph : 0883-2462565,9032462565.



మోహన్ పబ్లికేషన్స్

అజంతా హెూటల్ ఎదురుగా, కోటగుమ్మం,

రాజమహేంద్రవరము - 1.

online books store : www.Devullu.com





2019 [వెల: 250-00

# ఆత్మ

రచన :

శ్రీధరన్ కాండూరి

సెల్ : 9550983755, 9603056555.

*E-mail : Mahaguru.gorak@gmail.*

ప్రధమ ముద్రణ-2019

ఈ పుస్తకం కాపీల కొరకు సంప్రదించవలసిన చిరునామా

ప్రకాశకులు:

**మోహన్ పబ్లికేషన్స్**

అజంతా హెూటల్ ఎదురుగా, కోటగుమ్మం,

రాజమహేంద్రవరము - 1.

online books store : www.Devullu.com

# ఈ గ్రంధంలో....

## పార్టు–1

1. ఆత్మ అంటే ఏమిటి? ఆత్మకు మరియు జీవాత్మకు మధ్యగల తేడా ఏమిటి?
2. హైందవ మత వేదాంతంలో చెప్పబడిన 'పంచకోశ' శరీర మర్మం ఏమిటి?
3. ప్రపంచంలోని విభిన్న మతాలలో ప్రచారంలో ఉన్న 'ప్రేతలోక' సంబంధ విశ్వాసాలు?
4. ప్రపంచంలోని వివిధ మత విశ్వాసాలలో 'మరణ' ప్రాధాన్యత ఏమిటి?
5. హైందవ మతంలో మహాలయపక్షం – మహా భరణి శ్రార్ధ విశేషాలు?
6. ప్రపంచ దేశాలలో ప్రచారంలో ఉన్న "అంత్యక్రియల" సాంప్రదాయములు?
7. హైందవ మతంలో పునర్జన్మ సిద్ధాంతం?
8. ప్రాచీన ఇండో–యూరోపియన్ దేశాలలోని మతాలలో ప్రచారంలో ఉన్న 'ఆత్మ' సంబంధ విశేషాలు?
9. ప్రపంచంలోని విభిన్న మతాలలో 'పునర్జన్మ' సంబంధ విశ్వాసాలు?
10. "పునర్జన్మ" సిద్ధాంతాన్ని బలపరచిన కొన్ని యదార్ధ వృత్తాంతాలు–ఇండియా?
11. ప్రపంచంలోని ప్రముఖ మతాలలో చెప్పబడిన మరణానంతర జీవిత (Life after death) విశేషాలు?
12. ప్రాచీన చైనా వేదాంత శాస్త్రంలో 'మరణాంతర జీవితం' గురించి చెప్పబడిన రహస్యాలు?
13. జైన మతంలో 'ఆత్మ'కు సంబంధించిన విశ్వాసాలు?
14. ఆత్మలు, మానవుల్ని ఆవహించటం నిజమా?
15. జపాన్ మరియు ఇంగ్లాండ్ దేశాలలో పునర్జన్మ వృత్తాంతాలు?
16. యూదు మతంలో ప్రేతాత్మలకు సంబంధించిన విశ్వాసాలు ఎలా ఉన్నాయి?

# పార్టు-2

1. ఇండియాలో యదార్థంగా జరిగిన కొన్ని 'ప్రేత' సంబంధ వృత్తాంతాలు?
2. ఇస్లాం మతంలో చెప్పబడిన 'పిశాచ(జిన్)' రహస్యాలు?
3. దయ్యాల ఉనికిని నిర్ధారించిన అనేక యదార్ధ సంఘటనలు?
4. మరణానంతర జీవితంపై జిప్సీల విశ్వాసాలు?
5. కుక్కలకు అదృశ్య శక్తులను చూసే శక్తి ఉంటుందా?
6. ఫిలిప్పైన్స్ దేశంలో నేటికీ సంచరిస్తున్న 'అశ్వాంగ్' పిశాచాల విశేషాలు?
7. దశాబ్దాల క్రితం రుమేనియాలో యదార్థంగా జరిగిన ఒక రక్తపిశాచి వృత్తాంతం?
8. ఫిలిప్పైన్స్ దేశంలో యదార్థంగా జరిగిన ఒక చేతబడి వృత్తాంతము?
9. ఫిలిప్పైన్స్ గ్రామీణ ప్రాంతాలలో సంచరించే కొరివి దయ్యం 'సాంటెల్మో' విశేషాలు?
10. ఫిలిప్పైన్స్‌లో అర్ధరాత్రి తలుపులు తట్టే మూడు ప్రేతాత్మల మర్మం?
11. ప్రపంచ వ్యాప్తంగా "కొరివి దయ్యాల"(Spectral lights)పై ఎలాంటి విశ్వాసాలు ఉన్నాయి?
12. ప్రపంచ ప్రఖ్యాత మనస్తత్వశాస్త్రవేత్త C.G. జంగ్ – ప్రేతాత్మ సంబంధ యదార్థ అనుభవాలు?
13. భారతదేశంలోని వివిధ ప్రాంతాలలో యదార్థంగా జరిగిన పిశాచ సంబంధ వృత్తాంతాలు?
14. ప్రాచీన జపాన్‌లో జరిగిన ప్రేతాత్మ సంబంధ యదార్ధ గాధలు?
15. ఆత్మలకు నిలయమైన "చార్లీ మాన్షన్" (ఛార్లీ భవనము) మర్మం ఏమిటి?
16. ప్రేతాత్మల గ్రామం 'దాగ్‌షాయ్' (సిమ్లా) మర్మం ఏమిటి?
17. ప్రాచీన జపాన్‌లో సర్ప సంబంధ ప్రేతాత్మలు/శాపాలు?
18. చనిపోయిన జంతువులు కూడా దయ్యాలుగా మారతాయా?



# ఉపోద్ఘాతము

**1. దేహినోఽ స్మిన్ యథా దేహే కౌమారం యౌవనం జరా।
తథా దేహాంతరప్రాప్తి: ధీరస్తత్ర న ముహ్యతి ॥**

మనిషి దేహంలో జీవాత్మ ఉన్నంతవరకు ఆ దేహానికి కౌమారము, యవ్వనము, వార్ధక్యము ఉంటాయి. అదేవిధంగా, ఆయుర్దాయం తీరిపోయిన తరువాత జీవాత్మ ఆ శరీరాన్ని వదిలిపెట్టి ఇంకొక నూతన శరీరాన్ని పొందుతుంది. అనగా, శరీరానికి నాశనం ఉందికాని, జీవాత్మకు నాశనం లేదని శ్రీకృష్ణపరమాత్ముడు భగవద్గీతలో ఉద్ఘాటించాడు.

**2. వాసాంసి జీర్ణాని యథా విహాయ నవాని గృహ్ణాతి నరోఽ పరాణి ।
తథా శరీరాణి విహాయ జీర్ణా న్యన్యాని సంయాతి నవాని దేహీ ॥**

మానవుడు అప్పటివరకు తాను ధరించిన చిరిగిపోయిన లేదా పాతపడిన దుస్తులను ఏవిధంగా వదిలివేసి, మరల నూతన దుస్తులు ధరిస్తాడో అదేవిధంగా మానవుని ఆత్మ, బలహీనం అయిపోయిన తన శరీరాన్ని వదిలిపెట్టి ఇంకొక కొత్త శరీరాన్ని ధరిస్తుంది అని పరమాత్మ స్వయంగా తెలియజేసాడు.

**3. నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావక: ।
స చైనం క్లేదయంత్యాపో సశోషయతి మారుత:॥**

ఆత్మ ఒక మరణంలేని పదార్థం. అది నీటిలో మునిగి నాశనం కాదు. అగ్నిలో దహనంకాదు. గాలి, "ఆత్మ జ్యోతి"ని ఆర్పివెయ్యలేదు. అనగా, భూతత్వంగల ఏ బలంతోనూ లేదా అస్త్రంతోను ఆత్మ నాశనం కాదు. ఆత్మను కేవలము ఆ భగవంతుడు మాత్రమే సంపూర్తిగా నిర్మూలించగలడు.

**4. జాతస్య హి ధ్రువో మృత్యు: ధ్రువం జన్మ మృతస్య చ ।
తస్మాదపరిహార్యేఽ ర్థే న త్వం శోచితుమర్హసి ॥**

పుట్టిన ప్రతి మనిషీ ఏదో ఒక వయస్సులో తప్పనిసరిగా మరణించటం జరుగుతుంది. ఎంత గొప్ప ఆరోగ్య వంతుడైనా, ఎంతటి ధనవంతుడైనా ఆయుర్దాయం

తీరిపోగానే ఈ శరీరాన్ని వదిలిపెట్టి వెళ్ళిపోవలసిందే. అందువలన, చనిపోయిన వ్యక్తి గురించి ఎవరూ బాధపడకూడదు. చావు మరియు పుట్టుక అనేవి చాలా సహజంగా జరిగే ప్రక్రియలు అని అర్థంచేసుకోవాలి.

ఆత్మకు "ఆది" మరియు "అంతము" లేవని హైందవ మత ప్రామాణిక గ్రంథం అయిన "భగవద్గీత"లో కొన్ని వేల సంవత్సరాల క్రితమే ఉద్ఘాటించబడింది. ఆత్మకు మరణం లేదని – బౌద్ధమతంలో, జైనమతంలో, క్రైస్తవమతంలో, ఇస్లాంమతంలో, బహాయి మతంలో స్పష్టంగా చెప్పబడి ఉన్నది. ఇంకొక విశేషం ఏమంటే, కొన్నివేల సంవత్సరాల క్రితం, లాటిన్ అమెరికా దేశాలైన మెక్సికో, బ్రెజిల్ లాంటి దేశాలలోని ఆదిమానవులు కూడా ఆత్మకు చావులేదని బలంగా విశ్వసించారు. ఇంకొక విశేషం ఏమంటే, కొద్ది దశాబ్దాల వరకు ఆఫ్రికాలోని చాలా దేశాల ప్రజలను ఐరోపా వాసులు, అనాగరికులుగా, అజ్ఞానులుగా భావించారు. కానీ, ఆఫ్రికా దేశాలలోని ఆదిమజాతి ప్రజలు కూడా "ఆత్మ" యొక్క శాశ్వతత్వాన్ని స్పష్టంగా తెలుసుకున్నారు. పునర్జన్మలు నిజంగా ఉన్నాయని తమ అనుభవాల ద్వారా గుర్తించారు.

పుట్టిన ప్రతి మనిషి మరణించటం ఖాయం. అయితే ఏ వైద్యుడూ కూడా ఒక మనిషి ఎప్పుడు చనిపోతాడు? అన్న విషయాన్ని ఖచ్చితంగా చెప్పలేడు. కొన్ని రకాల వ్యాధులతో బాధపడే వారిని లేదా తీవ్రమైన ప్రమాదాలకు గురైన వారిని పరిశీలించి వాళ్ళు బ్రతుకుతారా? లేదా?, మరియు వాళ్ళు ఇంకా ఎన్ని రోజులు బ్రతికే అవకాశం ఉన్నది? అన్న విషయాన్ని, బాగా అనుభజ్ఞులైన వైద్యులు చాలా వరకు ఖచ్చితంగా చెప్పే అవకాశం ఉంటుంది. కానీ, పరిపూర్ణమైన ఆరోగ్యంతో ఉన్న వ్యక్తి ఎప్పుడు చనిపోతాడో? ఏ వైద్యుడూ ఏమాత్రం చెప్పలేడు.

అయితే, ఒక వ్యక్తి యొక్క మరణ సమయం ఎప్పుడు? అన్న విషయాన్ని అతడి లేదా ఆమె జన్మకుండలిని ద్వారా ఖచ్చితంగా తెలుసుకోవచ్చు. అయితే ఏ జ్యోతిష్కుడూ సాధ్యమైనంతవరకు ఏ వ్యక్తికి అతడి మరణ సమయం ఎప్పుడో? చెప్పడు అని గ్రహించాలి. ఏది ఏమైనా, పుట్టిన ప్రతి మనిషీ చనిపోవటం, ఆపై మళ్ళీ జన్మించి తన గతజన్మ కర్మ ఫలాలను అనుభవించక తప్పదు. ఈవిధంగా, ఆత్మ తన గమనంలో మళ్ళీ మళ్ళీ ఈ భూమిపై మానవ రూపంలోను, జంతు రూపంలోను, వివిధ రకాల

కీటకాల రూపంలోనూ జన్మిస్తూ, మరణిస్తూ – ఒక అంతులేని 'జనన–మరణ' చక్రంలో చిక్కుకుని పరిభ్రమిస్తూ ఉంటుంది.

చనిపోయిన ప్రతి మనిషి ఆత్మ, మళ్ళీ ఈ భూమిమీద మానవ రూపంలోనో లేక ఇంకే జీవి రూపంలోనో జన్మించాలన్న ఖచ్చిత నియమం ఏదీ లేదు. కొన్ని ప్రత్యేక పరిస్థితులలో కొందరు మానవులు, దారుణమైన మరణాన్ని పొందటం జరుగుతుంది. అలాంటి మానవుల యొక్క ఆత్మలు – అటు పుణ్యలోకాలకు వెళ్ళలేక, ఇటు, తమ చెడుకర్మ ఫలాన్ని అనుభవించటానికి నరక లోకానికి వెళ్ళలేక – ఈ భూమిపైనే పిశాచి రూపం ధరించి, చాలాకాలంపాటు తీవ్రమైన ఆవేదనను అనుభవించటం జరుగుతుంది. ఒక పరిధిని దాటి విపరీతమైన పాపకర్మలు చేసిన మానవుల ఆత్మలు కూడా ప్రేతాత్మలుగా మారతాయి. ప్రపంచంలోని దాదాపు అన్ని దేశాలలో "ప్రేతాత్మలు" నిజంగా ఉన్నాయని నమ్ముతున్నారు. అదేవిధంగా, చాలా దేశాలలో ప్రేతాత్మల ఉనికిని నిరూపించే ఎన్నో సంఘటనలు జరిగాయి. ఏదిఏమైనా, పునర్జన్మల గురించి మరియు పునర్జన్మ ఎత్తే అవకాశం లేక ప్రేతాత్మలుగా సంచరించే ఆత్మల గురించి ప్రపంచ దేశాలలో లభిస్తున్న సమాచారాన్ని ఆధారంగా చేసుకుని రచించబడినది ఈ **"ఆత్మ"** అనే పరిశోధనాత్మక గ్రంథం.



# పార్టు-1

## 1. ఆత్మ అంటే ఏమిటి? ఆత్మకు మరియు జీవాత్మకు మధ్యగల తేడా ఏమిటి?

పాశ్చాత్య దేశాల వేదాంతశాస్త్రం, ఐరోపా ఖండంలోని దేశమైన ప్రాచీన గ్రీసు దేశంలో ఆవిర్భవించిన వేదాంత సూత్రాలపై ఆధారపడి ఏర్పడింది. ఇక, తూర్పు దేశాల వేదాంతశాస్త్రం, భారతదేశంలో ఆవిర్భవించిన వేదాంత సూత్రాలపై ఆధారపడి ఆవిర్భవించిందని గుర్తించాలి. ప్రాచీనకాలంలో భారతదేశంలో జీవించిన లోకాయత మతస్థులు - ఆత్మ నిజంగా ఉండదని, మనిషి శరీరమే ఆత్మ అని, ఇంకా స్పష్టంగా చెప్పాలంటే, శరీరానికి ఆత్మకు తేడా లేదని వాదించారు. కానీ, శరీరం వేరు, ఆత్మవేరు అని హైందవ వేదాంతశాస్త్రాలు ఉద్ఘాటించాయి. "ప్రాణ" అనే సంస్కృత పదానికి కదలిక, చలనం, కంపించటం (వైబ్రేషన్) - అనే అర్థాలు ఉన్నాయి. కనుక మనిషి శరీరంలో ఉండే ప్రాణశక్తి ఆ మనిషి జీవించి ఉన్నంత వరకు నిరంతరం ఆ శరీరంలోనే చలిస్తూ ఉంటుంది. అనగా కదులుతూ ఉంటుంది.



మనిషి భౌతిక దేహంలో ఉండే మెదడు, మనిషి యొక్క చర్యలను ప్రభావితం చేస్తుంది. ఇక, మనిషి దేహంలో ఉండే గుండె (హార్ట్) - మనిషి బ్రతికి ఉండటానికి తోడ్పడుతుంది. మనిషిని నడిపేది అతడి మెదడా? లేదా హృదయమా? - అన్న విషయం తేల్చి చెప్పటం చాలా కష్టం అని గుర్తించాలి. ఎందుకంటే, - 'మనసు' అనే శక్తి, మనిషిని నడుపుతుందని, అందువలన

'గుండె'(హార్ట్)'ను మనసు అని చాలామంది భావిస్తూ ఉంటారు. మనిషి శిరస్సులో ఉండే "మెదడు" పని చేసినంత కాలమే మనిషి ఏ పని అయినా చెయ్యగలడు. కనుక మెదడుని (బ్రైన్) 'మనసు' అని మరికొంతమంది భావిస్తూ ఉంటారు. అయితే వీరి ఎవరికీ తెలియని అతి ముఖ్యమైన విషయం ఏమంటే, 'మనసు' అంటే – అటు మెదడు కాదు, ఇటు గుండె కాదు. మరి, మనసు అంటే ఏమిటి? అనే సందేహం ఏర్పడుతుంది. ఈ ప్రశ్నకు వేదాంత శాస్త్రాలు చెబుతున్న తిరుగులేని సమాధానం ఏమంటే, మనసు అనగా "ఆత్మ" (Soul/Spirit) అని గ్రహించాలి. ఎందుకంటే, ఒక మనిషియొక్క గుండెను ఇంకొక మనిషికి అమర్చినప్పుడు – ఆ గుండె ఎవరిదో ఆ వ్యక్తి యొక్క ఆలోచనలు, స్వభావం, జ్ఞాపకాలు – ఆ గుండెను అమర్చబడిన వ్యక్తికి సంక్రమించవు. కనుక ఇంకొకరి గుండెను అమర్చుకున్న వ్యక్తి, గతంలో తనకు ఏవిధమైన స్వభావం ఉన్నదో అదే స్వభావాన్ని కొత్త గుండెను పెట్టుకున్న తరువాత కూడా కలిగి ఉంటాడు. అనగా, గుండె మరియు ఆత్మ ఒకటి కాదని గుర్తించాలి. కనుక మనిషియొక్క మనసు అంటే, అతనియొక్క ప్రాణం అని అర్థం. మనిషి యొక్క స్వభావం అతని ఆత్మలో దాగి ఉంటుంది. ఆ మనిషి చనిపోయిన తరువాత ఆ ఆత్మ, ఆ మనిషి శరీరాన్ని వదిలిపెట్టి బైటకు వచ్చినప్పటికీ ఆ మనిషియొక్క స్వభావం ఆ ఆత్మలో ఉంటుంది. అంతేకాకుండా, ఆ మనిషి జీవించి ఉన్నప్పుడు చేసిన మంచి లేదా చెడు కర్మల యొక్క ఫలితాలు కూడా ఆ ఆత్మను అంటి పెట్టుకుని ఉంటాయి.

ఈ భూమిపైన జీవించే జీవులన్నీ ఏదో ఒక రోజున మరణించక తప్పదు. అయితే, మనిషి చనిపోయాడు అని గుర్తించబడిన తరువాత అతని శరీరంలో కదలికలు ఉండవు. అప్పుడు ఆ శరీరాన్ని "మృతదేహం" అని పిలుస్తారు. అప్పటి వరకు ఆ శరీరం కదలటానికి, అనేక పనులు చెయ్యటానికి కారణమైన ఏదో ఒక శక్తి ఆ శరీరం నుండి బైటకు వెళ్ళిపోయిన కారణంగానే, ఆ శరీరం నిర్జీవంగా మిగిలిపోయిందని భావిస్తారు. అలా, ఒక మనిషి లేదా జంతువు యొక్క దేహం ఈ భూమిమీద సంచరించటానికి మరియు తనకు సంబంధించిన పనులు చేసుకోవటానికి సహకరించే ఒక అదృశ్య శక్తినే "ఆత్మ" అని భావిస్తున్నారు.

అసలు ఆత్మ అంటే ఏమిటి?, మనిషితో సహా ఈ భూమిపై జీవిస్తున్న జీవులన్నింటిలోను ఆత్మ ఉంటుందా? ఆత్మ స్వరూపం ఎలా ఉంటుంది?, ఒక మనిషి చనిపోయిన తరువాత అతని ఆత్మ అక్కడే ఉంటుందా?, లేక ఎక్కడికైనా వెళు తుందా?, – అన్న ప్రశ్నలు అనాది కాలం నుండి ప్రపంచ వ్యాప్తంగా ఉన్న ఎందరో మేధావులను తీవ్రంగా ఆలోచింపచేసింది. ఎంతో అభివృద్ధి చెందిన సైన్స్ కూడా

ఆత్మ అంటే ఏమిటో?, ఆత్మ నిజంగా ఉన్నదా? లేదా? – అన్న ప్రశ్నలకు ఈనాటికీ సమాధానం చెప్పలేకపోతున్నది. కానీ, కొన్నివేల సంవత్సరాల క్రితమే, భారతదేశానికి చెందిన మహర్షులు, మరణానంతర జీవితం గురించి అనగా ఆత్మకు సంబంధించిన ఎన్నో నిగూఢమైన రహస్యాల గురించి లోకానికి తెలియజేసారు. దాదాపు ఐదువేల సంవత్సరాల క్రితం వ్రాయబడింది అని చెప్పబడిన శ్రీమద్భగవద్గీతలో ఆత్మకు సంబంధించిన అద్భుతమైన సమాచారం లిఖించబడి ఉన్నది.

ఈ లోకంలో అనగా భూమిమీద జన్మించే మానవుల ఆత్మలలో నాలుగు రకాలు ఉంటాయని హైందవ ధర్మశాస్త్రాలలో చెప్పబడి ఉన్నది. అది ఎలాగంటే...

**1.అనాగరిక లేదా పూర్తి అజ్ఞానం నిండిన ఆత్మలు :** ఈ ఈరకమైన ఆత్మలు, మానవులుగా ఉన్నప్పుడు పూర్తిగా తమ ఇంద్రియాలకు బానిసలుగా ఉంటాయి. మంచి, చెడు అనే విచక్షణ లేకుండా, తాము కోరినవి పొందాలని, అన్ని రకాలుగా ప్రయత్నిస్తాయి. ఇలాంటి స్వభావం కలిగిన మానవులు తమ మరణానంతరము పుణ్యలోకాలకు వెళ్ళలేరు. ఈ మానవులు, చనిపోయిన తరువాత కొంతకాలంపాటు ప్రేతలోకంలో ఉండి, ఆపై అతి కొద్దికాలంలోనే, అతి దుర్మార్గ స్వభావంగల మానవులుగా జన్మిస్తారు.

**2. స్వల్పస్థాయిలో జ్ఞానాన్ని అభివృద్ధి చేసుకున్న ఆత్మలు :** ఈ రకమైన ఆత్మలు, మరణం కారణంగా తమ శరీరాలను వదిలిపెట్టి ఆపై ఆత్మలలోకానికి పైన ఉండే చిన్నస్థాయి పితృలోకానికి వెళతారు. ఆ లోకంలో దీర్ఘకాలంపాటు నివసించి, ఆపై మళ్ళీ మానవులుగా జన్మిస్తారు.

**3. పరిపూర్ణమైన జ్ఞానం కలిగిన ఆత్మలు :** ఈ వర్గానికి చెందిన ఆత్మలు, తమ మరణానంతరము తమయొక్క సూక్ష్మ దేహాన్ని మరియు మనోమయ కోశాన్ని (Mental Sheath) త్యజించి, అనేక సంవత్సరాలపాటు (భూలోకం యొక్క సమయంతో పోల్చినప్పుడు అన్నమాట.) ఆత్మల లోకంలో నివసించి ఆపై భూమిమీద మానవ రూపంలో జన్మించటం జరుగుతుంది.

**4. విముక్త ఆత్మలు :** పరిపూర్ణమైన దైవజ్ఞానాన్ని పొందిన ఆత్మలను "విముక్త ఆత్మలు" అని పిలుస్తారు. ఈ ఆత్మలకు – తమ భౌతిక మరణం తరువాత సూక్ష్మ శరీరాన్ని లేదా మనోమయ కోశాన్ని వదిలిపెట్టవలసిన అవసరంగాని లేదా ఆత్మల లోకంలో కొంతకాలం పాటు విశ్రాంతి తీసుకోవలసిన అవసరంగాని ఉండదు. ఇలాంటి ఆత్మలు ఆ దైవ సంకల్పం వల్ల, ఈ భూమిమీద పుట్టుకతోనే మహా

జ్ఞానులుగా జన్మిస్తారు. జగద్గురు ఆదిశంకరాచార్య, మధ్వాచార్య, రామకృష్ణ పరమహంస లాంటి యోగులు అలాంటి 'విముక్త ఆత్మల'ని గుర్తించాలి. వీరు పుట్టినప్పటి నుండి ఇహలోక బంధాలకు సంపూర్తిగా దూరంగా ఉంటారు. తాము ఏ కారణంచేత అయితే ఈ భూమిమీద మాన రూపంలో జన్మించారో ఆ కార్యసాధనకోసం జీవించి, ఆపై తమ అవతారాన్ని ముగించుకుని వెళ్ళిపోతారు.

**మనిషి శరీంలో పంచభూత తత్వములు :** మానవ దేహం పంచభూతాలతో నిర్మించబడిందని హైందవ మరియు ప్రాచీన చైనా వేదాంత శాస్త్రాలు ఉద్ఘాటిస్తున్నాయి. దేవతలు లేదా దేవుళ్ళు కాంతి స్వరూపాన్ని కలిగి ఉంటారు. వారి దేహాలు 'అగ్నితత్వంతో" రూపొందిచబడి ఉంటాయి. ఇక, మానవుల దేహాలలో "భూతత్వం" అత్యధికంగా ఉంటుంది. ఇక, జలంలో జీవించే చేపలు, మొసళ్ళు, తాబేళ్ళు, కప్పలు లాంటి జలచరాలలో "జలతత్వం" అధికంగా ఉంటుంది. ఆకాశంలో ఎగిరే పక్షులలో, భూమిపై కొంచెం దూరం ఎగిరే పక్షులలో (కోళ్ళు, నెమళ్ళు లాంటివి అన్నమాట.) "వాయుతత్వం" అధికంగా ఉంటుంది.

మానవ శరీరం పంచ భూతాలతో తయారైంది కనుక ఒక్కొక్క భూతం (ప్రకృతి మూలకం) యొక్క తత్వం – మానవ శరీరంలోని ఒక్కొక్క లక్షణానికి కారణం అవుతుందని యోగశాస్త్రం తెలియజేస్తున్నది. మనిషి శరీరం గట్టిగా ఉంటుంది. అందుకు కారణం భూ తత్వం. మనిషి శరీరంలో ద్రవాలు ప్రవహిస్తూ ఉంటాయి. అందుకు కారణం జలతత్వం. మనిషి శరీరంలో వేడి ఉంటుంది. అందుకు కారణం అగ్నితత్వం. మనిషి అటు, ఇటు కదులుతాడు. ప్రయాణిస్తాడు. ఇందుకు కారణం అతనిలోని వాయుతత్వం. మానవ శరీరం ఎక్కడ ఉన్నప్పటికీ కొంత ప్రాంతాన్ని ఆక్రమిస్తుంది. అది అతనిలోని ఆకాశ తత్వం యొక్క ప్రభావం. మనిషియొక్క పంచభూత తత్వానికి మరియు మనిషిలో ఉండే ఆత్మకు చాలా తేడా ఉన్నది. ఇంకా స్పష్టంగా చెప్పాలంటే, ఈ పంచ భూత తత్వాలకు "ఆత్మ" చాలా భిన్నంగా ఉంటుంది. మనిషి చనిపోయిన తరువాత అతనిలోని భూతత్వం భూమిలో కలిసి పోతుంది. ఇతర నాలుగు తత్వాలూ వాటికి సంబంధించిన నాలుగు భూతతత్వాలలో లీనం అయిపోతాయి.

వేదాంతశాస్త్ర పండితులు ఇచ్చిన నిర్వచనం ప్రకారం చూసినట్లయితే, "ఒక జీవి – అది మనిషికావొచ్చు, ఒక క్రూర జంతువు కావొచ్చు, ఒక పాము కావొచ్చు, ఒక పక్షి కావొచ్చు". – ఆ జీవి అటు, ఇటు తిరగటానికి, జీవ సంబంధ క్రియలైన ఆహారం తీసుకోవటం, నిద్రపోవటం, శృంగారం జరపటం లాంటివి జరపాలంటే

ఆ జీవులలో ఏదో ఒక శక్తి లేదా నడిపించే శక్తి ఉండాలి. ఆ శక్తినే ప్రాణశక్తి (వైటల్ ఎనర్జీ) అని పిలుస్తున్నారు. ఒక జీవి సజీవంగా ఉన్నప్పుడు ఆ జీవిలో ఉండే ప్రాణాన్ని **'జీవాత్మ'** అని పిలుస్తారు. ఆ జీవి మరణించిన తరువాత ఆ ప్రాణం ఆ జీవి దేహాన్ని వదిలిపెట్టి బైటకు వచ్చేస్తుంది. అప్పుడు ఆ ప్రాణాన్ని **'ఆత్మ'** అని పిలుస్తారు. మనిషి మరణించిన తరువాత ఆ మనిషి ఆత్మ, పైన ఉండే పుణ్య లోకాలకు గాని లేదా క్రింద ఉండే నరకం లాంటి చీకటి లోకాలకు గాని వెళ్ళటం జరుగుతుంది. అయితే ఒక జీవియొక్క కర్మఫలం కారణంగా ఒక్కోసారి ఆ జీవియొక్క ఆత్మ అటు పై లోకాలకు వెళ్ళలేక, ఇటు క్రింద లోకాలకు వెళ్ళలేక భూమిపైనే ఒకవిధమైన తీవ్రమైన బాధ అనుభవిస్తూ సంచరిస్తుంది. అలాంటి రూపాన్నే 'ప్రేతాత్మ' అనే పేరుతో పిలుస్తారు.

ఐరోపా ఖండానికి చెందిన ప్రాచీన గ్రీకుదేశ వేదాంతులు, మరణానంతర జీవితం ఉంటుందని, ఆత్మ అనే ఒక అదృశ్య శక్తి ఉన్నదని తీర్మానించారు. అలాగే ప్రాచీన ఈజిప్టుదేశ మతంలో కూడా ఆత్మ ఉనికి గురించి, మరణానంతర జీవితం గురించి ఎన్నో విశేషాలు గ్రంథ రూపంలో భవిష్యత్ తరాలకు అందించబడ్డాయి. ఇక, ఆసియా ఖండం విషయానికి వచ్చినట్లయితే మహాయాన బౌద్ధమతాన్ని పాటించే చైనా, జపాన్, థాయ్‌లాండ్, టిబెట్ లాంటి దేశాల్లో కూడా "ఆత్మ" నిజంగా ఉంటుందని, మనిషి మరణించిన తరువాత అతడి లేదా ఆమె యొక్క ఆత్మ – తాను చేసిన కర్మలయొక్క ఫలితాన్ని బట్టి స్వర్గానికో, నరకానికో వెళుతుందని, చేసిన కర్మలు పాపకర్మలు అయినట్లయితే ఆ ఆత్మ, ప్రేతాత్మగా అనగా పిశాచిగా మారి మానవులకు తీవ్రమైన హానికారకము అవుతుందని బలంగా విశ్వసించబడింది.

**ప్రాచీన ఈజిప్టులో ఆత్మ సంబంధ విశ్వాసములు :**

ప్రాచీన ఈజిప్టు దేశం విషయానికి వచ్చినట్లయితే, ఆ దేశ మత గ్రంథాలలో ఇవ్వబడిన సమాచారం ప్రకారం చూసినట్లయితే, మనిషి ఆత్మలో – 1. బా (Ba) 2. కా (Ka) 3. రెన్ (పేరు/Name) 4. షూయట్ (నీడ) 5. ఇబ్ (గుండె/హార్ట్) – అనే ఐదు భాగాలు ఉంటాయని, ఈ ఐదు భాగాలతో కూడిన ఆత్మ – మనిషి దేహంలో ఉన్నంత వరకు ఆ మనిషి సజీవుడిగా ఉంటాడని తెలుస్తున్నది.

**1. 'బా'** (Ba) **:** ఆత్మలో మొదటి భాగం అని చెప్పబడిన 'బా' (Ba) అనగా ఆత్మయొక్క వ్యక్తిత్వం లేదా స్వభావం అని గుర్తించాలి. అది ప్రతి ఆత్మకు ప్రత్యేకంగా ఉంటుంది.


'బా' (Ba)

ఒక మనిషియొక్క వ్యక్తిత్వం అనగా ఆ మనిషి యొక్క తెలివితేటలు, ఇతరులపై అతడికి ఉండే ప్రేమాభిమానాలు లాంటి మానసికమైన లేదా అభౌతికమైన గుణాలయొక్క కలయికనే 'బా' (Ba) అని పిలుస్తారు. ప్రతి మనిషికీ ఒక ప్రత్యేకమైన 'బా' (Ba) ఉంటుంది. ప్రాచీన ఈజిప్టు దేశంలోని మతపరమైన గ్రంథాలలో మరియు సమాధులపైన చెక్కబడిన శిల్పాలపైన 'బా' (Ba) యొక్క రూపం ఎలా ఉంటుందో తెలియజేయబడింది. మానవ శిరస్సు కలిగిన ఒక పక్షి రూపంలో మనిషియొక్క 'బా' (Ba) ఉంటుంది. పక్షులు ఏ లోకంలోకైనా ప్రవేశించగలవని ప్రాచీన ఈజిప్టు ప్రజలు విశ్వసించారు. ఆ కారణంగానే మనిషి యొక్క 'బా' (Ba) కూడా పక్షి రూపంలో ఉంటుందని వారు భావించటం జరిగింది.

**2. 'కా'** (Ka) : ఇక, ఆత్మలోని రెండవ భాగం అయిన ప్రతి మనిషికీ ఒక ప్రత్యేకమైన 'కా' (Ka) ఉంటుంది. ఈ 'కా' (Ka) మనిషిలోని ప్రాణశక్తిగా గుర్తించబడింది. మనిషి మరణించిన తరువాత అతడి భౌతికదేహం నశించిపోయినప్పటికీ, అతనిలోని ప్రాణశక్తి అయిన 'కా' (Ka) మాత్రం జీవించే ఉంటుంది. 'కా' (Ka) విషయానికి వచ్చినట్లయితే దానిని ప్రాచీన ఈజిప్టు వేదాంతులు "ప్రాణం లేదా జీవ సారం" అని పిలిచారు. బ్రతికి ఉన్న వ్యక్తికి మరియు చనిపోయిన వ్యక్తికి మధ్య తేడాను ఈ 'కా' (Ka) నిర్ణయిస్తుంది. అనగా, మనిషి శరీరంలో 'కా' (Ka) ఉంటేనే ఆ మనిషి సజీవుడని, ఆ శరీరంలో 'కా' (Ka) లేకపోతే అతడు మరణించాడని గ్రహించాలి. మనిషి దేహం నుండి 'కా' (Ka) సంపూర్తిగా బైటకు వెళ్ళిపోతే ఆ మనిషి చనిపోయినట్లుగా తీర్మానిస్తారు. మనిషి చనిపోయిన తరువాత ఆత్మలోని భాగాలైన 'కా' (Ka) మరియు 'బా'(Ba)లు కలిసి 'అఖ్' అనే ఒక ప్రత్యేక రూపంగా ఏర్పడతాయి. ఈ 'అఖ్' అనే ప్రాచీన ఈజిప్టు పదానికి "శక్తిగలది" అని అర్థం. ఒక విశేషం ఏమంటే, బ్రతికి ఉన్న మనిషికి జీవించటంకోసం ఆహార పానీయాలు ఏవిధంగా అవసరం అవుతాయో, అదేవిధంగా 'కా' (Ka) జీవించాలన్నా


'కా' (Ka)

దానికి అన్న–పానీయాలు అవసరం అవుతాయని ఆనాటి ఈజిప్టు మత పెద్దలు నిర్ధారించారు. ఆ కారణంగానే ఆనాటి ఈజిప్టు దేశంలోని సమాధుల లోపల ఉండే గోడలపై ఆహార పదార్థాలయొక్క చిత్రాలు గీసేవారు. ఆ సమాధిలో ఉండే 'కా' (Ka) ఆ ఆహారపదార్థాల బొమ్మలలో ఉండే శక్తిని ఆహారంగా తీసుకుంటుందని వారు విశ్వసించటం జరిగింది. బొమ్మలో ఉండే ఆహారంయొక్క సారం కారణంగా 'కా' (Ka) చాలాకాలంపాటు అనగా వేల సంవత్సరాలపాటు జీవించి ఉండగలదని ఆనాటి ప్రజలు భావించటం జరిగింది.

మనిషి చనిపోయిన తరువాత ఆ మనిషిలోని ఆత్మ రెండు భాగాలుగా చీలిపోతుంది. మనిషి మృతదేహాన్ని సమాధిలో ఉంచిన తరువాత, ఆ సమాధిలోని మృతదేహం నుండి ఆత్మలో ఒక భాగమైన 'బా' (Ba) ప్రతి రోజూ ఉదయం, సమాధిలోంచి బైటకువెళ్ళి తన కుటుంబ సభ్యులు ఏవిధంగా బ్రతుకుతున్నారు? అన్న విషయాన్ని తెలుసుకుంటూ ఉంటుంది. ఇక, ఆత్మలోని రెండవ భాగం అయిన 'కా' (Ka) పైన ఉండే స్వర్గలోకానికివెళ్ళి అక్కడ లభించే సుఖాలను తనివితీరా అనుభవిస్తుంది. రాత్రి అయ్యే సమయానికి 'కా' (Ka) మరియు 'బా' (Ba) – మళ్ళీ సమాధిలోకి తిరిగి వచ్చేస్తాయి.

**3. రెన్ (పేరు/Name) :** ఆత్మలోని భాగం అయిన 'రెన్' అనగా ఒకవ్యక్తి పుట్టినప్పుడు ఆ వ్యక్తికి పెట్టబడిన పేరు అని అర్థం. ఒక మనిషికి పుట్టినప్పుడు పెట్టిన పేరు ఈ లోకంలోని మనుషులు గుర్తుంచుకున్నంత వరకూ ఆ పేరుకు సంబంధించిన రెన్, భూమిమీద సజీవంగా ఉంటుందని ప్రాచీన ఈజిప్టువాసులు విశ్వసించారు.

ఒక మనిషియొక్క మృతదేహాన్ని సమాధి చేసిన తరువాత ఆ సమాధి మీద, అందులో సమాధి చేయబడిన వ్యక్తియొక్క పేరు చెక్కబడుతుంది. సమాధిలోంచి సూర్యోదయం తరువాత బైటకు వెళ్ళిపోయే 'కా' (Ka) మరియు 'బా' (Ba) – రాత్రి సమయానికి సమాధి వద్దకు తిరిగివచ్చి ఆపై తమకు సంబంధించిన వ్యక్తియొక్క పేరు ఏ సమాధి మీద ఉన్నదో, ఆ సమాధి తమకు సంబంధించినది అని గుర్తించి ఆపై ఆ సమాధిలోకి ప్రవేశిస్తాయి. సమాధి పైన పేరు లేనట్లయితే 'కా' మరియు 'బా'లు తమయొక్క సమాధి ఏదో గుర్తించలేవు.కనుక ఆనాటి ఈజిప్టు ప్రజలు – సమాధి చెయ్యబడిన తమవారియొక్క సమాధులపై వారి పేర్లను చెక్కటంకాని లేదా వారి పేర్లు ఉన్న ఫలకాలను సమాధులపైన అతికించటంకాని జరిగింది.

**4. షూయట్ (నీడ) :** ఆత్మలోని నాల్గవ భాగమైన 'షూయట్' అనగా మనిషియొక్క నీడ అని గుర్తించాలి. ఈ నీడ, ఈజిప్టు మతంలో చెప్పబడిన మృత్యుదేవత అయిన అనూబిస్ యొక్క సేవకుడు అని చెబుతారు. ఒక మనిషి, వెలుతురులోకి వెళ్ళినప్పుడు ముఖ్యంగా, సూర్యుడి వెలుతురులోకి వెళ్ళినప్పుడు మనిషియొక్క రూపం – నీడ రూపంలో ప్రతిఫలిస్తుంది. ఈ నీడ తన శరీరాన్ని ఒక అంగరక్షకుడిలాగా కాపాడుతుందని ఆనాటి ఈజిప్టు ప్రజలు బలంగా విశ్వసించారు. (పిశాచాలకు నీడ మరియు ప్రతిబింబము ఉండవని ప్రపంచంలోని అనేక మతాలలో స్పష్టంగా చెప్పబడి ఉన్నది.

**5. ఇబ్ (గుండె/హార్ట్) :** ఇంకొక ముఖ్య విశేషం ఏమంటే, ఆత్మలో 5వ భాగం అయిన ఇబ్ అనగా గుండె (హార్ట్), మరణానంతర జీవితానికి ప్రధాన ఆధారం అని ఈజిప్టు మతంలో నిర్ధారించబడింది. అది ఎలాగో తెలుసుకుందాం...

ప్రాచీన ఈజిప్టు తాంత్రిక గ్రంథమైన "మృతుల గ్రంధము" (Book of the Dead)లో ఇవ్వబడిన సమాచారం ప్రకారం చూసినట్లయితే "ఒక మనిషి మరణించిన తరువాత అతడి లేదా ఆమె ఆత్మ, ఆకాశంవైపు పయనించి ఆపై అక్కడ ఉండే "అనుబిస్" అనే దైవాన్ని కలుసుకుంటుంది. అప్పుడు ఆ దైవం ఆ ఆత్మను వెంటపెట్టుకుని "సత్య/ధర్మ మందిరం" (Hall of truth) అనే పేరుగల ఒక లోకంలోకి తీసుకువెళు తుంది. ఈ ఆత్మ అక్కడికి చేరుకునే సరికి అక్కడ, కొన్ని వందల ఆత్మలు వరుసగా నిలబడి ఉంటాయి. ఆ మందిరంలో – అక్కడకు చేరిన ప్రతి ఆత్మయొక్క మంచి మరియు చెడులు విచారించబడతాయి. అది ఎలాగంటే...

ఆ మందిరంలో ఒక సింహాసనం మీద 'తోట్' అనే పేరుగల ఒక దైవం కూర్చుని ఉంటాడు. ఆ మందిరం మధ్యభాగంలో బంగారంతో రూపొందించబడిన ఒక పెద్ద త్రాసు ఉంటుంది. ఆ మందిరంలో ఒకవైపున వేరు, వేరు సింహాసనాలపైన 42 మంది న్యాయమూర్తులు కూర్చుని ఉంటారు.

ఈ న్యాయమూర్తులే ఆత్మలయొక్క మంచి, చెడులను విచారించి ఆపై ఆ ఆత్మలకు శిక్షలు వెయ్యటం లేదా మంచి ఫలితాలు ఇవ్వటం జరుగుతుంది. ఆ తరువాత ఆ లోకానికి చెందిన కొంతమంది దూతలు, ప్రతి ఆత్మయొక్క గుండెను 'ఓసీరిస్' అనే దేవతకి అప్పగిస్తారు. ఆ దేవత – బంగారు త్రాసుయొక్క కుడి పళ్ళెంలో ఆ గుండెను ఉంచుతుంది. ఎడమ పళ్ళెంలో 'మాట్' అనే దైవం యొక్క కిరీటంలో ఉండే ఒక తెల్లటి పక్షి ఈకను ఉంచుతుంది. అలా, పక్షి ఈకతో మనిషి

గుండెను తూకం వేసినప్పుడు ఆ గుండె, పక్షి ఈక కన్నా తక్కువ బరువు తూగినట్లయితే ఆ గుండె కలిగిన ఆత్మ, మనిషిగా భూలోకంలో జీవించినప్పుడు చాలా మంచి పనులు చేసినట్లుగా గుర్తిస్తారు. అందుకు ప్రతిఫలంగా ఆ గుండెకు సంబంధించిన ఆత్మ, అనంతకాలం దైవానికి సంబంధించిన స్వర్గ లోకంలో జీవించటానికి అర్హతను పొందుతుంది. ఇకపై, ఆ ఆత్మకు మరణం ఉండదు. అందువలన అది తనకు భూమిమీద ఉన్న తన వారిని చూడాలనిపించి నప్పుడు, నేరుగా భూమిమీద ఉన్న తన సమాధిలోని శరీరంలోకి ప్రవేశిస్తుంది. ఫలితంగా, ఆ శరీరం మామూలు మనిషిలాగా లేచి ఆ సమాధిలోంచి బైటకు రాగలుగుతుంది.



ఒకవేళ ఆ గుండెగల ఆత్మ, మనిషిగా ఉన్నప్పుడు భూమిమీద విపరీతమైన పాపాలు చేసినట్లయితే, ఈకతో ఆ గుండెను తూకం వేసినప్పుడు ఆ గుండె, ఈక కన్నా ఎంతో బరువు ఉన్నట్లుగా తెలుస్తుంది. అనగా ఆ గుండె గల ఆత్మ చాలా పాపంగలది అని గుర్తిస్తారు. అలా తేలిన మరుక్షణమే "అమిట్" అనే భయంకరమైన శునక రూపంలో ఉండే ఒక కుక్క, కన్నుమూసి తెరిచే లోగా ఆ 'చెడు ఆత్మ గుండె'ను నమిలి తినివేస్తుంది. అనగా ఆ గుండెకు సంబంధించిన ఆత్మ శాశ్వతంగా నశించి పోతుంది అన్నమాట. ఒక ముఖ్యవిషయం ఏమంటే, ప్రాచీన ఈజిప్టు వేదాంతంలో చెప్పబడిన సమాచారం ప్రకారం చూసినట్లయితే, ఆ మతంలో 'నరకం' అనే భావన లేదు. పాపం చేసిన వ్యక్తియొక్క ఆత్మ సంపూర్తిగా నశించి పోతుంది. ఇక, పుణ్యం చేసిన ఆత్మ, ప్రశాంతమైన మరియు ఆనందకరమైన స్వర్గంలాంటి లోకంలో శాశ్వతంగా మరియు ఆనందంగా నివసిస్తుంది. ఆ ఆత్మకి చావు ఉండదు కనుక అది

అవసరమైనప్పుడు మళ్ళీ తన సమాధిలోని తన మృతదేహంలో ప్రవేశించి మళ్ళీ జీవించగలదు.

ఆగ్నేయ-ఆసియా దేశమైన ఇండోనేషియాలో 19వ శతాబ్దం నుండి క్రైస్తవ మత ప్రచారం చేస్తున్న ఒక డచ్ క్రైస్తవ మిషరీకి చెందిన కొందరు మత ప్రచారకులు ప్రపంచానికి ఇలా తెలియజేసారు.....

ప్రాచీనకాలం నుండి ఇండోనేషియాలో ఆత్మకు సంబంధించిన ఒక విశ్వాసం ఇలా ప్రచారంలో ఉన్నది. అది ఏమిటంటే, మనిషియొక్క ఆత్మ ఆ మనిషి శిరస్సులో ఉంటుంది. ఆ కారణంగానే ఇండోనేషియాలోని ఆటవిక తెగల ప్రజలు తమ శత్రు తెగపై దాడి చేసినప్పుడు తమ చేతులలో ప్రాణాలు కోల్పోయిన శత్రువులయొక్క శిరస్సులను ఖండించి, తమ నివాస గ్రామాలకు తీసుకువెళ్ళి తమ గృహాలలో ఉంచుకునేవాళ్ళు. ఇలా ఉంచుకోవటానికి కారణం, శత్రువుల శిరస్సులను విజయ చిహ్నాలుగా భావించటం కాదని గుర్తించాలి. మరి, ఆ మానవ శిరస్సులవల్ల ఆ తెగల వాళ్ళకి కలిగే లాభం ఏమిటి అంటే.....

ఆ మానవ శిరస్సులలో ఆ మనిషికి సంబంధించిన ప్రాణశక్తి దాగి ఉంటుందని, ఎవరి గృహంలో అయితే ఆ శిరస్సు భద్రపరచబడి ఉంటుందో, ఆ ఇంట్లోని వ్యక్తులలోకి ఆ శిరస్సులోని ప్రాణశక్తి నిరంతరం ప్రవహిస్తూ ఆ ఇంట్లోని వ్యక్తులకు రెట్టింపు శారీరక బలాన్ని, ధైర్యాన్ని ఇస్తుందని ఆ తెగల ప్రజలు బలంగా విశ్వసించారు. అంతేకాకుండా, ఆ శిరస్సులు ఏ గ్రామంలో అధికంగా భద్రపరచబడి ఉంటాయో ఆ గ్రామాలలోని పాడిపంటలు విపరీతంగా అభివృద్ధి చెందినట్లుగా తెలిసింది. అలాంటి శిరస్సులు లేని గ్రామాల్లోని ప్రజలు అనారోగ్యానికి గురికావటం, పాడిపంటలను నష్టపోవటం జరిగినట్లుగా భావించబడింది. అనగా శత్రువుల శిరస్సులలో నిలవ ఉన్న "ఆత్మ" లాంటి శక్తి కారణంగానే ఆ శిరస్సులను భద్రపరచుకున్న గ్రామస్తులు అన్ని రకాలుగాను ఉన్నత స్థితిలో ఉన్నట్లుగా చెప్పబడింది. ఈనాటికీ 'ఆత్మ'యొక్క ఉనికి శరీరంలో ఏ భాగంలో ఉంటుంది? అన్న విషయం గురించి సైన్స్ చెప్పలేకపోవటం విశేషం. "ఆత్మ" అన్న విశేషం ఏనాటికీ సైన్స్‌కి అందని ఒక మిస్టరీగా మిగిలిపోతుందా?.

కొన్ని సమయాలలో ఆత్మలు, జీవించి ఉన్న ఒక మనిషిని ఆవహించి అతడి ద్వారా తాము చెయ్యాలనుకున్న పనులు అవి మంచివి కావొచ్చు లేదా చెడ్డవికావొచ్చు చేస్తూ ఉంటాయి. కొన్ని సమయాలలో మంచి ఆత్మలు, రోగగ్రస్తుడైన మనిషిని ఆవహించినప్పుడు ఆ ఆత్మలు ఆ వ్యక్తియొక్క రోగాన్ని తొలగించి, అతడిని ఆరోగ్య

వంతుడిగా తయారుచేస్తాయి. ఎందుకంటే, అతడు ఆరోగ్యంగా ఉంటేనే తాము చెయ్యాలనుకున్న పనులు అతడి ద్వారా చేయించటం సాధ్యపడుతుందని వాటికి తెలుసు మరి.

దుర్మార్గమైన మనస్తత్వాన్ని కలిగిన ఆత్మ, మంచి ప్రవర్తన కలిగిన ఎవరైనా మనిషిని ఆవహించినప్పుడు ఆ ఆత్మ ఆ మనిషి ద్వారా తమ కోర్కెలు తీర్చుకుంటుంది. ఆ కారణంగానే, అప్పటిదాకా ఎంతో మంచివారుగా ఉన్న కొంతమంది వ్యక్తులు హఠాత్తుగా తాగుబోతులుగా, వ్యభిచారులుగా మారటం జరుగుతుంది.

**ప్రేతాత్మల ప్రవేశ ద్వారం (Spiritual portal) :**

"అద్దాలు" (ఒకవైపు కళాయి పూసి ఉండే అద్దాలు. ఈ అద్దాలను ముఖం చూసుకోవటానికి ఉపయోగిస్తారు.) ప్రేతాత్మలు, ఈ లోకంలోకి అనగా మానవ లోకంలోకి ప్రవేశించటానికి ప్రవేశ ద్వారాలుగా ఉపయోగపడతాయని ప్రపంచవ్యాప్తంగా విశ్వసించ బడుతున్నది. సహజంగా, ప్రపంచంలోని చాలా మతాలలో అద్దాలకు ఒక ముఖ్యమైన స్థానం ఇవ్వబడింది. భారతదేశంలోని హైందవులు కూడా అద్దాలను ప్రత్యేకంగా భావిస్తారు. అద్దం, గోడమీద నుండి గాని, చేతిలో నుండి గాని జారి క్రిందపడి పగిలిపోతే త్వరలో ఏదో అశుభం జరగబోతున్నదని విశ్వసిస్తారు.

"అద్దాలు" ప్రేతాత్మలకు ప్రవేశ ద్వారాలుగా ఉపయోగపడతాయి అన్న ఉద్దేశంతో అద్దాల ఉపయోగం విషయంలో కొన్ని ప్రత్యేక జాగ్రత్తలు తీసుకుంటారు. ఒక అద్దాన్ని ఒకే ప్రదేశంలో చాలాకాలంపాటు ఉంచినట్లయితే ఆ అద్దం, ప్రేతాత్మలకు ప్రవేశ ద్వారంగా (Spiritual portal) మారే అవకాశాలు ఉంటాయని ప్రాచీన కాలంనాటి చైనా మంత్రవాదులు మరియు ఆధునిక కాలానికి చెందిన పారాసైకాలజిస్టులు అభిప్రాయ పడ్డారు. కొన్ని సమయాలలో, ఇతరుల గృహాలలో అనేక సంవత్సరాలపాటు వాడిన పెద్ద పెద్ద అద్దాలను ఏదో కారణం వల్ల తమ ఇంటికి తెచ్చుకుని, ఆపై వాటిని గోడకు తగిలించి వాడుకుంటూ ఉంటారు. ఇది చాలా చెడు సాంప్రదాయం అని గుర్తించాలి. ఎందుకంటే, ఇతరులు వాడిన అద్దాన్ని ఇంట్లోకి తెచ్చుకోవటం వల్ల ఇంట్లో వాస్తుపరమైన దోషాలు ఏర్పడతాయి. ఫలితంగా ఇంట్లో నకారాత్మక శక్తులు (నెగటివ్ ఎనర్జీస్) సంచరించే అవకాశాలు ఏర్పడతాయి. కనుక, పాతసామాన్లు అమ్మే దుకాణాలలో (ఆక్షన్ హాల్స్) లభించే సెకండ్‌హ్యాండ్ అద్దాలు, డ్రస్సింగ్‌టేబుల్స్, చవకగా దొరుకుతున్నాయి కదా అని కొనుక్కుని తెచ్చుకుని

ఇంట్లో పెట్టుకుంటే ఆ తరువాత, వాటిని ఆవరించే ఉండే చెడు ప్రభావానికి గురి కావటం జరుగుతుంది.

కొన్ని సమయాలలో కొంతమంది అద్దె ఇళ్ళలో నివసించటానికి వెళతారు. వీళ్ళు వెళ్ళే సరికి ఆ ఇంట్లో గోడలకు అద్దాలు అమర్చబడి కనిపిస్తాయి. అవి అంతకుముందు ఆ ఇంట్లో ఉన్నవాళ్ళు ఏర్పాటు చేసుకున్న అద్దాలు అని తెలిసినప్పటికీ వాటిని అలాగే ఉంచి వాడుకోవాలని చూస్తే తీవ్రమైన సమస్యలకు గురికావాల్సి వస్తుంది. అందువలన అద్దె ఇళ్ళకు వెళ్ళేవాళ్ళు, అంతకు ముందు ఆ ఇంట్లో ఉన్నవాళ్ళు వదిలిపెట్టి వెళ్ళిన అద్దాలను తీసి ప్రక్కన పెట్టటమో లేదా దూరంగా పారెయ్యటమో చెయ్యాలి.

పారాసైకాలజీలో "పోర్టల్" (Portal) అనే పదాన్ని తరచుగా ఉపయోగిస్తారు. ఈ పదానికి – రంధ్రం లేదా కిటికీ అనే అర్థాలు ఉన్నాయి. మానవుల లోకంలోకి ప్రవేశించటానికి మరియు మానవ లోకం నుండి తమ లోకంలోకి వెళ్ళటానికి ప్రేతాత్మలు ఈ పోర్టల్స్‌ని ఉపయోగిస్తాయని పారాసైకాలజిస్టులు నిర్ధారించారు. ముఖ్యంగా, చెడు స్వభావం కలిగిన నకారాత్మక శక్తులు (నెగటివ్ ఎనర్జీస్) చాలా తరచుగా ఈ పోర్టల్ గుండా మానవ లోకంలోకి ప్రవేశించి, మానవుల్ని అనేక రకాల బాధలకు గురిచేయటం జరుగుతుంది. ప్రేతాత్మలు మరియు నకారాత్మక శక్తుల యొక్క ప్రభావం విపరీతంగా ఉన్న ప్రదేశాలలో ఈ పోర్టల్ అనే ప్రవేశ ద్వారాలు అధికంగా ఉంటాయని చెబుతారు. ఒక ముఖ్య విశేషం ఏమంటే, ప్రేతాత్మలు ఈ పోర్టల్ ద్వారా తమ లోకానికి వెళ్ళటం మరియు ఈ లోకంలోకి రావటం జరుగుతుంది. అందువలన ఇవి ప్రవేశ మరియు నిష్క్రమణ (Exit) ద్వారాలుగా ఉపయోగిస్తాయి. ఇతర గ్రహాల నుండి భూమి మీదకు వచ్చే గ్రహాంతర జీవులు కూడా ఈ పోర్టల్ మార్గాలను ఉపయోగిస్తున్నారని అమెరికాకు చెందిన కొందరు పరిశోధకులు తెలియజేస్తున్నారు.

ఒక గృహంలో ఎవరైనా వ్యక్తి, తీవ్రమైన అనారోగ్యంతో ఉన్నప్పుడు ఆ ఇంట్లో ఉండే అద్దాలపై ఏదైనా వస్త్రాన్నివేసి కప్పి ఉంచటం మంచిదని చెబుతారు. ఎందుకంటే, అద్దం అనే ద్వారం ద్వారా ప్రేతలోకం నుండి ఈ లోకంలోకి ప్రవేశించే ప్రేతాత్మలు లేదా నకారాత్మక శక్తులు, అనారోగ్యంతో ఉన్న వ్యక్తిని మరింత వ్యాధిగ్రస్తుడిగా మార్చటం, లేదా ఆ వ్యక్తి ఆ వ్యాధితో మరణించేలా చెయ్యటం జరుగుతుంది.



# 2. హైందవ మత వేదాంతంలో చెప్పబడిన "పంచకోశ" శరీర మర్మం ఏమిటి?

హైందవ వేదాంత శాస్త్రాలలో చెప్పబడిన సమాచారం ప్రకారం చూసినట్లయితే, ఈ భూమిమీద, భౌతిక దేహాన్ని కలిగి ఉన్న ప్రతి ఆత్మకు మూడు శరీరాలు ఉంటాయి. అందులో మొదటిది స్థూలశరీరం. వివిధ అవయవాలతో కూడిన మరియు మనిషి భౌతిక నేత్రాలకు కనిపించే భాగమే ఈ స్థూలశరీరం. దీని తరువాత లోపలగా ఉండే శరీరాన్ని 'సూక్ష్మశరీరం/లింగదేహం' అనే పేరుతో పిలుస్తారు. దీని తరువాత లోపలి భాగాన్ని 'కారణశరీరం' (విత్తనదేహం) అని పిలుస్తారు. ఈ అంశాన్ని ఒక ఉదాహరణ ద్వారా అర్థం చేసుకోవచ్చు. అది ఎలాగంటే...బాగా పండిన ఒక చింతకాయను చేతిలోకి తీసుకుని పరిశీలించినట్లయితే – మొదట ఆ చింతకాయ పైన తొడుగు (గుల్ల/షెల్) ఉంటుంది. దీనిని అన్నింటికన్నా పైన ఉండే "భౌతికదేహం" అని భావించాలి. ఆ గుల్ల లోపల ఉండే, విత్తనాలతో కూడిన పదార్థాన్ని అనగా గుజ్జుని "సూక్ష్మదేహం" అని భావించాలి. ఆ గుజ్జు లోపల ఉండే విత్తనాలను "కారణదేహం" అని గుర్తించాలి. ఎందుకంటే, విత్తనం ఉన్నప్పుడు మళ్ళీ ఇంకొక చింతచెట్టు ఆవిర్భవిస్తుంది. కనుక "కారణదేహం", రాబోయే జన్మకు మూలమైన విత్తనం అని గ్రహించాలి.

హైందవ వేదాంతంలో ప్రముఖ గ్రంథంగా పరిగణించబడిన "తైత్తరీయ ఉపనిషద్"లో చెప్పబడిన సమాచారం ప్రకారం చూసినట్లయితే మానవ శరీరం ఐదు కోశములుగా లేదా మూడు దేహములుగా విభజించబడి ఉంటుంది. వీటిలో భౌతికదేహం అన్నింటికన్నా పైన ఉండగా, మిగిలిన దేహాలు/కోశములు ఒకదాని క్రింద ఒకటి ఉంటాయి. అది ఎలాగంటే...

**1.స్థూలశరీరం :** మనిషి కళ్ళకు కనపడే భౌతికదేహాన్ని "స్థూలదేహం" (ఫిజికల్ బాడి) అని పిలుస్తారు. ఇది, పంచకోశాలలో మొదటిది అయిన అన్నమయకోశానికి చెంది ఉంటుంది. అందుకు కారణం ఏమంటే, మనిషి ఆహారం తీసుకున్నంత కాలమే ఈ దేహం నిలబడి ఉంటుంది. అనగా అన్నం (ఆహారం) మీద ఆధారపడి ఈ దేహం జీవిస్తుంది అన్నమాట. అందువల్ల దీనిని అన్నమయ కోశము అనే పేరుతో పిలిచారు. ఈ భౌతిక శరీరంలో – మనిషిలో ఉండే క్రూరమైన లేదా సమాజం అంగీకరించని వాంఛలు, కోరికలు, వ్యామోహాలు దాగి ఉంటాయి.

ధ్యానం, యోగాసనాలు, ఉపవాసం అనే మూడు ప్రక్రియల ద్వారా అన్నమయ కోశాన్ని శుద్ధిచేసుకోవలసి ఉంటుంది. ఆధునిక, అల్లోపతి ఔషధాలు (ఇంగ్లీషు మందులు) ఈ అన్నకోశం మీదే తమ ప్రభావాన్ని చూపి ఆపై రోగాన్ని అణచటమో లేదా తగ్గించటమో జరుగుతుంది.

భౌతిక దేహాన్ని "పాంచభౌతికము" అని పిలుస్తారు. ఇందుకు కారణం ఏమంటే, 1. పృధ్వి(భూమి) 2. అపహ (నీరు) 3. తేజస్ (అగ్ని) 4. వాయువు (గాలి) 5. ఆకాశ (అంతరిక్షం) – అనే ఐదు భూతాలతో (ఎలిమెంట్స్) మానవ దేహం ఏర్పడుతుంది.

**మనిషి దేహాన్ని నడిపే ప్రాణముల మర్మం :**

మనిషి దేహంలో మొత్తం పది ప్రాణాలు ఉంటాయి. మనిషి శరీరం, పనిచెయ్యాలి అంటే అతడి దేహంలో ఈ ప్రాణాలు ప్రసరిస్తూ ఉండాలి. ఈ పది ప్రాణాలలో ముఖ్యప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమాన – అనే ఐదు ప్రాణాలు అత్యంత ముఖ్యమైనవి. అందుకే వీటిని "పంచ ప్రాణములు" అనే పేరుతో పిలుస్తారు. ఇక, నాగ, కూర్మ, కృకర, దేవదత్త, ధనుంజయ – అనే ఐదు అదనపు లేదా సహాయక ప్రాణాలను "ఉపప్రాణములు" అనే పేరుతో పిలుస్తారు.

ఈ పది ప్రాణాలలో అత్యంత ముఖ్యమైనది "ముఖ్యప్రాణ". ఈ ప్రాణం శరీరంలో ఉన్నంతవరకే మనిషి, శ్వాసపీల్చటం మరియు వదలటం జరుగుతుంది. ఇక, రెండవ ప్రాణం అయిన "అపాన" విషయానికి వచ్చినట్లయితే, శరీరంలో పేరుకుపోయిన మలినాలను మలమూత్రరూపంలో బైటకు పంపించే ప్రక్రియను ఈ అపాన అనే ప్రాణం నిర్వహిస్తుంది. ఇక, మూడవ ప్రాణం అయిన "వ్యాన" విషయానికి వచ్చినట్లయితే శరీరంలో రక్త ప్రసరణ ప్రక్రియను ఈ ప్రాణం నిర్వహిస్తుంది. నాల్గవ ప్రాణం అయిన "ఉదాన" విషయానికి వచ్చినట్లయితే, మనిషి ఆహారం మింగటానికి, మనిషి నిద్రపోతున్నప్పుడు అతడి ఆత్మను దైవం దగ్గరకు లేదా ప్రపంచంలోని వివిధ ప్రాంతాలకు తీసుకువెళ్ళటానికి సహకరిస్తుంది. అంతేకాకుండా, మనిషి మరణ సమయంలో అతని భౌతిక దేహం నుండి సూక్ష్మదేహాన్ని విడదీయటానికి ఈ ఉదాన వాయువు తోడ్పడుతుంది. ఇక, ఐదవ ప్రాణం అయిన "సమాన" విషయానికి వచ్చినట్లయితే మనిషి ఉదరంలోకి చేరిన ఆహారాన్ని అరిగించే ప్రక్రియను అనగా జీర్ణ ప్రక్రియను ఈ "సమాన" అనే ప్రాణం నిర్వహిస్తుంది.

ఇక, పంచ ఉప ప్రాణాల విషయానికి వచ్చినట్లయితే – మనిషి త్రేన్చటానికి (Belching) వెక్కిళ్ళు పెట్టటానికి, వాంతులు చేసుకోవటానికి సహకరిస్తుంది “నాగ” అనే ప్రాణం. మనిషి కళ్ళు మూసుకోవటానికి మరియు తెరచుకోవటానికి సహకరించేది “కూర్మ” అనే ప్రాణం. మనిషిలో ఆకలి వెయ్యటానికి కారణమవుతుంది “కృకర” అనే ప్రాణం. దేవదత్త అనే ప్రాణం కారణంగా మనిషి ఆవలిస్తాడు (Yawning). ఇక, ధనుంజయ అనే ఐదవ ఉప ప్రాణం, శరీరాన్ని పోషించటం, మనిషి చనిపోయిన తరువాత ఆ శరీరాన్ని కుళ్ళపెట్టటం మరియు స్త్రీ ప్రసవిస్తున్న సమయంలో ఆమె గర్భసంచిలోని బిడ్డను బైటకు తొయ్యటం అనగా స్త్రీ ప్రసవించేలా చెయ్యటం – అనే విధులను నిర్వహిస్తుంది.

**2. సూక్ష్మదేహం (Astral/Subtle body) :** దీనినే వేదాంతశాస్త్రంలో ‘లింగశరీరం’ అనే ఇంకొక పేరుతో కూడా పిలుస్తారు. మనిషి భౌతిక నేత్రాలకుగాని ఇతర శాస్త్రీయ యంత్రాలకు గాని కనపడని శరీరాన్ని సూక్ష్మదేహం అని పిలుస్తారు.

ఇక, సూక్ష్మదేహం విషయానికి వచ్చినట్లయితే ఈ భాగం – 19 తత్వాలతో ఏర్పడి ఉంటుంది. అవి ఏమిటంటే...5 జ్ఞానేంద్రియాలు, 5 కర్మేంద్రియాలు, 5 ప్రాణాలు మరియు మనస్సు, బుద్ధి, చిత్తం(సబ్‌కాన్షియస్), అహంకారం. – అనే 19 తత్వాలతో సూక్ష్మదేహం ఏర్పడుతుంది.

సంస్కృత భాషలో “ఇంద్రియ” అనగా వాహనం, సాధనం, జ్ఞానం అనే అర్థాలు ఉన్నాయి. మనిషి శరీరంలో పాదములు, చేతులు, కంఠనాళాలు, మూత్ర మరియు విసర్జన వ్యవస్థలు – అనే ఐదు కర్మేంద్రియాలు ఉన్నాయి. “కర్మ” అనగా పని (Action). అని అర్థం. మానవుడు ఈ ఐదు కర్మేంద్రియాల ద్వారా ఐదు రకాల చర్యలు లేదా పనులు చేస్తాడు. ఈ పనులన్నీ జరగటానికి మూలకారణం ప్రాణం. వయస్సు పెరిగే కొద్ది మనిషిలోని ప్రాణశక్తి తగ్గిపోతుంది. ఫలితంగా ఆ మనిషి చేసే పనులలో వేగం తగ్గటం మరియు చేసేపని సరిగ్గా ఉండకపోవటం లాంటివి జరుగుతాయి.

ఈ సూక్ష్మదేహంలో 1. ప్రాణమయకోశం (ప్రధానశ్వాస లేదా శక్తి), 2. మనోమయ కోశం (మనస్సు), 3. విజ్ఞానమయ కోశం (విజ్ఞానం/మేధస్సు) అనే మూడు కోశములు ఉంటాయి. లేదా ఈ మూడు కోశాలతో సూక్ష్మదేహం రూపొందించబడి ఉంటుంది అన్నమాట.

**3. కారణదేహం :** ఇక మూడవది అయిన కారణదేహం విషయానికి వచ్చినట్లయితే, ప్రారంభంలేని అనగా వివరించటానికి వీలుకాని అజ్ఞానమే "కారణదేహం" అని పిలువబడుతుంది. ఈ కారణదేహం కారణంగానే భౌతికదేహం మరియు సూక్ష్మదేహాలు ఏర్పడుతున్నాయి. 'ఆనందమయకోశము' అనే పొరకు మరియు కారణదేహానికి సంబంధం ఉంటుంది.

**పంచకోశములు :** ఒక దిండు (పిల్లో) పైన గలీబు (పిల్లోకవరు) ఏవిధంగా ఉంటుందో, ఒక ఉల్లిపాయలో ఒక దానిమీద ఒకటిగా పొరలు ఎలా ఉంటాయో, అలాగే మనిషి శరీరంలో – అత్యంత లోపలి భాగంలో ఉండే ఆత్మ చుట్టూ 5 పొరలు ఉంటాయి. వీటినే "పంచకోశములు" అని పిలుస్తారు. ఇంకా వివరంగా చెప్పాలంటే, గిన్నెలు అమ్మే దుకాణంలో – ఒకే ఆకారంలో మరియు వివిధ పరిమాణాలలో ఉండే ఐదు లేదా పది గిన్నెలను ఒక వర్గంగా (సెట్) ఏర్పాటుచేసి అమ్ముతూ ఉంటారు. అనగా ఒక దానిలో ఒకటి ఇమిడిపోయే వివిధ పరిమాణాలలో ఉన్న గిన్నెలు లాగా, ఒకదానిపై ఒకటి అమరి ఉన్న పొరలను లేదా తొడుగులను యోగశాస్త్రంలో మరియు వేదాంతశాస్త్రంలో "పంచకోశములు" అనే పేరుతో పిలుస్తారు. ఈ కోశములు ఒకదానికి ఒకటి అతుక్కుపోయినట్లుగా ఉంటాయి. మనిషి జీవించటానికి కారణమైన ఆత్మ (Soul) ఈ పంచకోశముల మధ్యభాగంలో నివసిస్తూ ఉంటుంది.

**1. అన్నమయ కోశము :** అన్ని కోశముల కన్నా పైన ఉండే కోశమును (భౌతిక దేహాన్ని) 'అన్నమయ కోశము' అని పిలుస్తారు. దీనినే స్థూలశరీరం అని కూడా పిలవటం జరుగుతుంది.

**2. ప్రాణమయకోశం :** స్థూల శరీరం లోపల ఉండే రెండవ దేహాన్ని "ప్రాణమయ కోశము" అని పిలుస్తారు. ప్రాణము లేదా శ్వాస అనే పదార్థంతో ఈ ప్రాణమయకోశం రూపొందించబడి ఉంటుంది. ఈ శరీరానికి/కోశానికి "శ్వాస" ఆహారంగా ఉంటుంది. అన్నమయ దేహం (కోశము) లోపల ప్రాణమయకోశం ఒక పొరలాగా లేదా ఒక తొడుగులాగా – మిగిలిన రెండు కోశముల పైన అమరి ఉంటుంది. మనిషిలోని కర్మేంద్రియాలు, జ్ఞానేంద్రియాలు ఈ ప్రాణమయకోశం మీద ఆధారపడి పనిచేస్తాయి. అనగా, ఈ ఇంద్రియాలను నడిపే శక్తి, ప్రాణకోశమే అని గ్రహించాలి. ప్రాణాయామం అనే ప్రక్రియ ద్వారా ఈ ప్రాణమయ కోశాన్ని శుద్ధి చేసుకుంటారు. ఇంకొక విశేషం ఏమంటే, రేకీ, ఆక్యుపెంచర్, మాగ్నెటోథెరపి, హోమియోపతి –

లాంటి సాంప్రదాయ వైద్యాలు ఈ మనోమయ కోశం మీద తమ ప్రభావాన్ని చూపించి, ఆపై వ్యాధులను శాశ్వతంగా నిర్మూలించటానికి ప్రయత్నిస్తాయి. ఒక విశేషం ఏమంటే, మనిషి శరీరంలో అతి ముఖ్యమైన ఈ ప్రాణమయకోశం భౌతికమైన ఉనికిని కలిగి ఉండదు. అనగా యంత్రాలకుగాని (సూక్ష్మదర్శిని, స్కానింగ్, ఎక్సరే) మనిషి నేత్రాలకు గాని కనపడదు.




**పంచకోశముల అమరిక**

**3. మనోమయ కోశము :** స్థూల శరీరం లోపల మూడవ పొర (కోశము)గా ఉండే దేహాన్ని "మనోమయ కోశము" అని పిలుస్తారు. ఆలోచనలు, భావోద్వేగములు (ఎమోషన్స్), ఆశలు, జ్ఞాపకాలు - అనే అంశాలతో ఈ మనోమయ కోశము నిర్మించబడి ఉంటుంది. స్థూల దేహానికి మరియు ప్రాణమయ దేహానికి మధ్య సంధాన కర్తగా ఈ మనోమయ కోశము పని చేస్తుంది. మనిషి భౌతికదేహంలో జరిగే శ్వాస ప్రక్రియ మరియు భౌతికదేహంలో ఉండే పంచేంద్రియాలు ఈ మనోమయకోశం యొక్క ఆధీనంలో ఉండి పనిచేస్తాయి. ఒక మనిషి, ఆధ్యాత్మిక

రంగంలో ప్రవేశించాలంటే అతడు, మొదట తనయొక్క మనోమయ కోశాన్ని శుద్ధి చేసుకుని దానిని తన నియంత్రణలో ఉంచుకోవాలి.

**4. విజ్ఞానమయ కోశము :** స్థూల దేహం లోపల ఉండే నాల్గవ పొరను అనగా నాల్గవ దేహాన్ని "విజ్ఞానమయ కోశము" అనే పేరుతో పిలుస్తారు. మనిషి యొక్క మేధాశక్తి, మంచి చెడుల విచక్షణా జ్ఞానం, నిర్ణయాలు తీసుకునే శక్తి లాంటివి ఈ విజ్ఞానమయ కోశంలో దాగి ఉంటాయి. మనిషి జీవితంలో ఈ విజ్ఞామయకోశం ప్రముఖమైన పాత్ర వహిస్తుంది. ఎందుకంటే, మనిషి ఆలోచించాలి. ఆపై నిర్ణయాలు తీసుకోవాలి. ఆ నిర్ణయాలను ఎలా అమలు చెయ్యాలో? నిర్ధారించుకోవాలి. ఈ ప్రక్రియలు సక్రమంగా జరిగినప్పుడే మనిషి సక్రమంగా జీవించగలడు.

**5. ఆనందమయ కోశము :** స్థూలదేహం లోపల అనగా ఆఖరి పొరగా ఉండే ఐదవ కోశాన్ని "ఆనందమయ కోశము" అనే పేరుతో పిలుస్తారు. మనిషి భౌతిక దేహంతో అనుభవించే సుఖాల వలన లభించే ఆనందానికి మరియు ఈ ఆనందమయ కోశములో ఉండే ఆనందానికి మధ్య ఏ సంబంధమూ లేదని గుర్తించాలి. మనిషి సమాధి స్థితిలోకి వెళ్ళినప్పుడు అతనికి కలిగే ఆనందమే ఈ అన్నమయ కోశము అవుతుంది.

పంచకోశాలలో ఆఖరిది అయిన ఆనందమయకోశము యొక్క లక్షణాల గురించి వివిధ రకాల నిర్వచనాలు ఇవ్వబడ్డాయి. ఆనందం లేదా విచారం లేని స్థితికి చేరుకున్న వ్యక్తులలో మాత్రమే ఆనందమయకోశం పనిచేస్తుందని తెలుస్తున్నది. యోగులు, మహర్షులు లాంటి సర్వసంగపరిత్యాగులకు మాత్రమే ఈ ఆనందమయ కోశం తెరుచుకుంటుంది. అలాంటివారు ఈ కోశం ద్వారా దైవంతో సంబంధాన్ని ఏర్పరచుకుంటారని చెబుతారు. ఈ భూమిపై నివసించే మానవులలో 90% మందిలో ఆనందమయకోశం సంపూర్తిగా అభివృద్ధి చెంది ఉండదు.

మనిషి మెళుకువతో ఉన్న స్థితిలో పంచకోశాలూ పనిచేస్తాయి. ఇక, మనిషి స్వప్నావస్థలో ఉన్నప్పుడు ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ అనే నాలుగు కోశాలు పనిచేస్తున్నప్పటికీ, విజ్ఞానమయ మరియు ఆనందమయ కోశాలు ఒక పాతికశాతం వరకు మాత్రమే పనిచేస్తాయి. అనగా పూర్తిగా పని చెయ్యవు అన్నమాట.

# 3. ప్రపంచంలోని విభిన్న మతాలలో ప్రచారంలో ఉన్న 'ప్రేతలోక' సంబంధ విశ్వాసాలు?

"ఒక అంశాన్ని నిజమని కొందరు నమ్మవచ్చు. కానీ, ఎక్కువ మంది ఒక అబద్ధాన్ని నమ్మటం లేదా లేనిదాన్ని ఉన్నది అని నమ్మటం అసాధ్యం. ఒకవేళ నమ్మినా, దీర్ఘకాలంపాటు ఆ నమ్మకం నిలబడటం జరగదు". కానీ ప్రపంచంలోని దాదాపు 99 శాతం ప్రజలు, ప్రేతాత్మలు నిజంగా ఉన్నాయని ఈనాటికీ నమ్ముతున్నారు. చైనాలో ప్రచారంలో ఉన్న సిద్ధాంతం ప్రకారం చూసినట్లయితే, ఈ భూమిమీద మానవులు ఏవిధంగా జీవిస్తున్నారో, అదేవిధంగా ఇదే మానవ లోకంలో అదృశ్యంగా ఉండే ప్రేతలోకంలో, ప్రేతాత్మలు జీవిస్తాయని నమ్ముతారు. అయితే, ప్రేతలోకానికి మరియు ఈ లోకానికి మధ్య ఒక అదృశ్యమైన తెర ఉంటుంది. సంవత్సరంలో ఒకరోజున ఆ తెరలో ఉండే ద్వారాలు తెరుచుకుంటాయి. ఆ ద్వారాల నుండి – ఆ లోకంలోని ప్రేతాత్మలు ఈ లోకంలోకి వస్తాయని, ఆ సమయంలో ఆ ప్రేతాత్మలకు తృప్తిని కలిగించే ఆహార పదార్థాలను, పానీయాలను ఆయా ప్రేతాత్మలకు సంబంధించిన సమాధులపై ఉంచటం చైనాలో ఈనాటికీ జరుగుతున్నది. ఇలా ప్రేతాత్మలకు పూజలు చేసే రోజుని చైనాలోని చాలా రాష్ట్రాలలో ప్రభుత్వ సెలవు దినంగా ప్రకటించబడింది. ఇక, దక్షిణ అమెరికా విషయానికి వచ్చినట్లయితే ఆ ఖండంలోని అనేక దేశాలలో "మృతులదినం" (Day of the dead) అనే ఒక పండుగలాంటి పవిత్రమైన దినాన్ని పాటిస్తారు. ఆ రోజున ఆత్మల లోకం నుండి భూమి మీదకు వేలాది ఆత్మలు వస్తాయని భావిస్తారు. ఆ ఆత్మలకు ఆనందం కలగటంకోసం ఆ ఆత్మలకు సంబంధించిన మిత్రులు, వాటి సమాధులను అందమైన పూలతో అలంకరించి, ఆపై ఆ సమాధులపైన మధురమైన పదార్థాలను, మత్తును ఇచ్చే పానీయాలను ఉంచి ఇవతలికి వస్తారు. ఈ లోకంలోకి వచ్చే ఆత్మలు ఆ పదార్థంలోని ప్రాణశక్తిని తమ ఆహారంగా తీసుకుంటాయని భావిస్తారు.

భారతదేశం విషయానికి వచ్చినట్లయితే, తమ కుటుంబానికి చెందిన చనిపోయిన వ్యక్తులయొక్క ఆత్మలను పితృదేవతలుగా భావించి, వాళ్ళ ఆత్మశాంతికోసం వాళ్ళ వర్ధంతినాడు, అన్నదానాలు చెయ్యటం, వస్త్రదానాలు చెయ్యటం లాంటివి జరుగుతాయి. ముఖ్యంగా, దైవాన్ని మరియు ఆత్మలను గౌరవించే హైందవులు, ఈ ప్రపంచంలో ఎక్కడ ఉన్నా సరే, పితృదేవతలను ప్రతి సంవత్సరమూ, ఒకరోజున పూజించే

అద్భుతమైన సాంప్రదాయాన్ని పాటిస్తున్నారు. ప్రపంచంలోని కోట్లాదిమంది తమ మతాలతో సంబంధం లేకుండా, మరణానంతర జీవితం ఉంటుందని, ప్రేతాత్మలు ఉంటాయని బలంగా నమ్ముతున్నప్పుడు – ఎవరో కొందరు అజ్ఞానులు, హేతువాదం ముసుగులో హైందవ విశ్వాసాలను హీనంగా విమర్శించే కుసంస్కారులు, విదేశాల నుండి వస్తున్న ధనమదంతో విర్రవీగుతున్న మరియు ఉన్మాదంతో చెలరేగి పోతున్న మతాలలోకి చేరి, ఆపై హిందూ మతాన్ని విమర్శిస్తున్నవాళ్ళు మరియు దేవుడు లేడు, దయ్యం లేదు, నరకం లేదు, స్వర్గం లేదు అని వాదించినంత మాత్రాన వారి వాదన ఏనాటికీ నిజం కాదు. "ఆకాశంలో సూర్యుడు ఉన్నమాట ఎంత నిజమో? ఆత్మలు ఉన్నమాట కూడా అంతే నిజం" అని కొద్దిపాటి మేధస్సు ఉన్న మనిషికి కూడా జీవితంలో ఏదో ఒక సమయంలో అర్థమయి తీరుతుంది.

**జపాన్‌లో ప్రచారంలో ఉన్న మరణ సంబంధ విశ్వాసాలు :**

ప్రతి మనిషిలోను ఒక ఆత్మ ఉంటుందని జపాన్ దేశంలో విశ్వసిస్తారు. ఆత్మను జపాన్ మతంలో "రేకాన్" అని పిలుస్తారు. ఒక మనిషి చనిపోయినప్పుడు ఆ మనిషియొక్క రేకాన్, నరకం లాంటి ఒక లోకానికి చేరుకుంటుంది. అక్కడికి చేరుకున్న ఆత్మకు (రేకాన్) భూలోకంలో ఉన్న ఆ ఆత్మకు సంబంధించిన శరీరానికి శాస్త్రోక్తంగా అంత్యక్రియలుచేసి, ఆపై ఆ ఆత్మయొక్క ఆత్మశాంతికోసం తగిన ప్రక్రియలు, పూజలు చేసినట్లయితే, అప్పుడు ఆ ఆత్మ ఆ లోకం నుండి బయలుదేరి తన పూర్వీకుల దగ్గరకు చేరుకుంటుంది. ఆ తరువాత సంవత్సరానికి ఒకసారి ఆగష్టు నెలలో వచ్చే 'ఒబాన్' పర్వదినం రోజున భూమిమీదకి వచ్చి, ఆపై తన వంశస్తులు తన సమాధి వద్ద చేసే పూజలను మరియు తనకు సమర్పించే మధుర పదార్థాలను, పానీయాలను స్వీకరించి ఆపై వాళ్ళని ఆశీర్వదించి ఆ తరువాత అక్కడ నుండి మళ్ళీ తన లోకానికి వెళ్ళిపోతుంది. కొన్ని సందర్భాలలో, చనిపోయిన మానవులకు సరిగ్గా అంత్యక్రియలు జరగవు. అలాంటి పరిస్థితుల్లోను, ప్రేమవైఫల్యం కారణంగా, బాధ కారణంగా, ఇతరులపై తనకు ఉన్న ద్వేషం



కారణంగా, ఇతరులమీద కక్ష ఉన్న కారణంగా, ఇతరులపై అసూయ కారణంగా తీవ్రంగా బాధపడుతూ – మరణించిన వ్యక్తులు మరియు ఆత్మహత్య లేదా హత్య కారణంగా మరణించిన వ్యక్తులు, అకాల మృతి పొందిన వ్యక్తులు – వీరియొక్క రేకాన్ అనగా ఆత్మ, మొదట చేరవలసిన నరకలోకానికి చేరదు. అతి భయంకరమైన క్రూర స్వభావంగల "యురేయ్" పిశాచిగా మారిపోతుంది. ఏ కోరిక తీరక తాను మరణించాడో లేదా మరణించిందో ఆ కోరిక తీర్చుకోవటానికి, చనిపోయిన వ్యక్తియొక్క ఆత్మ, యురేయ్ రూపంలో ఈ లోకంలోకి వస్తుంది. ఆపై ఏ కారణంగా తను ఆ పిశాచి రూపంలో ఈ లోకంలోకి వచ్చిందో ఆ కోరికను లేదా లక్ష్యాన్ని సాధించటానికి ప్రయత్నిస్తుంది. విపరీతమైన పైశాచిక బలంతో ప్రవర్తించే ఈ యురేయ్ అనే ప్రేతాత్మలను తాంత్రిక శాస్త్రంలో చెప్పబడిన విధానాలలో శాంతింపచేసినట్లయితే ఆ ప్రేతాత్మలు తమ రూపాన్ని వదిలిపెట్టి పై లోకాలకు వెళ్ళిపోతాయని భావిస్తారు.

సాధారణంగా, యురేయ్ అనే ప్రేతాత్మలు, తెలుపు రంగు దుస్తులను ధరించి ఉన్నట్లుగా కనిపిస్తాయి. అదేవిధంగా స్త్రీ వర్గానికి చెందిన యురేయ్ ప్రేతాత్మలు పొడవైన, నల్లని మరియు విరబోసుకున్న శిరోజాలను కలిగి ఉంటాయని చెబుతారు. ఈ యురేయ్ అనే ప్రేతాత్మలయొక్క చేతులు మణికట్టు దగ్గర నుండి వ్రేలాడుతూ ఉంటాయి. వీటికి కాళ్ళు ఉండవని అందువల్ల ఇవి గాలిలో తేలుతూ ఒక ప్రదేశం నుండి ఇంకొక ప్రదేశానికి చేరుతాయని భావిస్తారు. ఇంకొక విశేషం ఏమంటే, ఈ యురేయ్ వెంట వెలుగుతున్న కొవ్వొత్తులు లాంటి రెండు జ్వాలలు కూడా వెలుగుతూ కనిపిస్తాయని చెబుతారు. ఈ వెలుగులు నీలం లేదా ఆకుపచ్చ లేదా వంగపండు రంగులో కనిపిస్తాయని చెప్పుకుంటారు.

**ప్రేతాత్మలలో రకములు :**

**1. ఆన్రియో :** ఈ భూమిమీద మానవ రూపంలో తాను జీవించి ఉన్నప్పుడు – తనని హింసించిన/బాధించిన లేదా చంపిన వ్యక్తులపై పగ తీర్చుకోవటంకోసం నరకం నుండి లేదా మృతుల లోకం నుండి తిరిగివచ్చే అతి ఉగ్ర స్వభావంగల యురేయ్ అనే ఆత్మలను "ఆన్రియో" అంటారు.

**2. యుబుమే :** బిడ్డను ప్రసవించే సమయంలో చనిపోయిన స్త్రీ లేదా తన పిల్లలు బాగా చిన్నవాళ్ళుగా ఉన్నప్పుడు చనిపోయిన స్త్రీ యొక్క యురేయ్, మొదట ప్రేతలోకానికివెళ్లి ఆ తరువాత యుబిమే అనే పిశాచి రూపంలో భూలోకానికి తిరిగి వచ్చి తన సంతానానికి అతి దగ్గరగా ఉండటం ప్రారంభిస్తుంది.

**3. ఘనాయురేయ్ :** ప్రమాదవశాత్తు లేదా ఎవరో తొయ్యటంవల్ల సముద్రంలో పడి చనిపోయిన వ్యక్తులయొక్క యురేయ్‌లు, ఘనాయురేయ్ అనే పేరుగల పిశాచాలుగా మారతారు. ఈ పిశాచాలు సముద్ర తీరంలో మాత్రమే కనిపిస్తాయి.

**4. జాష్కీ–వరాషి :** చిన్న వయస్సులో చనిపోయిన పిల్లలయొక్క యురేయ్‌లు – "జాష్కి–వరాషి" అనే పిశాలుగా మారతాయి. వీటివల్ల ప్రమాదం తక్కువగా ఉన్నప్పటికీ చికాకులు ఎక్కువగా ఉంటాయని చెబుతారు.

**యూదు మతంలో ప్రేతాత్మ విశ్వాసాలు :**

యూదు మతానికి చెందిన హిబ్రూ బైబిల్ గ్రంధంలో చెప్పబడిన సమాచారం ప్రకారం చూసినట్లయితే, చనిపోయిన ప్రతి మనిషియొక్క ఆత్మ, ఈ భూగోళం మధ్యభాగంలో ఉండే "షివోల్" అనే చీకటిలోకానికి వెళుతుంది. ఆ లోకంలో నివసించే ఆత్మలు – నీడల రూపంలో ఉంటాయి. ఈ లోకానికి దైవంతో ఏమాత్రం సంబంధం ఉండదు. ఆ కాలంలో కొంతమంది మంత్రగాళ్ళు, కొన్నిరకాల మంత్రప్రయోగాలు చేసి షివోల్ లోకం నుండి నీడలను (పిశాచాలను) భూమిమీదకు రప్పించి, వాటి సహాయంతో, భవిష్యత్తులో జరగబోయే సంఘటనల గురించి తెలుసుకునేవాళ్ళు.



ఇప్పటి వరకు, మానవ జాతికి తెలిసిన సమాచారం ప్రకారం చూసినట్లయితే – ప్రేతాత్మలు, మానవులకు శత్రువులుగానే గుర్తించాలి. ముఖ్యంగా, చనిపోయిన తరువాత వాటి మృతదేహాలకు సరైన అంత్యక్రియలు (దహనం చెయ్యటం/సమాధి చెయ్యటం) జరగనప్పుడు ఆ మృతదేహానికి సంబంధించిన ఆత్మలు, అతి ప్రమాదకరమైన క్రూర స్వభావాన్ని కలిగి ఉండే దయ్యాలుగా మారతాయి. ప్రేతాత్మలకు ఇల్లు ఉండదు. కేవలము సమాధి

మాత్రమే ఉంటుంది. వాటికి కూడా ఆకలి, దాహం ఉంటాయని ప్రపంచ వ్యాప్తంగా ఉన్న అనేక మతాలలో స్పష్టంగా చెప్పబడి ఉన్నది. అందువల్ల, అవి తమ ఆకలిని తీర్చుకోవటంకోసం కొన్ని నిర్ణీత సమయాలలో మానవ సమాజంలోకి రావటం, ఆపై ఏదో ఒక మనిషిని ఆవహించి ఆ మనిషి ద్వారా తమ ఆకలిని, దాహాన్ని తీర్చుకోవటం జరుగుతుంది.

చనిపోయిన మనుషులయొక్క ఆత్మలు, ప్రేతాత్మలుగా మారటం సహజంగా జరిగే విషయమే. కానీ, కొన్ని రకాల క్షుద్ర శక్తులు – సృష్టి ప్రారంభంలోనే అవతరించాయి. అవి, మానవుల్ని అప్పుడప్పుడూ పీడిస్తూ ఉంటాయి. క్రైస్తవ మతంలో చెప్పబడిన ఒక ఆసక్తికరమైన సమాచారం ప్రకారం చూసినట్లయితే, సృష్టిలో తొలి మానవుడు అయిన ఆడమ్‌కి అత్యంత అందమైన ఒక భార్య ఉండేది. ఆమె పేరు 'లిలిత్' అని చెబుతారు. ఆమె జీవించి ఉన్న సమయంలో అనేక మంది పురుషుల్ని వివిధ రకాల మాయోపాయాలతో శృంగారపరంగా అనుభవించింది. ఆ తరువాతకాలంలో దైవం యొక్క శాపం కారణంగా ఆమె, మరణించి అతి భయంకరమైన ఒక పిశాచిగా మారిపోయింది.

పుట్టిన ప్రతి మనిషి ఏదో ఒక సమయంలో చనిపోవటం ఖాయం. అయితే చనిపోయిన మనిషి, తాను చేసిన చెడు లేదా మంచి కర్మలను బట్టి పుణ్యలోకాలకు (స్వర్గం కావొచ్చు) లేదా పాపలోకానికి (నరకలోకం) వెళ్ళటం జరుగుతుంది. అయితే, కొంతమంది వ్యక్తులు చనిపోయిన తరువాత అటు స్వర్గానికి, ఇటు నరకానికి వెళ్ళలేక మధ్యలో ఉన్న ప్రేతలోకానికి చేరుకుంటారు. హైందవ వేదాంత శాస్త్రాలలో చెప్పబడిన సమాచారం ప్రకారం చూసినట్లయితే – భూగోళానికి కొన్ని కిలోమీటర్ల ఎత్తులో అదృశ్య రూపంలో ప్రేతలోకం ఉంటుందని తెలుస్తున్నది. తాము జీవించి ఉన్నంతకాలమూ తమ భోగ విలాసాలకోసం, చెప్పటానికి వీలుకానన్ని అరాచకాలుచేసి చివరికి దిక్కుమాలిన చావు లేదా దారుణ మరణం పొందిన వ్యక్తులయొక్క ఆత్మలు తప్పనిసరిగా ఈ ప్రేత లోకానికి చేరుకుంటాయి. అందుకు ముఖ్య కారణం ఏమంటే, ఇంద్రియ సుఖాలకోసం తాము బ్రతికి ఉన్నంతకాలం తపించిపోయిన ఈ వ్యక్తులకు చనిపోయిన తరువాత కూడా ఆ సుఖాలమీద వ్యామోహం పోదు. ఫలితంగా, వాళ్ళుపై లోకాలకు (పుణ్యలోకాలు) లేదా క్రింద లోకానికి (నరకం) పోలేక ఈ భూమిమీదే జీవించాలని ఆశపడతారు. ఫలితంగా, వాళ్ళు భూమికి బాగా దగ్గరగా ఉన్న ప్రేత లోకానికి చేరుకోవాల్సి వస్తుంది.

మహాభాగవత గ్రంథంలోని 24వ అధ్యాయంలో చెప్పబడిన సమాచారం ప్రకారం చూసినట్లయితే 'అంతరిక్షం' అని పిలువబడే ఆకాశంలో యక్షులు, రాక్షసులు, పిశాచాలు, భూతాలు – లాంటి వివిధ జాతులవారు – తాము కోరిన సుఖాలను అనుభవిస్తూ ఉంటారని, ఆకాశంలో ఎక్కడ వరకైతే గాలులు వీస్తాయో, మేఘాలు తేలుతూ ఉంటాయో ఆ భాగాన్ని "అంతరిక్షం" అని పిలుస్తారని తెలుస్తున్నది. ఈ వివిధ జాతుల అమానుష జీవులు జీవించే ప్రదేశానికి పైన, గాలి అనేది ఉండదు. భూగోళానికి పైన 1287 కి.మీ. దూరంలో అనగా వంద యోజనాల దూరంలో ఉండే అంతరిక్ష ప్రాంతంలో, పైన చెప్పిన అమానుష శక్తులు నివసిస్తూ ఉంటాయని భాగవత గ్రంథంలో చెప్పబడి ఉన్నది. కనుక ప్రేతలోకం కూడా అంతరిక్షంలోనే పైన చెప్పిన దూరంలో ఉన్నదని భావించవచ్చు. ప్రతి మనిషికీ ఒక నిర్ణీత ఆయుర్దాయం నిర్ణయించబడుతుంది. ఆ ఆయుర్దాయం ముగిసేలోపే, ఏదో ఒక కారణం వల్ల మరణించిన వ్యక్తులయొక్క ఆత్మలు, ప్రేతలోకానికి చేరుకుంటాయని మహాభాగవత గ్రంథంలో చెప్పబడి ఉన్నది. ఇక్కడ ఇంకొక ముఖ్యమైన అంశాన్ని కూడా గుర్తించాల్సి ఉన్నది. అది ఏమిటంటే, కొన్ని పరిస్థితులలో, ఒకవ్యక్తి చనిపోయినప్పుడు ఆ వ్యక్తియొక్క మృతదేహం ఆ వ్యక్తికి సంబంధించిన వాళ్ళకి లభించదు. ఫలితంగా, ఆ మృతదేహానికి శాస్త్రోక్తంగా అంత్యక్రియలు చేసే అవకాశం ఉండదు. ఎప్పుడైతే ఒక మృతదేహానికి సక్రమంగా అంత్యక్రియలు జరగవో అప్పుడు ఆ మృతదేహానికి సంబంధించిన ఆత్మ, తీవ్రమైన అశాంతికి గురై, ప్రేతాత్మగా మారుతుంది. ఆపై ప్రేతలోకానికి చేరుకుంటుంది.

మరికొన్ని సందర్భాలలో, తాము చనిపోయిన విషయాన్ని తెలుసుకోలేని కొన్ని ఆత్మలు, తికమకకు గురై ఆపై భూమిమీదే ఒక గమ్యం అంటూ లేకుండా సంచరిస్తాయి. ఆ ఆత్మలు, వాటికి సంబంధించిన శరీరాలలో ఉన్నంత వరకు ఆకలి, దాహం, కోరికలు లాంటి వాటిని తీర్చుకున్నాయి. ఇప్పుడు వాటికి ఆ కోరికలు తీర్చుకోవటానికి అవసరమైన శరీరం లేదు. దాంతో అవి, తీవ్రమైన ఆగ్రహానికి, అశాంతికి గురి అవుతాయి. ఫలితంగా, అవి సుఖంగా ఉన్న మానవుల్ని తమకు వీలైనవిధంగా తీవ్రంగా బాధించటానికి సిద్ధపడతాయి. గతంలో తాము మానవ రూపంలో ఉన్నప్పుడు (మనిషి శరీరంలో ఉన్నప్పుడు) ఏ సుఖాలైతే అనుభవించాయో వాటిని మళ్ళీ అనుభవించాలని తీవ్రంగా ప్రయత్నిస్తాయి. అందుకోసం అవి, జీవించి ఉన్న మానవులను ఉపయోగించుకుంటాయి. అలా కోర్కెలు తీర్చుకోవటానికి ప్రేతాత్మలు మానవుల్ని ఆవహించే ప్రక్రియనే "ఆవహించటం" లేదా "దయ్యం పట్టటం" అని పిలుస్తారు. ఏదిఏమైనా, ఇలా కోర్కెలు తీరక తల్లడిల్లిపోతున్న ఆత్మలకు శాంతి

కలిగించటంకోసం హైందవ తాంత్రిక గ్రంధాలలో అనేక రకాల పరిహార ప్రక్రియలు సూచించబడ్డాయి. వాటిలో శార్ధకర్మకూడా ఒకటి అని గుర్తించాలి. చాలామందికి తెలియని విషయం ఏమంటే, పితృపక్షంలో వచ్చే అమావాస్యనాడు చేసే శార్ధకర్మలు కేవలము ఆ కర్మలు చేస్తున్న వ్యక్తులయొక్క పితృదేవతలకే కాకుండా, ఆ కర్మలు చేస్తున్న ప్రదేశంలో పిశాచి రూపంలో సంచరిస్తున్న ఇతర వ్యక్తులయొక్క ఆత్మలకు కూడా శాంతిని కలిగిస్తాయని, వాటికి ఉన్న ప్రేత రూపం పోయి ఆపై అవి పితృదేవతల లోకానికి చేరుకుని, కొంతకాలం తరువాత మళ్ళీ ఈ లోకంలో జన్మిస్తాయని గుర్తించాలి.



ప్రాచీన బాబిలోనియాలో (ఆనాటి మెసపొటోమియా అనగా ఈనాటి ఇరాక్ దేశంలోని దక్షిణ – మధ్యభాగంలో "బాబిలోనియా" అనే ప్రాంతం ఉండేది.) విపరీతమైన ప్రచారంలో ఉన్న ఒక సమాచారం ప్రకారం చూసినట్లయితే, సమాధి చెయ్యబడిన వ్యక్తులయొక్క ఆత్మలు, తమకు సంబంధించిన మానవులకు భవిష్యత్తులో జరగబోయే సంఘటనల గురించి వివరిస్తాయని తెలుస్తున్నది. అయితే, ఈ సమాచారాన్ని పొందాలనుకున్నవారు తమకు సంబంధించిన వారియొక్క సమాధుల

వద్దకువెళ్ళి, అక్కడ ప్రార్ధనలు చేసినప్పుడు మాత్రమే ఆ సమాధులలోని ఆత్మలు బైటకు వచ్చి ఆ సమాచారాన్ని అందిస్తాయని గుర్తించాలి. పాపం చేసినవాళ్ళు మాత్రమే దయ్యాలుగా మారతారని, అలాంటి శక్తులకు దైవలోకంలోకి ప్రవేశం ఉండదని అందువల్ల ఆ శక్తులు భూమిమీదే అనంతకాలం సంచరిస్తూ ఉంటాయని ఆనాటి బాబిలోనియాలోని ప్రజలు విశ్వసించారు.

ఆత్మలు లేదా ప్రేతాత్మలు వాయు రూపంలో ఉంటాయి. అవి ఆవగింజంత పరిమాణంలో ఉండవచ్చు లేదా ఒక ఏనుగు అంత పరిమాణంలో ఉండవచ్చు. అనగా, ఆత్మలు ఏ పరిమాణంలోకి అయినా పెరగ గలవు లేదా తగ్గ గలవు. సాధారణంగా, ఆత్మలు – మనిషియొక్క మెదడును తమ నివాసంగా మార్చుకుని ఆపై ఆ మనిషి ద్వారా అనేక రకాల చెడు కార్యాలను చేయిస్తాయి. “దయ్యాలు పట్టటం” అనే ప్రక్రియ కూడా సాధారణంగా జరగదు. సమాధులపైన లేదా నిర్మానుష్యంగా ఉండే చెట్లక్రింద మూత్ర విసర్జన చెయ్యటం వల్ల దయ్యం పట్టే అవకాశాలు అధికంగా ఉంటాయి. మూత్రంయొక్క వాసన, ప్రేతాత్మలకు తీవ్రమైన ఆగ్రహాన్ని కలిగిస్తుందని నమ్ముతారు. తాము నివాసం ఉండే ప్రదేశంలో మూత్రవిసర్జన చెయ్యటం వల్ల ఆ ప్రేతాత్మలు తీవ్రంగా ఆగ్రహిస్తాయి. ఫలితంగా, మూత్రవిసర్జన చేసిన వ్యక్తుల్ని ఆవహించి పీడిస్తాయి. ఇస్లాం మతంలో చెప్పబడిన “జిన్నులు” అనే పేరుగల పిశాచాలు కూడా, తమపై మూత్రవిసర్జన చేసిన మానవుల్ని శిక్షిస్తాయని చెప్పబడి ఉన్నది. అదేవిధంగా, చాలా వయస్సు ఉన్న వేపచెట్టు క్రింద లేదా మర్రిచెట్ల క్రింద రాత్రి సమయాలలో నిద్రించేవాళ్ళకి దయ్యంపట్టే అవకాశాలు ఎక్కువగా ఉంటాయని చెబుతారు.

ఏ మనిషి అయినా చనిపోయే ముందు ప్రశాంతంగా ఉంటే, ఆ మనిషి చనిపోయిన తరువాత అతని ఆత్మ ప్రశాంతంగా ఉంటుంది. ఆపై మళ్ళీ ఎక్కడ జన్మించాలి? ఏం సాధించాలి? అన్న విషయాలను నిర్ణయించుకుని, ఆపై ఆ నిర్ణయాలు అమలు చెయ్యటానికి మళ్ళీ త్వరలోనే ఈ భూమిపై జన్మిస్తుంది. మరణించే వ్యక్తికి తీవ్రమైన అశాంతి లేదా బాధ కలిగినట్లయితే ఆ వ్యక్తి చనిపోయిన తరువాత అతని ఆత్మ, పిశాచిగా మారుతుంది. అందువల్ల ఒకవ్యక్తి చనిపోతున్నప్పుడు ఆ సమయంలో అతని దగ్గర ఉండే అతడి కుటుంబీకులు లేదా బంధువులు – పెద్దగా ఏడవటం, పెద్దగా అరవటం చెయ్యకూడదు. అలా చెయ్యటం వల్ల చనిపోయిన మనిషి మరింత ఆందోళనకు గురి కావటం జరుగుతుంది. అందువల్ల హైందవ మతంలో, ఎవరైనా

వ్యక్తి మరణానికి దగ్గరగా ఉన్నప్పుడు అతడికి సంబంధించిన వ్యక్తులు – భగవంతుడి నామాన్ని జపిస్తూ ఉంటారు. ఆ దైవ నామస్మరణని వింటున్న ఆ వ్యక్తి, ఎంతో కొంత మనశ్శాంతిని పొంది, ఆపై ప్రశాంతంగా దేహాన్ని చాలిస్తాడు అనగా మరణిస్తాడు. అప్పుడు అతడి ఆత్మ, ప్రేతాత్మగా మారే అవకాశాలు చాలా తక్కువగా ఉంటాయని భావించవచ్చు. (తాము జీవించి ఉన్నంతవరకు చాలావరకు మంచి పనులు చేసిన వ్యక్తులకు మాత్రమే, వాళ్ళ మరణ సమయంలో వాళ్ళకు వినిపించే దైవ స్మరణ మనశ్శాంతి కలిగిస్తుందని గుర్తించాలి.)



# 4. ప్రపంచంలోని వివిధ మత విశ్వాసాలలో "మరణ" ప్రాధాన్యత ఏమిటి?

మనిషికి తన జీవిత కాలంలో ఎదురయ్యే భయాలలో అతి భయంకరమైనది అతడి మరణం. మరణం ఎంత భయంకరమైనది అయినప్పటికీ, ఒకవిధంగా అది, మానవ జాతికి జ్ఞానాన్ని బోధించే 'గురువు' అని భావించవలసి ఉంటుంది. మనిషికి మరణం లేకపోతే – దేహానికి మరియు ఆత్మకి మధ్య ఉండే తేడా తెలియదు. మనిషికి ఆ తేడా తెలియకపోతే దేవుడి గురించి మనిషికి పొరపాటున కూడా ఆలోచన రాదు. మరణం లేకపోతే మతం లేదు. మనిషికి కొంచెం తెలివితేటలు వచ్చిన సమయం నుండి మరణం గురించి ఆలోచించటం మనిషిలో మొదలయ్యింది. చనిపోయిన వ్యక్తిలో నుండి ఏదో ఒక "శక్తి" వెళ్ళిపోయిందని ఆనాటి మానవుడికి చూచాయిగా అర్ధమయ్యింది. అప్పటి వరకూ మామూలుగా తిరిగిన మనిషి, హఠాత్తుగా ఒక బొమ్మలాగా మారిపోయి, కట్టెలాగా మిగిలిపోయే సరికి తోటి మనుషులకు భయము మరియు ఆందోళన కలిగాయి. అప్పటి వరకు తమతో ఉన్న ఆ మనిషి హఠాత్తుగా అలా అయిపోవటంతో వాళ్ళకి బాధతోపాటు ఆశ్చర్యం కూడా కలిగింది. తమతోటి మనిషి శరీరం యధాతథంగా కనిపిస్తున్నది. కానీ, ఆ శరీరంలో కదలికలు లేవు. ఒక బొమ్మలాగా ఆ శరీరం మిగిలిపోయింది. అందుకు కారణం ఏమిటి? అని ప్రాచీనకాలంనాటి మనిషిలో ఆలోచన మొదలయ్యింది. ఆ ఆలోచన – క్రమ క్రమంగా మనిషిలో జ్ఞానాన్ని ఉద్భవింపచేసింది. ఫలితంగా, ఆత్మ గురించిన సమాచారం మనిషికి తెలిసింది.

మనిషి బ్రతికి ఉన్న సమయంలో కూడా ఆ మనిషి ఆత్మ, కొన్ని సమయాలలో తాత్కాలికంగా శరీరాన్ని వదిలిపెట్టి బైటకు వెళ్ళిపోతుంది. మళ్ళీ కొంత సమయం తరువాత శరీరంలో ప్రవేశిస్తుంది. ఇది ఎలా జరుగుతుందో తెలుసుకుందాం...మనిషి నిద్రపోతున్నప్పుడు అతని ఆత్మ, బైటకువచ్చి ప్రపంచంలోని ఏ ప్రదేశానికైనాసరే మనోవేగంతో చేరుకుంటుంది. ఆ సమయంలో ఆత్మ చూసిన ప్రదేశాలు ఆ ఆత్మ తాలీకు మనిషికి స్వప్న రూపంలో కనిపిస్తాయి. ఆ కారణంగానే, ఏనాడూ తన సొంత ఊరుని దాటి వెళ్ళని మనిషికి ఎక్కడో వేల మైళ్ళ దూరంలో ఉన్న పర్వతాలు, సముద్రాలు, విచిత్రమైన ప్రదేశాలు కలలో కనిపిస్తాయని గుర్తించాలి. కొన్ని సమయాలలో మానసిక బాధలవల్ల లేదా అనారోగ్యంవల్ల లేదా తీవ్ర ప్రమాదంవల్ల మనిషి స్పృహ కోల్పోతాడు. ఆ సమయంలో ఆ మనిషియొక్క ఆత్మ, తాత్కాలికంగా ఆ మనిషి శరీరాన్ని వదిలిపెట్టి బైటకు వెళ్ళిపోతుంది. ఆ మనిషి – రోగం నుండి లేదా బాధ నుండి తేరుకున్నట్లయితే ఆ ఆత్మ, మళ్ళీ శరీరంలోకి చేరుతుంది అని గ్రహించాలి.

**మరణ సమయంలో ఏం జరుగుతుంది....?**

"యోగవాశిష్ట" అనే గ్రంథంలో వశిష్ట మహర్షి ఇలా చెప్పాడు...ఒక శరీరానికి వచ్చిన వ్యాధి కారణంగా ఆ శరీరంలోని నాడులు బలాన్ని కోల్పోతాయి. ఫలితంగా, అవి వ్యాకోచించటం మరియు సంకోచించటం అనే పనులను చెయ్యలేకపోతాయి. ఫలితంగా, ఆ మనిషి శ్వాసను పీల్చటం మరియు వదలటం కష్టం అయిపోతుంది. ఆపై, శరీర వ్యవస్థలో సమతౌల్యం (బాలెన్స్) లేకుండా పోతుంది. ఫలితంగా, ఆ మనిషి పీల్చిన గాలి సరిగ్గా లోపలికి రాదు. అదేవిధంగా, ఆ మనిషి బైటకు వదిలే గాలి సరిగ్గా బైటకు పోదు. అందువలన ఆ మనిషి, శ్వాస తీసుకోవటం ఆగిపోతుంది. ఎప్పుడైతే మనిషిలో శ్వాస ప్రక్రియ ఆగిపోతుందో ఆ మనిషిలో కదలికలు లేకుండా పోతాయి. ఆపై ఆ మనిషి చనిపోవటం జరుగుతుంది. ఎప్పుడైతే మనిషి చనిపోతాడో ఆ మరుక్షణమే అతనిలోని ఆత్మ, బైటకు వచ్చి అక్కడ ఉండే గాలిలో గిరికీలు కొడుతుంది. ఆ సమయంలో ఆ ప్రాంతంలోని గాలిలో ఉండే అనేక ఆత్మలు, అప్పుడే శరీరం నుండి బైటకు వచ్చిన ఆత్మకు దర్శనమిస్తాయి.

మనిషి శరీరంలో ఉండే ప్రాణశక్తులను (లైఫ్ ఫోర్సెస్) 'ప్రాణ' వాయువు పైకి, 'అపాన'వాయువు కిందకి లాగుతున్నంత కాలం మనిషి బ్రతికి ఉంటాడు. ఎప్పుడైతే ప్రాణ లేదా అపాన వాయువులయొక్క కదలిక బలహీన పడుతుందో, ఆ క్షణంలో

మనిషి శరీరంలో ఉండే ప్రాణశక్తి, బైటకు వెళ్ళిపోతుంది. ప్రాణం పోయే సమయంలో ఆ కార్యానికి (ప్రాణంపోయే కార్యం) 'అపాన' అనే ప్రాణం సహకరించినట్లయితే మనిషియొక్క ఆత్మ, తల మధ్యభాగంలో ఉండే (పుఱ్ఱె మధ్యభాగం) రంధ్రం ద్వారా లేదా ముక్కు లేదా చెవి లేదా నోరు ద్వారా బైటకు వెళ్ళిపోతుంది. అలా కాకుండా ఆత్మ వెళ్ళిపోవటానికి "ప్రాణ" అనే వాయువు సహకరించనట్లయితే ఆత్మ, మనిషియొక్క మలద్వారం ద్వారా బైటకువెళ్ళిపోతుందని యోగశాస్త్రం తెలియజేస్తున్నది.

**మరణానికి గుర్తులు/చిహ్నాములు?**

ఒక మనిషి చనిపోయాడు అని తెలియజేసే చిహ్నాలు లేదా లక్షణాలు – ఇవి అని చెప్పటం కష్టమే అని గుర్తించాలి. ఎందుకంటే, ఒక మనిషిలో హృదయ స్పందన ఆగిపోవటం (గుండెకొట్టుకోవటం ఆగిపోవటం), నాడి కొట్టుకోవటం ఆగిపోవటం, శ్వాస ఆగిపోవటం – లాంటి చిహ్నాలను మరణానికి గుర్తుగా భావించరాదు. ఎందుకంటే, కొన్ని సందర్భాలలో కొంతమంది వ్యక్తులలో శ్వాసప్రక్రియ ఆగిపోవటం మరియు గుండె కొట్టుకోవటం ఆగిపోయిన తరువాత, చాలా సేపటికి ఆ వ్యక్తులు మళ్ళీ బ్రతికిన సందర్భాలు కొన్ని ఉన్నాయని వైద్యశాస్త్ర చరిత్ర తెలియజేస్తున్నది. కనుక, ఒక వ్యక్తి నిజంగా చనిపోయాడు లేదా చనిపోయింది అని తెలియజేసే నమ్మకమైన మరియు ఏకైక చిహ్నం ఏమిటి అంటే – ఒక వ్యక్తి చనిపోయిన కొద్ది సేపట్లోనే శరీరం నుండి దుర్గంధం రావటం మొదలవుతుంది. కొన్ని గంటల తరువాత శరీరం కుళ్ళిపోవటం మొదలవుతుంది. అనగా, శరీరం ముక్కలు ముక్కలుగా విడిపోవటం ప్రారంభం అవుతుంది అన్నమాట. అందువల్ల, ఒక వ్యక్తి మరణించాడు అని వైద్యులు చెప్పిన వెంటనే ఆ విషయాన్ని నమ్మి, మరణించిన వ్యక్తికి అంత్యక్రియలు చేసే ప్రక్రియను ప్రారంభించటం తొందరపాటు చర్య అవుతుందని కొందరు యోగశాస్త్రజ్ఞులు అభిప్రాయపడుతున్నారు. 'ఒక మనిషి చనిపోయాడు' అని వైద్యులు నిర్ణయించిన తరువాత సాధారణంగా ఆ నిర్ణయం చాలా వరకు నిజమయ్యే అవకాశం ఉంటుంది. కానీ, కొన్ని సందర్భాలలో వైద్యులు చేసిన నిర్ణయం తప్పుకావొచ్చు. అది ఎలాగంటే, ఒక మనిషి సమాధి స్థితిలో ఉన్నప్పుడు లేదా తీవ్రమైన మైకం లాంటి స్థితిలో (ట్రాన్స్) ఉన్నప్పుడు – ఆ వ్యక్తి చనిపోయినట్లుగా కనిపించటం జరుగుతుంది మరియు చనిపోయిన వ్యక్తిలో కనిపిస్తాయని, ఆధునిక సైన్స్ చెప్పే లక్షణాలు స్పష్టంగా కనిపిస్తాయి. కానీ, ఆ వ్యక్తి చనిపోయి ఉండడని గ్రహించాలి. కొంతమంది వ్యక్తులు యోగసాధన కారణంగా లేదా అనూహ్యంగా వారి మెదడులో కలిగిన మార్పుల కారణంగా ఒక సమయంలో సమాధి స్థితిలోకి వెళ్ళిపోతారు. ఆ

సమయంలో వారిలో శ్వాస ప్రక్రియ ఉండదు మరియు హృదయ స్పందనలు అనగా గుండె కొట్టుకోవటం ఉండదు.

ఒక మనిషి చనిపోయిన కొద్ది గంటల వరకు అతడి మృతదేహం చుట్టూ అతని ఆత్మ పరిభ్రమిస్తూ ఉంటుంది. ఏదిఏమైనా, కొన్ని సందర్భాలలో చనిపోయిన వ్యక్తికి శవ పరీక్ష (అటాప్సి) చేస్తారు. అనగా ఆ శవంలోని ప్రతి భాగాన్ని కత్తులతో చీల్చి, ఆపై లోపలి భాగాలను క్షుణ్ణంగా పరిశీలిస్తారు. అనగా ఆ వ్యక్తి చనిపోవటానికి కారణం ఏమిటో? ఆ శవ పరీక్షలో తేల్చబడుతుంది అన్నమాట.

దైవాన్ని మరియు మరణానంతర జీవితాన్ని నమ్మే వైద్యులు (వాళ్ళు ఏ మతానికి చెందినవారైనా కావొచ్చు) కొద్ది గంటల క్రితం చనిపోయిన వ్యక్తియొక్క మృతదేహానికి శవ పరీక్ష చేయటానికి ముందు ఆ శవానికి సంబంధించిన ఆత్మను ఇలా ప్రార్ధించాలి. “ఓ ఆత్మా! నీకు ఈ శరీరంలో ఉండే సమయం అయిపోయిందని ఆ దైవం నిర్ణయించటం వల్ల నువ్వు నీ శరీరంలో నుండి బైటకు వెళ్ళిపోయావు. ఇక, ఈ శరీరం నీది కాదు. నీకు సంబంధించిన ఈ మృతదేహాన్ని కోసి పరీక్షించటం వల్ల నీ మృతికి కారణం ఏమిటో మాకు తెలుస్తుంది. అది తెలియటం వల్ల భవిష్యత్తులో ఇతర రోగులకు మేము తగినవిధంగా వైద్యం చెయ్యటం జరుగుతుంది. మేము నీ దేహాన్ని కొయ్యకుండా ఉన్నప్పటికీ, నీవు ఎట్టి పరిస్థితుల్లోను నీ దేహంలోకి రాలేవు. నీ మృతదేహాన్ని కోసి పరీక్షించటం వల్ల మాకు తెలిసే ఫలితాల వల్ల భవిష్యత్తులో ఎందరో వ్యాధి గ్రస్తులకు మంచి జరుగుతుంది. నీవు ఇప్పుడు చనిపోయావు కనుక అనగా నీ ఆత్మ నీ శరీరంలో లేదు కనుక మేము కత్తులతో నీ శరీరాన్ని కోసినా నీకు ఏవిధమైన నొప్పి ఉండదని అర్ధం చేసుకో”. ఈవిధంగా, శవపరీక్ష చేసే ముందు ఆ పరీక్ష చేయబోయే వైద్యులు లేదా సంబంధిత నిపుణులు ఆ ఆత్మ గురించి ప్రార్ధన చెయ్యటం వల్ల ఆ శరీరానికి సంబంధించిన ఆత్మ, వాస్తవాన్ని తెలుసుకుని ఆపై ఆ శరీరం దగ్గర నుండి దూరంగా వెళ్ళిపోతుంది. ఈ సమాచారాన్ని హైదరాబాద్‌కు చెందిన ఒక ప్రముఖ వైద్యుడు నాకు స్వయంగా అందించటం జరిగింది.

దాదాపు 12 సంవత్సరాల క్రితం నేను ఆనాటి కరీంనగర్ జిల్లాలోని వేములవాడలోని ఒక కాలేజిలో పనిచేస్తున్న కాలంలో హఠాత్తుగా ఒక రోజున విజయవాడ రావాల్సి వచ్చింది. ఆపై, నేను మధ్యాహ్న సమయంలో వేములవాడ నుండి కరీంనగర్‌కి బస్సులో వచ్చి, ఆపై అక్కడ బస్సు ఎక్కి వరంగల్ రైల్వేస్టేషన్ దగ్గర దిగాను. ఆపై స్టేషన్‌లోకి వెళ్ళి విజయవాడ వైపుకి వెళ్ళే ట్రైన్ కోసం ఎదురుచూస్తూ

ఒకటవ నెంబర్ ఫ్లాట్‌పారమ్ చివర ఉన్న ఒక బెంచి మీద కూర్చున్నాను. అదే సమయంలో ఒకవ్యక్తి నా ప్రక్కన వచ్చికూర్చున్నాడు. కొద్ది నిమిషాలు గడిచిన తరువాత ఆ వ్యక్తి, నన్ను తమిళంలో పలకరించాడు. కొద్ది నిమిషాలు గడిచే సరికి నాకు ఆ వ్యక్తితో పరిచయం బాగా పెరిగింది. అతడికి మానవాతీత శక్తులపట్ల గట్టి నమ్మకాలు ఉన్నట్లుగా నాకు ఆ వ్యక్తి మాటలను బట్టి అర్థమయ్యింది. ఆ మాటల సందర్భంలో అతడు, కొంతకాలం క్రితం తనకి అయిన కారు యాక్సిడెంట్ గురించి చెప్పాడు. ఆశ్చర్యకరమైన విషయాలు దాగి ఉన్న ఆ యాక్సిడెంట్ గురించిన సమాచారాన్ని అతడు ఇలా చెప్పాడు...

నేను, నా భార్య, కుమారుడు – కారులో, చెన్నై నుండి షుమారు 200 కి.మీ. దూరంలో ఉన్న మా గ్రామానికి వెళుతున్నాం. మా కారు, రద్దీ అధికంగా ఉండే రహదారి మీదుగా ప్రయాణిస్తున్నది. ఆ సమయంలో ఆ కారుని నేనే డ్రైవ్ చేస్తున్నాను. నేను, డ్రైవరు సీటులో కూర్చుని కారు నడుపుతుండగా – నా భార్య మరియు కుమారుడు వెనుక సీటులో కూర్చున్నారు. మా కారు చెన్నై దాటిన రెండు గంటల తరువాత హఠాత్తుగా అదుపు తప్పి బోల్తా కొట్టింది. ఆ తరువాత ఏం జరిగిందో నాకు తెలియదు. మర్నాడు ఉదయం స్పృహలోకి వచ్చిన నేను, చెన్నైలోని ఒక పెద్ద ప్రైవేటు ఆసుపత్రిలో ఒక బెడ్‌మీద పడుకుని ఉన్నాను. నా బెడ్‌కి ప్రక్కనే మా అన్నదమ్ములు నిలబడి నాకేసి ఆందోళనగా చూస్తున్నారు. మరి కొంచెంసేపటి తరువాత మా అన్నయ్య నాకు ధైర్యం చెప్పటం ప్రారంభించాడు. అతడు ఎందుకు అలా చెబుతున్నాడో నాకు అర్థంకాలేదు. ఆ తరువాత కొంతసేపటికి అక్కడకు వచ్చిన ఒక పోలీసు కానిస్టేబుల్ నాతో ఇలా చెప్పాడు. “నిన్న మీకు జరిగిన కారు యాక్సిండెంట్‌లో మీ భార్య మరియు కుమారుడు చనిపోయారు”. ఆ మాట వినగానే నాకు ఒక్కసారిగా గుండె ఆగినంత పనయ్యింది. నేను, ఏడవటానికి కూడా శక్తిలేక పళ్ళు బిగపెట్టి కాసేపు పైకి చూసి, ఆపై అప్రయత్నంగా నా కాళ్ళవైపు చూసుకున్నాను. నా ఎడమ కాలు మోకాలి దగ్గర బాండేజి కనిపించింది. ఆ కారు ప్రమాదంలో నా కాలు మోకాలు దాకా తెగిపోయిందని నాకు నిమిషాల్లో అర్థమయ్యింది. ఆ తరువాత నా బెడ్ దగ్గరకి, నాకు సర్జరీ చేసిన వైద్యుడు వచ్చాడు. ఆపై ఆ వైద్యుడు, నాతో ఇలా చెప్పాడు.

“యాక్సిడెంట్‌లో మోకాలు దాకా నుజ్జు అయిపోయిన నీ కాలు భాగాన్ని ఖండిస్తున్న సమయంలో, నిన్ను ఉంచిన ఆపరేషన్ టేబుల్ ప్రక్కన, వళ్ళంతా రక్తం ఓడుతున్నట్లుగా కనిపిస్తున్న ఒక స్త్రీ నిలబడి ఉన్నది. నీకు జరిగిన కారు యాక్సిడెంట్‌లో

నీ భార్య మరియు నీ కుమారుడు చనిపోయిన విషయం నాకు అప్పటికే తెలుసు. ఏదిఏమైనా, అత్యంత ప్రమాదకరమైన స్థితిలో ఉన్న నిన్ను కాపాడటంకోసం, నలిగి నాశనం అయిపోయిన నీ కాలిని ఖండించి తీసివేయటానికి సిద్ధపడ్డాను. అలాంటి సమయంలో నీ భార్యయొక్క ప్రేతాత్మ అక్కడ నాకు కనపడే సరికి, నువ్వు కూడా చనిపోతావు అన్న అనుమానం నాకు వచ్చింది. విచిత్రం ఏమంటే, నాకు ఆ ఆపరేషన్ థియేటర్‌లో కనిపించిన స్త్రీ ప్రేతాత్మ, నా ప్రక్కన ఉన్న నా సహాయకులకు కనపడలేదు. ఇక, స్పృహ లేకుండా పడి ఉన్న మరియు మత్తు ఇవ్వబడి ఉన్న నీకు ఆమె ప్రేతాత్మ కనిపించే అవకాశమే లేదు. ఏదిఏమైనా నేను, నా ఇష్టదైవంపై భారంవేసి పరిపూర్ణమైన ఏకాగ్రతతో సర్జరీ ముగించాను. నీ మోకాలు వరకు కాలును తొలగించాను. ఆ సర్జరీ నేను చేయకపోయినట్లయితే కొన్ని గంటల్లోనే నీ శరీరం అంతా సెప్టిక్ అయి నువ్వు చనిపోయి ఉండేవాడివి. ఇంకొక విషయం ఏమంటే, ప్రేతాత్మలు కొన్ని సమయాలలో మనుషులకు కనిపిస్తాయి అని మా పెద్ద వాళ్ళు చెప్పిన మాటల్ని నేను నమ్ముతాను కనుక, నాకు ఆపరేషన్ థియేటర్‌లో నీ భార్య ప్రేతాత్మ కనిపించింది. కానీ, సైన్స్‌ని మాత్రమే నమ్మే నాతోటి డాక్టర్లు "నాకు ఆపరేషన్ థియేటర్‌లో దయ్యం కనిపించింది అని చెబితే నమ్మరు సరికదా. నన్ను ఒక పిచ్చివాడిగా లెక్క కట్టి చాటున నా గురించి హేళనగా మాట్లాడుకుంటారు. అందుకే, నాకు ఎదురైన ఆ అనుభవాన్ని వాళ్ళకు చెప్పలేదు. నువ్వు బొమ్మలు గీసే కళాకారుడివి మరియు మనసున్న మనిషివి కనుక అర్థం చేసుకుంటావని నీకు, ఆపరేషన్ థియేటర్‌లో నాకు ఎదురైన అనుభవం గురించి చెప్పాను". – ఈవిధంగా ఆ వ్యక్తి తన జీవితంలో జరిగిన ఒక యదార్ధ ప్రేతాత్మ సంఘటన గురించి నాకు తెలియజేసాడు.

ఒక ముఖ్య విషయం ఏమంటే, చనిపోయే సమయంలో ఒకవ్యక్తికి మళ్ళీ పుట్టాలి అన్న కోరిక చాలా బలంగా ఉన్నట్లయితే, ఆ వ్యక్తి చనిపోయిన కొద్ది రోజుల్లోనో లేదా నెలల్లోనో మళ్ళీ జన్మించటం జరుగుతుంది. మరణించిన అతి కొద్దికాలంలోనే మళ్ళీ జన్మించిన వ్యక్తులకు తమ గతజన్మకు సంబంధించిన జ్ఞాపకాల చాలా అధికంగా ఉంటాయని చెబుతారు.

ఒక విచిత్రం ఏమంటే, ఒక మనిషి జీవించి ఉన్నప్పుడు అతడికి కొద్దిపాటి శక్తి మాత్రమే ఉంటుంది. అయితే మనిషి మరణం తరువాత అతని శరీరం నుండి బైటకు వచ్చిన ఆత్మకు అనేక శక్తులు సంక్రమిస్తాయని ప్రపంచంలోని అనేక మతాలలో చెప్పబడి ఉన్నది. ఆ కారణంగానే, చనిపోయిన వ్యక్తులయొక్క ఆత్మలకు శాంతిని

కలిగించే పూజలుచెయ్యటం, శార్ధ కర్మలు చెయ్యటం లాంటివి ప్రపంచవ్యాప్తంగా ఈనాటికీ జరుగుతున్నాయని గుర్తించాలి. యుక్త వయస్సులో ఉండగా చనిపోయిన వాళ్ళు, పిల్లలుగా ఉండగా చనిపోయినవాళ్ళు, ప్రసవ సమయంలో ప్రసవ వేదన తట్టులేక చనిపోయిన స్త్రీలు, హత్య చేయబడినవాళ్ళు, పిడుగుపడి చనిపోయిన వాళ్ళు, విషసర్పంయొక్క కాటువల్ల చనిపోయినవాళ్ళు, ఆత్మహత్య చేసుకుని చనిపోయినవాళ్ళు, నీళ్ళలో మునిగి చనిపోయినవాళ్ళు – తప్పనిసరిగా ప్రేతాత్మలుగా మారతారు. బలన్మరణం పొందిన కారణంగా వాళ్ళ ఆత్మలు, తీవ్రమైన క్షోభతో ఉగ్ర రూపాన్ని ధరించి, ఆపై మానవులకు ఏదోవిధంగా హాని చెయ్యటానికి ప్రయత్నాలు చేస్తాయి. కోర్కెలు తీరకుండా హఠాత్తుగా జీవితాన్ని ముగించుకున్న మానవులయొక్క ఆత్మలు, ప్రేతాత్మలుగా మారతాయని దాదాపు ప్రపంచంలోని అన్ని ప్రాంతాలలోనూ బలంగా విశ్వసిస్తున్నారు.



కొన్ని ప్రత్యేక పరిస్థితుల్లో, చనిపోయిన వ్యక్తుల యొక్క ఆత్మలు మానవులకు కనిపిస్తాయని మరియు బ్రతికి ఉన్నప్పుడు ఆ ఆత్మలకు సంబంధించిన వ్యక్తులు ఏ రూపంలో ఉండేవాళ్ళో, అదే రూపంలో వాళ్ళ ఆత్మలు – మానవులకు కనిపిస్తాయని ప్రపంచంలోని అనేక ప్రాంతాలలో నిరూపణ అయ్యింది. ఇంకొక విశేషం ఏమంటే, మనిషి మరణించిన తరువాత ఆ మనిషికి సంబంధించిన ఆత్మకు కొన్ని ప్రత్యేక శక్తులు వస్తాయి. ఆ శక్తుల కారణంగా ఆత్మ, ప్రాణం ఉన్న ఇతర జీవులను లేదా మానవులను లేదా రాళ్ళు, వస్తువులు లాంటి వాటినికూడా ఆవహిస్తుంది. ఆత్మచేత ఆవహించబడిన వస్తువులు ఎవరి ప్రమేయం లేకుండా వాటంతట అవే కదులుతాయి. ప్రపంచ వ్యాప్తంగా ఆత్మకి సంబంధించిన నమ్మకాలలో అతి ప్రధానమైనది ఏమంటే, ఒక మనిషి చనిపోయిన తరువాత అతని ఆత్మ ఆ శరీరం నుండి బైటకు వచ్చినప్పటికీ ఆ ఆత్మకి ఆ శరీరం మీద వ్యామోహం పోదు.

అందువలన అది ఆ శరీరం చుట్టూ గిరికీలు కొడుతూ ఉంటుంది. హైందవ మతం, సిఖ్ మతం, జపాన్ మతం – అనే పెద్ద ప్రపంచ మతాలలో మినహా ఇతర మతాలలో మృతదేహాలను సమాధి చేస్తారు. ఏ సమాధిలో తన మృతదేహం ఉంటుందో ఆ సమాధి చుట్టూ ఆ మృతదేహం తాలీకు ఆత్మ సంచరిస్తూ ఉంటుంది. కొంతకాలానికి మృతదేహంలో ఉండే మాంసం నశించిపోయి కేవలం ఎముకలు మాత్రమే మిగులుతాయి. మరి కొంతకాలానికి ఆ ఎముకలు కూడా నశించిపోతాయి. తన శరీరానికి చెందిన చివరి ఎముక ఆ సమాధిలో ఉన్నంతవరకూ ఆ ఆత్మ ఆ సమాధిని ఆవహించి ఉంటుందని భావిస్తారు. ఆ కారణంగానే, క్రైస్తవ మతంలో ఒక ప్రత్యేకవర్గం అయిన రోమన్ కాథలిక్ మతాన్ని పాటించేవారు మరియు బౌద్ధమత సన్యాసులను దైవాలుగా ఆరాధించేవారు, తమ గురువుల యొక్క దేహంలోని ఒక ఎముక దొరికినా సరే, ఆ ఎముకను తీసుకువచ్చి తమ ప్రాంతంలో ఒకచోట సమాధి చేసి, ఆ సమాధి పైన ఒక స్థూపాన్ని నిర్మించటం జరుగుతుంది. కొంతమంది పరిశోధకుల అభిప్రాయం ప్రకారం చూసినట్లయితే, పూరీ క్షేత్రంలో పూజలు అందుకునే జగన్నాథస్వామియొక్క దారు ప్రతిమలో (కొయ్య బొమ్మలో) గౌతమ బుద్ధుడియొక్క దంతం (Teeth) భద్రపరచబడి ఉన్నట్లుగా తెలుస్తున్నది.

సాధారణంగా హైందవ కుటుంబాలలో ఒక వ్యక్తి చనిపోయినప్పుడు ఆ వ్యక్తియొక్క పెద్ద కొడుకు ఆ వ్యక్తికి శార్ధకర్మలు నిర్వహించటం జరుగుతుంది. కనుక పురుషుడు మాత్రమే తన తండ్రికి లేదా తల్లికి శార్ధకర్మలు చెయ్యాలని భావిస్తారు. కానీ, ప్రాచీనకాలంలో అమ్మాయిలకు కూడా ఉపనయనం జరిగేది. అనగా వాళ్ళు కూడా జంధ్యాలు ధరించేవాళ్ళు. ఫలితంగా, ఆ అమ్మాయిలకుకూడా తమ తల్లిదండ్రులకు తల కొరివి పెట్టటం దగ్గర నుంచి శార్ధకర్మలు చెయ్యటం వరకు అర్హత ఉండేది. కాలక్రమంలో అమ్మాయిలకు ఉపనయనం చేసే సాంప్రదాయం తొలగిపోయింది. ఫలితంగా అమ్మాయిలు తమ తల్లిదండ్రులకు శార్ధకర్మలు చేసే అర్హతను కోల్పోయారు. కొడుకులు మాత్రమే తల్లిదండ్రులకు శార్ధకర్మలు చెయ్యాలని, కూతుళ్ళు చెయ్యకూడదని ఏ ధర్మశాస్త్రాలలోనూ చెప్పలేదు. మరి, కొడుకులు మాత్రమే పితృకర్మలు చేసే సాంప్రదాయం ఎలా ఏర్పడింది? అన్న సందేహం చాలా మందికి వచ్చే అవకాశాలు ఉంటాయి. దీనికి ఒక పండితుడు ఇలా సమాధానం చెప్పాడు.

"పూర్వకాలంలో అమ్మాయిలకు చాలా చిన్న వయస్సులో అనగా పది ఏళ్ళ వయస్సులోనే పెళ్ళి జరిగేది. అంతేకాకుండా, ఆ అమ్మాయిలు పెళ్ళి తరువాత చాలా దూరంలో ఉన్న అత్తవారింటికి వెళ్ళిపోవటం జరిగేది. అలా అమ్మాయిలు తమ

అత్తవారింట్లో ఉన్న సమయంలో, ఇక్కడ పుట్టింట్లో – వాళ్ళ తల్లి లేదా తండ్రి చనిపోతే ఆ విషయాన్ని ఆ అమ్మాయిలకు తెలియజేయటానికి చాలా రోజులు పట్టేది. కారణం, ఆ కాలంలో ప్రయాణ సౌకర్యాలు లేవు. కనీసం ఉత్తరాలు పంపించే సౌకర్యాలు కూడా ఉండేవికాదు. దూర ప్రాంతాలకు వెళ్ళాలంటే కాలినడకన లేదా ఎడ్ల బండిలోనో వారాలతరబడి ప్రయాణించాల్సి వచ్చేది. మరి, అన్ని రోజుల పాటు మృతదేహాన్ని ఇంట్లో ఉంచుకోవటం సాధ్యపడదు. అందువల్ల, ఎక్కడో దూరంగా అత్తగారింట్లో ఉన్న అమ్మాయి వచ్చేదాకా మృతదేహాన్ని ఉంచకుండా, ఇంట్లోనే ఉండే కొడుకుచేత ఆ మృతదేహానికి అంత్యక్రియలు చేయిస్తూ ఉండేవాళ్ళు. ఫలితంగా, కొడుకులు మాత్రమే తల్లిదండ్రులకు అంత్యక్రియలు, శార్ధకర్మలు చెయ్యాలి అనే ఒక సాంప్రదాయం మొదలయ్యింది. అదే సాంప్రదాయం ఈనాటికీ కొనసాగుతున్నది.

ఇంకొక ముఖ్యవిశేషం ఏమంటే, ఇప్పుడు కూడా స్త్రీలు తమ తల్లిదండ్రులకు శార్ధకర్మలు చెయ్యవచ్చు. మగవాళ్ళు, తమ తల్లిదండ్రులకు శార్ధకర్మలు చేసేటప్పుడు భుజంమీద ఒక జంధ్యాన్ని తాత్కాలికంగా ధరిస్తారు. అదేవిధంగా స్త్రీలు కూడా ఒక తెల్లటి వస్త్రాన్ని తమ భుజంపై వేసుకుని శార్ధకర్మలు చెయ్యవచ్చు. ఈ ప్రక్రియలో పురుషులు తమ జంధ్యాన్ని కుడి భుజంమీద నుండి ఎడమ భుజం మీదకి మరియు ఎడమ భుజం మీద నుండి కుడి భుజంమీదకి ఎలా మార్చుకుంటారో అదేవిధంగా స్త్రీలు కూడా తమ భుజంపై ఉండే తెల్లటి వస్త్రాన్ని కుడివైపు నుండి ఎడవైపుకి, ఎడమ వైపు నుండి కుడివైపుకి మార్చుకోవాల్సి ఉంటుంది.

కొన్ని సమయాలలో కొందరు వ్యక్తులు, చెడు పరిస్థితులలో చనిపోవటం జరుగుతుంది. అలాగే అకాలమృత్యువు పొందటం జరుగుతుంది.

తన శరీరానికి తగినవిధంగా అంతిమ సంస్కారాలు (అగ్నిలో దహించటం లేదా సమాధి చెయ్యటం) జరగనట్లయితే ఆ శరీరానికి చెందిన ఆత్మ, తీవ్రమైన ఆవేదనకు గురి అవుతుందని ప్రాచీనకాలానికి చెందిన ఈజిప్టు, గ్రీకు, రోమన్ ప్రజలు బలంగా విశ్వసించారు. ఆ కారణంగానే, ఆ దేశాలలో – చనిపోయిన వ్యక్తులయొక్క దేహాలకు చాలా శ్రద్ధతో, శాస్త్రోక్తంగా అంత్యక్రియలు జరిపినట్లుగా తెలుస్తున్నది. అనేక నేరాలుచేసి, చట్టం ద్వారా మరణశిక్ష అనుభవించిన నేరస్తుల యొక్క మృతదేహాలకు, శతృవుల యొక్క మృతదేహాలకు అంత్య క్రియలు చెయ్యకుండా ఆ మృతదేహాలను ఎక్కడో ఒకచోట పారవెయ్యటం జరిగేది. అలా చెయ్యటం వల్ల ఆ ద్రోహులకు మరణం తరువాత కూడా తీవ్రమైన బాధ కలిగించే అవకాశం ఉంటుందని ఆనాటి ప్రజలు భావించటం జరిగింది.

హైందవ మతంలో – నామకరణ మహోత్సవానికి, అన్నప్రాసనకి, వివాహానికి ఎంత ప్రాముఖ్యత ఇవ్వబడిందో, అంత్య క్రియలకు కూడా అంతే ముఖ్య స్థానం ఇవ్వబడింది. ఇతర మతాలలో జరిగే అంత్యక్రియలకు, హైందవ మతంలో జరిగే అంత్యక్రియలకు చాలా తేడా ఉన్నది. మృతదేహాలకు సశాస్త్రీయంగా అనగా మంత్రాలతో కూడిన ప్రక్రియతో దహన ప్రక్రియను నిర్వహించటం జరుగుతుంది. హైందవ మతంలో చెప్పబడిన సిద్ధాంతాల ప్రకారం చూసినట్లయితే – మానవ శరీరం, పంచ భూతాలతో (గాలి, నీరు, వెలుతురు, ఆకాశం, మట్టి) తయారవుతుంది. చనిపోయిన వ్యక్తియొక్క మృతదేహం ఆ పంచ భూతాల్లోనే కలవాలి అన్న ఉద్దేశంతో మృతదేహాన్ని దహనం చేస్తారు.

మనిషి శరీరం దహనం అయినప్పుడు ఒక్క ఆకాశం మినహా మిగిలిన నాలుగు భూతాలలోకి శరీరం లీనం అవుతుంది. ఇక, మనిషిలోని ప్రాణం – ఆకాశ తత్వాన్ని కలిగి ఉంటుంది కనుక పితృదేవతలు నివాసం ఉండే ఆకాశంలోకి ఆత్మ చేరుకుంటుంది.  అయితే, హైందవ మతంలో జరిగే అంత్యక్రియలు, చనిపోయిన వ్యక్తియొక్క వయస్సును బట్టి వివిధ రకాలుగా ఉంటుంది. చిన్న వయస్సు ఉండే పిల్లలు చనిపోయినప్పుడు ఆ మృతదేహాన్ని సమాధి చేస్తారు. యోగులైన మహానుభావులు మరణించినప్పుడు వారి పార్ధివ దేహాన్ని సమాధి చేస్తారు. ఇంకొక ముఖ్య విశేషం ఏమంటే, యోగులు "తమకి మరణం ఆసన్నమైన సమయాన్ని ముందుగానే గుర్తించి, ఆపై ఒక నిర్ణీత ప్రదేశంలో పద్మాసనంలో కూర్చుని, శ్వాసను బంధించి, ఆ తరువాత తమ ప్రాణాన్ని శిరస్సు మధ్యలో ఉండే రంధ్రం ద్వారా పైకి పంపించివేస్తారు. అలా ప్రాణం పోయిన యోగుల మృతదేహాలకు సమాధి కడతారు. ఆ తరువాతకాలంలో ఆ సమాధులే దివ్య క్షేత్రాలుగా మారతాయి. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోని కర్నూలు జిల్లాలో ఉన్న "శ్రీ రాఘవేంద్రస్వామి వారి బృందావనం" కూడా ఒక సమాధే అని గుర్తించాలి. ఇక, ఒక సన్యాసి చనిపోయినప్పుడు అతడి మృతదేహాన్ని నదీ జల ప్రవాహంలో వదిలివేస్తారు. అలా చెయ్యటం వల్ల ఆ సన్యాసి యొక్క మృతదేహాన్ని జలంలో ఉండే చేపలు లాంటి జీవులు ఆహారంగా తీసుకుంటాయి. ఆవిధంగా సన్యాసుల ఆత్మలు జలచరాల ద్వారా పుణ్యలోకాలకు చేరుకుంటాయి. ఇలాంటి అంత్యక్రియల విధానాన్ని "జలసమాధి" అని పిలుస్తారు.

ముఖ్యంగా, గంగానది లాంటి పవిత్ర నదులలో ఇలాంటి జల సమాధులు జరుగుతూ ఉంటాయి. మృతదేహాలను పవిత్రమైన నదీ తీరాలలో దహనం చేసినట్లయితే ఆ మృతదేహాల తాలీకు ఆత్మలయొక్క పాపాలు నశించి పోతాయని, ఫలితంగా ఆ

ఆత్మలు పుణ్యలోకాలకు వెళతాయని హిందూ మతంలో స్పష్టంగా చెప్పబడి ఉన్నది. హిందూ మతంలో చెప్పబడిన ఒక ముఖ్య సిద్ధాంతం ప్రకారం చూసినట్లయితే ఒకవ్యక్తి చనిపోయిన తరువాత కొద్ది రోజుల పాటు అతని ఆత్మ, భూమిమీదే తిరుగుతూ ఉంటుంది. ఆ సమయంలో ఆ ఆత్మయొక్క చెడు ప్రభావం, ఆ వ్యక్తియొక్క దగ్గర బంధువులకు మరియు దూరపు బంధువులకు తగులుతుంది. అలాంటి పరిస్థితినే "మైల" లేదా "సూతకం" అని పిలుస్తారు. మరణించిన వ్యక్తియొక్క ఆత్మకు శాంతి కలగటంకోసం తగిన కర్మకాండలు పూర్తి అయ్యే సరికి, ఆ ఆత్మ – పుణ్యలోకాలకు వెళ్ళి పోతుంది. అప్పుడు ఆ ఆత్మకు సంబంధించిన బంధువులకు "మైల" అనే దోషం తొలగిపోతుంది.

దక్షిణ భారతదేశంలోని హైందవులు – శ్మశానంలో ఒకవ్యక్తియొక్క మృతదేహాన్ని దహనం చేసిన తరువాత, కొన్ని పిండాలను (నల్ల నువ్వులు కలిపిన బియ్యపు పిండి ముద్దలు) చితికి కొంచెం దూరంలో నేలపై ఉంచుతారు. అలా నేలపై ఉంచిన పిండాలను కొద్ది నిమిషాల్లోగా కాకులు వచ్చి తిన్నట్లయితే, దహించబడిన మృతదేహం తాలీకు ఆత్మ శాంతించినట్లుగా గుర్తిస్తారు. అలా కాకుండా, ఆ పిండాలను కాకులు ముట్టుకోనట్లయితే చనిపోయిన వ్యక్తియొక్క ఆత్మ, తీవ్రమైన అశాంతితో ఉన్నట్లుగా అర్థంచేసుకుంటారు. కొన్ని సమయాలలో చితికి నిప్పు అంటించినప్పుడు కొద్ది నిమిషాలు గడిచినా ఆ చితి మండకుండా విపరీతమైన పొగ వస్తుంది. అలా వచ్చినట్లయితే దాని అర్థం ఏమంటే – చితిపై ఉంచబడిన మృతదేహానికి చెందిన వ్యక్తియొక్క ఆత్మ తీవ్రమైన అశాంతితో ఉన్నదని అర్థం. దీన్ని నిరూపించే అనేక యదార్థ సంఘటనలు మన తెలుగు రాష్ట్రాల్లో కూడా జరిగాయి.

ఉదాహరణకి, దాదాపు 20 సంవత్సరాల క్రితం గుంటూరు పట్టణంలోని ఒక సాంప్రదాయ బ్రాహ్మణ కుటుంబానికి చెందిన ఒక వృద్ధుడు మరణించినప్పుడు అతడి కుమారుడు, అతడి మృతదేహాన్ని శ్మశానంలో చితిపై ఉంచి దహనం చెయ్యాలని ప్రయత్నించినప్పుడు ఆ చితి ఎన్నిసార్లు ప్రయత్నించినా సరిగా అంటుకోలేదు. ఆ అంత్యక్రియల ప్రక్రియను నిర్వహించటానికి వచ్చిన పురోహితుడు, ఆ మృతదేహం తాలీకు కుమారులతో ఇలా అన్నాడు. "మీ తండ్రిగారి ఆత్మ ఏదో బాధతో ఉన్నది. అందుకే ఆయన చితి అంటుకోవటంలేదు. చనిపోయేముందు ఆయనకి ఏదైనా బాధ ఉందేమో మీ అమ్మగారిని కనుక్కోండి". అప్పుడు ఆ కుమారులలో ఒకడు వెంటనే ఇంటికి వెళ్ళి, శ్మశానంలో జరిగిన విషయంచెప్పి ఆపై "మా నాన్నకి చనిపోయేముందు ఏ విషయంలో అయినా దిగులు ఉన్నదేమో నీకు తెలుసా?" అని

అడిగాడు. అప్పుడు ఆమె, కొంచెంసేపు ఆలోచించి "మీ మామయ్య దగ్గర మీ నాన్న రెండేళ్ళ క్రితం లక్ష రూపాయలు అప్పుతీసుకున్నాడు. ఆ అప్పు తీర్చకుండానే చనిపోతున్నాను అని మీ నాన్న తన చివరి క్షణాల్లో నా చెవిలో చెప్పాడు. బహుశా ఆ కారణంగానే మీ నాన్న ఆత్మ అశాంతితో తల్లడిల్లిపోతున్నది కాబోలు" అన్నది. విషయం అర్థమైన ఆ కొడుకు వెంటనే అప్పటికప్పుడు బాంకుకివెళ్ళి లక్ష రూపాయలు డ్రాచేసి, ఆపై నేరుగా శ్మశానికివెళ్ళి అక్కడ, మృతదేహానికి దగ్గరలో నిలబడి ఉన్న బంధువుల మధ్యలో ఉన్న తన మామయ్యకి ఆ లక్ష రూపాయలు ఇచ్చి, ఆపై చితి దగ్గరకు వెళ్ళి ఆ చితికి రెండు చేతులు జోడించి దణ్ణంపెట్టి "నాన్నా! నీ అప్పు ఇప్పుడే తీర్చేసాను. నువ్వు ఇక బాధపడవలసిన పనిలేదు. నువ్వు సంతోషంగా పుణ్యలోకాలకువెళ్ళు" అన్నాడు. ఆ తరువాత పెద్ద ప్రయత్నం లేకుండానే ఆ చితి చక్కగా అంటుకుని కొంచెం సేపట్లోనే కపాలమోక్షం కూడా జరిగింది.

హైందవ మత వేదాంతంలో చెప్పబడిన సమాచారం ప్రకారం చూసినట్లయితే, "ఒక మనిషి తాను చనిపోయే సమయంలో ఎలాంటి ఆలోచనలతో ఉంటాడో, ఆ ఆలోచనలకు తగినట్లుగానే అతని ఆత్మ, పుణ్యలోకాలకు వెళ్ళటమో లేదా నరకలోకానికి వెళ్ళటమో లేదా పిశాచిగా మారటమో జరుగుతుందని తెలుస్తున్నది. ఉదాహరణకి – ఒక వ్యక్తి – తాను చనిపోయే సమయంలో తన కుటుంబం గురించి అనగా తన సంతానం గురించి మరియు మనవళ్ళు, మనుమరాళ్ళ గురించి దిగులు పడుతున్నట్లయితే అనగా వాళ్ళకి తాను దూరం అవుతున్నట్లుగా భావిస్తున్నట్లయితే ఆ వ్యక్తి చనిపోయిన తరువాత, మొదట పితృలోకానికి చేరుకుని ఆ తరువాత అతి కొద్దికాలంలోనే తన కుటుంబంలో ఒక బిడ్డగా జన్మించటం జరుగుతుంది. ఇక, ఒక వ్యక్తి చనిపోయే ముందు డబ్బు గురించి ఆలోచిస్తున్నట్లయితే ఆ వ్యక్తి, మరణించిన తరువాత విష్ణులోకానికి చేరుకుని, ఆ తరువాత అతి కొద్దికాలంలోనే ఒక వ్యాపార కుటుంబంలో పుట్టి, పెరిగి పెద్ద అయిన తరువాత ఒక గొప్ప వ్యాపారిగా మారటం జరుగుతుంది. ఒకవ్యక్తి చనిపోయే సమయంలో కూడా క్రూరమైన ఆలోచనలతో ఉన్నట్లయితే ఆ వ్యక్తి ఆత్మ, ఒక భయంకరమైన పిశాచిగా మారటం జరుగుతుంది. చనిపోయే సమయంలో దైవ సంబంధమైన ఆలోచనలతో ఉన్న వ్యక్తి యొక్క ఆత్మ, అన్నిటి కంటే ఎత్తులో ఉండే పుణ్యలోకాలకు చేరుకోవటం జరుగుతుంది.

# 5. హైందవ మతంలో మహాలయపక్షం – మహాభరణి శ్రార్ధ విశేషాలు?

### మహాలయపక్ష శార్ధ విధానం ఎలా ఏర్పడింది?

మహాలయ పక్షంలో నిర్వహించే శ్రార్ధకర్మలయొక్క ప్రాధాన్యతను వివరించే ఒక కథ, మహాభారత గ్రంధంలో కనిపిస్తుంది. అది ఏమిటంటే....

కురుక్షేత్ర యుద్ధంలో మరణించిన వారిలో మహాదాత అయిన కర్ణుడు కూడా ఉన్నాడు. ఈ కర్ణుడు తాను జీవించి ఉన్న కాలంలో తన శక్తికి మించి దానాలుచేసి "దానవీరుడు" అనే బిరుదు కూడాపొందాడు. అనగా, ఇతడు మహా పుణ్యాత్ముడు అని గుర్తించాలి. సరే, వీర మరణం పొందాడు కనుక కర్ణుడియొక్క ఆత్మ, నేరుగా స్వర్గానికి వెళ్లింది. స్వర్గంలో ఆ కర్ణుడి ఆత్మకు ఆహారంగా బంగారు బిళ్ళల్లి ఇచ్చారు. వాటిని చూసి ఆశ్చర్యపోయిన కర్ణుడు ఆ బంగారు బిళ్ళల్ని తెచ్చిన దేవ సేవకుడితో ఇలా అన్నాడు. "నేను మానవ లోకానికి చెందిన ఆత్మని. అందువల్ల నాకు ఆహారం కావాలి. కానీ, నీవు బంగారాన్ని తెచ్చావు. దాంతో నా ఆకలి ఎలా తీరుతుంది?". అప్పుడు ఇంద్రుడు అక్కడ ప్రత్యక్షం అయి ఆపై కర్ణుడితో "ఓ కర్ణా! నువ్వు బ్రతికి ఉన్నంతకాలం, అవసరం ఉన్న అందరికీ బంగారాన్ని దానం చేసావు. అది మహా పుణ్యమే. కానీ, నీవు బ్రతికి ఉన్న సమయంలో – కారణం ఏదైనప్పటికీ నీ పితృదేవతలకు ఒక్కరోజు కూడా శ్రార్ధకర్మ చెయ్యలేదు. అనగా, పితృదేవతలకు ఆహారం పెట్టలేదు. అంతేకాదు నీ గృహంలో ఏనాడూ నీ పితృదేవతల దినంనాడు అన్నదానాలు చెయ్యలేదు. ఆ కారణంగానే ఇప్పుడు నీకు ఆహారం బదులు, బంగారం ఆహారంగా ఇవ్వబడింది అని గ్రహించు" అన్నాడు. అప్పుడు కర్ణుడు, విచారం నిండిన స్వరంతో ఇంద్రుడితో "ప్రభూ! నా తల్లిదండ్రులు ఎవరో నాకు అసలు తెలియదు. ఆ కారణంగానే నేను నా పితృదేవతలకు శ్రార్ధములు పెట్టలేదు. నేను, కావాలని పితృ కర్మలను మానలేదని గ్రహించు. నాకు ఈ బంగారాన్ని తినే దుర్గతిని తప్పించు" అన్నాడు. అప్పుడు ఇంద్రుడు, కర్ణుడి మీద సానుభూతిని చూపిస్తూ కర్ణుడితో "నాయనా! నీకు 15 రోజుల వ్యవధి ఇస్తున్నాను. ఈ పక్షం రోజుల్లో నీవు భూలోకానికి మానవ రూపంలో వెళ్ళి, ఆపై ఏదైనా పవిత్ర నదీతీరంలో నీ పితృదేవతలకు శ్రార్ధకర్మలుచేసి, ఆపై, వారి ఆత్మశాంతికోసం అన్నదానం, జలదానం లాంటి దానాలు చెయ్యి. ఆ తరువాత స్వర్గానికి తిరిగిరా. అప్పటి నుండి నీకు ఈ స్వర్గలోకంలో

మనుషులు తినే ఆహారమే ఇవ్వబడుతుంది" అన్నాడు. ఆ తరువాత కర్ణుడు మానవ దేహంతో భూలోకానికి వచ్చి 15 రోజులపాటు ఇక్కడ తన పితృదేవతలకు శ్రార్ధకర్మలు చేసాడు మరియు వారి జ్ఞాపకార్థం వందలాదిమంది బ్రాహ్మణులకు విందు భోజనాలుపెట్టి, భారీ పరిమాణంలో విలువైన దానాలు చేసాడు. కర్ణుడు, భూలోకంలో ఆ 15 రోజులపాటు పితృకర్మలు చేసిన కాలాన్ని ఆ తరువాత కాలంలో "పితృపక్షం" అనే పేరుతో పిలవటం ప్రారంభించారు.

1. దక్షిణ భారతదేశ సాంప్రదాయంలో భాద్రపద – బహుళ పాడ్యమి తిధి నుండి 15 రోజుల పాటు ఉన్న కాలాన్ని 'మహాలయ పక్షము' అనే పేరుతో పిలుస్తారు. ఈ సమయంలో సూర్యుడు, కన్యారాశిలో ఉంటాడు. అందువలన ఈ సమయంలో తమ పితృదేవతలకు (చనిపోయిన తల్లి, తండ్రి, తాత, ముత్తాత) శ్రార్ధ కర్మలు చేసిన వారికి పుణ్యం లభిస్తుందని మరియు వారు వాంఛించినవి లభిస్తాయని వరాహ మరియు బ్రహ్మాపురాణాలలో చెప్పబడి ఉన్నది.

2. ఉత్తర భారతదేశ సాంప్రదాయంలో పితృపక్షం/మహాలయపక్షం, ప్రతి సంవత్సరం ఆశ్వీయుజ మాసంలోని శుక్లపక్షంలో అనగా పౌర్ణమి నుండి అమావాస్య వరకు మధ్య ఉండే 15 రోజుల పాటు ఉంటుంది.

**ఉత్తర భారతంలో ఒక నెలలో, దక్షిణ భారతంలో ఇంకొక నెలలో పితృపక్షం/ మహాలయపక్షం రావటానికి గల కారణం ఏమిటి?**

దక్షిణ భారతదేశంలో మరియు పశ్చిమ భారతదేశంలోని ప్రాంతాలలో భాద్రపద మాసంలోని రెండవ పక్షంలో "మహాలయపక్షం" ప్రారంభం అవుతుంది. దక్షిణ భారతదేశంలో (తెలుగు రాష్ట్రాలతో సహా) 'అమాంత' సాంప్రదాయంలో ప్రతి నెల యొక్క ప్రారంభం మరియు ముగింపు ఉంటాయి. 'అమాంత' అనగా అమావాస్య అంతం వరకు అని అర్థం. అనగా, అమావాస్య తిథి ముగింపు సమయంలో నెల ప్రారంభం అయి, మళ్ళీ అమావాస్య ముగింపు సమయం వరకు కొనసాగుతుంది.

ఈ అంశాన్ని ఒక ఉదాహరణ ద్వారా తెలుసుకుందాం...

2019, ఆగష్టు నెల (శ్రావణమాసం) 30వ తేదీ, శుక్రవారం సాయంత్రం 4.36 దాకా అమావాస్య ఉన్నది. ఆ అమావాస్య ఘడియలు దాటిన మరుక్షణమే భాద్రపద శుద్ధ పాడ్యమి ప్రారంభం అయ్యింది. అనగా, భాద్రపద మాసంలోని తొలి శుక్లపక్ష తిధి అయిన పాడ్యమి ప్రారంభం అయ్యింది అన్నమాట. ఇలా ప్రారంభం

అయిన భాద్రపదమాసం, సెప్టెంబర్ 28, శనివారం రాత్రి 12.28 వరకు అనగా అమావాస్య ఘడియలు వెళ్ళే వరకు ఉంటుంది. ఆ మర్నాటి నుండి అనగా సెప్టెంబరు 29వ తేదీ నుండి ఆశ్వీయుజమాసం ప్రారంభం అవుతుంది. అనగా దక్షిణ భారత దేశంలో 'అమాంత' పంచాంగ విధానాన్ని పాటిస్తారు అని గుర్తించాలి.

ఉత్తర భారతదేశం విషయానికి వచ్చినట్లయితే అక్కడ 'పూర్ణిమాంత' విధానంలో నెల ప్రారంభం అవుతుంది. అనగా పూర్ణిమ ఘడియలు ముగిసిన సమయం నుండి – మళ్లీ వచ్చే నెలలో పూర్ణిమ ఘడియలు ముగిసే దాకా ఒక నెల కొనసాగుతుంది. అది ఎలాగంటే... 2019, సెప్టెంబర్ 14వ తేదీ ఉదయం 8.25 వరకు పౌర్ణమి తిథి ఉన్నది. ఈ తిథి ముగిసిన వెంటనే ఆశ్వీయుజమాసం ప్రారంభం అయి అక్టోబర్ 13వ తేదీ రాత్రి 1.33 వరకు అశ్వీయుజ మాసం కొనసాగుతుంది. కారణం, అక్టోబర్ 13 రాత్రి 1.33 వరకు పౌర్ణమి తిథి ఉంటుంది. అనగా ఉత్తర భారతంలో "పూర్ణిమాంత పంచాంగాన్ని" ఉపయోగిస్తారు అని గ్రహించాలి.

2019, సెప్టెంబర్ 14 నుండి సెప్టెంబర్ 28 వరకు మహాలయపక్షం కొనసాగుతుంది. పైన చెప్పిన ఉత్తర భారతదేశంలో ఆశ్వీయుజ మాసం మరియు దక్షిణ భారతదేశంలో భాద్రపదమాసం జరిగే సమయంలోనే ఈ మహాలయపక్షం ఉంటుంది అన్నమాట.

ఉత్తర మరియు దక్షిణ భారతదేశాలలో వేరు, వేరు నెలల విధానాన్ని అనగా పూర్ణిమాంత మరియు అమాంత అనే విధానాలను ఉపయోగించటం వల్ల మహళాయపక్షం – దక్షిణ భారతదేశం వారికి భాద్రపద మాసంలోను, ఉత్తర భారతదేశం వారికి ఆశ్వీయుజ మాసంలోను వస్తుంది. ఇక్కడ ఉన్న ఒక విశేషం ఏమంటే, నెలలు వేరు అయినప్పటికీ "మహాలయ పక్షం' రోజులు రెండు ప్రాంతాలలోను ఒకే సమయంలో ఉంటాయి.

**మహాభరణి శ్రార్ధము :**

మత్స్యపురాణం, అగ్నిపురాణం మరియు గరుడపురాణాలలో ఈ భరణి శ్రార్ధము యొక్క ప్రాముఖ్యత చెప్పబడి ఉన్నది. ఆశ్వీయుజ మాసంలోని కృష్ణపక్ష తిథులలో వచ్చే చతుర్దశి లేదా పంచమి తిథినాడు, అపరాహ్ణ కాలంలో భరణి నక్షత్రం ఉన్నప్పుడు పితృదేవతలకు తర్పణాలను మరియు పిండములను సమర్పిస్తారు. ఈ ప్రక్రియనే "మహాభరణి శ్రార్ధము" అనే పేరుతో పిలుస్తారు. అందుకు కారణం

ఏమంటే, భరణి నక్షత్రానికి అధిపతి యముడు. ఈయన పితృలోకానికి లేదా యమలోకానికి అధిపతిగా ఉంటాడని హైందవ ధర్మశాస్త్రాలలో చెప్పబడి ఉన్నది. ఇంకొక విశేషం ఏమంటే, పితృపక్షంలో వచ్చే భరణి నక్షత్రం – మూడు నక్షత్రాల త్రికోణాకార అమరికలో ఉంటుంది. ఈ త్రికోణాకార భరణి నక్షత్ర సమూహానికి యమధర్మరాజు అధిదేవతగా ఉంటాడు. ఆ సమయంలో ఈ విశ్వంలో యముడి యొక్క శక్తి విపరీతంగా వ్యాపించి ఉంటుంది. అందువల్ల పితృపక్షంలో వచ్చే భరణి నక్షత్రంనాడు పితృకర్మలు చేసినట్లయితే గయాక్షేత్రంలో భరణి నక్షత్రంనాడు శ్రార్ధకర్మలు చేస్తే ఎలాంటి ఫలితం వస్తుందో అంతటి ఫలితం వస్తుందని చెబుతారు.

ఉత్తర భారతదేశ పంచాంగ విధానంలో సాధారణంగా భరణీ నక్షత్రం, ఆశ్వీయుజ మాస – కృష్ణపక్షంలో చతుర్ధినాడు (నాల్గవ తిథి) వస్తుంది. ఆ కారణంగానే, ఉత్తర భారతదేశంలో దీనిని "చౌత్ భరణి" అని పిలుస్తారు. అలా కాకుండా పంచమినాడు ఈ భరణి నక్షత్రం ఉన్నట్లయితే 'భరణి పంచమి' అనే పేరుతో పిలుస్తారు. ఈ సమయంలో చేసే శ్రార్ధ కర్మల వల్ల, మరణించిన వారియొక్క ఆత్మలు ప్రేత రూపాన్ని వదిలిపెట్టి, పుణ్యలోకాలకు వెళతాయని హైందవ శాస్త్రాలలో చెప్పబడి ఉన్నది. మహాలయ అమావాస్య (అనగా 15వ రోజున/15వ తిథినాడు) సమయంలో చేసే పితృకర్మల తరువాత, అంతటి ప్రాధాన్యత ఈ భరణి శ్రార్ధ ప్రక్రియకు ఇవ్వబడినది చెబుతారు.

**పితృపక్షంలో 'అవిధవ నవమి' :**

భర్తకన్నా ముందు చనిపోయిన భార్యను 'అవిధవ' అని పిలుస్తారు. అలాంటి స్త్రీలకు పితృపక్షంలో వచ్చే నవమి తిథినాడు చేసే శ్రార్ధప్రక్రియను "అవిధవ నవమి" అని పిలుస్తారు. సాధారణంగా ఈ అవిధవ నవమి, శ్రార్ధ ప్రక్రియను చనిపోయిన స్త్రీ యొక్క భర్త లేదా కుమారుడు చేయవచ్చు. ఈ శ్రార్ధ సమయంలో ఒక ముత్తైదువకు భోజనంపెట్టి, ఆపై చీరె, జాకెట్టు, కొబ్బరికాయ ఆమెకు ఇవ్వాలి. భర్త బ్రతికి ఉన్నంత వరకు ఈ 'అవిధవనవమి' శ్రార్ధంతో పాటుగా ఆమెకు ప్రతి సంవత్సరం పెట్టే శ్రార్ధాన్నికూడా పెట్టాల్సి ఉంటుంది.

**కాకబలి :**

దురదృష్టవశాత్తు కొంతమంది చిన్న పిల్లలు అకస్మాత్తుగా చనిపోతారు. అలాంటి అభాగ్యులైన బిడ్డలకు పితృపక్షంలో వచ్చే త్రయోదశినాడు ఒక ప్రత్యేకమైన శాంతి ప్రక్రియను చేస్తారు. దీనిని "కాకబలి" అని పిలుస్తారు. ఆ మర్నాడు ఆ బిడ్డల ఆత్మశాంతికోసం శ్రార్ధకర్మలను నిర్వహిస్తారు.

సాధారణంగా, భారతదేశంలోని హైందవులు – గయ/కాశి/ప్రయాగ/కురుక్షేత్ర/నైమిశారణ్యం/రామేశ్వరం – క్షేత్రాలలో తమ పితృదేవతలకు ముఖ్యంగా తల్లిదండ్రులకు శ్రార్ధకర్మలు చెయ్యటం జరుగుతుంది. కలకత్తా నగరంలోని జగన్నాథ్‌ఘాట్ వద్ద పితృపక్షంలో పితృదేవతలకు తర్పణాలు ఇవ్వటం ఎంతో పుణ్యాన్ని ఇస్తుందని చెబుతారు.

ఈలోకంలో ఏ సుఖాలు అనుభవించకుండానే చనిపోయిన చిన్న పిల్లలకు మరియు సుఖాలను విసర్జించి సన్యాసులుగా మారిపోయిన వారికి – పితృపక్షంలోని ద్వాదశినాడు శ్రార్ధకర్మలు చేస్తారు. ఆయుధాలచేత చనిపోయినవారికి, హింసాత్మక చావు పొందినవారికి పితృపక్షంలోని చతుర్దశి తిథినాడు శ్రార్ధకర్మలు చేస్తారు. దీనిని "ఘాతచతుర్ధశి" (గాయముల/దెబ్బల) అని పిలుస్తారు.

ఏ తిథినాడు చనిపోయాడు/చనిపోయింది అనే ప్రశ్న లేకుండా, చనిపోయిన పెద్దలందరికీ (పితృదేవతలు) పితృపక్షంలోని చివరి రోజు అయిన అమావాస్యనాడు చేసే శ్రార్ధప్రక్రియను "సర్వపిత్రి అమావాస్య" అనే పేరుతో పిలుస్తారు. ఈ తిథి రోజున పితృదేవతలకు తర్పణాలు వదిలితే, గయా క్షేత్రంలో శ్రార్ధకర్మలు చేస్తే ఎంత పుణ్యం వస్తుందో, అంత పుణ్యం వస్తుందని హైందవ మంత్రశాస్త్రాలు ఉద్ఘాటిస్తున్నాయి.

**అపరాహ్ణ కాలము :**

హైందవ కాలమానంలో రోజు – ఆ రోజు సూర్యోదయంతో ప్రారంభం అయి మర్నాటి సూర్యోదయం ముందు వరకు కొనసాగుతుంది. హైందవ కాలమాన విధానంలో రోజుని ప్రాత:కాలము, సంగవకాలము, మధ్యాహ్నకాలము, అపరాహ్ణ కాలము, సాయంకాలము – అనే ఐదు భాగాలుగా విభజించబడింది.

దినమాన కాలాన్ని (సూర్యోదయం నుండి సూర్యాస్తమయం వరకు ఉన్న సమయాన్ని దినమానకాలము అని పిలుస్తారు. అనగా పగటి కాలము అన్నమాట.) ఐదు భాగాలుగా చేసినప్పుడు మొదటి, రెండవ, మూడవ కాలముల తరువాత వచ్చే నాల్గవ భాగాన్ని 'అపరాహ్ణ' కాలము అని పిలుస్తారు.

భారతదేశంలో, ముఖ్యంగా ఉత్తర భారతదేశంలో 'ప్రహార్' లేదా 'పహార్' అనే 'కాల' కొలమానాన్ని ఉపయోగిస్తారు. సాధారణంగా, ఒక పహార్ – మూడు గంటలకు సమానంగా ఉంటుంది. కనుక, ఒక రోజుని ఎనిమిది పహార్‌లుగా విభజిస్తారు. 'ప్రహార్' అనే సంస్కృత పదం నుండి ఈ 'పహార్' అనే పదం పుట్టింది. హిందూస్థానీ

భాషలో 'పెహ్‌రా' అనగా కాపలాకాయుట అని అర్థం. తెలుగులో కూడా కాపలాకాయటం అనే పదాన్ని 'పహరా' కాయుట అనే పదం రూపంలో ఉపయోగిస్తున్నారు.

ఒక రోజుని (24 గంటలు) ఎనిమిది 'ప్రహారములు'గా విభజించారు. రెండు ప్రహారముల మధ్యకాలంలో అనగా ఒక ప్రహారం చివర మరియు రెండవ ప్రహారం మొదటి భాగం కలిసే సమయంలో శ్రార్ధకర్మ నిర్వహించకూడదు. అదేవిధంగా సాయంత్ర సమయంలో మరియు రాత్రి సమయంలో శ్రార్ధకర్మలు చెయ్యకూడదు.

**హైందవ మతంలో శ్రార్ధకర్మ సమయ నిర్ణయం :**

హైందవ మత సాంప్రదాయం ప్రకారం చూసినట్లయితే – ఒకవ్యక్తి, ఏ నెలలో? ఏ పక్షంలో? ఏ తిథినాడు మరణించాడో? – ఆపై ప్రతి సంవత్సరమూ అదే నెలలో, అదే పక్షంలో, అదే తిథినాడు ఆ వ్యక్తియొక్క కుటుంబీకులు ఆ వ్యక్తికి శార్ధకర్మలు నిర్వహించాల్సి ఉంటుంది. ఉదాహరణకి – ఒక హైందవుడు, చైత్రమాస, శుక్లపక్ష, పంచమినాడు మరణించినట్లయితే ఆ వ్యక్తికి ప్రతి సంవత్సరమూ చైత్రమాస, శుక్లపక్ష పంచమినాడు శ్రార్ధకర్మలు చెయ్యాలి. అదేవిధంగా, ఆ వ్యక్తియొక్క వర్ధంతి కూడా అదే తిథినాడు చెయ్యాలి. చనిపోయిన తారీఖుని 'వర్ధంతి'గా ప్రకటించటం పాశ్చాత్యుల పద్ధతి అని జ్ఞానులు పేర్కొంటున్నారు.



# 6. ప్రపంచ దేశాలలో ప్రచారంలో ఉన్న "అంత్యక్రియల" సాంప్రదాయాలు?

ప్రపంచంలోని కొన్ని దేశాలలో ఒక్కోమతం ప్రధాన మతంగా ఉంటుంది. అలాగే ఒక్కొక్క మతంలో ఒక్కోవిధమైన అంత్యక్రియల నిర్వహణా సాంప్రదాయం వాడుకలో ఉంటుంది. మతం ఏదైనప్పటికీ చనిపోయిన వ్యక్తియొక్క మృతదేహానికి అంత్యక్రియలు చెయ్యటం వెనకాల ఉన్న ఏకైక లక్ష్యం ఏమంటే "ఆ వ్యక్తియొక్క ఆత్మ ప్రశాంతంగా పై లోకాలకు వెళ్ళిపోవటమే అని గుర్తించాలి". అదేవిధంగా ఒకవ్యక్తికి అంత్య క్రియలు చేసిన తరువాత ముఖ్యంగా, దహనం చేసిన తరువాత లభించే "అస్థికలకు" ఎంతో ప్రాధాన్యత ఇవ్వబడింది. వాటిని కూడా, మతపరంగా చెప్పబడిన

విధానాలలో భద్రపరచటం లేదా మరణించిన వ్యక్తియొక్క ఆత్మకు శాంతి కలిగించేవిధంగా, ఆ వ్యక్తియొక్క అస్థికలను పవిత్ర ప్రదేశాలలో లేదా జలాలలో చల్లటం (జలాలలో వదిలిపెట్టటం) జరుగుతుంది. సాంప్రదాయ కాశ్మీరీ బ్రాహ్మణ కుటుంబంలో జన్మించిన జవహర్‌లాల్ నెహ్రూపై, నాస్థికత్వ పునాదులపై ఆధారపడి ఏర్పడిన రష్యా కమ్యూనిస్ట్ పార్టీ సిద్ధాంతాల ప్రభావం విపరీతంగా ఉండేది. ఫలితంగా, ఆయన తన జీవితంలో ఏనాడూ హైందవ దైవాల వైపు కన్నెత్తి చూడలేదు. మతానికి ఏమాత్రం ప్రాధాన్యత ఇవ్వలేదు. హైందవ మత ప్రధాన దేశం అయిన భారతదేశాన్ని మత రహితమైన దేశంగా (సెక్యులరిస్ట్ కంట్రీ)గా మార్చాలని ఎంతగానో ప్రయత్నించాడు. ఒక విచిత్రం ఏమంటే, ఇంతటి కరుడు కట్టిన నాస్థికుడైన నెహ్రూ కూడా తన మరణ సమయంలో తన కూతురైన ఇందిరాగాంధీకి ఏం చెప్పాడంటే "నేను చనిపోయిన తరువాత నా మృతదేహాన్ని దహనం చెయ్యండి. ఒకవేళ నేను ఏదైనా ఇతర దేశంలో మరణించినట్లయితే ఆ దేశంలోనే నా మృతదేహానికి అగ్ని సంస్కారాలుచేసి, ఆపై నా అస్థికలను మరియు చితాభస్మాన్ని అలహాబాద్‌కి తీసుకురండి. ఆ తరువాత నా అస్థికలలో ఒక గుప్పెడు తీసుకుని అలహాబాద్ వద్ద ఉన్న గంగానదిలో నిమజ్జనం చెయ్యండి. నా చిన్నతనం అంతా అలహాబాద్‌లోని గంగ, యమునా నదుల వద్ద గడిచింది. ఆ అభిమానంచేతనే నా చితాభస్మాన్ని ఆ నదిలో కలపమని అడుగుతున్నాను. అంతేకాని, మిగిలిన హైందువులు భావించినట్లుగా అది పవిత్ర నది కావటంవల్ల అందులో నా అస్థికలను కలపమని అడగటంలేదు. నా మిగిలిన భస్మాన్ని భారతదేశ వ్యవసాయ భూముల్లో కలపండి. నా చితాభస్మంలో కొంచెం కూడా ఉంచవొద్దు. నాకు ఏవిధమైన హైందవ మత విశ్వాసాలు లేవు". ఏదిఏమైనా నెహ్రూ కోరిన ప్రకారమే ఆయన అంత్యక్రియలు జరిగాయి. ఆయన అస్థికలలో కొంతభాగం గంగానదిలో కలిపి, కొంత భాగాన్ని న్యూఢిల్లీలోని ఒక ప్రదేశంలో సమాధిచేసి దానిపై ఒక స్మారక స్థూపాన్ని నిర్మించారు. ఆవిధంగా చూసినట్లయితే నెహ్రూ చివరి కోర్కెకు విరుద్ధంగా ఆయన అస్థికలను భద్రపరచటం జరిగింది అన్నమాట.

### 1. హైందవ మతంలో అంత్యక్రియల విశేషాలు :

ఇక, హిందూ మతం విషయానికి వచ్చినట్లయితే హిందూ మతంలో "ఆత్మ" అనే భావనకు విశేష ప్రాధాన్యత ఉన్నది. స్వయంగా ఆలోచించటం, స్వయంగా కొన్ని పాపపుణ్య ఫలితాలను కలిగి ఉండటం లాంటి అంశాలు గల ఒక శక్తిని

"ఆత్మ" అని పిలుస్తారు. ఒక ఆత్మ, ఒక మానవ దేహంలో ఉన్నప్పుడు దానిని "జీవాత్మ" అని పిలుస్తారు. ఒక మనిషి తాను జీవించి ఉన్నప్పుడు చేసిన సమస్త పాప మరియు పుణ్య కర్మల ఫలితాలు సంపూర్తిగా తొలగిపోయినప్పుడు అనగా లేకుండాపోయినప్పుడు ఆ ఆత్మకు ఆపై మళ్ళీ జన్మించవలసిన అవసరం ఉండదు. అప్పుడు అతని ఆత్మ, అతడిని సృష్టించిన "పరమాత్మ" అనగా భగవంతుడిలో లీనం అయిపోతుంది.

హైందవ మతంలో – ఒకవ్యక్తి పుట్టినప్పటి నుండి చనిపోయే వరకు అనేక రకాల మతపరమైన కర్మలను ఆ వ్యక్తికి నిర్వహిస్తారు. మొదటి ఉత్సవం "అన్నప్రాసన" అనే పేరుతో ప్రారంభం అవుతుంది. ఇక, చివరి ఉత్సవం అనగా ఆ వ్యక్తియొక్క మృతదేహాన్ని దహనం చెయ్యటం అని గుర్తించాలి. ఇలా, ఒక వ్యక్తికి అతడి జీవితంలో చివరగా చేసే మతపరమైన ప్రక్రియను 'అంత్యేష్టి' అని పిలుస్తారు. సంస్కృత భాషలో అంత్యేష్టి అనగా ఆఖరి లేదా చివరి కర్మ అని అర్థం. ఇదే పదాన్ని హిందీ భాషలో 'అంతిమ్ సంస్కార్' అని, తెలుగు భాషలో 'అంతిమ సంస్కారం' అని పిలుస్తారు.

హిందూ మతానికి చెందిన పురుషుడు చనిపోయినప్పుడు మొదట, ఆ మృతదేహానికి తలస్నానం చేయించి ఆ తరువాత మృతుడి నుదుటిమీద విభూతి లేదా చందనంతో బొట్టు పెడతారు. ఇక, స్త్రీ విషయానికి వస్తే ఆమె నుదుటిమీద పసుపుతో బొట్టు పెడతారు.

ఏదిఏమైనా మరణించిన వ్యక్తియొక్క మృతదేహానికి శాస్త్రోక్తంగా అంత్యక్రియలు చెయ్యటంవల్ల ఆ వ్యక్తియొక్క ఆత్మ, పుణ్య లోకాలకు వెళుతుందని హైందవ మతంలో చెప్పబడి ఉన్నది. హైందవ మతానికి పునాదులు అని చెప్పబడిన వేదాలు మరియు సంహితలు అనే గ్రంధాలలో చెప్పబడిన సాంప్రదాయాల ప్రకారం మృతదేహాలకు అంత్యక్రియలు జరుగుతాయి. హిందువులలో దాదాపు 90% మంది – మృతదేహాలను దహనం (Cremation) చేస్తారు.

హిందువులు, తమకు సంబంధించిన మృతదేహాలను అగ్నిలో దహనం చెయ్యటానికి ముఖ్య కారణం ఏమంటే, అగ్ని చాలా వేగంగా మృతదేహాన్ని దహిస్తుంది. ఫలితంగా, ఆ మృతదేహానికి చెందిన ఆత్మ, చాలా తొందరగా ఆ శరీరంతో సంబంధాన్ని తెంచుకుంటుంది. కానీ, మృతదేహాలను సమాధిచేసే విధానంలో సమాధి చెయ్యబడ్డ మృతదేహం కొన్ని నెలలపాటు ఉంటుంది. ఆ మృతదేహంలోని మాంసం సంపూర్తిగా నశించిపోవటానికి కొంతకాలం పడుతుంది. ఆ తరువాత ఆ సమాధిలో మిగిలిన ఆ

మృతదేహం తాలీకు అస్థిపంజరం (స్కెలెటన్) సంపూర్తిగా అదృశ్యం కావాలంటే కొన్ని ఏళ్ళు పడుతుంది. అప్పటి వరకు ఆ మృతదేహంయొక్క ఆత్మ ఆ సమాధి చుట్టూ అశాంతితో తిరుగుతూ ఉంటుందని మర్చిపోకూడదు.

చాలామంది హిందువుల అభిప్రాయం ప్రకారం చూసినట్లయితే, ఏ వ్యక్తి అయినా వారణాసిలో (కాశీ) చనిపోయినా లేక వారణాసిలోని గంగానది ఒడ్డున వ్యక్తి మృతదేహం దహనం చేయబడినా – ఆ వ్యక్తియొక్క ఆత్మకి ఎంతో పుణ్యం వస్తుందని ఆవిధంగా, వారణాసిలో మరణించిన లేక దహనం చేయబడిన వ్యక్తుల యొక్క ఆత్మలకు నేరుగా మోక్షం లభిస్తుందని తెలుస్తుంది. సాధారణంగా, హైందవ మతంలో ఎవరైనా ఒక పురుషుడు చనిపోతే, అతని మృతదేహానికి అతడి పెద్ద కొడుకు అగ్ని సంస్కారాలు చేస్తాడు. అనగా, అతడి చితికి నిప్పు అంటిస్తాడు. ఇక తల్లి చనిపోయినప్పుడు ఆమె ఆఖరి కొడుకు ఆమెకు అగ్ని సంస్కారం చేస్తాడు. విదేశాలలో ఉన్న హైందవులు కూడా ఇదే విధానాన్ని పాటిస్తారు. ఆ కారణంగానే యు.కె.దేశంలో ఉండే హైందవులు తమలో ఎవరైనా ఒకవ్యక్తి మరణించినప్పుడు ఆ వ్యక్తియొక్క పెద్ద కుమారుడు – అతని తండ్రియొక్క మృతదేహాన్ని – శవదహన కేంద్రంలోని దహన యంత్రంలో ఉంచి, ఆపై ఆ మృతదేహాన్ని దహించే విద్యుత్తు యంత్రంయొక్క మీటను (స్విచ్)ను నొక్కుతాడు. అనగా అతడి తండ్రి మృతదేహానికి అతడే నిప్పు పెట్టాడు అన్నమాట.

ఆపై ఆ మృతదేహం దహనం అయిన మూడవ రోజున ఆ ఆరిపోయిన చితిలో మిగిలిన ఆ వ్యక్తియొక్క ఎముకలను అనగా అస్థికలను సేకరించి, ఆపై వాటిని ఒక రాగి చెంబులో లేదా పాత్రలో ఉంచి, ఆ తరువాత ఆ అస్థికలను పవిత్ర నదీ జలాలలో వదిలి వేస్తారు. అనగా నిమజ్జనం చేస్తారు. ఇలా ఎందుకు చేస్తారంటే మనిషి యొక్క ఆత్మ ఆ అస్థికలను ఆవహించి ఉంటుందని, అలాంటి అస్థికలను పవిత్ర జలాలలో కలపటం వల్ల ఆ వ్యక్తి యొక్క ఆత్మ, పుణ్యలోకాలకు చేరుతుందని చెబుతారు. భారతదేశంలోని హైందవులు – మరణించిన వారియొక్క అస్థికలను సాధారణంగా, కాశీలో ప్రవహించే గంగానదిలో కలపటానికి బాగా ఇష్టపడతారు. అలా వీలుకానివారు తమకు దగ్గరలో ఉండే ఏ నదిలో అయినా లేదా సముద్రంలో అయినా కలపవచ్చు. అయితే, హిందూ మతంలో కూడా అంత్యక్రియల నిర్వహణ విధానంలో కొన్ని తేడాలు ఉన్నాయి. అది ఎలాగంటే...పసిబిడ్డల మృతదేహాలను, సన్యాసుల మృతదేహాలను దహనం చెయ్యరు. అనగా, ఆ వర్గాల మృతదేహాలకు అగ్ని సంస్కారాలు చెయ్యరు అన్నమాట.

హిందూ మతంలో – పుట్టిన తరువాత ఒక సంవత్సరం వయస్సు వచ్చే వరకు జీవించిన బిడ్డల మృతదేహాలను సాధారణంగా సమాధి చెయ్యటం జరుగుతుంది. కొన్ని సమయాలలో బిడ్డల మృతదేహాలను నదులలో వదిలివేయటం జరుగుతుంది. అనగా, హిందువులు – సంవత్సరంలోపు వయస్సు ఉన్న బిడ్డలయొక్క మృతదేహాలను, భూమికిగాని, జలానికి గాని సమర్పిస్తారు అన్నమాట. ఇందుకు కారణం ఏమంటే సంవత్సరంలోపు వయస్సు ఉన్న బిడ్డలకు సూక్ష్మదేహాలు ఏమాత్రం అభివృద్ధి చెందకుండా ఉంటాయి. అందువల్ల వారి దేహాలు అగ్ని సంస్కారానికి అనగా అగ్ని ద్వారా దహించటానికి అర్హతను కలిగి ఉండవు.

**కపాలమోక్షం :** సంస్కృత భాషలో 'కపాల' అనగా 'పుఱ్ఱె' (Skull) అని అర్థం. హైందవ మతంలో, ఒకవ్యక్తి మరణించినప్పుడు ఆ వ్యక్తి మృతదేహాన్ని ఒక చితిపై ఉంచి దహనం చేస్తారు. అనగా, ఆ మృతదేహానికి అగ్ని సంస్కారం చేస్తారు అన్నమాట. ఆ అగ్నిలో మృతదేహం మొత్తం కాలిన తరువాత, చివరిగా ఆ మృతదేహంలో మిగిలిన పుఱ్ఱె "ఫెటేల్" మనే చాలా పెద్ద శబ్దంతో రెండుగా విచ్చిపోతుంది. దీనినే తెలుగు భాషలో 'కపాలమోక్షం' అని, సంస్కృత భాషలో 'కపాలమోక్ష' అని పిలుస్తారు.

యోగశాస్త్రంలో చెప్పబడిన సమాచారం ప్రకారం చూసినట్లయితే, మనిషి వెన్నుముక ప్రారంభ భాగంలో అనగా ఆసన భాగానికి (ఆనస్) కొంచెం పైన, అనగా వెన్నుముక ప్రారంభం నుండి శిరస్సు మధ్యభాగం వరకు, ఇంకా స్పష్టంగా చెప్పాలంటే "మూలాధార చక్రం" నుండి శిరస్సు మధ్య భాగంలో ఉండే (పుర్రె మధ్యభాగం) రంధ్రం వరకు అనగా "సహస్రారచక్రం" (అనగా వెయ్యి రేకుల పద్మం అని అర్థం) వరకు "సుషుమ్ననాడి" వ్యాపించి ఉంటుంది. ఈ నాడికి ఎడమ వైపున 'ఇడ' అనే నాడి, కుడి వైపున 'పింగళ' అనే నాడి – సహస్రార చక్రం దాకా వ్యాపించి ఉంటాయి. అనగా, ఈ మూడు నాడులూ సహస్రారచక్రం/బ్రహ్మరంధ్రం వద్ద కలుస్తాయి. ప్రతి మనిషిలోని (అతడు/ఆమె) మూలాధార చక్రంలో "కుండలినీ" అనే మహాద్భుతమైన ఒక యోగశక్తి దాగి ఉంటుంది.

మానవుల యొక్క వెన్నుముకలో సుషుమ్ననాడి ఉంటుంది. అయితే, సాధారణ మానవులలో ఉండే కుండలినీ శక్తి, వెన్నుముకకి అటువైపు మరియు ఇటువైపు ఉన్న ఇడ మరియు పింగళ నాడులగుండా పైకి ప్రవహిస్తుంది. ఫలితంగా, వారిలో ఎల్లప్పుడూ ఇహలోక అంశాలకు సంబంధించిన ఆలోచనలు మాత్రమే ఉంటాయి. కానీ, యోగులకు వారిలోని కుండలినీ శక్తి, మూలాధార చక్రం నుండి సుషుమ్ననాడి

ద్వారా సహస్రారచక్రం వరకు ప్రవహిస్తుంది. ఒక మనిషిలో ఎప్పుడైతే "శ్వాస" అతని సుషుమ్న నాడి గుండా ప్రవహిస్తుందో, అప్పుడు ఆ మనిషియొక్క మనస్సు స్థిరంగా నిలబడిపోతుంది. ఆ పరిస్థితుల్లో ఆ మనిషియొక్క మనస్సు ఈ లోకానికి సంబంధించిన అన్ని విషయాలను మర్చిపోయి, ఈ అనంత విశ్వంలో వ్యాపించి ఉండే "పరబ్రహ్మ" అనగా దైవంపై నిమగ్నం అవుతుంది.

యోగులు, తాము చేసిన కఠోరమైన యోగసాధన కారణంగా, వారియొక్క సుషుమ్ననాడి గుండా శ్వాస ప్రవహిస్తుంది. ఫలితంగా, వారికి అనేక మానవాతీత శక్తులు సంక్రమిస్తాయి. అందులో ముఖ్యమైనది – వారికి ఏ రోజున?, ఏ సమయంలో?, మరణం వస్తుందో కొద్ది రోజుల ముందుగానే తెలిసిపోతుంది. తమ మరణ సమయం తెలియగానే యోగులు, అన్ని రకాల ఆహారాలను విసర్జించి ఆపై పాలు మరియు తులసి దళాలు వేసిన నీటిని ఆహారంగా తీసుకుని, తమ మిగిలిన అతి కొద్ది రోజుల ఆయుర్దాయాన్ని గడుపుతారు. ఇలా మరణానికి దగ్గర అవుతున్న కొందరు యోగులయొక్క శిరస్సులలోని కపాలాలు మెత్తబడతాయని చెబుతారు. సాధారణంగా, కపాలం దాదాపు ఇనుములాగా చాలా కఠినంగా అనగా గట్టిగా ఉంటుంది అని గుర్తించాలి. కొన్ని సమయాలలో, తనువు చాలించటానికి సిద్ధంగా ఉన్న యోగులయొక్క శిరస్సుపైన వారి శిష్యులలో ఒకడు ఒక కొబ్బరికాయను ఆ యోగుల యొక్క ఆజ్ఞమీదట ఆ యోగుల శిరస్సుమీద పగల కొడతాడు. ఆ దెబ్బకి ఆ యోగుల యొక్క శిరస్సు మధ్యభాగం పగిలిపోతుంది. ఆపై ఆ మధ్యభాగం అనగా బ్రహ్మరంధ్రం నుండి ఆ యోగుల యొక్క ప్రాణం (ఆత్మ), బైటకు వచ్చి, ఆపై పైకి వెళ్ళిపోయి, ఆ తరువాత వారియొక్క ఇష్టదైవంలో లీనం అయిపోతుంది. అనగా ఆ యోగులకు ఇక, పునర్జన్మ ఉండదు అన్నమాట. కొన్ని సమయాలలో కొందరు యోగులు తమ మరణ సమయంలో శ్వాసను బిగపెడతారు. ఫలితంగా, వారియొక్క ఆత్మ వారి శిరస్సు మధ్య భాగాన్ని ఛేదించుకుని, ఆపై ఆ మధ్యభాగంలో ఉన్న రంధ్రం ద్వారా పైకి వెళ్ళిపోతుంది. అలా పైకివెళ్ళే ఆత్మ ఒక వెలుగు రూపంలో కనిపిస్తుందని చెబుతారు. ఏదిఏమైనా, బ్రహ్మరంధ్రం ద్వారా ప్రాణాలను త్యజించటం మహా యోగులకు మాత్రమే సాధ్యం అవుతుందని యోగశాస్త్రం తెలియజేస్తున్నది.

సాధారణంగా హిందూ మతంలో, మృతదేహాన్ని దహనం చేసిన తరువాత 13 రోజులపాటు సంతాప దినాలు పాటిస్తారు. ఆ సమయంలో మృతుడి కుటుంబ సభ్యులు తమ ఇంట్లోనే ఉండి, ఆపై ఇంటికి వచ్చే బంధు, మిత్రులను పలకరించి

ఆపై వారు అందించే స్వాంతన వాక్యాలను (ధైర్యం చెప్పే మాటలను) స్వీకరిస్తారు. ఈ 13 రోజుల కాలంలో తమ తమ కులాన్నిబట్టి కొన్ని రకాల కర్మలను నిర్వహిస్తారు.

**తేరాహ్‌వి :** 'తేరాహ్‌వి' అనగా హిందీ భాషలో '13' అని అర్థం. ఉత్తర భారతదేశంలోని హైందవులు మరియు కొందరు సిఖ్ మత ప్రజలు – తమ కుటుంబంలో – ఒక వ్యక్తి మృతదేహానికి దహన సంస్కారాలు చేసిన రోజు నుండి 13వ రోజున, చనిపోయిన వ్యక్తియొక్క ఆత్మకు శాంతి కలగటంకోసం చేసే ప్రత్యేకమైన మత సంబంధమైన కార్యక్రమాన్ని 'తేరాహ్‌వి' అని పిలుస్తారు. హిందువుల విషయానికి వస్తే 13వ రోజున, తమ గృహంలో పురోహితుల చేత పూజలు మరియు హెూమము చేయించి, ఆపై పేదలకు మరియు తమ గృహంలో ఈ కార్యక్రమాలను చేయించిన బ్రాహ్మణులకు దానాలు చేస్తారు. ఇక, ఆరోజు మధ్యాహ్న సమయంలో తమ పేటలో లేదా గ్రామంలో నివసించే వారందరికీ భోజనాలు పెడతారు. ఎక్కువ సంఖ్యలో ప్రజలు భోజనాలు చెయ్యటంవల్ల, చనిపోయిన వ్యక్తికి ఆత్మశాంతి కలుగుతుందని నమ్ముతారు. ఇక, సిఖ్ మతస్తుల విషయానికి వస్తే, వారి కుటుంబాలకు చెందిన వ్యక్తి మృతదేహానికి అంత్యక్రియలు చేసిన రోజు నుండి 13వ రోజున వారి ప్రార్థనా ప్రాంతం అయిన గురుద్వారాలో వారికి దైవ సమాన గ్రంథం అయిన "గురుగ్రంథ్‌సాహిబ్"ను పఠించి, ఆపై అక్కడకు వచ్చిన ప్రజలందరికీ భోజనాన్ని అందిస్తారు.

**2. సిఖ్ మతంలో అంత్యక్రియల విశేషాలు :**

హైందవ మతంలోని కొన్ని ఛాందస ఆచారాల పట్ల, కులవ్యవస్థ పట్ల, ఇంకా స్పష్టంగా చెప్పాలంటే – బ్రాహ్మణుల మతరపరమైన ఆధిక్యతపట్ల, వేదాలపట్ల – తీవ్రమైన వ్యతిరేక భావం కలిగిన 'నానక్' అనే క్షత్రియ కులానికి చెందిన వేదాంతి సృష్టించిన మతమే సిఖ్ మతం. నిజానికి, గురునానక్ ఏనాడూ తన మతం పేరు ఏమిటో చెప్పలేదు. తొలి గురువైన గురునానక్‌యొక్క బోధనలను తూ.చ. తప్పకుండా పాటించే ఆయన అనుచరులను 'సిఖ్‌లు' (శిష్యులు) అని, వాళ్ళు పాటించే మతాన్ని సిఖ్ మతం అని పిలుస్తారు. ఒక విశేషం ఏమంటే, గురునానక్ హైందవ మత సాంప్రదాయాలను తీవ్రంగా వ్యతిరేకించినప్పటికీ ఆ మతంలోని చాలా అంశాలు హైందవ మతం నుండి సంగ్రహించబడినవే అని చెప్పక తప్పదు. (నోట్ : సిఖ్ మతానికి, గురునానక్ మరియు ఇతర సిఖ్ గురువులకు సంబంధించిన అద్భుత విశేషాలను తెలుసుకోవటంకోసం **శ్రీధరన్‌కాండూరి** రచించిన అద్భుతమైన, ఆసక్తికరమైన మరియు పరిశోధనాత్మక గ్రంథం **"దం దత్తాత్రేయ"** చదువగలరు.)

సిఖ్‌లు 'పునర్జన్మ' సిద్ధాంతాన్ని బలంగా నమ్ముతారు. భగవంతుడియొక్క "హుకుం" అనగా నిర్ణయం మీద మనిషి చావు, నిర్ణయం అవుతుందని సిఖ్ మతస్తులు విశ్వసిస్తారు. ఈ లోకంలోకి రావటం మరియు ఈ లోకం నుండి వెళ్ళిపోవటం (ఆవన్ జానా) అనే 'చక్రం' మనిషి జీవితంలో తిరుగుతూ ఉంటుందని సిఖ్ మతంలో చెప్పబడి ఉన్నది. ఆత్మ, శరీరం, మనసు – అనే మూడు అంశాల కలయికతో మనిషి ఏర్పడతాడని సిఖ్‌మత వేదాంతం చెబుతుంది. ఆరోగ్యంగా ఉన్న మనిషిలో ఈ మూడు అంశాలు సమర్ధవంతంగా మరియు ఒకదానికి ఒకటి సహకరిస్తూ పనిచేస్తాయని సిఖ్ వేదాంతులు ఉద్ఘాటిస్తారు. ఆత్మ–శరీరం–మనసు – అనే అంశాలు పరస్పరం విభిన్నమైనవని మరియు ఈ మూడు అంశాలు దైవం చేత సృష్టించబడ్డాయిని "గురుబాణి" (సిఖ్ గురువుల బోధనలతో తయారైన గ్రంధం) తీర్మానించింది.

సిఖ్ మతంలో, ఆత్మహత్య మరియు కనికర హత్య (వ్యాధిని తట్టుకోలేక నరకయాతన పడుతున్న రోగగ్రస్తులకు విషపు ఇంజక్షన్ ఇచ్చి, వాళ్ళు మరణించేలా వైద్యులు చేసే విధానాన్ని కనికర హత్య/మెర్సీకిల్లింగ్ అని పిలుస్తారు.) – అనే రెండు ప్రక్రియలు అతి తీవ్రంగా నిషేధించబడ్డాయి. భగవంతుడు ఒక మనిషికి ఇచ్చిన ఆయుర్దాయం ముగిసేలోగా ఆ మనిషి ఎట్టి పరిస్థితుల్లోనూ ఆత్మహత్య ద్వారా తన జీవితాన్ని ముగించుకోవటం మహాపాపం అని, దైవ అపచారం అని సిఖ్ మత సూత్రాలు ఉద్ఘాటిస్తున్నాయి. అందువల్ల, సిఖ్‌లు తమ జీవితాన్ని – ఆ దైవం తమకు ఇచ్చిన కానుకగా భావిస్తారు. అంతటి విలువైన జీవితాన్ని బాధ్యతాయుతంగా గడపాలని ప్రతి సిఖ్ మతస్తుడు నమ్ముతాడు. జననం మరియు మరణం అనే అంశాలు ఆ దైవం చేతుల్లో ఉంటాయని సిఖ్ మతం ప్రబోధిస్తున్నది.

సిఖ్ మతంలో కూడా మరణానంతర జీవితం ఉంటుందని, ఆత్మకు చావు లేదని ఉద్ఘాటించబడింది. అందువల్ల, మృతదేహాలకు అగ్ని సంస్కారం (దహనం చెయ్యటం) జరుగుతుంది. సిఖ్ మతంలో – ఒకవ్యక్తి మరణానికి దగ్గరలో ఉన్నాడని తెలిసినప్పుడు ఆ వ్యక్తి ప్రక్కన ఉండే అతని కుటుంబ సభ్యులు "సుఖ్‌మాని" (శాంతిని కలిగించే శ్లోకం)ని పెద్ద స్వరంతో సంయుక్తంగా పఠిస్తారు. ఆ దైవ ప్రార్ధనను వింటున్న వ్యక్తి (మరణానికి చేరువగా ఉన్న వ్యక్తి) తనకు ఏమాత్రం ఓపిక ఉన్నా "వాహేగురు" అని చెబుతాడు. (పంజాబి భాషలో 'వాహేగురు' అనగా భగవంతుడు అని అర్ధం.) మృతదేహాన్ని దహనం చెయ్యటానికి సిఖ్ మతంలో ప్రధాన ప్రాధాన్యత ఇవ్వబడుతుంది. కొన్ని సమయాలలో దహనం చెయ్యటం వీలుకాదు. అలాంటి సమయంలో మృతదేహాన్ని సమాధి చెయ్యటం లేదా సముద్ర జలాలలో నిమజ్జనం

చెయ్యటం లాంటివి జరుగుతుంది. సిఖ్ మతంలో శవ సంస్కారం అనగా శవ దహనం, పగలు పూట అయినా లేదా రాత్రి పూట అయినా చేస్తారు. (నోట్ : హిందూ మతంలో మాత్రం సూర్యోదయం నుండి సూర్యాస్తమయం వరకు ఉన్న సమయంలో మాత్రమే అంత్యక్రియలు చేస్తారని గుర్తించాలి.)

సిఖ్ మతంలో కూడా – అంతిమ సంస్కారానికి ముందు మృతదేహానికి స్నానం చేయించి, ఆ తరువాత సిఖ్ సాంప్రదాయం ప్రకారం దుస్తులను ధరింపచేసి, ఆపై మృతదేహాన్ని ఒక శవపేటికలో ఉంచి, ఆ తరువాత ఆ శవపేటికను తమకు దగ్గరలో ఉన్న ఒక గురుద్వారాకు (సిఖ్‌ల ప్రార్ధనాస్థలం లేదా ఆలయం) తీసుకువెళ్లి ఆ తరువాత ఆ పేటికను – గురుగ్రంథ్ సాహిబ్ (సిఖ్‌ల పూజనీయ గ్రంథం) ముందు కొంచెం దూరంలో ఉంచి, ఆపై సిఖ్‌ల 11వ గురువు రచించిన గురుగ్రంథ్‌సాహెబ్‌ను సంయుక్తంగా పఠిస్తారు. ఈ గ్రంథ పఠన కార్యక్రమం ముగిసిన తరువాత ఆ శవపేటికను తమకు సంబంధించిన శ్మశానానికి తీసుకువెళ్ళి అక్కడ దహనం చేస్తారు. సిఖ్‌లు మృతదేహాలకు చేసే దహన ప్రక్రియను 'అంతిమ్ సన్‌స్కార్' అని పిలుస్తారు. (యు.కె. దేశంలో ఉండే సిఖ్‌లు కూడా విద్యుత్తు సహాయంతో మృతదేహాలను దహనం చేయిస్తారు.) కొన్ని సమయాలలో మృతదేహాలను దహనం చేసే అవకాశం ఉండదు. అలాంటి సమయాలలో సిఖ్‌లు కూడా మృతదేహాలను సమాధి చెయ్యటం (Burial) జరుగుతుంది.

పుట్టిన వెంటనే చనిపోయిన శిశువులను కూడా సిఖ్‌లు, పరిపూర్ణ లేదా బాగా ఎదిగిన వ్యక్తులు లాగా గుర్తిస్తారు. అందువలన ఆ శిశువుల మృతదేహాలకు కూడా అగ్ని సంస్కారాలు నిర్వహిస్తారు. (కానీ హిందూ మతంలో శిశువుల మృతదేహాలను సమాధి చేస్తారు. ఆపై ఆ సమాధుల దగ్గర పాలను మరియు పూలను ఉంచుతారు. దీనినే "బొందపెట్టటం" అని ఆంధ్రదేశంలో పిలవటం జరుగుతుంది.) ఇంకొక ముఖ్య విశేషం ఏమంటే, హైందవ మత సాంప్రదాయాలపై వ్యతిరేకతతో ఆవిర్భవించిన సిఖ్ మతంలోకూడా – దహనం చెయ్యబడిన వ్యక్తియొక్క అస్థికలను/చితాభస్మాన్ని సేకరించి, ఆపై దానిని పవిత్ర జలాలలో నిమజ్జనం చేస్తారు. మృతదేహం నుండి సేకరించిన అస్థికలను/చితాభస్మాన్ని తమకు దగ్గరలో ఉన్న నదిలో నిమజ్జనం చేస్తారు. బౌద్ధ మరియు క్రైస్తవ మతాలలో లాగా అస్థికలపై 'కట్టడాలను' నిర్మించే సాంప్రదాయం సిఖ్ మతంలో లేదని గుర్తించాలి.

మరణానంత జీవితం ఉంటుందని సిఖ్ మతంలో బలంగా విశ్వసిస్తారు. మనిషి దేహం నశించి పోతుందని, ఆత్మకు చావు ఉండదని, ఆత్మ – తాను మనిషిగా

ఉన్నప్పుడు చేసిన పాప మరియు పుణ్య కర్మల ఫలితాలను అనుభవించటానికి మళ్ళీ మళ్ళీ మనిషిగా జన్మిస్తూ ఉంటుందని చెబుతారు. ఒక సిఖ్ మతస్తుడు అనుమానాస్పద పరిస్థితుల్లో మరణించినప్పుడు అతని మృతదేహానికి శవపరీక్ష (అటాప్సి) చెయ్యవచ్చని సిఖ్‌మత పెద్దలు చెబుతారు. అయితే ఎట్టి పరిస్థితుల్లోను మృతదేహం శిరస్సుపై ఉండే కేశాలను మాత్రము తొలగించరాదని శాసిస్తారు.

ఇంకొక ముఖ్య విశేషం ఏమంటే, ఒకవ్యక్తికి అంత్యక్రియలు నిర్వహించిన రోజునుండి 10వ రోజు వరకు ఉన్న కాలాన్ని "సంతాప దినాలు"గా ఆ వ్యక్తియొక్క కుటుంబ సభ్యులు భావిస్తారు. ఆ సమయంలో వాళ్ళు, తమ తమ వృత్తి, ఉద్యోగాలకు సెలవు ప్రకటిస్తారు. ఈ పది రోజుల సమయంలో – మృతుడి ఆత్మశాంతికోసం తమ గృహంలో లేదా తమకు దగ్గరలో ఉన్న ఒక గురు ద్వారంలో గురుగ్రంథ్‌సాహెబ్ గ్రంథాన్ని సంపూర్తిగా పఠిస్తారు. సాధారణంగా, గురుద్వారంలో ఉండే సిఖ్ గ్రంథి (సిఖ్ మతంలోని పూజారి) ఈ గురుగ్రంథ్‌సాహెబ్‌ని పఠిస్తాడు.

సిఖ్ మతంలో కూడా మృతుడికి సంతాప సూచికంగా నియమిత కాలంపాటు సంతాపం పాటించిన తరువాత రోజున అనగా 10వ రోజున గురుద్వారాలో లేదా మృతునియొక్క గృహంలో "భోగ్" అనే కార్యక్రమం జరుగుతుంది. ఈ కార్యక్రమంలో అక్కడకు వచ్చిన బంధుమిత్రులకు మరియు ఇతరులకు భోజనం పెడతారు. సాధారణంగా ఈ భోజనం, గురుద్వారాకు అనుబంధంగా ఉండే వంటశాలలో (కిచెన్) తయారు చేయబడుతుంది.

**3. లింగాయత్/లింగాయత మతంలో అంత్యక్రియలు :**

"మట్టి నుండి పుట్టిన మానవ శరీరాన్ని మళ్ళీ మట్టిలోనే సమాధి చేయటం" – భారతదేశంలోని అన్ని శైవ వర్గాలకు ఒక సాంప్రదాయంగా గుర్తించబడింది. సాధారణంగా, శైవ మతస్తులు శ్మశానాన్ని "రుద్రభూమి" అని పిలుస్తారు. అనగా మరణానికి అధిపతి అయిన రుద్రుడు సంచరించే ప్రదేశం అని అర్థం.

ప్రాచీనకాలంలో దక్షిణ భారతదేశంలో శైవ మతం ప్రబలంగా ఉండేది. అనగా, ఆ మతాన్ని పాటించేవాళ్ళు చాలా అధిక సంఖ్యలో ఉండేవాళ్ళు అన్నమాట. ఆ కాలంలో, మృతదేహాలను దహనం చెయ్యటం కన్నా సమాధి చెయ్యటమే తేలిగ్గా ఉండేది. అంతేకాక, ఆ కాలంలో ప్రత్యేకంగా శ్మశానాలు ఉండేవికాదు. అందువలన, వ్యవసాయ భూమి ఉన్నవారు, తమ కుటుంబంలో చనిపోయిన వ్యక్తులను తమకు

సంబంధించిన వ్యవసాయ భూముల్లో ఆరు లేదా ఏడు అడుగుల లోతు గొయ్యి త్రవ్వి, ఆ గోతిలో మృతదేహాలను సమాధి చేసేవారు. భూమిని దున్ని, వ్యవసాయం చేసేటప్పుడు అంత లోతుకి త్రవ్వాల్సిన (దున్నటం) అవసరం ఉండదు కనుక, ఆరు అడుగుల లోతులో ఉన్న మృతదేహానికి, ఆ భూమిపైన దున్నే నాగలి వల్ల ఎలాంటి సమస్యా ఉండేదికాదు. అంతే కాకుండా భూమి అడుగున సమాధి చేయబడిన ఆ మృతదేహాలు కొంతకాలానికి కుళ్ళిపోయి, ఆపై ఆ భూమికి సారాన్ని ఇచ్చే ఎరువుగా మారిపోయేవి. ఆవిధంగా అటు భూమికి సారం వచ్చేది. ఇటు భూమిపైన ఆ మృతదేహాల వల్ల ఏవిధమైన చెడు ప్రభావం లేకుండా పోయేది.

హిందూ మతంలోని యజ్ఞ, యాగాల పట్ల, హిందూ మతంపై వేదాలకు ఉన్న అధికారం పట్ల, హైందవ మతంలో బ్రాహ్మణులకు ఇవ్వబడిన అత్యంత గౌరవ స్థానం పట్ల ఏర్పడిన తీవ్రమైన ద్వేషం కారణంగా లింగాయత్ మతం లేదా వీరశైవ మతం ఆవిర్భవించింది. బ్రాహ్మణ కుల వ్యతిరేకతతో ఏర్పడిన ఈ వీర శైవ మతాన్ని స్థాపించింది, ఒక సద్బ్రాహ్మణ కుటుంబంలో జన్మించిన బసవన్న అనే విప్లవ భావాలు కలిగిన బ్రాహ్మణ యువకుడు కావటం ఒక విచిత్రం అని భావించక తప్పదు. లింగాయత్ మతం క్రీ.శ. 12వ శతాబ్దంలో ఆవిర్భవించింది.

లింగాయత్ మతంలో పూజలు, పునస్కారాలు చేయించే పూజారి వర్గాన్ని "వీరశైవ జంగమ" అని పిలుస్తారు. ఒక విశేషం ఏమంటే, హైందవ మత కుల వ్యవస్థకు వ్యతిరేకంగా ఆవిర్భవించిన వీరశైవ మతంలో కూడా రెండు రకాలు ఉన్నాయి. వారిలో ఒక వర్గం - వీరశైవ జంగమలు అని పిలువ బడుతున్నారు. (ఈ వర్గం వారు శ్రీశైలం మరియు కేదార్‌నాథ్ క్షేత్రాలలో ఆదిశంకరాచార్య కాలంనుండి పూజారులుగా పనిచేస్తున్నారు.) ఇక రెండవ వర్గం అయిన లింగాయత్‌లలో విభిన్న వర్గాలకు చెందిన ప్రజలు ఉంటారు.

లింగాయత్ మతం ఆవిర్భవించింది ప్రాచీన కన్నడ దేశంలో (కర్నాటక) అన్నమాట వాస్తవం. అదేవిధంగా, ప్రపంచంలో ఎక్కువ మంది లింగాయత్ మతస్తులు ఉన్నది కూడా ఆ కన్నడదేశంలోనే అని గుర్తించాలి. ఇంకొక విశేషం ఏమంటే, ఆంధ్రప్రదేశ్‌లోను మరియు తెలంగాణాలోను అక్కడక్కడా, గుర్తించదగిన సంఖ్యలో లింగాయత్ మతస్తులు జీవిస్తున్నారు. లింగాయత్ మతస్తులు, ఒక చిన్న గోలి (మార్బల్) పరిమాణంలో ఉండే శివలింగాన్ని ఒక తాడు సహాయంతో తమ మెడలో వ్రేలాడదీసుకుంటారు. దానినే ఈ మతస్థులు "ఇష్టలింగం" అనే పేరుతో పిలుస్తారు.

అలా ధరించటం వల్ల తాము, ఏకైక దైవంగా పూజించే శివుడు, లింగ రూపంలో ఎల్లప్పుడు తమ హృదయానికి దగ్గరగా ఉంటాడని లింగాయత్‌లు భావిస్తారు.

కొంతకాలం క్రితం వరకు లింగాయత్ మతం, హైందవ మతంలో భాగమని, ఇంకా స్పష్టంగా చెప్పాలంటే, ఈ మతం హైందవ మతంయొక్క ఉప-మతమని భావించటం జరిగింది. కానీ, కొద్ది సంవత్సరాల క్రితం ఈ మతానికి ఒక ప్రత్యేక ప్రతిపత్తి ఇవ్వటం జరిగింది. ఫలితంగా, లింగాయత మతం (వీర శైవం), హైందవ మతానికి భిన్నమైన మతంగా గుర్తించబడింది. అనగా, ఇక నుండి వీరశైవం, హైందవ మతానికి తోక మతం కాదని లింగాయత్ మతస్థులు ఉద్ఘాటిస్తున్నారు. లింగాయత్ మతంలో మృతదేహాన్ని సమాధి చేస్తారు. మొదట మృతదేహాన్ని, బాగా అలంకరించిన ఒక కుర్చీలో కూర్చోపెట్టి ఆపై, ఆ కుర్చీని ఒక వాహనంపైన ఏర్పాటుచేయబడిన వేదికపై ఉంచి, ఆ తరువాత ఆ వాహనాన్ని ఊరేగింపుగా శ్మశానానికి తీసుకువెళతారు. ఆపై ఆ మృతదేహాన్ని, సమాధికోసం ఏర్పాటు చేయబడిన గోతిలో 'మోకాళ్ళమీద కూర్చుని ఉన్న భంగిమ'లో కూర్చోపెట్టి, ఆ గోతిని మట్టితో పూడ్చివేస్తారు. సమాధి కార్యక్రమం పూర్తి అయిన తరువాత మృతుడికి సంబంధించిన బంధువులు - మృతుడి ఇంటికి తిరిగివచ్చి శుద్ధి స్నానాలు చేస్తారు.

వీర శైవ మతంలో/లింగాయత్ మతంలో గొప్ప గురువులుగా అనగా మత బోధకులుగా గుర్తించబడిన వ్యక్తులు మరణించినప్పుడు, వారి మృతదేహాలను సమాధిచేసి, ఆపై వాటి మీద మందిరాలను నిర్మిస్తారు. ఆ తరువాత కాలంలో ఆ మందిరాలు లింగాయత్ మతస్తులకు గొప్ప పుణ్యక్షేత్రాలుగా మారతాయి. కర్నాటకలోని సి.హెచ్.నగర్ ప్రాంతంలోని యమ్.యమ్. కొండలపైన ఉన్న శ్రీమలైమహదేశ్వర స్వామి ఆలయం కూడా ఇలాంటిదే అని గుర్తించాలి. ఇక, సామాన్యులైన వీరశైవ మతస్తులు మరణించినప్పుడు శ్మశానంలో గోతులను త్రవ్వి ఆపై ఆ గోతులలో వారి మృతదేహాలను ఉంచి, ఆపై వారు బ్రతికి ఉన్నప్పుడు ధరించిన ఇష్టలింగాలను ఆ సమాధులలో ఉంచి ఆ తరువాత ఆ సమాధులను మట్టితో పూడ్చివేస్తారు.

**ప్రాచీన తమిళనాడులో అంత్యక్రియల విశేషాలు :**

తమిళనాడులో మృతదేహానికి అంత్యక్రియలు చేసే ప్రదేశాన్ని 'సుడుక్కాడు" అని పిలుస్తారు. తమిళ భాషలో "సుడు" అనగా కాల్చుట అని, "కాడు" అనగా అడవి లేదా శ్మశానం అని అర్థం. కనుక, సుడుక్కాడు అంటే శవాలను దహనంచేసే

అడవి లేదా శ్మశానం అని అర్థం. ప్రాచీన తమిళనాడులో ఒక విశేషమైన సాంప్రదాయం ప్రచారంలో ఉండేది. అది ఏమిటంటే, ఒక హిందువు కుటుంబంలో – మొదట పుట్టిన వ్యక్తియొక్క మృతదేహాన్ని (ఆ వ్యక్తి స్త్రీ కావొచ్చు లేదా పురుషుడు కావొచ్చు)ని శ్మశానంలో దహనం చేసేవాళ్ళు. ఇక, ఆ కుటుంబంలో ఆ తరువాత పుట్టిన వ్యక్తుల మృతదేహాలను సమాధి చేసేవాళ్ళు. (ఉదాహరణకి – ఒక వ్యక్తికి ముగ్గురు కొడుకులు, ఇద్దరు కూతుళ్ళు ఉన్నారు అనుకుందాం. అందులో, పెద్ద కొడుకు చనిపోయినప్పుడు అతని మృతదేహాన్ని దహనం చేస్తారు. ఇక, మిగిలిన ఇద్దరు కొడుకుల్ని మరియు ఇద్దరు కూతుళ్లను మరణించిన తరువాత సమాధి చేస్తారు అన్నమాట.)

సాధారణంగా, తమిళనాడులోని చాలామంది అగ్రకుల హైందవులకు సొంత భూములు అనగా వ్యవసాయ భూములు ఉంటాయి. అందువలన వాళ్ళు, తమ కుటుంబంలో చనిపోయిన వ్యక్తుల మృతదేహాలను తమ భూములలో సమాధిచేసి ఆపై దానిమీద ఒక తులసికోటను కట్టి, ప్రతిరోజూ ఆ తులసికోటలో దీపాన్ని వెలిగిస్తారు. తమ పొలంలో ఉన్న తమ కుటుంబీకుడి యొక్క సమాధి అనగా ఆ సమాధిలోని వ్యక్తియొక్క ఆత్మ, తమ పొలాన్ని మరియు తమ కుటుంబాన్ని ఎల్లప్పుడూ రక్షిస్తూ ఉంటుందని తమిళనాడులోని హైందవులు విశ్వసిస్తారు.

**ప్రపంచంలోని ఇతర మతాలలో అంత్యక్రియల విశేషాలు :**

**1. మహాయాన బౌద్ధమతంలో అంత్యక్రియల విధానం :** అంత్యక్రియల విషయానికి వచ్చినట్లయితే ప్రపంచంలోని ఏ దేశంలోనూ ఒకేవిధమైన అంత్యక్రియల విధానం వాడుకలోలేదని గ్రహించాలి. కొన్ని దేశాలలో ఒకే మతం ప్రచారంలో ఉన్నప్పటికీ ఆ దేశాలలోని, ఒక్కొక్క దేశంలో ఒక్కొక్క విధమైన అంత్యక్రియల విధానం వాడుకలో ఉన్నది. సాధారణంగా ఒక్కో దేశంలోని అంత్యక్రియల విధానం ఆ దేశంలోని సామాజిక మరియు పర్యావరణ పరిస్థితులపై ఆధారపడి ఉంటుంది. ఉదాహరణకి – బౌద్ధమతంలో చెప్పబడిన సూత్రాల ప్రకారం చూసినట్లయితే, ఆ మతానికి చెందిన వ్యక్తి మరణించినప్పుడు అతని మృతదేహాన్ని సమాధి చెయ్యాలి. కానీ, కొన్ని దేశాలలో ఉండే బౌద్ధ మతస్తులు, వాళ్ళు ఉన్న దేశంలోని పరిస్థితులను బట్టి వాళ్ళు – తమ మతంలోని వ్యక్తి చనిపోయినప్పుడు చేసే అంత్యక్రియల విధానం వాళ్ళ మత సూత్రాలకు వ్యతిరేకంగా ఉంటుంది. ఉదాహరణకి – బౌద్ధమతాన్ని స్వీకరించిన బ్రిటీష్ జాతీయులు – బ్రిటన్‌లో తమ మతస్థులకు చేసే అంత్యక్రియలలో మృతదేహాన్ని, మృతదేహ దహన కేంద్రంలో (Crematorium) విద్యుత్తు సహాయంతో దహనం చెయ్యటం (Cremation) జరుగుతుంది.

ఇక, బౌద్ధమతం అనగా మహాయాన బౌద్ధమతం ఏకైక మతంగా గుర్తించబడిన టిబెట్ దేశంలో "ఆకాశ సమాధి" (Sky burial) అనే విధానంలో మృతదేహాలకు అంత్యక్రియలు చేస్తారు. ఇంతకీ, ఆకాశ సమాధి అంటే ఏమిటో మనకి తెలియాలి. అది ఏమిటంటే, వ్యక్తియొక్క మృతదేహాన్ని ఒక పర్వతంపైకి తీసుకువెళ్ళి ఆపై అక్కడ పడేస్తారు. అలా పడవేసిన ఆ మృతదేహాన్ని రాబందులు, గద్దలు, కాకులు లాంటి పక్షులు పీక్కుతింటాయి. కొద్ది రోజులకి ఆ మృతదేహంలోని మాంసం సంపూర్తిగా అదృశ్యం అయిపోతుంది. ఇక్కడ ఇంకొక విశేషం కూడా దాగి ఉన్నది. అది ఏమిటంటే, ఇలా, కొండపైన పక్షులకు ఆహారంగా వేసిన మృతదేహాన్ని, అక్కడకు వచ్చిన పక్షులు నిమిషాలలో – ఆరగించటం ప్రారంభించినట్లయితే ఆ వ్యక్తి, ఆధ్యాత్మికంగా ఉన్నత స్థాయికి చేరాడని మరియు అతని ఆత్మ చాలా ప్రశాంతంగా పై లోకాలకు వెళ్ళిపోతున్నదని గ్రహిస్తారు. తన మృతదేహాన్ని పక్షులకు ఆహారంగా చెయ్యటం వల్ల తనకి బాగా పుణ్యం చేకూరుతుందని ఆ మృతదేహం నుండి బైటకు వెళ్ళిన ఆత్మ భావిస్తుంది.

కొన్ని సమయాలలో బౌద్ధమతస్తులు కూడా తాము నివాసం ఉంటున్న దేశ/ప్రాంత పరిస్థితులను బట్టి తమ మతానికి చెందిన వ్యక్తులయొక్క మృతదేహాలను – దహనం చెయ్యటం లేదా జల సమాధి చెయ్యటం (ప్రవహించే జలంలో మృతదేహాన్ని వదిలివెయ్యటం వల్ల ఆ మృతదేహాన్ని జలంలో ఉండే వివిధ రకాల జలచరాలు ఆహారంగా తీసుకుంటాయి. ఫలితంగా, ఆ మృతదేహానికి చెందిన ఆత్మకు అపారమైన పుణ్యం లభిస్తుందని నమ్ముతారు.) లాంటి విధానాలను పాటించటం జరుగుతుంది.

**2. జపాన్ దేశంలో అంతిమ సంస్కారాలు :**

ప్రస్తుతం, జపాన్ ప్రజలు చాలా వరకు లౌకిక విధానాలను (సెక్యులర్) పాటిస్తున్నప్పటికీ, ఈ దేశంలోని ప్రజలలో 91% మంది సాంప్రదాయ బౌద్ధమత విధానంలో, మృతులకు అంత్యక్రియలు చేస్తున్నారు. ప్రాచీనకాలంలో జపాన్‌లోని ఏ కుటుంబంలో అయినా, "ఒకవ్యక్తి మరణానికి దగ్గరలో ఉన్నాడు" అని అర్థమైనప్పుడు ఆ వ్యక్తియొక్క కుటుంబ సభ్యులు ఆ వ్యక్తి నోట్లో కొద్ది, కొద్దిగా నీటి చుక్కలువేసి ఆ వ్యక్తి నోరును తడిచేస్తూ ఉండేవాడు. ఈ విధానాన్ని 'మట్స్‌గో–నో–మిజు' అని పిలిచేవాళ్ళు. ఈ జపాన్ పదానికి 'ఆఖరి నిమిషంలో ఇచ్చే నీరు' అని అర్థం. ఇంకొక ముఖ్యవిశేషం ఏమంటే, భారతదేశంలోని సాంప్రదాయ హైందవ గృహాలలో తప్పనిసరిగా చిన్నదో లేక పెద్దదో ఒక పూజా మందిరం ఉంటుంది. అందులో, ఆ

కుటుంబ సభ్యులు ఇష్టపడే దేవతలయొక్క చిత్రపటాలు లేదా చిన్న పరిమాణంలో ఉండే దేవతా విగ్రహాలు ఉంటాయి. ఆ గృహంలోని స్త్రీలు లేదా వయస్సు మళ్ళిన పురుషులు ఆ దేవతా మందిరంలో దేవతలకు తమకు తోచినవిధంగా ప్రతిరోజూ పూజలు చెయ్యటం జరుగుతుంది. ఇక, జపాన్ విషయానికి వచ్చినట్లయితే ఈ దేశంలోని చాలా గృహాలలో బుద్ధుడి ప్రతిమలు ఉండే పూజా మందిరాలు ఉంటాయి. మరికొన్ని కుటుంబాలలో 'షింటో' మతానికి చెందిన దైవాలకు చెందిన పూజా మందిరాలు ఉంటాయి. ఏదిఏమైనా, ఒక కుటుంబంలో ఎవరైనా ఒకవ్యక్తి చనిపోయినప్పుడు ఆ కుటుంబీకులు తమ గృహంలోని పూజా మందిరానికి, న్యూస్ పరిమాణంలో ఉండే ఒక తెల్ల కాగితాన్ని అడ్డుగా ఉంచుతారు. ఒకవ్యక్తి మరణించినప్పుడు అతడి ఆత్మని తమతోపాటు తీసుకువెళ్ళాలని ఆశించే ఇతర ప్రేతాత్మలు మరియు ఆ వ్యక్తి మృతదేహంలో ప్రవేశించాలని వాంఛించే కొన్ని ప్రేతాత్మలు ఆ మృతదేహం దగ్గరకు వస్తాయి. అలాంటి అపవిత్రమైన ప్రేతాత్మలు తమ పూజా మందిరంలోకి ప్రవేశించినట్లయితే ఆ మందిరాలలోని దైవ ప్రతిమలు లేదా చిత్రాలు అపవిత్రం అవుతాయని భావిస్తారు. అలా జరగకుండా ఉండటంకోసం ఒక తెలుపురంగు కాగితాన్ని ఆ పూజామందిరానికి అడ్డంగా ఉంచుతారు. అలా ఉంచటంవల్ల ఆ గృహంలోకి వచ్చే ప్రేతాత్మలు ఆ పూజా మందిరంలోకి వెళ్ళలేవని నమ్ముతారు. ఒక గృహంలో ఎవరైనా ఒక వ్యక్తి చనిపోయినప్పుడు ఆ కుటుంబ సభ్యులు ఆ మరణ వార్తను తమ బంధువులకు మరియు ప్రభుత్వ అధికారులకు తెలియజేస్తారు. అప్పుడు ప్రభుత్వ అధికారులు అక్కడకు వచ్చి, ఆపై మృతదేహాన్ని పరిశీలించి ఆ తరువాత అక్కడికక్కడే ఆ కుటుంబ సభ్యులకు "మరణ ధృవీకరణ పత్రం" (డెత్ సర్టిఫికెట్) ఇస్తారు. ఆపై, మృతుడి కుటుంబ సభ్యులు తమ కటుంబసభ్యుడి మరణ వార్తను తమకు దగ్గరలో ఉన్న ఒక షింటో లేదా బౌద్ధ ఆలయ పూజారికి తెలియజేస్తారు. అప్పుడు ఆ పూజారి, మృతుడి ఇంటికి వస్తాడు. ఆ తరువాత మృతుడి పెద్ద కొడుకు ఆధ్వర్యంలో మృతుడికి అంత్యక్రియలు జరిపించే కార్యక్రమం ప్రారంభం అవుతుంది. ఇంకొక ముఖ్య విషయం ఏమంటే, ప్రాచీన చైనాలో ఉపయోగించిన ఆరు రోజుల చంద్ర తిధుల విధానంలో, మృతదేహానికి ఏ రోజున అంత్యక్రియలు చెయ్యాలో నిర్ణయిస్తారు. మృతదేహానికి అంత్యక్రియలు చేసే రోజున మొదట ఆ మృతదేహానికి స్నానం చేయించి, ఆ తరువాత ఆ మనిషి దేహంలో ఉండే నవ రంధ్రాలను పత్తితో మూసి వేస్తారు. ఇంకొక ముఖ్య విశేషం ఏమంటే, జపాన్‌లో ఒక స్త్రీ చనిపోయినప్పుడు ఆమె మృతదేహానికి తెల్లటి కిమినో ధరింప చేస్తారు. (మెడ

నుండి పాదాల వరకు పొడవుగా అనగా నైటీ లాగా ఉండే వస్త్రాన్ని జపాన్ భాషలో కిమినో అంటారు.) ఇక, పురుషుడి మృతదేహానికి సూట్ లేదా కిమినోని ధరింపచేస్తారు. ఆ తరువాత మృతుడి లేదా మృతురాలియొక్క ముఖానికి అందంగా మేకప్ వేస్తారు.

మృతుడికి అంత్యక్రియలు చెయ్యటానికి ముందు ఆ మృతదేహానికి ఆ ప్రాంతంలో ఉండే బౌద్ధమత ఆలయ పూజారులు ఒక కొత్త పేరుని ఇస్తారు. అలా ఆ మృతదేహానికి కొత్త పేరుని ఇవ్వటంవల్ల ఒక లాభం ఉంటుందని చెబుతారు. అది ఏమిటంటే, మృతుడిని ఎప్పుడైనా అతని పాత పేరుతో తలచుకున్నట్లయితే, ఆత్మల లోకంలో ఉండే ఆ మృతుడియొక్క ఆత్మ, తక్షణమే తనను తలచుకున్నవాళ్ళ ముందు ప్రత్యక్షం అవుతుంది. అలా తిరిగి వచ్చిన ప్రేతాత్మ, మానవులకు తీవ్రమైన హాని చేసే అవకాశం ఉంటుంది. అలా జరగకుండా ఉండటంకోసం మృతుడికి బౌద్ధమత పూజారి కొత్త పేరు పెడతాడు. ఫలితంగా, ఆ తరువాత కాలంలో మృతుడిని పాత పేరుతో తలచుకున్నప్పటికీ, ఆ పేరు తనది కాదని మరియు కొత్త పేరు మాత్రమే తనదని విశ్వసించే ఆ ప్రేతాత్మ మళ్ళీ తిరిగి మానవలోకంలోకి రాదు.

మరణించిన వ్యక్తి – ఎంతకాలం బ్రతికాడు? మరియు అతడి గొప్పతనం ఏమిటి? – అన్న విషయాలను బట్టి, అతనికి పెట్టే కొత్తపేరు ఎంత పొడవు ఉండాలి? లేదా ఎంత పొట్టిగా ఉండాలి? అన్న విషయాన్ని బౌద్ధ ఆలయపూజారి నిర్ణయిస్తాడు. సాధారణంగా, ఈ కొత్తపేరు పెట్టటానికి దాదాపు ఒక మిలియన్ యన్నులను (Yens) ఆలయ అధికారులు వసూలు చేస్తారు. (జపాన్ దేశ కరెన్సీని “యన్” అనే పేరుతో పిలుస్తారు. భారత్ కరెన్సీని రూపాయల్లో, అమెరికా కరెన్సీని డాలర్లలలో ఎలా చెబుతారో అలాగే జపాన్ కరెన్సీని యన్‌లలో చెబుతారు.) ఆ తరువాత మృతుడి దేహాన్ని – అతడి బంధువులు మరియు కుటుంబ సభ్యులు – ఒక శవపేటికలో ఉంచి, ఆపై ఆ మృతదేహంయొక్క శిరస్సు చుట్టూ మరియు పాదాల చుట్టూ కొన్ని పూలను ఉంచి, ఆపై ఆ మృతదేహానికి భక్తి పూర్వకంగా వందనం చేస్తారు. ఆ తరువాత ఆ శవ పేటికను మేకులతో సీల్‌చేసి దానిని బౌద్ధ సాంప్రదాయం ప్రకారం శవదహన కేంద్రానికి (Crematorium) తరలిస్తారు. ఆ తరువాత ఆ శవపేటికను శవదహన కేంద్రంలో ఉండే ఒక ట్రేలో ఉంచుతారు. ఆ తరువాత ఆ మృతుడి కుటుంబ సభ్యులు అందరూ చూస్తూ ఉండగా ఆ శవపేటిక మెల్లి మెల్లిగా, దహనం చెయ్యబడే గదిలోకి (Cremation Chamber) వెళ్ళిపోతుంది. దాదాపు 2 గంటలలోపు ఆ శవపేటికతో సహా మృతదేహం కాలి బూడిద అయిపోతుంది. జపాన్‌లోని ఒక పరిశోధకుడు చెప్పిన వివరాల ప్రకారం చూసినట్లయితే “విద్యుత్తుతో దహనం చేయబడే

– పెద్దవాళ్ళ (Adult) మృతదేహం కాలటానికి గంటన్నర, చిన్న వయస్సు ఉన్న పిల్లల మృతదేహం కాలటానికి 45 నిమిషాలు, పుట్టగానే చనిపోయిన శిశువుల దేహాలు దహనం అవటానికి 15 నిమిషాలు పడుతుందని తెలుస్తున్నది".

శవదహనం పూర్తి అయిన తరువాత మృతుడికి సంబంధించిన అస్థికలను అతడి కుటుంబ సభ్యులు సేకరిస్తారు. ఆ తరువాత వాటిని రెండు పొడవాటి వెదురు పుల్లలతో ఒక్కొక్కటిగా పట్టుకుని ఒక లోహపు పాత్రలో వేస్తారు. (సాధారణంగా జపాన్ ప్రజలు, తాము తినే ఆహారాన్ని – దాదాపు 6 అంగుళాల పొడవు ఉండే రెండు వెదురు పుల్లలతో తీసుకుని నోట్లో వేసుకుంటారు. వీటిని ఆంగ్లంలో చోప్‌స్టిక్స్ అంటారు. అలా స్పూన్లకి బదులుగా పుల్లలతో ఆహారం తీసుకోవటం జపాన్‌లో ఒక సాంప్రదాయంగా గుర్తించబడింది.) ఇంకొక విశేషం ఏమంటే, మృతుడియొక్క అస్థికలను సేకరించటంలో ఒక పద్ధతిని పాటిస్తారు. మొదట, మృతుడియొక్క పాదాలకు సంబంధించిన ఎముకలను తీసుకుని, చివరగా శిరస్సుయొక్క ఎముకలను తీసి తమ దగ్గర ఉన్న పాత్రలో వేస్తారు. ఇలా చెయ్యటం వల్ల మృతుడియొక్క ఆత్మ ఆ పాత్రలో కాళ్ళు క్రిందకు ఉంచి నిలబడుతుందని నమ్ముతారు.

కొన్ని సందర్భాలలో, ఇలా సేకరించిన మృతుడి అస్థికలను భాగాలుగా విభజించి ఒకటి కన్నా ఎక్కువ పాత్రలలో ఉంచుతారు. ఆ తరువాత, అస్థికలు ఉన్న ఒక పాత్రను, తమ కుటుంబ సభ్యుల అస్థికలను సమాధి చేసిన ప్రాంతంలో సమాధి చేస్తారు. ఇంకొక భాగాన్ని, దగ్గరలో ఉన్న బౌద్ధ ఆలయ పరిసరాల్లో సమాధి చేస్తారు. ఏదిఏమైనా, ఆ ప్రాంతంలో ఉండే సాంప్రదాయాన్ని బట్టి ఆ అస్థికల పాత్రలు ఎన్నిచోట్ల సమాధి చెయ్యాలి? అన్న విషయం నిర్ణయించబడుతుంది. కొన్ని కుటుంబాలలో మృతుడియొక్క అస్థికలు భద్రపరచిన పాత్రను కొద్ది రోజులపాటు తమ గృహాలలో ఉంచుకుని, ఆ తరువాత ఆ పాత్రను శ్మశానంలో సమాధి చేస్తారు. ఒక్కోసారి దహన కేంద్రం నుండి వచ్చిన కొద్ది గంటలలోనే మృతుడి అస్థికలు ఉన్న పాత్రను శ్మశానాలలో సమాధి చెయ్యటం జరుగుతుంది.

మృతుడి అస్థికలను సమాధి చేసిన తరువాత, ఆ సమాధి పైన మృతుడియొక్క పేరును చెక్కిస్తారు. ఇక్కడ ఒక విచిత్రం ఉన్నది. అది ఏమిటంటే, ఒక వ్యక్తి తన భార్య కన్నా ముందు చనిపోయినట్లయితే, అతడి భార్యయొక్క పేరును కూడా అతడి సమాధిపైన చెక్కిస్తారు. అలాగే, ఒక భార్య కన్నా ముందుగా ఆమె భర్త చనిపోయినట్లయితే ఆమె భర్త అస్థికలపై కట్టిన సమాధిపై ఆమె పేరును కూడా

చెక్కిస్తారు. అయితే ఇక్కడ ఒక నియమాన్ని పాటిస్తారు. అది ఏమిటంటే, బ్రతికి ఉన్న జీవిత భాగస్వామి (భార్య/భర్త) యొక్క పేరును ఎరుపు రంగుతో పెయింట్ చేస్తారు. అనగా, ఒక సమాధిని చూసిన వెంటనే ఆ సమాధిలోని వ్యక్తిపేరు మరియు ఆ వ్యక్తియొక్క జీవితభాగస్వామి – ఆ సమాధి నిర్మించినప్పుడు జీవించి ఉన్నట్లుగా స్పష్టంగా తెలుస్తుంది.

జపాన్‌లో ఒక సామాన్య పౌరుడి కుటుంబంలో ఒక వ్యక్తి మృతదేహానికి అంత్యక్రియలు చెయ్యటానికి దాదాపుగా 2.31 మిలియన్ల ఎన్‌లు (25 వేల యు.ఎస్. డాలర్లకు సమానం) ఖర్చు అవుతుంది. అందులో, ఆ అంత్యక్రియలను – దగ్గర ఉండి నిర్వహించిన బౌద్ధ పురోహితుడికి ఇచ్చే రుసుము దాదాపుగా ఐదున్నర లక్షల ఎన్‌లు ఉండటం విశేషం.

### 3. ప్రపంచ క్రైస్తవ మతంలో అంత్యక్రియల విధానాలు :

క్రైస్తవ మతానికి చెందిన ప్రొటెస్టెంట్ చర్చి అధిపతుల యొక్క అభిప్రాయం ప్రకారం చూసినట్లయితే "మనిషి యొక్క దేహానికి మరియు ఆత్మకు స్పష్టమైన తేడా ఉంటుంది. మనిషి శరీరంలో ఉండే ఆత్మ, స్వర్గానికి వెళుతుంది. అందువల్ల, ఆ ఆత్మ వదిలివెళ్ళిపోయిన మృతదేహానికి ఏ ప్రాధాన్యత ఉండదు. అందువల్ల దానిని ఏదో ఒక విధానంలో నశింపచేయాలి". ఉదాహరణకి – దహనం చెయ్యాలి అన్నమాట.

రోమన్ క్యాథలిక్, అర్థోడాక్స్ చర్చిలు – ఈ వర్గాలకు చెందిన మతాధిపతులు ఈనాటికీ "పునర్జీవనం" (Resurrection) అన్న సిద్ధాంతాన్ని బలంగా నమ్ముతున్నారు. అనగా, చనిపోయిన వ్యక్తియొక్క ఆత్మ, కొంతకాలానికి మళ్ళీ తిరిగి వచ్చి తన మృతదేహంలో ప్రవేశిస్తుందని, అప్పుడు ఆ మృతదేహం మళ్ళీ జీవిస్తుందని వాళ్ళు విశ్వసిస్తున్నారు. ఆ కారణంగానే రోమన్ క్యాథలిక్ మరియు అర్థోడాక్స్ చర్చి అధిపతులు – మృతదేహాన్ని దహనం చెయ్యటం కన్నా సమాధి చెయ్యటమే చాలా మంచిది అని తమ మతస్థులకు ప్రబోధిస్తున్నారు. ఇక, యు.కె. (యునైటెడ్ కింగ్‌డమ్) దేశంలోని క్రైస్తవులలో – మృతదేహాలను దహనం చెయ్యటం అనే ప్రక్రియ రోజురోజుకీ అధికం అవుతున్నది. ఇంకా చెప్పాలంటే ఆ దేశానికి చెందిన క్రైస్తవులలో ఎక్కువ శాతం మంది దహనం చేసే విధానాన్ని పాటిస్తున్నారు.

ఇటీవల కాలంలో కాథలిక్ చర్చి కూడా తన మతానికి చెందిన వ్యక్తులయొక్క మృతదేహాలను దహనం చెయ్యటానికి అంగీకరించటం జరిగింది. అయితే, ఒకవేళ

మృతదేహాన్ని దహనం చేసినప్పటికీ ఆ మృతదేహానికి సంబంధించిన అస్థికలను లేదా చితా భస్మాన్ని ఒక పాత్రలో ఉంచి, ఆ తరువాత దానిని భూమిలో పాతిపెట్టటం లేదా దానిని ఒక సమాధిలో ఉంచటంగాని చెయ్యాలని కాథలిక్ చర్చిలోని కొందరు మతాధిపతులు అభిప్రాయ పడుతున్నారు. కాథలిక్ క్రైస్తవ చర్చి నియమాల ప్రకారం చూసినట్లయితే, ఒకవ్యక్తి మృతదేహానికి అంత్యక్రియలు చేసే సమయంలో ఆ ప్రదేశానికి వచ్చే ఆ వ్యక్తి యొక్క బంధువులు, మిత్రులు – నలుపు రంగు దుస్తులను ధరించాలి. మృతదేహానికి అంత్యక్రియలు చేసేముందు మృతదేహాన్ని చర్చిలో ఉంచి ప్రార్థనలు చేస్తారు. ఆ సమయంలో చర్చిలో ఉన్నవారు నలుపు రంగు వస్త్రాలను ధరించి ఉండాలి. ఏదిఏమైనా, ఒక వ్యక్తి మరణించిన తరువాత అతని మృతదేహానికి రెండు రోజుల నుండి 7 రోజులలోపు తప్పనిసరిగా అంత్యక్రియలు చెయ్యాలి. శ్మశానంలో ఒకవ్యక్తియొక్క మృతదేహాన్ని సమాధిచేసే ప్రక్రియను కాథలిక్ చర్చికి సంబంధించిన ప్రీస్ట్ నిర్వహిస్తాడు.

### 4. ప్రపంచ ఇస్లాం మత దేశాలలో అంతిమ సంస్కారాలు :

ఇస్లాం మతంలో చెప్పబడిన సూత్రాల ప్రకారం చూసినట్లయితే, “అల్లా” ఒక మనిషియొక్క మంచి, చెడులను నిర్ణయించి ఆ మనిషి స్వర్గానికి వెళ్ళాలా? లేదా నరకానికి వెళ్ళాలా? అని తీర్పు చెప్పేవరకు మరణించిన మనిషి ఆత్మ ఆ మృతదేహంలోనే ఉంటుందని తెలుస్తుంది. అందువలన, ఇస్లాం మతంలో మృతదేహాన్ని సమాధి చేస్తారు. ఇంకొక విశేషం ఏమంటే, సమాధిలో ఉన్న పుణ్యాత్ములకు ఆ సమాధి, స్వర్గంలాగా సుఖాన్ని ఇస్తుందని, ఇక, పాపాత్ములకు వాళ్ళ సమాధి – నరకం లాగా అనేక రకాల బాధలను కలిగిస్తుందని ఇస్లాం మతంలో చెప్పబడి ఉన్నది. భగవంతుడు అనగా ‘అల్లా’ – మృత జీవుల పాప–పుణ్య విచారణ చేసే సమయంలో – అప్పటి వరకు భూమిమీద సమాధులలో ఉన్న మృతదేహాలు మళ్ళీ ప్రాణం పోసుకుని నేరుగా అల్లా సముఖానికి వెళతాయని, అక్కడ, అల్లా ఆ వ్యక్తుల యొక్క మంచి, చెడులను విచారించి, వాళ్ళలో పాపాత్ములను నరకానికి, పుణ్యాత్ములను స్వర్గానికి పంపిస్తాడని ఇస్లాం మత సిద్ధాంతాలు ఉద్ఘాటిస్తున్నాయి. దైవ విచారణ సమయంలో మృతదేహాలు మళ్ళీ జీవిస్తాయని ఇస్లాం మతంలో విశ్వసిస్తున్న కారణంగా – ఆ మతంలో మృతదేహాలను సమాధి చేస్తారని గుర్తించాలి. ఒక మనిషి మరణించిన 24 గంటల లోగా అతడి మృతదేహాన్ని సమాధి చెయ్యాలని ఇస్లాం మతం తెలియ జేస్తుంది. ఇస్లాం మతంలో – ఒక పురుషుడు చనిపోయినపుడు అతని మృతదేహానికి

శుభ్రంగా స్నానం చేయించి, ఆపై ఒకటి లేదా మూడు తెల్లటి వస్త్రాల ముక్కలను ఆ మృతదేహం చుట్టూ చుడతారు. ఇక, స్త్రీ మరణించినట్లయితే ఆమె మృతదేహానికి స్నానం చేయించి ఆ తరువాత మూడు లేదా ఐదు వస్త్రపు ముక్కలను ఆ స్త్రీ మృతదేహం చుట్టూ చుడతారు. ఆ తరువాత మృతదేహాన్ని "ఖబరస్థాన్"(శ్మశానం)కి తీసుకువెళ్ళి అక్కడ సమాధి చేస్తారు.

ఇంకొక ముఖ్య విశేషం ఏమంటే, చాలా ముస్లిం దేశాలలో ఒక శవపేటిక అవసరం లేకుండానే మృత దేహాలను నేరుగా సమాధి చేస్తారు. అతి కొద్ది ఇస్లాం దేశాలలో మాత్రమే మృతదేహాలను ఒక చెక్కపెట్టెలో ఉంచి, ఆపై ఆ పెట్టెను సమాధి చేస్తారు. ఇస్లాం మత సాంప్రదాయాల ప్రకారం – మృతదేహాన్ని సమాధి చేసేటప్పుడు ఆ మృతదేహం యొక్క శిరస్సు మక్కా దిక్కుకి ఉండేలా సమాధి చేస్తారు. (సౌదీ అరేబియా దేశంలోని మక్కా క్షేత్రం, ఇస్లాం మతస్తులకు అత్యంత ముఖ్యమైన, పవిత్ర పుణ్య క్షేత్రంగా గుర్తించబడింది). సాధారణంగా, ఇస్లాం మతంలో మృతదేహాన్ని సమాధి చేసే ముందు మృతునియొక్క ఆత్మశాంతికోసం అల్లాను ప్రార్ధిస్తారు. ఈ ప్రార్ధనల వ్యవధి 30 నిమిషాల నుండి 60 నిమిషాల వరకు మాత్రమే ఉంటుంది. సాధారణంగా, ఈ మృతదేహ సంబంధ ప్రార్ధనలు మసీదులలోని ఇమామ్ (మతాధికారి) ఆధ్వర్యంలో జరుగుతుంది. ఇస్లాం మతంలోని ఇంకొక ప్రత్యేకత ఏమంటే, ఒకవ్యక్తియొక్క మృతదేహాన్ని సమాధిలో ఉంచిన తరువాత అక్కడకు వచ్చిన ప్రతి వ్యక్తీ ఒక గుప్పెడు మట్టిని ఆ సమాధిలోకి విసురుతాడు. అనగా, ఆ వ్యక్తిని సమాధిచేసే పవిత్ర కార్యంలో ప్రతి వ్యక్తీ తనవంతు బాధ్యతను నిర్వహిస్తాడు అన్నమాట. ఇంకొక ముఖ్య విశేషం ఏమంటే, ఇస్లాం మతంలో – మృతదేహం దగ్గర బాధను వ్యక్తం చేసే విధానం కూడా ఒక మర్యాదకు కట్టుబడి ఉంటుంది. అందువల్ల మృతదేహాన్ని దర్శించటానికి వచ్చే బంధుమిత్రులు పెద్దగా ఏడవటం, బాధతో కేకలు పెట్టటం, దు:ఖంతో గుండెలు బాదుకోవటం, తలను రెండు చేతులతో కొట్టుకోవటం, ఒంటిమీద ఉన్న వస్త్రాలను చించుకోవటం, దైవ/మత వ్యతిరేక వాఖ్యలు లాంటివి చెయ్యకూడదని నియమం విధించబడింది. చిన్నస్థాయి స్వరంతో ఏడవటం తప్పుకాదని ఇస్లాం మతంలో చెప్పబడి ఉన్నది. మృతదేహాన్ని సమాధి చెయ్యటం పూర్తి అయిన తరువాత మృతుడియొక్క బంధువులు అందరూ, మృతుడికి సంబంధించిన దగ్గర వ్యక్తియొక్క కుటుంబంలో సమావేశం అయి, ఆపై మృతుని యొక్క కుటుంబానికి ధైర్యాన్ని చెప్పి ఆ రోజంతా అక్కడే ఉండి మృతుడి జ్ఞాపకార్ధం, ఇస్లాం సాంప్రదాయం ప్రకారం పెట్టే భోజనాన్ని స్వీకరిస్తారు. ఇలా అనేకమంది తమ గృహానికి వచ్చి

తమకి మానసిక ధైర్యాన్ని ఇచ్చి, ఆపై తమతోపాటు భోజనాలు చెయ్యటం వల్ల మృతులకు చెందిన ఆ కుటుంబంలోని వ్యక్తులకు మానసికంగా కొంత నిబ్బరం ఏర్పడుతుంది. ఇంకొక ముఖ్య విశేషం ఏమంటే, ఇస్లాం మతంలో ఒకవ్యక్తి చనిపోయిన తరువాత 40 రోజులపాటు ఆ కుటుంబం సంతాపం పాటిస్తుంది. ఆ సమయంలో మొదటి మూడు రోజులపాటు తోటి ఇస్లాం కుటుంబీకులు – మృతుల కుటుంబానికి కావలసిన అన్నపానీయాలను వాళ్ళ ఇంటికి తీసుకువచ్చి అందిస్తారు. ఏదిఏమైనా, ఒక కుటుంబం తమ సభ్యుడి యొక్క మృతికి సంతాపాన్ని పాటిస్తున్న 40 రోజుల కాలంలో ఆ కుటుంబానికి సంబంధించిన బంధువులు, మిత్రులు తమకు వీలైనప్పుడు ఆ కుటుంబం దగ్గరకువెళ్ళి వాళ్ళని ఓదార్చి, ఆపై తమకు వీలైనవిధంగా ఆ కుటుంబానికి సహాయం చెయ్యటం జరుగుతుంది.

ఇంకొక ఆసక్తికరమైన విషయం ఏమంటే, సాధారణంగా ఇస్లాం మతస్తులయొక్క సమాధులు ఎత్తుగా ఉంటాయి. అలా కాకుండా, ఆ సమాధులు నేల బారుగా ఉన్నట్లయితే, ఆ శ్మశానంలోకి వచ్చే వ్యక్తులు ఆ సమాధి ఉన్న ప్రదేశాలను గుర్తించలేక ఆ ప్రదేశాలను కూడా మామూలు నేలలాగానే భావించి దాని మీదుగా నడిచి వెళ్ళిపోవటం జరుగుతుంది. అలా ఆ సమాధుల మీదుగా నడిచి వెళ్లటం అనే ప్రక్రియ, చనిపోయినవారి పట్ల చేసే మహా అపచారంగా భావిస్తారు. చాలా ఇస్లాం దేశాలలో మృతదేహాలను సమాధి చేసే ప్రదేశానికి స్త్రీలను అనుమతించరు.

**5. యూదు మతంలో అంత్యక్రియలు :**

క్రైస్తవ మతానికి మూల మతం అయిన యూదు మతంలో (ముఖ్యంగా ఇజ్రాయేల్ దేశంలో) ప్రచారంలో ఉన్న మత విశ్వాసాలను బట్టి చూసినట్లయితే "దైవం తీర్పు ఇచ్చే సమయంలో సమాధులలో ఉండే మృతదేహాలు నిద్రలేచి, దైవం ముందు విచారణకు నిలబడతాయని తెలుస్తున్నది. ఆ కారణంగానే, యూదు మతంలోకూడా మృతదేహాలను సమాధి చేసే సాంప్రదాయాన్ని పాటిస్తారు. అయితే కొంతకాలంగా యూదు మతంలో వస్తున్న సంస్కరణల కారణంగా అనగా ఆధునిక భావాల కారణంగా – మృతదేహాలను దహనం చేసే సాంప్రదాయం కూడా క్రమ క్రమంగా వాడుకలోకి వస్తున్నది అని గుర్తించాలి. ఈ మతంలో చెప్పబడిన సూత్రాల ప్రకారం చూసినట్లయితే, ఒక మృతదేహాన్ని సమాధి చేసే వరకు ఆ మృతదేహాన్ని ఎక్కడో ఒకచోట ఒంటరిగా పడుకోపెట్టే విధానం తప్పు అని ఈ మతంలో చెప్పబడి ఉన్నది. యూదు మతానికి చెందిన మత పెద్దలు – మృతదేహాలకు అంత్యక్రియలు

నిర్వహించే బాధ్యతను ఎంతో శ్రద్ధతో మరియు దగ్గర ఉండి జరిపిస్తారు. ఇంకొక విశేషం ఏమంటే, ఈ మతంలో పురుషుల మృతదేహాలకు పురుషులే స్నానం చేయించటం మరియు నూతన వస్త్రాలు ధరింపచేయటం జరుగుతుంది అదేవిధంగా, స్త్రీల మృతదేహాలకు స్త్రీలే స్నానం చేయించటం మరియు నూతన వస్త్రాలు ధరింపచేయటం జరుగుతుంది. సాధారణంగా, యూదు మతంలో – మృతదేహాలకు సాధ్యమైనంత తొందరగా అంత్యక్రియలు జరపటం అనగా సమాధి చెయ్యటం జరుగుతుంది. ఏదైనా సందర్భంలో సమాధి చెయ్యటం కొంచెం ఆలస్యం చెయ్యటం జరుగుతుంది. అనగా ఆ మృతదేహానికి "శవపరీక్ష" (అటాప్సీ) చేయవలసి వచ్చినప్పుడు, మొదట ఆ శవపరీక్ష చేసి, ఆపై ఆ మృతదేహాన్ని సమాధి చేస్తారు. యూదుల కుటుంబాలలో ఒక వ్యక్తి మరణించినప్పుడు ఆ గృహాలలోని అద్దాలపై వస్త్రాలను కప్పి ఉంచుతారు. మరియు కొవ్వొత్తులను వెలిగించి ఉంచుతారు. ఆ సమయంలో మృతుడి ఇంటికి వచ్చే బంధువులు మరియు స్నేహితులు – మృతుడి కుటుంబీలకు ఆహార పదార్థాలను తెచ్చి ఇస్తారు. అంతేకాకుండా, చనిపోయిన వ్యక్తియొక్క జీవితంలో జరిగిన మరపురాని సంఘటనల గురించి చెప్పుకుంటారు. అంతేకాకుండా, ఆ సమయంలో యూదు మత సంబంధమైన ప్రార్థనలను సామూహికంగా చేస్తారు. ఒక వ్యక్తిని సమాధి చేసిన 30వ రోజున మరియు సంవత్సరం తరువాత మృతుడియొక్క కుటుంబంలో ఆ మృతుడియొక్క జ్ఞాపకార్థం ప్రత్యేక దైవ ప్రార్థనలు మరియు మతపరమైన ప్రక్రియలు జరుపబడతాయి. ఇంకొక విశేషం ఏమంటే, యూదు మతస్తులు కూడా తమ కుటుంబంలోని వ్యక్తులు మరణించినప్పుడు కొద్ది రోజులపాటు మత సంబంధమైన కార్యక్రమాలకు దూరంగా ఉంటారు. అనగా సూతకం (మైల) పాటిస్తారు.

**6. బహాయ్ మతంలో అంత్యక్రియలు :**

మహమ్మద్ ప్రవక్త స్థాపించిన ఇస్లాం మతాన్ని మరియు ఆ మత సిద్ధాంతాలను కొంత వరకు వ్యతిరేకించిన కొందరు ఇస్లాం మత విప్లవ కారులు, 'బహాయ్' అనే నూతన మతాన్ని స్థాపించారు. ఈ విధానంలో అల్లాని ప్రార్థిస్తారు. ఖురాన్‌ని నమ్ముతారు. కానీ, మహమ్మద్ ప్రవక్తను కేవలం ఒక సాధారణ మత ప్రవక్తగానే చూస్తారు. అంతేకాకుండా, మహమ్మద్ ప్రవక్త చెప్పిన నియమాలలో కొన్నింటిని బహాయ్ మతస్థులు తిరస్కరించారు. అంతేకాకుండా, బహాయ్ మతం – క్రైస్తవ మతం, బౌద్ధమతం, హిందూమతం – లాంటి అన్య మతాలయొక్క మత గ్రంధాలను, మత సిద్ధాంతాలను గౌరవిస్తుంది. ఫలితంగా, ఇస్లాం మత పెద్దలు మరియు గురువులు, బహాయ్ మతాన్ని

ఇస్లాంమత వ్యతిరేక మతంగా గుర్తించారు. అయినప్పటికీ, ఈ ప్రపంచంలో అనేక చోట్ల కొద్ది సంఖ్యలో బహాయ్ మతస్థులు ఉన్నారు. అలాగే ఆ మతానికి కొన్ని ప్రత్యేకమైన మత సాంప్రదాయాలు కూడా ఉన్నాయి.

బహాయ్ మతంలోని "శవ సంస్కార" (అంత్యక్రియలు) సూత్రాల ప్రకారం చూసినట్లయితే, మృతదేహం ఉన్న ప్రదేశం నుండి శ్మశానం వరకు మృతదేహాన్ని తీసుకువెళ్ళటానికి పట్టే కాలం ఒక గంట సమయానికి మించి ఉండరాదని తెలుస్తున్నది. మృతదేహాన్ని సమాధి చెయ్యటానికి ముందు దానిని ఒక సిల్క్ లేదా కాటన్ వస్త్రంతో చుట్టాలి. ఆ తరువాత "నేను దైవం దగ్గర నుండి వచ్చాను మరియు ఆ దైవం దగ్గరకే వెళుతున్నాను. నా వాళ్ళందరితో సంబంధం తెంచుకుని వెళుతున్నాను. దయగల ఆ దేవుడు నన్ను కాపాడుగాక" అనే అక్షరాలు చెక్కి ఉన్న ఒక ఉంగరాన్ని ఆ మృతదేహం యొక్క చేతి వ్రేలుకి తొడుగుతారు. ఇక, మృతదేహాన్ని సమాధి చెయ్యటానికి ఉపయోగించే శవపేటిక – స్ఫటికం లేదా శిల లేదా గట్టి చెక్కతో చేసినది అయి ఉండాలి. ఆ తరువాత చనిపోయిన వ్యక్తి గురించి ఒక ప్రార్ధన చేస్తారు. ఆ తరువాత ఆ వ్యక్తియొక్క మృతదేహం కాళ్ళు "కిబిలీ" (బహాయ్ మత స్థాపకుడి సమాధి ఉన్న పట్టణం కిబిలీ అని గ్రహించాలి.) వైపు ఉండేలా శవ పేటికలో ఉంచి, ఆపై శవ పేటికను సమాధి చేస్తారు. ఒక ముఖ్యవిశేషం ఏమంటే, పైన చెప్పిన చివరి ప్రార్ధన మరియు మృతదేహం వేలుకి ఉంగరం తొడగటం అనే రెండు కార్యాలూ – కేవలం 15 సంవత్సరాల వయస్సు దాటిన తరువాత చనిపోయిన వ్యక్తులకు మాత్రమే చేయబడతాయని గుర్తించాలి.

### 7. జొరాస్ట్రియన్ మతంలో అంతిమ సంస్కారాలు :

ప్రాచీన ఇరాన్‌లో ఆవిర్భవించిన జొరాస్ట్రియన్ మతంలో అగ్నిని పూజిస్తారు. ఈ మతంలోని ఆచారాలు చాలా వరకు వైదిక మతానికి దగ్గరగా ఉంటాయి. అంతేకాదు, ప్రాచీన జొరాస్ట్రియన్ మతస్థుల గ్రంధాలలో ఉపయోగించిన భాష 50% వరకు సంస్కృత భాషను పోలి ఉంటుంది. ఒకప్పుడు, ఇరాన్ దేశ అధికార మతంగా గుర్తించబడిన జొరాస్ట్రియన్ మతం ఆ తరువాత కాలంలో – ఇరాన్‌లోకి దౌర్జన్యంగా ప్రవేశించిన ఇస్లాం మతస్థుల అరాచకాలకు మరియు మత మార్పిడులకు లొంగిపోయింది. ఫలితంగా, కొంతమంది జొరాస్ట్రియన్లు, ఇరాన్‌ను వదిలిపెట్టి సముద్ర మార్గంలో అనగా అరేబియా సముద్ర మార్గంలో ప్రయాణించి గుజరాత్ తీరానికి చేరుకున్నారు. ఆ తరువాత గుజరాత్ రాష్ట్రంలోకి ప్రవేశించి క్రమ క్రమంగా ఉత్తర

భారతదేశంలోని ఇతర రాష్ట్రాలలో తన నివాసాన్ని ఏర్పాటు చేసుకున్నారు. భారతదేశంలోని జొరాస్టియన్ మతాన్ని 'పార్శీమతం' (ఇరాన్ మతం అన్నమాట) అనే పేరుతోను, ఆ మతాన్ని పాటించే వారిని 'పార్శీలు' అని పిలుస్తారు. ఈ పార్శీలు భారతీయ ఆర్థిక రంగానికి, ముఖ్యంగా పారిశ్రామిక రంగానికి వెన్నుముకగా నిలిచారు. ఈనాడు ప్రపంచ ప్రఖ్యాతి చెందిన భారతదేశ టాటా కంపెనీ వ్యవస్థాపకులు ఈ పార్శీ మతాన్ని పాటించే టాటా వంశస్తులే అని గుర్తించాలి.

ఏదిఏమైనా, పార్శీ మతంలో అనగా జొరాస్టియన్ మతంలో మృతదేహాలను దహనం చెయ్యరు. మృతదేహాలను – నివాస ప్రాంతాలకు దూరంగా ఉన్న నిర్మానుష్య ప్రాంతంలో వదిలివేస్తారు. వాటిని రాబందులు, కాకులు లాంటి పక్షులు పీక్కుతింటాయి.

**సమాధి గోతుల ప్రత్యేక విశేషాలు :**

భారతదేశంలోని ప్రజలు, ముఖ్యంగా హైందవులు మానవ జీవితం యొక్క అశాశ్వతత్వం గురించి మాట్లాడుతూ "ఒక మనిషి ఎంత భూమిని సంపాదించినా, ఎన్ని కోట్లు సంపాదించినా, చివరికి ఆ మనిషికి మిగిలేది లేదా దక్కేది ఆరు అడుగుల నేల మాత్రమే" అని సామెత చెబుతారు. ఇక, పాశ్చాత్య దేశాలలో ఇదే అంశం గురించి చెబుతూ "ఆరు అడుగుల క్రింద (Six feet under) అనే సామెతను చెబుతూ ఉంటారు". ఏ దేశంలో చెప్పినా ఈ సామెతకి ఒకే అర్థం వస్తుంది. అది ఏమిటంటే, "మనిషిని సమాధి చెయ్యటానికి కేవలం ఆరు అడుగుల లోతు ఉండే గొయ్యి చాలు" అని. సామెత సంగతి అలా ఉంచి, సమాధి చెయ్యటానికి ఉపయోగించే గొయ్యి విషయానికి వచ్చినట్లయితే, ప్రపంచంలోని ఏ దేశంలో అయినా సరే, సాధారణంగా, సమాధి చెయ్యటానికి ఆరు అడుగుల లోతు గొయ్యిని త్రవ్వరు. భవిష్యత్తులో అదే గోతిలో ఇంకా మూడో, నాలుగో శవ పేటికలను సమాధి చెయ్యాలి అని నిర్ణయించుకున్నప్పుడు – ఆరు అడుగుల గొయ్యిని త్రవ్వి అందులో మొదట ఒక శవ పేటికను పాతి పెడతారు. ఆ తరువాతకాలంలో ఆ శవ పేటికపైన ఇంకొక శవ పేటికను ఉంచి సమాధి చేస్తారు. ఆవిధంగా దాదాపు ఐదారు శవపేటికలను ఒకదానిపై ఒకటి – ఆ ఆరు అడుగుల గొయ్యి పూర్తిగా నిండే వరకు అనగా చివరి సమాధి నేల మట్టానికి సమానమయ్యే వరకు శవ పేటికలను సమాధి చేస్తూ ఉంటారు అన్నమాట.

ప్రపంచంలోని ఒక్కొక్క దేశంలో ఒక్కోవిధంగా ఈ సమాధి గోతులయొక్క లోతు ఎంత ఉండాలో నిర్ణయిస్తారు. ఉదాహరణకి – అమెరికా (U.S.A.) విషయం తీసుకున్నట్లయితే, ఆ దేశంలోని విభిన్న రాష్ట్రాలలో వేరు వేరు ప్రమాణాలు అమలులో

ఉన్నాయి. అది ఎలాగంటే...అమెరికాలోని కాలిఫోర్నియా రాష్ట్రంలో ఒక శవపేటికను ఒక గోతిలో ఉంచినప్పుడు దానిపై నుండి భూమి మట్టం వరకు మధ్య 19 అంగుళాల వరకు మట్టిని కప్పి ఉంచవచ్చు. అనగా శవ పేటికను భూమిమీద నుండి 19 అంగుళాల లోతున అనగా ఒక అడుగు మరియు 7 అంగుళాల లోతున సమాధి చేస్తారు అన్నమాట. అయితే, అమెరికాలోని ఇతర రాష్ట్రాలలో – 30 నుండి 36 అంగుళాల లోతులో ఉన్న గోతిలో శవపేటికను సమాధి చెయ్యటానికి అవకాశం ఉంటుంది. ఇంకొక ముఖ్య విశేషం ఏమంటే, కొన్ని దశాబ్దాల క్రితం వరకు అమెరికాలోని అపాలాషియా ప్రాంతంలో శవ పేటికలను 6 అడుగుల లోతు ఉన్న గోతిలో సమాధి చేస్తూ ఉండేవాళ్ళు. అందుకు కారణం ఏమంటే, శవ పేటికను సమాధి చేసే గొయ్యి తక్కువ లోతులో ఉన్నట్లయితే, సమాధి చేసిన కొంతకాలం తరువాత ఎలుకలు, పందికొక్కులు లాంటి జీవులు ఆ నేలలో బొరియలు చేస్తున్న సమయంలో, సమాధిలో ఉన్న శవ పేటికలకు కూడా రంధ్రాలుచేసి, ఆపై వాటిలోకి ప్రవేశించి లోపల ఉన్న మరియు అప్పటికే శిధిలం అయిపోయిన అస్థిపంజరాలను నాశనం చేయటం జరుగుతూ ఉండేది. అయితే, కొంతకాలం నుండి మృతదేహాలను – లోహంతో చేసిన శవ పేటికలలో ఉంచిగాని లేక శ్మశానంలో నేలలో గొయ్యి త్రవ్వి, ఆపై ఆ గోతిలో కాంక్రీట్ (ఇసుక + సిమెంట్ + సన్న కంకర)తో నిర్మించిన గదులలో సమాధి చెయ్యటం వల్ల – భూమిని తొలిచే పంది కొక్కులు/ఎలుకల వల్ల ఆ సమాధులకు ఏవిధమైన ప్రమాదము లేకుండా పోయింది. ఫలితంగా, మృతదేహాలను సమాధి చెయ్యటానికి ఆరు అడుగుల దాకా గోతులు త్రవ్వాల్సిన అవసరం లేకుండా పోయింది.

“తన తోటి మానవుల మృతదేహాలను సమాధి చెయ్యటం” అనే సాంప్రదాయం కేవలము మనుషులకు మాత్రమే ఉన్నదని చాలా మంది భావిస్తూ ఉంటారు. అలాంటి వారికి తెలియని ముఖ్య విషయం ఏమంటే, అరణ్యాలలో సంచరించే చింపాంజీలు మరియు ఏనుగులు – అనే రెండు రకాల జీవులు, తమ జాతికి చెందిన జీవి చనిపోయినప్పుడు ఆ జీవియొక్క మృతదేహంపై ఆకులను మరియు ఆకులతో కూడిన కొమ్మలను వేసి, ఆ మృతదేహం – రాబందులు, గ్రద్దలు లాంటి క్రూరమైన పక్షులకు మరియు ఇతర మాంసాహార జంతువులకు ఆహారం కాకుండా రక్షించుకుంటాయి. ముఖ్యంగా, ఒక ఏనుగు తన కాళ్ళ క్రిందపడి నలిగి చనిపోయిన ఒక మానవ స్త్రీ మరియు ఆమె యొక్క బిడ్డ మృతదేహాలపైన కొన్ని ఆకులను కుప్పలాగా కప్పి, ఆపై అక్కడ నుంచి వెళ్ళిపోతుంది. దాదాపు 6 సంవత్సరాల క్రితం అంతర్జాలంలో

(ఇంటర్నెట్) ఒక వీడియో బాగా వైరల్ అయ్యింది. ఆ వీడియోలోని ఆశ్చర్యకరమైన అంశం ఏమంటే, ఒక తల్లి కుక్క – చనిపోయిన తన పిల్ల కుక్క యొక్క మృతదేహంపై తనయొక్క ముక్కు/మూతి భాగంతో ప్రక్కనే ఉన్న ఇసుకని ఎంతో శ్రమపడి నెట్టింది. అనగా, తన బిడ్డ మృతదేహానికి ఇసుకతో సమాధి కట్టింది అన్నమాట. ఈ వీడియోని విశ్లేషించిన కొందరు పశు వైద్యులు (వెటర్నరి డాక్టర్స్) ఇలా చెప్పారు. అది ఏమిటంటే, “కుక్కలు, సాధారణంగా తమ ఆహారాన్ని నేలలో ఒకచోట కప్పి ఉంచి తమకు అవసరం అయినప్పుడు ఆ మట్టిని త్రవ్వి లోపల దాచిన ఆ ఆహారాన్ని ఆరగిస్తాయి. ఇంటర్‌నెట్‌లో వైరల్ అయిన వీడియోలో కూడా అలాంటి సంఘటనే జరిగిందని, అంతేగాని, కుక్క పిల్లని దాని తల్లి మట్టిలో సమాధి చెయ్యలేదని”. ఇక, చీమలు, చెద పురుగులు లాంటి కీటకాల విషయానికి వస్తే – అవి వాటి జాతిలోని ఇతర కీటకాల యొక్క మృతదేహాలను తాము కట్టే పుట్టలలో సమాధి చేస్తూ ఉంటాయని శాస్త్రజ్ఞులు కనుగొన్నారు.



# 7. హైందవ మతంలో పునర్జన్మ సిద్ధాంతం?

‘పునర్జన్మ’ అనగా మళ్ళీ జన్మించుట అని అర్ధం. ఒక మనిషి పుట్టిన తరువాత ఏదో ఒక సమయంలో దేహాన్ని చాలించక తప్పదు. దేహం నశిస్తుందే కాని అందులో నివసించే ఆత్మకు చావు ఉండదు. అందువలన, దేహంలో ఉండే ఆత్మ, ఆ దేహంలో తాను ఉన్నంతకాలం చేసిన మంచి లేదా చెడు కర్మలయొక్క ఫలితాలను అనుభవించ టానికి ఈ భూమి మీద మళ్ళీ మానవ రూపంలో జన్మించటం జరుగుతుంది. దీనినే ‘పునర్జన్మ’ (Reincarnation) అని ఆధ్యాత్మికశాస్త్రంలో పిలుస్తారు.

క్రీస్తుపూర్వం 8వ శతాబ్దంలో అనగా ఇప్పటికి దాదాపుగా 28 శతాబ్దాల క్రితం రచించబడిన ‘బృహదరణ్యక’ మరియు ‘ఛాందోగ్య ఉపనిషత్తులలో పునర్జన్మలకు సంబంధించిన అతి ముఖ్యమైన సమాచారం కనిపిస్తుంది. ఈ గ్రంధాలలో చెప్పబడిన సమాచారాన్ని బట్టి చూసినట్లయితే, ఒక మనిషియొక్క మృతదేహాన్ని చితిపై దహించినపుడు, ఆ దహించిన అగ్ని నుండి వెలువడే పొగ ద్వారా – ఆ మృతదేహానికి సంబంధించిన ఆత్మ, ఆకాశంలో సంచరించే మేఘాలలోకి చేరుతుంది. అలా చేరిన ఆ ఆత్మ, ఆ మేఘాలు వర్షించినప్పుడు ఆ వర్షపు నీటితోపాటుగా భూమిమీదకి

చేరుకుని, ఆపై ఆహార పంట మొక్కలలోకి చేరుకుంటుంది. (వరి, గోధుమ, బార్లి వగైరా ఆహార ధాన్యాలు). ఆ తరువాత ఆ ఆహారం ద్వారా, ఆ ఆహారాన్ని తీసుకునే పురుషుడిలోకి ప్రవేశించి, ఆపై ఆ పురుషుడిలో ఉత్పత్తి అయ్యే లక్షలాది వీర్య కణాలలో ఏదో ఒక వీర్యకణంలోకి ప్రవేశిస్తుంది. ఆ తరువాత ఆ పురుషుడు ఒక స్త్రీతో సంభోగం జరిపినప్పుడు అతడి నుండి విడుదల అయ్యే వీర్యం ద్వారా ఆ స్త్రీ యొక్క అండాశయంలోని ఏదో ఒక అండంలోకి ప్రవేశిస్తుంది. ఆపై ఈ వీర్యకణం మరియు ఆ అండం కలిసి ఆ స్త్రీ గర్భంలో 'జీవం' ఏర్పడుతుంది. కాలక్రమంలో ఆ జీవమే పిండంగా, ఆపై శిశువుగా పరిణామం చెంది – 9 లేదా 10 నెలల తరువాత ఆ స్త్రీయొక్క గర్భం నుండి బిడ్డగా ఈ లోకంలోకి వస్తుంది.



1. శిశువు (జననం) → 2.యువకుడు → 3. వృద్ధుడు (మరణం), ఆపై దైవ లోకానికి చేరుకుని, అక్కడ నుండి మళ్ళీ శిశువు (జననం)గా జీవితాన్ని ప్రారంభిస్తుంది. – ఈవిధంగా "జనన–మరణ చక్రం"లో చిక్కుకున్న ఆత్మ, మళ్ళీ పుడుతూ మళ్ళీ చనిపోతూ – ఇలా అనంతంగా ఈలోకంలో జీవిస్తుంది. (పై **చిత్రంలో ఈ అంశం చూపించబడింది.**)

గౌతమబుద్ధుడు, ఆనాటి గయ ప్రాంతంలోని (ఈనాటి బీహార్ రాష్ట్రం) ఒక బోధి చెట్టుక్రింద (రావిచెట్టు) జ్ఞానోదయం పొందాడు. ఆ తరువాత, అతడు ఆ చెట్టు క్రిందే 7 రోజులపాటు ధ్యానంలో కూర్చుని తన గత జన్మలను గుర్తు తెచ్చుకున్నాడు. ఫలితంగా, బుద్ధుడికి "తాను ఈ జన్మలో తెలుసుకున్న మహా జ్ఞానాన్ని ప్రజలకు ఏవిధంగా అందించాలి?" అన్న పరిపూర్ణ అవగాహన ఏర్పడింది. ఆ తరువాత అక్కడి నుండి బయలు దేరాడు. తన ధర్మ ప్రచారాన్ని ప్రారంభించాడు. కాశ్మీరు ప్రాంతంలో ప్రచారంలో ఉన్న శైవ మతానికి చెందిన

'యోగవాశిష్ట' అనే గ్రంధంలో పునర్జన్మలకు సంబంధించిన ఒక కథ కనిపిస్తుంది. ఈ కథలో – గంగానది ఒడ్డున నివసించే ఇద్దరు సోదరులు, ఒకేసారి, వృద్ధులైన తమ తల్లిదండ్రులను కోల్పోతారు. తల్లిదండ్రులు పోయారన్న బాధ ఆ ఇద్దరికీ ఉన్నప్పటికీ తమ్ముడు ఆ దు:ఖాన్ని మర్చిపోలేక నిరంతరం బాధపడుతూ ఉండేవాడు. అన్న అయిన 'పుణ్యుడు', మరణించిన తన తల్లిదండ్రుల యొక్క ఆత్మలు పుణ్యలోకాలకు వెళ్ళటానికి అవసరమైన కర్మకాండలను, హోమాలను ఎంతో శ్రద్ధతో నిర్వహిస్తున్నాడు. కానీ, అతని తమ్ముడైన పవనుడు అవేమీ పట్టించుకోకుండా తన తల్లిదండ్రుల మరణాన్ని పదే పదే తలచుకుని ఒక ఏకాంత ప్రదేశంలోకూర్చుని రోదిస్తూ ఉంటాడు. తల్లిదండ్రుల కర్మకాండలను శాస్త్రోక్తంగా పూర్తిచేసిన తరువాత పుణ్యుడు తన తమ్ముడి దగ్గరకు వెళతాడు. అక్కడ, దిగులుతో క్రుంగిపోతున్న తన తమ్ముడు పవనుడిని ఓదార్చి, ఆపై అతడికి ఆత్మ గురించి, మోక్షం గురించి, పునర్జన్మల గురించి వివరిస్తాడు. ఆ సందర్భంలో పుణ్యుడు ఇలా చెబుతాడు. "నీ తల్లిదండ్రులు చనిపోయి, నీకు లేకుండా పోయారని విచారిస్తున్నావే కానీ, వాళ్ళు మళ్ళీ మళ్ళీ ఈ భూమిపై మానవ రూపంలో జన్మించి అనేక రకాల కష్టాలను అనుభవించాల్సిన పని లేకుండా, పునర్జన్మ రహితమైన మోక్షలోకానికి వెళ్ళారని ఎందుకు గ్రహించలేక పోతున్నావు?. ఈ బంధాలన్నీ ఒక "మాయ" అని గ్రహించు. భగవద్గీతలో శ్రీకృష్ణుడు ఏం చెప్పాడో గుర్తుకు తెచ్చుకో – జ్ఞాని అయిన వాడు, మరణించిన వారి గురించి లేదా జీవించి ఉన్న వారి గురించి ఏమాత్రం బాధ పడడు.

నీ తల్లి చనిపోయిందని బాధపడుతున్నావు. కానీ. నీ తల్లి ఇంతకు ముందు ఎత్తిన జన్మలలో ఆమెకు ఎంతమంది కొడుకులుగా పుట్టి ఉంటారో ఊహించు?. నీ తండ్రి నీకు కాకుండా పోయాడని విచారిస్తున్నావు. నీ తండ్రి, ఆయన గత జన్మలలో ఎంతమంది కుమారులకు తండ్రి అయి ఉంటాడో ఆలోచించుకో?. నీకు మరియు నాకు ఈ జన్మలో తల్లిదండ్రులు అయిన ఆ స్త్రీ, పురుషులు గతజన్మలో మనకి ఏవిధంగానూ సంబంధం లేని వారు అయి ఉండవచ్చు అని నీవు ఎందుకు ఆలోచించవు?. నీవు గాని, నేను గాని – మన గతజన్మలలో ఎందరో తల్లులకు కొడుకులుగా జన్మించి ఉంటాము. అలాంటప్పుడు ఈ జన్మలో మనని కన్న తల్లిని మాత్రమే మనకు శాశ్వతమైన, లేదా ఏకైక తల్లి అని ఎందుకు అనుకోవాలి?. ఒక మామిడి చెట్టు ప్రతి వేసవిలోనూ వేలాది పండ్లను ఉత్పత్తి చేస్తుంది. అదేవిధంగా, మనం అనేక జన్మలలో అనేకమంది స్నేహితులను మరియు బంధువులను కలిగి ఉంటాము.

ఎవరు తల్లి? ఎవరు తండ్రి? ఎవరు అన్న? ఎవరు తమ్ముడు? ఎవరు అక్క? ఎవరు చెల్లి? ఎవరు బంధువులు? – ఒక మనిషి చనిపోయిన మరుక్షణం వీళ్ళెవరితో ఆ మనిషికి సంబంధం ఉండదు. ఒక సుడిగాలి బలంగా వీచి, ఒక ప్రాంతంలో ఉన్న దుమ్ముధూళిని ఏవిధంగా దూరంగా విసరివేస్తుందో, అలాగే ఒక మరణం – ఒక వ్యక్తియొక్క సమస్త బంధాలను తొలగించి వేస్తుంది.

మొదట “నేను ఎవరు?” అని ఒక్కసారి లోతుగా ఆలోచించు. అనేక వందల ఎముకలతో నిర్మితమైన అస్థిపంజరం నేనా?, కిలోలకొద్ది మాంసం మరియు రక్తంతో నిండిన దేహం నేనా? – అని నిన్ను నీవు ప్రశ్నించుకో. ఈ శరీరం నీవు కాదు. అందువలన ఈ శరీరంతోపాటు వచ్చే అన్ని బంధాలు, బంధుత్వాలు నీ శరీరానికే గాని, నిజమైన ‘నీవు’ అని పిలువబడే నీ ఆత్మకు వర్తించవని గుర్తించు. అతి చిన్న పరిమాణంలో ఉండే ఎర్ర చీమ, ఆరు నెలలు మాత్రమే ఆయుర్దాయాన్ని కలిగి ఉంటుంది. ఆ చీమ, నివాసం ఉండే చెట్టు కొన్ని వందల సంవత్సరాల ఆయుర్దాయం కలిగి ఉంటుంది. అయితే, అటు చీమ అయినా ఇటు చెట్టు అయినా తమ ఆయుర్దాయం పూర్తి అయిన తరువాత, తమయొక్క రూపాన్ని లేదా దేహాన్ని వదిలిపెట్టి వెళ్ళిపోక తప్పదు. ఈవిధంగా పుణ్యుడు, మనిషియొక్క జన్మల రహస్యం గురించి, బంధాల గురించి వివరంగా చెప్పే సరికి పవనుడు తన దు:ఖాన్ని వదిలిపెట్టి జ్ఞానంతో ప్రకాశించాడు. యోగవాశిష్ట గ్రంథంలోని ఉపశమ అనే ప్రకరణంలో దాదాపు రెండు అధ్యాయాలలో పైన పేర్కొన్న ఆధ్యాత్మిక సత్యాలు వివరించబడ్డాయి.

**మాంసాహారాన్ని నిషేధించటానికి మూల కారణం పునర్జన్మలా?**

“పాపకార్యాలు చేసినవాళ్ళు ఆ చెడు కర్మని అనుభవించటంకోసం కోళ్ళు, కుక్కలు, పందులు లాంటి జంతువులుగా, పక్షులుగా జన్మిస్తారు” అన్న విషయం ప్రపంచంలోని చాలా మతాలలో చెప్పటం జరిగింది. అయితే, మాంసాహారం తినేవాళ్ళకి తాము తింటున్న కోడి లేదా పంది లేదా మేక లాంటి జీవి, గతజన్మలో తమ తండ్రో లేక తాతో అయి ఉండవచ్చని తెలిసే అవకాశం ఉండదు. ఆ విషయం తెలియకుండా, మళ్ళీ జన్మ ఎత్తిన తన దగ్గర బంధువుని తినటం వల్ల, ఆ తిన్న వ్యక్తికి చెడుకర్మ అనగా పాపం చుట్టుకుంటుందని ప్రాచీన గ్రీసు దేశానికి చెందిన పైథాగరస్ అనే మహా వేదాంతి పేర్కొన్నాడు. ఆ కారణంగానే, ఆయన మాంసాహారాన్ని తిరస్కరించి, శాఖాహారాన్ని స్వీకరించటమే కాకుండా మాంసాహారం తీసుకోవటంవల్ల

అకారణంగా పాపాన్ని మూట కట్టుకోవలసి వస్తుందని ఉద్ఘాటించాడు.

కొంతమంది మాంసాహార ప్రేమికులు మరియు హైందవ మతం, ప్రబోధించే శాఖాహారాన్ని ద్వేషించే హేతువాదులు (నిజానికి ఈ హేతువాదులు ద్వేషించేది హిందూ మతాన్ని మాత్రమే అని గుర్తించాలి. అయితే, నేరుగా హిందూ మతాన్ని విమర్శించటానికి అవకాశం దొరకనప్పుడు హిందూమత ఏకైక ఆహారం అయిన శాఖాహారాన్ని వివమర్శిస్తారు.) శాఖాహారుల్ని ఇలా తీవ్రంగా ప్రశ్నిస్తారు. వారి ప్రశ్నలు ఇలా ఉంటాయి.

1. మాంసాహారం తినే వాళ్ళు, నేలపై తిరిగే కోడి దగ్గర నుండి గేదెలు, పందులు, మేకలు, జింకలు, నెమళ్ళు, పిల్లులు (చైనా జాతీయులు ఆరగిస్తారు.) లాంటివి చంపటం వల్ల పాపం వస్తుందని మరియు వాటిని కోసేటప్పుడు అవి విపరీతమైన నరకయాతన అనుభవిస్తాయని, అది చాలా తప్పని "శాఖాహారాన్ని" బలపరచేవారు చెబుతున్నారు. మరి, శాఖాహారులు ఏ హింసా లేకుండానే ఆహారాన్ని పొందుతున్నారా? – తోటకూర, పాలకూర, మెంతికూర లాంటి మొక్కలకి ప్రాణం ఉండదా? మరి, వాటిని నిర్ధాక్షణ్యంగా పీకి, వివిధ రకాలుగా వండుకుని ఎలా తింటున్నారు? చెట్లకు కాసే కాయలు చెట్లలలోని భాగాలే కదా? – అలాంటప్పుడు ఆ కాయలను నిర్మొహమాటంగా ఎలా కోసుకుని తింటున్నారు? మరి, హింస లేకుండా శాఖాహారులే ఆహారాన్ని పొందలేనప్పుడు, మాంసాహారులు హింసలేకుండా మాంసాహారాన్ని ఎలా పొందగలరు?.

హేతువాదులు అడుగుతున్న ప్రశ్నలకు జ్ఞానులైన పండితులు ఇలా సమాధానం చెబుతున్నారు.

1. శాఖాహారంగా ఉపయోగపడే మొక్కలు (తోటకూర, కొత్తిమీర, పాలకూర వగైరా మొక్కలు). ఏవిధమైన రాగద్వేషాలను కలిగి ఉండవు. అంతేకాదు, అవి అటు, ఇటు కదిలివెళ్ళే చైతన్యాన్ని కలిగి ఉండవు.

2. జంతువుల్ని వండుకోవటంకోసం చంపటానికి ప్రయత్నించినప్పుడు అవి చాలా దారుణంగా అరుస్తాయి (వాటికి ఏడవటం రాదు కనుక), వీలైతే చావును తప్పించుకోవటానికి ఏదో ఒక దిక్కుకి పారిపోవాలని కూడా ప్రయత్నిస్తాయి. కానీ, చెట్టుకి ఉన్న కాయల్ని (వంకాయలు, మామిడికాయలు, బెండకాయలు లాంటివి)

కొయ్యాలని చూసినప్పుడు ఆ చెట్లు ఏవిధమైన ఆవేదనకు గురి కావు మరియు అక్కడ నుండి పారిపోవటానికి ప్రయత్నించవు.

3. మనుషులలో, జంతువులలో నరాల వ్యవస్థ ఉంటుంది. అందువలన ఒక మనిషినిగాని, జంతువునిగాని కొంచెం గాయపరచినా – నరాల వ్యవస్థ కారణంగా ఆ బాధ ఆ జీవియొక్క మెదడుకి చేరుతుంది. ఫలితంగా, ఆ జీవి ఆ బాధను శారీరకంగా అనుభవిస్తుంది. కానీ మొక్కల్లో, చెట్లల్లో అలాంటి నరాల వ్యవస్థ లేదు. కనుక "కాకరకాయను కోస్తే– కాకర మొక్క కేకలు పెట్టదు. అరిటికాయ కోస్తే అరటిచెట్టు అరవదు" అని గ్రహించాలి.

మొత్తంమీద చూసినట్లయితే మొక్కలకు, చెట్లకు కూడా ప్రాణం ఉంటుందని ఒప్పుకోక తప్పదు. కానీ, మొక్కల్ని లేదా చెట్లని ఆహారం కోసం ఉపయోగించినప్పుడు అవి ఏవిధమైన బాధని పొందవని గుర్తించాలి. ఇంకొక ముఖ్య విశేషం ఏమంటే, ఒక జంతు కళేబరం లేదా ఒక చిన్న జీవి కళేబరం (ఒక కప్పలాంటి చిన్నజీవి) ఒక ప్రదేశంలో రెండు, మూడు రోజుల మించి ఉంటే ఆ కళేబరం నుండి భరించలేని దుర్గంధం బైటకు వస్తుంది. ఇంకా కొద్ది రోజులు అలాగే ఉంటే దాని నుండి అతి ప్రమాదకరమైన పురుగులు, ఇంకా చెప్పాలంటే భయంకర అంటువ్యాధులను ప్రసాదించే వైరస్‌లు ఉద్భవిస్తాయి. కానీ, ఒక ప్రదేశంలో కుళ్ళిపోయిన మామిడి కాయలను లేదా కుళ్లిపోయిన కూరగాయలను లేదా గుట్టలు గుట్టలుగా ఆకుకూరల్ని పడవేసినప్పుడు అతి కొద్ది రోజుల్లోనే అవి కుళ్లిపోయి, ఆపై ఎండిపోతాయి. వాటి నుండి ఏవిధమైన భరించరాని దుర్గంధమూ రాదు. వాటి నుండి ఏ చెడు క్రిములు పుట్టవు. కారణం, రక్తం మరియు మాంసం ఉన్న జీవులు మాత్రమే తమ మరణానంతరము ప్రమాదకరంగా తయారవుతాయి. అందుకే, మరణించిన జంతువుల్ని లేదా మానవుల్ని తగలపెట్టటమో లేదా సమాధి చెయ్యటమో జరుగుతుంది.

ఒక విశేషం ఏమంటే, ప్రపంచ వ్యాప్తంగా సంవత్సరానికి సుమారుగా 50 బిలియన్ల జీవులు (శాఖాహారాన్ని తీసుకునే జీవులు అన్నమాట.) కసాయి దుకాణాలలో మరియు మాంసాహారాన్ని విదేశాలకు ఎగుమతిచేసే కర్మాగారాలలో నిర్దాక్షిణ్యంగా నరికి చంపబడుతున్నాయి. ప్రస్తుతం, ప్రపంచంలోని వివిధ దేశాలలో పండించబడే ఆహార పంటల ఉత్పత్తిలో 80% పంటని అనగా ఆహారాన్ని – మాంసంకోసం పెంచబడే కోళ్ళు, పందులు, మేకలు, ఈము పక్షులు లాంటి జీవులకు ఆహారంగా

ఇవ్వటం జరుగుతున్నది. మానవులు తినవలసిన ఈ వ్యవసాయ పంటల (శాఖాహారం)లలో ఎక్కువ భాగాన్ని జంతువులకు పెట్టి, ఆపై వాటి మాంసాన్ని మనుషులు తింటున్నారు. ఫలితంగా, శాఖాహారంగా ఉపయోగించే వివిధ రకాల ఆహార ధాన్యాలు శాఖాహారులకు అందుబాటులో లేకుండా పోతున్నాయి. అనగా విపరీతమైన ధరల స్థాయికి శాఖాహారం చేరుకుంటున్నది.



# 8. ప్రాచీన ఇండో-యూరోపియన్ దేశాలలోని మతాలలో ప్రచారంలో ఉన్న 'ఆత్మ' సంబంధ విశేషాలు?

ఉత్తర భారతదేశం నుండి అట్లాంటిక్ మహాసముద్రం వరకు వ్యాపించి ఉన్న వివిధ దేశాలను ఇండో-యూరోపియన్ దేశాలు అని పిలుస్తారు. ఒక విశేషం ఏమంటే, ఈ విభిన్న దేశాలలో దాదాపు ఒకే లక్షణాలు కలిగిన మత విశ్వాసాలు మరియు సాంఘిక వ్యవస్థలు ఉన్నాయి.

ఉత్తర భారతదేశం విషయానికి వచ్చినట్లయితే, ఉత్తరభారతదేశంలోని ప్రజలు 'ఆర్యులు' అనే పేరుతో పిలువబడ్డారు. వీరి మత విశ్వాసాలకు సంబంధించిన గ్రంథాలైన నాలుగు వేదాలు - ఆర్యుల మాతృభాష అయిన సంస్కృతంలో వ్రాయబడ్డాయి. ఇంకొక విశేషం ఏమంటే... హైందవ మత సమాజాన్ని - గతకాలంలో నడిపిన మనుధర్మ సూత్రాలు, ఉపనిషత్తులు, బ్రాహ్మణకాలు, మహాభారత, రామాయణాలు ఈ సంస్కృత భాషలోనే రచించబడ్డాయి.

ఇక, ఇండో-యూరోపియన్ వర్గంలో భాగమైన ఇరాన్, పర్షియా(నేటి ఇరాక్) దేశాలలో క్రీస్తు పూర్వమే జొరాస్టర్ అనే ఒక సంచలన మత ప్రవక్త ఒక కొత్త మతాన్ని సృష్టించాడు. ఈ మతంలో యజ్ఞాలు, హెూమాలు లాంటి అగ్ని సంబంధ ఆరాధనా విధానాలు ఉండటమే కాకుండా ఆ మతానికి చెందిన దైవాన్ని అగ్ని రూపంలో ఆరాధించటం జరిగింది. ఈ జొరాస్టర్ సృష్టించిన మతం పేరు "జొరాస్టర్" మతం. ఈ మతంలోకూడా హిందూ మతానికి సంబంధించిన మత విశ్వాసాలు ప్రముఖంగా కనపడటం ఒక విశేషంగా చెప్పాలి.

ఇక, నాటి రష్యా సామ్రాజ్యానికి అనుబంధంగా ఉన్న ఉక్రెయిన్ మరియు రష్యాలోని చాలా భాగాలు, ఆస్ట్రియా, హంగేరి, జెకోస్లావేకియా, గ్రీసు, ఇటలీ లాంటి ఇండో-యూరోపియన్ దేశాలలో కూడా - హైందవ మతంలో ఉన్న విశ్వాసాలకు చాలా దగ్గరలో ఉన్న విశ్వాసాలు ఉండటం ఒక విశేషంగా గుర్తించాలి.

ఇండో-యూరోపియన్ మతాలలో ప్రచారంలో ఉన్న ఒక ప్రధాన సిద్ధాంతం ఏమంటే, "మరణించిన వ్యక్తులయొక్క ఆత్మలను పూజించటం" అని తెలుస్తున్నది. పై లోకాలలో ఉండే దేవతలు ఒక వర్గం కాగా, క్రింద లోకాలలో అనగా భూగోళానికి క్రిందుగా ఉండే లోకాలలో - చనిపోయిన మానవులయొక్క ఆత్మలు జీవిస్తాయని ఈ మతాలలో చెప్పబడింది. ఈ భావన ఆధారంగానే ఉత్తర భారతదేశంతో సహా అనేక ఇండో-యూరోపియన్ దేశాలలో 'పితృదేవతారాధన' ప్రారంభం అయ్యింది. చనిపోయిన పూర్వీకుల (తండ్రి, తాత, ముత్తాత, ఇంకా పై తరం తాతలు) యొక్క ఆత్మలు, పితృలోకం అనే ఆత్మల లోకంలో నివసిస్తాయని, సంవత్సరానికి ఒకసారి ఆ ఆత్మలు భూమి మీదకి వస్తాయని, ఆ సమయంలో ఆ ఆత్మలకు సంబంధించిన వారసులు, ఆ ఆత్మలకు తృప్తి కలిగించేవిధంగా పూజలు చేసి, ఆపై ఆ ఆత్మలకి అన్నపానీయాలు సమర్పించాలని - దాదాపు ఈ మతాలన్నింటిలోనూ బలంగా విశ్వసించబడింది.

హైందవ మతానికి సృష్టికర్తలు అయిన ఆర్యుల మత విశ్వాసాల ప్రకారం చూసినట్లయితే, ఆనాటి ఆర్యులు ఆత్మను 'ఆత్మన్' అనే సంస్కృత భాషాపదంతో పిలువటం జరిగింది. ఒక విశేషం ఏమంటే... ఈ ఆత్మలయొక్క సమూహాన్ని ఆనాటి ఆర్యులు 'పిత్రలు' లేదా 'పితరులు' అనే పేరుతో పిలిచారు. ఆనాటి జర్మన్ ప్రజలు ఆత్మను 'శ్వాస/ ఊపిరి' అనే పేరుతో పిలిచారు. మనిషి శరీరంలో శ్వాస ప్రక్రియ జరుగుతున్నంతవరకే మనిషి జీవించి ఉంటాడని, ఆ ప్రక్రియ ఆగిపోయిన మరుక్షణం మనిషి చనిపోతాడని, కనుక మనిషి శరీరంలో ఉండే ఒక అదృశ్య శక్తినే వారు 'శ్వాస' అనే పేరుతో పిలిచారు.



శ్వాస అనగా ఆత్మ అని అర్థం చేసుకోవాలి. ఇక, ఇండో–యూరోపియన్ ప్రాంతంలో ఒక భాగమైన ఇటలీకి చెందిన లాటిన్ భాషలో ఆత్మను 'అనిమా' అనే పేరుతో పిలిచారు. ఈ మాటకు అర్థం "జీవితం", "శ్వాస", "చిరుగాలి" అని.



ఇండో–యూరోపియన్ మతాలలో, ఆత్మకి ఒక రూపం ఉంటుందని భావించబడింది. ప్రాచీనకాలంలో ఈ ప్రాంతంలోని అనేక దేశాలలో – చనిపోయిన వారియొక్క ఆత్మలు, మానవ రూపాలలో కనిపించినట్లుగా ఆ కాలానికి చెందిన గ్రంథాలలో లిఖించబడింది. వీటినే ఆ తరువాతకాలంలో 'దయ్యాలు'/ పిశాచాలు' అని పిలవటం జరిగింది. దయ్యాలు అని పిలువబడే ఆత్మలు – నీడల రూపంలో లేదా నీటి ఆవిరి రూపంలో కనిపిస్తాయని, కొంతసేపటి తరువాత అవి మానవ రూపంలోకి మారతాయని ఆ కాలంలో బలంగా విశ్వసించబడింది. గతంలో ఈ ఆత్మలు భూమిమీద మానవ దేహాలలో నివసించినప్పుడు ఏ రూపాలలో ఉండేవో అవే రూపాలతో ఆ ఆత్మలయొక్క రూపాలు కూడా కనిపిస్తాయని చెప్పబడి ఉన్నది.

పితృలోకం లేదా మృతుల లోకంలో నివసించే ఆత్మలకు కూడా ఆకలి మరియు ఇతర అవసరాలు ఉంటాయని ఆనాటి ఇండో–యూరోపియన్ మతాలలో చెప్పబడింది. అయితే, ఆ ఆలోకాలలోని ఆత్మలకు తమ అవసరాలను తీర్చుకునే శక్తి ఉండదని అందువలన, అవి తమ వారసుల నుండి వాటిని పొందుతాయని భారతదేశానికి చెందిన వేదాలలో మాత్రమే కాక, ఇతర ఇండో–యూరోపియన్ దేశాలలోని మత గ్రంథాలలో కూడా చెప్పబడి ఉన్నది.

తమ పితృదేవతలకు ప్రతి సంవత్సరమూ అన్నపానీయాలను సశాస్త్రీయంగా అనగా మంత్ర పూరితంగా ఇవ్వని మానవులపై ఆ పితృదేవతలు పగపట్టి, వాళ్ళని అనేక రకాలుగా హింసిస్తాయని ఋగ్వేదంలో చెప్పబడింది. పితృదేవతలకు శార్ధకర్మలు

నిర్వహించటం ఎంత ముఖ్యమో 'శ్రీమద్రామాణ మహాగ్రంధం'లో ఉద్ఘాటించబడింది.

ఇక, జొరాస్ట్రియన్ మతానికి చెందిన 'అవెస్తా' అనే గ్రంథంలో ఇవ్వబడిన సమాచారం ప్రకారం చూసినట్లయితే, పితృదేవతలను గౌరవిస్తూ – వారికి ఒక గుప్పెడు మాంసాన్ని, ఒక కొత్త వస్త్రాన్ని ఇచ్చిన వారికి ఆ పితృదేవతలు – సంపదలు ప్రసాదిస్తారని తెలుస్తున్నది. ఇక, నాటి గ్రీసు దేశంలో – చనిపోయిన వ్యక్తులయొక్క సమాధుల మీద ఆహార పదార్థాలను, పువ్వులను ఉంచేవారు. మరికొన్నిచోట్ల ఆ సమాధులలోని ఆత్మల శాంతికోసం సమాధుల్లోకి జంతువుల రక్తాన్ని గొట్టాల ద్వారా పంపించేవాళ్ళు. చనిపోయిన వ్యక్తులయొక్క ఆత్మలకు అసాధారణమైన శక్తులు ఉంటాయని జొరాస్ట్రియన్ మతంలో చెప్పబడి ఉన్నది. (ఒక ముఖ్య విశేషం ఏమంటే ఆ జొరాస్టియన్ మతాన్ని పాటించే వారిని భారతదేశంలో 'పార్శీలు' అని పిలుస్తారు.)

చనిపోయిన వ్యక్తులయొక్క ఆత్మలను వారి వారసులు, మంత్రాలతో కూడిన విధానంలో పిలిచినప్పుడు (ఆవాహన చేస్తారు) ఆ ఆత్మలు భూమి మీదకు వచ్చి తమ వారసులు ఇచ్చిన ఆహారాన్ని స్వీకరించి, ఆపై ఆ వారసులు కోరిన కోర్కెలను తీరుస్తాయని ఈ మతాలలో బలంగా విశ్వసించబడింది. ఇంకొక విశేషం ఏమంటే, ఆనాటి పర్షియా మరియు ఇండియా దేశాలలో ఒక విచిత్రమైన విశ్వాసం ప్రచారంలో ఉన్నది. అది ఏమిటంటే...ప్రజల్ని మరియు ప్రజలయొక్క ఆస్తులను నాశనంచేసే సుడిగాలులు మరియు ఈదురు గాలులను – అశాంతితో అలమటిస్తున్న కొన్ని ప్రేతాత్మలని మరియు మానవులకు హాయిని కలిగించి, మంచి వర్షాలు కురిపించే వాయువులను – మంచివారియొక్క ఆత్మలని చెప్పబడింది.

అలాగే, ఆనాటి గ్రీసు దేశంలో, చెడు ఆత్మల ప్రతి రూపంగా చెప్పబడిన ప్రమాదకరమైన గాలులను శాంతింపచేయటంకోసం ఆ వాయువులకు నల్లమేకలను బలి ఇవ్వటం జరిగింది. ఆనాటి గ్రీసు దేశానికి చెందిన ఓడలు సముద్రంమీద ప్రయాణించే సమయంలో 'హర్పీలు' అనే పేరుగల అతి ప్రమాదకరమైన, బలమైన వాయువులు వీచేవి. వీటివల్ల ఓడలు దెబ్బతిని, నీళ్ళలో మునిగిపోయే పరిస్థితులు ఏర్పడేవి. ఇలాంటి ప్రమాదకర వాయువులు లేదా గాలులు తమ ఓడలపైకి దాడి చేసినప్పుడు ఆ ఓడలకు చెందిన నావికులు, వాటిని శాంతింపచేయటంకోసం ప్రార్థనలు చెయ్యటం, బలులు ఇవ్వటం లాంటివి చేసేవారు. నరకలోకం నుండి తప్పించుకు వచ్చిన దుష్ట స్వభావంగల ప్రేతాత్మలే ఈ హర్పీలు అని ఆనాటి గ్రీసు దేశానికి చెందిన పురాణ గ్రంథాలలో వ్రాయబడి ఉన్నది.

ఆనాటి గ్రీకులు మరియు రోమన్లు ఇంకొక ప్రత్యేక విశ్వాసాన్ని కూడా కలిగి ఉండేవారు. అది ఏమిటంటే, ఆ ప్రాంతాలలోని ప్రజలు తమ కుటుంబాలలో చనిపోయిన వ్యక్తులకు సమాధులను కట్టి, ఆ సమాధులపై చెట్లను నాటేవారు. ఆ చెట్లలలో తమ బంధువుల యొక్క ఆత్మలు సుఖంగా నివసిస్తాయని భావించేవారు. ఈనాటికీ భారతదేశంలోని అనేక గ్రామీణ ప్రాంతాలలోని హైందవులకు చెందిన సమాధులపై చెట్లు పెరుగుతూ ఉండటం మనం గమనించవచ్చు. సమాధి మీద ఉన్న చెట్టులో ఆ సమాధికి చెందిన ఆత్మ నివసిస్తుందని భావించటం జరుగుతున్నది.

ఒక విచిత్రం ఏమంటే, ఒక్కోసారి ఎవరూ పట్టించుకోని ఒక సమాధిమీద ఏ మఱ్ఱిచెట్టో, వేపచెట్టో పెరిగి, పెరిగి ఒక మహా వృక్షంగా మారటం జరుగుతుంది. ఆనాటికి ఆ చెట్టు మొదట్లో ఒక సమాధి ఉన్నది అన్న విషయం కూడా ఎవరికీ తెలియకుండా పోతుంది. ఎవరన్నా వ్యక్తులు అలాంటి చెట్ల క్రింద నిద్రపోయినప్పుడు వాళ్ళకి భయంకరమైన పీడ కలలు రావటం జరుగుతుంది. అంతేకాదు, సమాధులమీద పెరిగిన మహా వృక్షాలపైన క్రూర స్వభావంగల ప్రేతాత్మలు నివసిస్తాయని ఒక తాంత్రిక గ్రంథంలో స్పష్టంగా చెప్పబడి ఉన్నది.

చనిపోయిన మానవునియొక్క ఆత్మలు ఏవైనా జంతువుల రూపంలోనో లేదా పక్షుల రూపంలోనో భూమిమీదకు వస్తాయని అనేక ఇండో-యూరోపియన్ మతాలలో విశ్వసించబడింది. బహుశా ఆ కారణంగానే కావొచ్చు హైందవ దేశంలోని హిందువులు తమ పితృ దేవతలకు పిండాలు పెట్టినప్పుడు ఆ పిండాలను, కాకుల రూపంలో తమ పితృదేవతలు వచ్చి తినాలని భావిస్తారు. చనిపోయినవారియొక్క ఆత్మలు, పక్షుల రూపంలో వస్తాయని ఇటలీ దేశానికి చెందిన అనేక జానపద గాథలలో చాలా వివరంగా చెప్పబడి ఉన్నది.

ఇక, భారతదేశానికి చెందిన ఋగ్వేదంలో వివిధ రకాల ఆత్మలకు సంబంధించిన సమాచారం ఇవ్వబడి ఉన్నది. చెడు ఆత్మలను ఏ మంత్రాలతో, ఏ తాంత్రిక విధానాలతో లొంగ దీసుకోవాలో అధర్వణవేదంలో చెప్పబడి ఉన్నది. భూతాలు లేదా ప్రేతాలు జన సంచారంలేని ప్రాంతాలలో నక్కి ఉంటాయని, అవకాశం దొరికితే అవి, మానవులపై దాడులు చేస్తాయని, వాటి బారి నుండి తమను తాము రక్షించుకోవటం మనుషులయొక్క బాధ్యత అని అధర్వణవేదం ఉద్ఘాటించింది.

ఇక, పర్షియాకు చెందిన జొరాస్టర్ మత గ్రంథమైన అవెస్తాలో చెప్పబడిన సమాచారం ప్రకారం చూసినట్లయితే, అన్ని రకాల వ్యాధులూ చెడు ఆత్మల వల్ల

వస్తాయని తెలుస్తున్నది. అదేవిధంగా కొన్నిరకాల ఆత్మలు, మానవుల శరీరాలలో ప్రవేశించటంవల్ల మానవులకు ఎన్నటికీ నయంకాని వ్యాధులు వస్తాయని అవెస్తాలో చెప్పబడింది.

**హైందవ మతంలో అంత్యక్రియల మర్మం :**

హైందవ మతంలో అంతిమ క్రియలకు అనగా అంత్యక్రియలకు ఎంతో ప్రాధాన్యత ఇవ్వబడింది. చనిపోయిన మనిషి ఎటువంటివాడైనప్పటికీ ఆ మనిషియొక్క మృతదేహానికి శాస్త్రోక్తంగా అగ్ని సంస్కారం చెయ్యవలసి ఉంటుంది. మృతదేహానికి సరైన అంత్యక్రియలు జరగనట్లయితే ఆ మృతదేహానికి సంబంధించిన ఆత్మ, అసంతృప్తితో రగిలిపోయి ఆపై ప్రేతాత్మగా మారి ఈ లోకంలోనే సంచరిస్తూ ఉంటుంది. అలా జరక్కుండా ఉండాలంటే మృతదేహాన్ని సక్రమంగా దహనం చెయ్యాలి. అయితే కొన్ని సందర్భాలలో మృతదేహానికి అగ్ని సంస్కారం చేసే అవకాశాలు ఉండవు. అది ఎలా జరుగుతుందంటే...

1. యుద్ధంలో చనిపోయిన వ్యక్తియొక్క మృతదేహం కొన్నిసార్లు దొరకదు. అలాగే, నీళ్ళల్లో కొట్టుకుపోయి చనిపోయిన వ్యక్తియొక్క మృతదేహం కూడా దొరకదు. విమానాలు, హెలీకాప్టర్లు కూలిపోయినప్పుడు మరణించిన వారియొక్క మృతదేహాలు దొరకటం చాలా అరుదుగా జరుగుతుంది. ఒకవేళ దొరికినా – అది ఫలాన వ్యక్తియొక్క మృతదేహం అని గుర్తించే అవకాశాలు ఉండవు. అలాంటి పరిస్థితుల్లో ఒకవ్యక్తియొక్క మృతదేహానికి దహన సంస్కారాలు చెయ్యటం దాదాపు అసాధ్యం అవుతుంది. ఇలాంటి పరిస్థితుల్లో ఏం చెయ్యాలో 'భవిష్యపురాణం' అనే గ్రంథంలో వివరంగా చెప్పబడి ఉన్నది. ఆ వివరాల ప్రకారం చూసినట్లయితే....

ఒకవ్యక్తియొక్క మృతదేహం దొరకనప్పుడు అతడికి సంబంధించిన కుటుంబీకులు లేదా బంధువులు ఒక పురోహితుని సహకారంతో – 360 దర్భ పుల్లలతో ఒక బొమ్మను తయారు చేయించాలి. ఈ బొమ్మలో తల భాగానికి 40 దర్భలను, మెడ భాగానికి 20 దర్భలను, రెండు చేతులకు కలిపి 100 దర్భలను, ఛాతీ భాగానికి 20 దర్భలను, ఉదర భాగానికి 20 దర్భలను, పిరుదులు (బటక్స్) భాగానికి 30, రెండు తొడలకు 100, మోకాళ్ళకు మరియు పాదాలకు 30 దర్భలను ఉపయోగించాలి. అనగా, ఆ వ్యక్తి యొక్క బొమ్మ తయారీకి 360 దర్భలను ఉపయోగించాలి.

కొన్ని సమయాలలో దర్భలు దొరకవు. అలాంటి సందర్భాలలో... తలకు బదులు కొబ్బరియ, నోటి బదులుగా సొరకాయ, దంతాలకు బదులుగా ఏవైనా 5

రత్నాలు, నాలుకకు బదులుగా ఒక అరటిపండు, రెండు కళ్ళకు బదులుగా రెండు గవ్వలు, ముక్కుకి బదులుగా కొంత బంక మన్ను, చెవులకు బదులుగా రెండు అరిటాకులు, జుట్టుకి బదులుగా మేడిచెట్టు లేత కొమ్మలు, ప్రేగులకు బదులుగా తామర కాడల నుండి తీసిన నార, శరీరంలో ఉండే మాంసానికి బదులుగా మట్టి మరియు బార్లిగింజల పొడి కలిపి చేసిన ముద్ద, రక్తానికి బదులుగా తేనె, చర్మానికి బదులుగా దుప్పి లేదా మేకయొక్క చర్మం, బొడ్డుకి బదులుగా ఒక కలువ పువ్వు, పొత్తికడుపుకి బదులుగా ఒక వంకాయ, వస్త్రాలకు బదులుగా చెట్టు బెరడు తీసుకోవాలి. ఆపై, వీటినన్నింటినీ చితిపై పేర్చి శాస్త్రోక్తంగా దహనం చెయ్యాలి.

కొన్ని సమయాలలో ఒకవ్యక్తి తప్పిపోవటంకాని లేదా చెప్పకుండా ఇంట్లో నుండి వెళ్ళిపోవటం కాని లేదా ఎవరైనా ఆ వ్యక్తిని అపహరించుకు పోవటంకాని (కిడ్నాపింగ్) జరుగుతుంది. ఎన్నేళ్ళు గడిచినా ఆ వ్యక్తియొక్క సమాచారం అతడి ఇంట్లో వారికి తెలియదు. ఇలా 12 సంవత్సరాలపాటు ఒక వ్యక్తియొక్క ఆచూకి తెలియనట్లయితే ఆ వ్యక్తికి తప్పనిసరిగా అంత్యక్రియలు శాస్త్రోక్తంగా చేసి తీరాలని హైందవ తంత్రశాస్త్రాలు ఉద్ఘాటిస్తున్నాయి. ఒక్కోసారి, ఒకవ్యక్తియొక్క ఆచూకీ 12 సంవత్సరాల దాకా తెలియకపోవటంతో అతని కుటుంబీకులు, అతనికి పైన చెప్పిన విధానంలో ఒక బొమ్మను తయారుచేసి దానికి అంత్యక్రియలు జరుపుతారు. అయితే ఇలా జరిపిన కొంతకాలానికి ఎక్కడో ఉన్న ఆ వ్యక్తి తిరిగి వస్తాడు. అనగా బ్రతికి ఉన్న వ్యక్తికి అతడి కుటుంబీకులు అంత్యక్రియలు చేసారు అన్నమాట. ఈవిధంగా, బ్రతికి ఉన్న వ్యక్తికి అంత్య క్రియలు చేసిన కారణంగా ఆ వ్యక్తికి తీవ్రమైన చెడు జరిగే అవకాశం ఉంటుంది. అలా జరక్కుండా ఉండటంకోసం హైందవ ధర్మశాస్త్రాలలో ఒక పరిహారాన్ని చేస్తారు. అది ఏమిటంటే...

బ్రతికి ఉన్న వ్యక్తికి - కారణం ఏదైనప్పటికీ అంతిమ క్రియలు చేసినట్లయితే ఆ వ్యక్తి చనిపోయినట్లుగా లెక్క. కానీ, ఆ మనిషి నిజంగా చావలేదు. అలా అంత్యక్రియలు చేయించుకున్న దోషం ఆ వ్యక్తికి పోవాలంటే ఆ వ్యక్తి మళ్ళీ పుట్టాలి. అది సాధ్యంకాదు. కనుక దానికి ఒక పరిహారం చెప్పబడింది. అది ఏమిటంటే...ఆ వ్యక్తి మొదట ఒక స్త్రీయొక్క కాళ్ళ మధ్య నుండి దూరి ఇవతలికి రావాలి. ఆ తరువాత వివిధ రకాల సంస్కారాలు వరుసగా చెయ్యాలి. అనగా ఒక బిడ్డ పుట్టిన తరువాత నామకరణం, బారసాల ఆ తరువాత అక్షరాభ్యాసం, ఆపై ఉపనయనం...లాంటి సంస్కారాలు ఎలా చేస్తారో అలా, ఈ వ్యక్తికి కూడా సంస్కారాలు

చెయ్యాలి. కొన్ని సమయాలలో ఆ వ్యక్తికి, అవసరమైతే అతడి భార్యతో అతడికి రెండవసారి వివాహం కూడా చెయ్యాల్సి ఉంటుంది.

**అనుస్తరణి జంతువు :** ఋగ్వేదంలో మరియు అధర్వణ వేదంలో చెప్పబడిన సూత్రాల ప్రకారం చూసినట్లయితే, ఆడ మేక లేదా ఆవు యొక్క చర్మాన్ని మరియు శరీర భాగాలను సంస్కృత భాషలో "అనుస్తరణి జంతువు" అని పిలుస్తారు. ఒక మనిషియొక్క మృతదేహాన్ని దహనం చెయ్యటానికి చితిపై ఉంచి, ఆపై ఈ అనుస్తరణి జంతువు చర్మాన్ని – మృతదేహంపై కప్పుతారు. ఆపై జంతువుయొక్క శరీర భాగాలలో కొన్ని, మృతదేహంయొక్క చేతుల్లో ఉంచి, కొన్నింటిని మృతదేహం చుట్టూ ఉంచుతారు. ఆపై చితికి నిప్పు అంటిస్తారు. ఆ మానవ మృతదేహంపైన కప్పబడి ఉన్న అనుస్తరణి జంతువుయొక్క చర్మం మరియు శరీర భాగాల కారణంగా ఆ మృతదేహం తాలీకు ఆత్మకు అగ్నితాపం అనగా అగ్గి సెగయొక్క బాధ చాలావరకు తగ్గిపోతుందని తెలుస్తున్నది. కాలక్రమంలో, అనుస్తరణి జంతువును దహన ప్రక్రియలో ఉపయోగించే సాంప్రదాయం నశించిపోయింది. ఆ స్థానంలో బియ్యాన్ని ఉపయోగించటం ప్రారంభించారు. ఫలితంగా, దహనం చెయ్యటానికి ముందు మృతదేహం పైన బియ్యాన్ని ఒక పొరలాగా పరిచే సాంప్రదాయం ప్రారంభం అయ్యింది. ప్రస్తుతకాలంలో ఈ సాంప్రదాయాన్ని చాలామంది పాటించటంలేదన్నది వాస్తవం.

# 9. ప్రపంచంలోని విభిన్న మతాలలో 'పునర్జన్మ' సంబంధ విశ్వాసాలు?

హైందవులు, బౌద్ధులు, జొరాస్టియన్ మతస్తులు (పార్శీలు), ఇస్లాం మతానికి చెందిన సూఫీ వర్గంవారు, ఉత్తర మరియు దక్షిణ అమెరికా ఖండాలలో నివసించే తెగల ప్రజలు ముఖ్యంగా, లాటెన్ అమెరికా ప్రాంతంలో నివసించే మాయాజాతి ప్రజలు, పునర్జన్మ సిద్ధాంతాన్ని సంపూర్తిగా విశ్వసిస్తారు.

**షింటో మతంలో ఆత్మ :**

జపాన్‌లోని అధిక సంఖ్యాక ప్రజలు (దాదాపు 80%), షింటో మతాన్ని పాటిస్తారు. ప్రపంచంలో దాదాపు వంద మిలియన్ల షింటో మతస్తులు ఉన్నారు.

వాళ్ళలో అత్యధిక శాతం మంది జపాన్‌లో జీవిస్తున్నారు. ప్రపంచంలోని పెద్ద మతాలలో షింటో మతానికి 5వ స్థానం ఇవ్వబడింది. నిజం చెప్పాలంటే, షింటో మతం, హిందూ మతానికి చాలా దగ్గరలో ఉంటుంది. షింటో మతంలోకూడా అనేకమంది దేవుళ్ళను, దేవతలను పూజిస్తారు. ఆ కారణంగానే ఇతర మతాలకు చెందినవారు కూడా షింటో మతం మీద ఆసక్తిని పెంచుకుని, ఆపై ఆ మతంలో చేరుతున్నారు.

షింటో మతంయొక్క ప్రత్యేకత ఏమంటే – ఈ మతాన్ని పాటించేవాళ్ళు – "తాము షింటో మతాన్ని పాటిస్తున్నామని బహిరంగంగా చెప్పుకోవలసిన పనిలేదు". జపాన్ దేశంలో నివసించే ఏ షింటో మత కుటుంబంలో అయినా ఒక బిడ్డ జన్మించినప్పుడు ఆ ప్రాంతంలో ఉండే షింటో ఆలయంలోని రికార్డులలో ఆ బిడ్డపేరు చేరుస్తారు. అప్పటి నుండి ఆ బిడ్డ, షింటో మత సభ్యుడిగా గుర్తించబడతాడు. ఒకవేళ ఆ వ్యక్తి ఆప్రాంతాన్ని వదిలిపెట్టి ఇంకొక ప్రాంతానికి వెళ్ళినట్లయితే ఇతర ప్రాంతంలో ఉండే షింటో ఆలయ రికార్డులో కూడా ఆ వ్యక్తి పేరుని నమోదు చేస్తారు.

షింటో మత సిద్ధాంతాల ప్రకారం చూసినట్లయితే, ఈ సృష్టిలో ప్రతి జీవిలో మాత్రమే కాక నదులు, పర్వతాలు, ప్రదేశాలలో కూడా ప్రాణం ఉంటుంది. ఈ ప్రాణాన్ని లేదా ప్రాణశక్తిని షింటో మతంలో 'కామి' అనే పేరుతో పిలుస్తారు. కొన్ని ప్రాంతాలలో లేదా పర్వతాలలో లేదా నదులలో ఈ 'కామి' యొక్క శక్తి చాలా అధికంగా ఉంటుందని, అలాంటి ప్రాంతాలపై లేదా పర్వతాలపై ప్రజలకు విపరీతమైన ఆకర్షణ ఉంటుందని, అందువల్ల ఆ ప్రాంతాలకు ఎక్కువ మంది మానవులు వెళుతూ ఉంటారని షింటో మతం తెలియజేస్తున్నది. ఆ రకంగా చూసినట్లయితే ఆంధ్రదేశంలోని తిరుమల కొండల్లో అపారమైన ప్రాణశక్తి ఉన్నదని, ఆ కారణంగానే భారతదేశంలోని ఏ హైందవ ఆలయానికి లేనంత ప్రజాదరణ, ఆదాయము – తిరుమల ఆలయానికి మాత్రమే ఉన్నదని భావించవచ్చు. అలాగే, కామి అనే శక్తి అధికంగా ఉన్న వ్యక్తులు తోటి మానవుల్ని విపరీతంగా ఆకర్షిస్తారు. అలాంటి ఆకర్షణశక్తి ఉన్నవాళ్ళు గొప్ప నాయకులుగా గుర్తించబడతారు.

**ప్రాచీన చైనాలోని టావో మతంలో 'ఆత్మ' :**

ఒక జీవితం ముగియటానికి మరియు ఇంకొక కొత్త జీవితం ప్రారంభం కావటానికి మధ్య ఉండే తాత్కాలిక విరామమే "మరణం" అని, ప్రాచీన చైనాకు

చెందిన టావోయిజం అనే మతం తెలియజేస్తున్నది. అయితే, టావోయిస్టుల సిద్ధాంతాల ప్రకారం చూసినట్లయితే, "ఒక మనిషి చనిపోయిన తరువాత అతని ఆత్మ మళ్ళీ మానవ లోకంలో పుట్టవచ్చు లేదా మనిషికన్నా తక్కువ స్థాయికి చెందిన జంతు లోకంలో పుట్టవచ్చు. ఈ రెండూ కాకుండా, ఆకాశంలో ఉండే ఉన్నతస్థాయి లోకంలో (అనగా దేవతలు ఉండే లోకంలో) కూడా పుట్టవచ్చని తెలుస్తున్నది. ఈ సృష్టిలో ఏదీ నశించదని, నిరంతరం కొనసాగుతూనే ఉంటుందని టావోయిజం తెలియజేసింది. 'పునర్జన్మలు ఖచ్చితంగా ఉన్నాయని' టావోయిజం – తన మతాన్ని పాటించే వారికి ప్రబోధించింది.

**ప్రాచీన ఈజిప్టులో మరణానంతర జీవితం/పునర్జన్మ విశ్వాసాలు :**

ప్రాచీన ఈజిప్టు దేశంలో ప్రచారంలో ఉన్న విశ్వాసాల ప్రకారం చూసినట్లయితే – ప్రతి మనిషికి అతని రూపాన్ని పోలిన ఇంకొక అదృశ్య రూపం ఉంటుంది. ప్రతి మనిషికి ఒక "నీడ" (Shadow) ఎలా ఉంటుందో, అదేవిధంగా అతనిని పోలిన రూపం ఇంకొకటి అతని శరీరాన్ని అదృశ్యంగా అంటిపెట్టుకుని ఉంటుంది. మనిషి శరీరం ఈ భూమిమీద చెక్కు చెదరకుండా ఉన్నంతవరకు అతని "నకలు" (Double) శరీరం కూడా నిలిచి ఉంటుంది. ఈ నకలు శరీరమే, ఈజిప్టు వేదాంతంలో "ఆత్మ"గా గుర్తించబడింది. భౌతికదేహంతో సంబంధం లేకుండా ఈ 'నకలు దేహం' స్వయంగా ఏ పనీ చెయ్యలేదని భావిస్తారు. మనిషి భౌతిక దేహానికి దెబ్బ తగిలితే, ఈ నకలు దేహానికి కూడా దెబ్బతగులుతుంది. అలాగే, మనిషి భౌతికదేహం తగలబడిపోతే ఈ నకలు దేహం కూడా తగలబడిపోయి, నశించి పోతుంది. ఆ కారణంగానే ప్రాచీన ఈజిప్టు ప్రజలు – చనిపోయిన వ్యక్తులయొక్క మృతదేహాలను సమాధులలో (పిరమిడ్లు) చాలా జాగ్రత్తగా భద్రపరచటం జరిగింది. మృతదేహాలు శాశ్వతంగా చెడకుండా ఉండటంకోసం ఆ మృతదేహాలకు అనేక రకాల ఔషధీయుక్త ద్రవాలనుపూసి ఆపై వాటిపై గుడ్డలను చుట్టటం జరిగేది. ఇలా భద్రపరచబడిన మృతదేహాలను ఆ కాలంలో "మమ్మీలు" అని పిలవటం జరిగింది. ఇలా సిద్ధంచేసిన ఈ మమ్మీలను ఒక పెట్టెలో ఉంచి, ఆ తరువాత ఈ పెట్టెను పిరమిడ్ లోపలి భాగంలో భద్రపరచే వాళ్ళు. ఏ కారణంచేతైనా పిరమిడ్‌లో ఉన్న ఈ మమ్మీలు అనగా మృతదేహాలు నాశనం అయిపోతే వాటికి సంబందించిన ఆత్మలు లేదా నకలు దేహాలు (Double) కూడా నాశనం అవటం జరుగుతుందని భావించబడుతుంది.

ఈజిప్టు మతంలో చెప్పబడిన సిద్ధాంతాల ప్రకారం చూసినట్లయితే, చనిపోయిన వ్యక్తియొక్క ఆత్మ లేదా నకలు – ఈ ప్రపంచం అంతా స్వేచ్ఛగా చాలాకాలంపాటు

సంచరించి, ఆపై తన మృతదేహం దగ్గరకు తిరిగి వస్తుంది. ఈ నకలు దేహానికి కూడా ఆకలి, దప్పిక (దాహం) ఉంటుందని ప్రాచీన ఈజిప్టు ప్రజలు విశ్వసించారు. ఆ కారణంగానే, మృతదేహాలను సమాధిచేసిన పిరమిడ్ల లోపలి భాగాల్లో అనేక రకాల ఆహారపదార్థాలను, పానీయాలను కూడా ఉంచటం జరిగింది. వీటిని ఆకలితో ఉన్న నకలు దేహం ఆరగిస్తుందని నమ్మేవారు.

**చాల్డియన్లు, క్రైస్తవుల "ఆత్మ" సంబంధ విశ్వాసాలు :**

యూదు మతానికి చెందిన చాల్డియన్లు (కబల మతస్తులు) కూడా దాదాపు ఇదేవిధమైన విశ్వాసాన్ని కలిగి ఉన్నారు. మనిషియొక్క మృతదేహం నాశనం అయితే ఆ మృతదేహానికి సంబంధించిన 'నకలు దేహం' కూడా నశించి పోతుందని చాల్డియన్లు ఉద్ఘాటించారు. ఈ నకలు దేహం, ఒక్కోసారి తన మృతదేహాన్ని ఆవహిస్తుందని, అప్పుడు ఆ మృతదేహం చైతన్యవంతమై లేచి తిరుగుతుందని చాల్డియన్లు భావించారు. క్రైస్తవులలో కూడా ఇలాంటి విశ్వాసం ఉన్న కారణంగానే, మృతదేహాలను సమాధిచేసే సాంప్రదాయాన్ని అనుసరిస్తున్నారని పరిశోధకులు అభిప్రాయపడుతున్నారు. శిలువమీద ప్రాణాలు వదిలిన జీసెస్‌క్రీస్తు కూడా ఈ విధానంలోనే మళ్ళీ జీవించాడని భావిస్తారు. కానీ, హైందవ మతంలో ఇందుకు విరుద్ధమైన విశ్వాసాలు ప్రచారంలో ఉన్నాయి. చనిపోయిన వ్యక్తియొక్క ఆత్మ తిరిగి రావాలని హైందవులు ఎంతమాత్రం ఆశపడరు. ఎందుకంటే, చనిపోయిన వ్యక్తియొక్క ఆత్మ, ఇహలోక సుఖాలను అనుభవించాలనే విపరీతమైన వాంఛను కలిగి ఉంటుంది. అలాంటి వాంఛ కలిగిన ఆత్మ, మళ్ళీ తన దేహంలోకి ప్రవేశించినట్లయితే, తిరిగి బ్రతికిన ఆ మనిషి భయంకరమైన రాక్షస స్వభావాన్ని పొందుతాడు. ఆ కారణంగానే, వెళ్ళిపోయిన ఆత్మ తిరిగి తన శరీరంలోకి ప్రవేశించకుండా ఉండటంకోసమే హైందవులు మృతదేహాలను దహనం చేస్తారు. మృతదేహాన్ని దహనం చెయ్యటంవల్ల ఆ మృతదేహానికి సంబంధించిన ఆత్మకు ఆ దేహంమీద వ్యామోహం నశించిపోతుంది. ఫలితంగా, అది పై లోకాలకు వెళ్ళిపోతుంది.

**నైజీరియాలో (ఆఫ్రికా దేశం) పునర్జన్మ విశ్వాసాలు :**

ప్రపంచంలోని చాలా దేశాల్లో అతి ప్రాచీన కాలం నుండి పునర్జన్మ సిద్ధాంతాన్ని బలంగా నమ్మటం జరుగుతున్నది. ఇతర దేశాలతో పోలిస్తే, వెనకబడిన దేశాలుగా (ముఖ్యంగా విజ్ఞానపరంగా) గుర్తించబడిన ఆఫ్రికాదేశాల్లో కూడా పునర్జన్మలకు సంబంధించిన విశ్వాసాలు ప్రచారంలో ఉన్నాయి.

ఆఫ్రికాదేశాల్లో ప్రచారంలో ఉన్న సిద్ధాంతం ప్రకారం చూసినట్లయితే, ఒక మనిషి చనిపోయిన తరువాత అతని ఆత్మ, మళ్ళీ మనిషి రూపంలో జన్మిస్తుందని లేదా ఒక జంతువు యొక్క మృతదేహంలోకి ప్రవేశిస్తుందని తెలుస్తున్నది. అయితే, వ్యక్తియొక్క ఆత్మ మళ్ళీ కొంతకాలం తరువాత ఒక స్త్రీ గర్భం ద్వారా ఒక బిడ్డ రూపంలో ఈలోకంలోకి వస్తే అది పునర్జన్మ క్రింద గుర్తించబడుతుంది. ఇక, చనిపోయిన వ్యక్తియొక్క ఆత్మ ఏదైనా జంతువులోకి ప్రవేశిస్తే అది "పరకాయ ప్రవేశం" అవుతుందే కాని, పునర్జన్మ కాదని గుర్తించాలి.



ఆఫ్రికా ఖండంలోని నైజీరియా దేశంయొక్క నైరుతి భాగంలో ఉన్న కొన్ని రాష్ట్రాలలోను మరియు నైజీరియాకు సరిహద్దుగా ఉన్న కొన్ని దేశాలలోను "యోరూబా" అనే జాతికి చెందిన ప్రజలు నివసిస్తున్నారు. విచిత్రం ఏమంటే...వీళ్ళకు ఉన్న విశ్వాసాలు, చాలా వరకు భారతీయుల మత విశ్వాసాలకు దగ్గరగా ఉంటాయి. ఈ యోరూబా జాతి ప్రజలు పునర్జన్మకు సంబంధించిన ఏవిధమైన నమ్మకాలను కలిగి ఉన్నారో తెలుసుకుందాం..."మరణం" అనే భావన యెరూబా జాతి ప్రజలకు ఏమాత్రం కొత్తకాదు. ఈ భూమిమీద పుట్టిన ప్రతి జీవి తప్పనిసరిగా చనిపోతుంది. అనగా, భూమి ఏ మనిషికి శాశ్వతమైన స్థానంకాదు. స్వర్గం ఒక్కటే ఆత్మకు శాశ్వతమైన స్థానం – అని యెరూబా మత సిద్ధాంతాలు తెలియజేస్తున్నాయి. శరీరం నుండి ఆత్మ వేరు కావటమే మరణం అని ఈ జాతి ప్రజలు నమ్ముతారు. 'మరణం'లో చెడ్డ మరణం మరియు మంచి మరణం అనే రెండు రకాలు ఉంటాయని ఈ ప్రజలు నమ్ముతారు. పరిపూర్ణమైన వయస్సు వచ్చే వరకు మరియు మంచి ఆదర్శకరమైన జీవితాన్ని గడిపి, ఆపై మరణిస్తే అది మంచి మరణమని చెబుతారు. అలా మంచి మరణం పొందిన వ్యక్తుల మృతదేహాలకు ఎంతో ఘనంగా మరియు శాస్త్రీయంగా అంత్యక్రియలు నిర్వహిస్తారు. అలా చెయ్యటం వల్ల ఆ మృతదేహాలకు

సంబంధించిన ఆత్మలు మొదట పితృలోకానికి చేరుకుని అనగా పూర్వీకుల లోకానికి చేరుకుని అక్కడ కొంతకాలం నివాసం ఉండి ఆ తరువాత తమకు సంబంధించిన కుటుంబాలలో బిడ్డగా జన్మించటం జరుగుతుందని భావిస్తారు.

ఇక, చిన్న వయస్సులోనే మరణించటం, ప్రమాదాలలో మరణించటం, భయంకరమైన వ్యాధుల కారణంగా మరణించటం, బిడ్డను ప్రసవిస్తున్న సమయంలో ఆ బాధ తట్టుకోలేక మరణించటం – లాంటివి, ఆయా వ్యక్తులకు దైవాలు విధించిన శిక్షే అలాంటి మరణమని నమ్ముతారు. అలా చెడు మరణం పొందిన వ్యక్తులయొక్క ఆత్మలు, పితృలోకానికి వెళ్లవని అనగా మళ్ళీ భూమిమీద జన్మించవని నమ్ముతారు. ఆకారణంగానే అలాంటి మరణం పొందిన వ్యక్తులయొక్క మృతదేహాలను కొంతమంది మంత్రవాదులయొక్క సహకారంతో భూమిలో సమాధి చేస్తారు.

యోరూబా జాతి ప్రజలు అనేక తరాలపాటు తమ కుటుంబంలో జరిగిన జన్మలను అనగా జన్మించిన వారిని మరియు వారి స్వభావాన్ని, అలవాట్లను నిశితంగా పరిశీలించి – ఆపై పునర్జన్మలు ఉన్నాయని నిర్ధారించుకున్నారు. కొన్ని సంవత్సరాల క్రితం చనిపోయిన తమ కుటుంబానికి సంబంధించిన వ్యక్తి, మళ్ళీ తమ కుటుంబంలో జన్మించినప్పుడు – ఆ వ్యక్తి గతంలో అనగా గతజన్మలో ఏవిధమైన లక్షణాలను, అలవాట్లను కలిగి ఉండేవాడో ఈ వ్యక్తి కూడా అలాంటి స్వభావాన్నే కలిగి ఉండటం జరిగింది.

యోరోబా జాతి ప్రజల విశ్వాసాల ప్రకారం చూసినట్లయితే, పునర్జన్మలు మూడు రకాలుగా ఉంటాయని తెలుస్తున్నది. అది ఎలాగంటే... 1. చనిపోయిన వ్యక్తి అతి కొద్ది సమయంలోనే ఇంకొక మృతదేహంలో లేదా జంతువుల దేహంలో ప్రవేశించి ఆ దేహం ద్వారా భూమిమీద తిరగటం జరుగుతుంది. 2. బాగా వృద్ధాప్యం వచ్చిన తరువాత, చనిపోయిన వ్యక్తి తన కుటుంబం మీద ఉన్న ప్రేమను మర్చిపోలేక మళ్ళీ తన కుటుంబంలోనే అనగా తన మనుమడికి కొడుకుగానో, తనకు సంబంధించిన బంధువుల కుటుంబంలోనో బిడ్డగానో జన్మించటం జరుగుతుంది. 3. కొన్ని సమయాలలో ఒకవ్యక్తి మరణిస్తాడు. ఆపై అతని మృతదేహానికి అంత్యక్రియలు చెయ్యటానికి సిద్ధపడతారు. సరిగ్గా, అప్పుడే ఆ మనిషి తిరిగి బ్రతుకుతాడు. ఇది కూడా ఒకరకమైన పునర్జన్మ అని ఈ జాతి ప్రజలు నమ్ముతారు.

“పునర్జన్మ” – కొన్ని సందర్భాలలో పూర్తిగా భౌతికంగా ఉండదని యోరూబా ప్రజలు భావిస్తారు. అది ఎలాగంటే, ఒక వ్యక్తి చనిపోయిన అనేక ఏళ్ళ తరువాత ఆ

వ్యక్తికి సంబంధించిన కుటుంబీకులు ఏదైనా తీవ్ర సమస్యలో చిక్కుకుని బాధపడుతున్నప్పుడు ఆ వ్యక్తియొక్క ఆత్మ, మళ్ళీ తన కుటుంబీకులకు కనిపించి ఆపై వాళ్ళ సమస్యను తన శక్తితో పరిష్కరించి, ఆపై తిరిగి తన లోకానికి వెళ్ళిపోతుంది. ఒకవిధంగా చెప్పాలంటే, ఒక ఆత్మ ఈవిధంగా తిరిగి రావటం మరియు వెళ్ళటం కేవలం కొద్ది నిమిషాల వ్యవధిలో జరుగుతుందని భావిస్తారు. మరికొన్ని సమయాలలో ఆ వ్యక్తియొక్క వర్ధంతి రోజున (మరణించిన రోజున) ఆ వ్యక్తియొక్క ఆత్మశాంతికి పూజలు, ఆహార సంతర్పణలు లాంటివి చేస్తున్న సమయంలో ఆ వ్యక్తియొక్క ఆత్మ తన కుటుంబీకులకు రాత్రి సమయంలో స్వప్నాలలో కనిపించటం జరుగుతుంది. అదేవిధంగా భర్త చనిపోయిన స్త్రీలకు వారి భర్తలు అప్పుడప్పుడూ స్వప్నాలలో కనిపించి ఆ స్త్రీలకు ఎదురయ్యే సమస్యలకు తగిన పరిష్కారాలను సూచించటం జరుగుతుందని చెబుతారు. ఇలా తాత్కాలికంగా, ఒక ఆత్మ ఈ లోకంలోకి తిరిగి రావటాన్ని కూడా ఒకవిధమైన పునర్జన్మ అని యెరూబా ప్రజలు నమ్ముతున్నారు.

కొన్ని సమయాలలో, “కొన్ని ఆత్మలు, తాము గతజన్మలో చేసిన చెడు కర్మల యొక్క ఫలితాలను చాలా తొందరగా అనుభవించటంకోసం ఒకే తల్లికి అతి తక్కువకాలంలో అనేకసార్లు జన్మించి ఆపై వెంటనే చనిపోవటం జరుగుతుంది”. అది ఎలాగంటే...ఒక తల్లికి జన్మించిన బిడ్డ – పుట్టిన ఒక గంటకో లేదా ఒక రోజుకో చనిపోతుంది. మళ్ళీ కొద్ది రోజుల్లోనే ఆ తల్లి గర్భవతి కావటం, నెలలు నిండగానే ఒక బిడ్డను ప్రసవించటం వెంటనే ఆబిడ్డ చనిపోవటం జరుగుతుంది. ఈవిధంగా, ఒక ఐదు సంవత్సరాల వ్యవధిలోనే ఒక ఆత్మ, ఐదుసార్లు ఒక తల్లికి బిడ్డగా జన్మించి మరియు చనిపోవటం జరుగుతుంది. అనగా, పునర్జన్మలు ఎత్తటం జరుగుతుంది అన్నమాట. ఇలా ఒకటి రెండు సార్లు పుట్టిన బిడ్డలు పుట్టిన వెంటనే చనిపోతూ ఉంటే ఆ బిడ్డ తల్లిదండ్రులు – తమకు మళ్ళీ పుట్టబోయే బిడ్డలు కూడా వెంట వెంటనే చనిపోతారని ఊహించి, ఆపై రెండవసారో లేక మూడవసారో పుట్టిన బిడ్డ చనిపోయిన వెంటనే ఆ బిడ్డయొక్క ముఖంమీదో లేక పొట్టమీదో తీవ్రమైన గాయాన్ని చేసి, ఆపై ఆ బిడ్డయొక్క మృతదేహాన్ని భూమిలో సమాధిచేస్తారు. అలా ఆ మృతదేహాన్ని గాయపరచటంవల్ల ఆ మృతదేహానికి సంబంధించిన బిడ్డ ఆత్మ, తాను మళ్ళీ అదే తల్లి గర్భంలో ప్రవేశించి మళ్ళీ జన్మించాలన్న విషయం మర్చిపోతుంది. ఫలితంగా, ఇంకొక ఏదైనా ఆత్మ ఆ తల్లి గర్భంలో ప్రవేశించి బిడ్డగా పుడుతుంది. అప్పుడు, ఆ తల్లికి పుట్టిన బిడ్డ చావకుండా బ్రతికి ఉంటుంది.

ఒక విచిత్రం ఏమంటే, ఇలాంటి విశ్వాసంతోనే, కొందరు తల్లిదండ్రులు తమకు పుట్టిన ఇద్దరు, ముగ్గురు బిడ్డలు ఇలా వరుసగా చనిపోవటం గమనించి ఆపై, చివరగా పుట్టిన బిడ్డ మృతదేహంమీద గాయాలు చేసి ఆ బిడ్డ మృతదేహాన్ని సమాధి చెయ్యటం జరిగింది. అయితే, ఆ తరువాత కొద్దికాలంలోనే, ఆ తల్లిదండ్రులకు పుట్టిన బిడ్డ శరీరంమీద గాయపు మచ్చలు కనిపించాయి. (తాము, తమ బిడ్డల మృతదేహాలమీద ఏ ప్రాంతంలో గాయాలు చేసారో సరిగ్గా అదే ప్రాంతంలో, కొత్తగా పుట్టిన బిడ్డకు గాయపు మచ్చలు ఉన్నాయి.) దానితో యెరూబా ప్రజలకు ఒక సత్యం స్పష్టంగా అర్ధమయ్యింది. అదిఏమిటంటే, "ఒక బిడ్డ ఆత్మకు సంబంధించిన మృతదేహంపై గాయాలుచేసి సమాధి చేసినప్పటికీ ఆ బిడ్డ ఆత్మ, తనయొక్క శరీరం ఏ సమాధిలో ఉన్నదో గ్రహించి, ఆపై ఆ సమాధి నిర్మించిన తన తల్లిదండ్రులు ఎవరో తెలుసుకుని ఆపై వాళ్ళకే మళ్ళీ బిడ్డగా జన్మించటం జరిగింది" అని.

ఆఫ్రికాఖండంలో నివసించే 'అకురే' అనే ఆదిమానవ జాతి ప్రజల్లో కూడా పునర్జన్మ విశ్వాసాలు ఈనాటికీ ప్రబలంగా ప్రచారంలో ఉన్నాయి. వారి మతంలో చెప్పబడిన సూత్రాల ప్రకారంచూసినట్లయితే – గతజన్మలో గొడ్రాలుగా అనగా పిల్లలులేని తల్లిగా చనిపోయిన స్త్రీ ఈ జన్మలో తనకు పుట్టిన పిల్లల్ని విపరీతంగా గారాబం చేస్తుందని ఈ జాతి ప్రజలు నమ్ముతారు. అదేవిధంగా, తమ కుటుంబానికి చెందిన పూర్వీకులు మళ్ళీ తమ కుటుంబంలో జన్మిస్తారని వీళ్ళు నమ్ముతారు. ఒకవిశేషం ఏమంటే, కుటుంబంలోని ఒక పూర్వీకుడు మళ్ళీ జన్మించినప్పుడు ఆ జన్మించిన బిడ్డకు పూర్వీకుడియొక్క శారీరక రూపం, మనస్తత్వం రావటం మాత్రమే కాకుండా ఆ పూర్వీకుడి శరీరంపైన ఎక్కడెక్కడ పుట్టుమచ్చలు ఉండేవో, సరిగ్గా అక్కడే అలాంటి పుట్టు మచ్చలు కూడా ఉండటం జరుగుతుంది. ఇలాంటి అనుభవాలు అనేకసార్లు ఎదురుకావటంతో అకురె జాతి ప్రజలు, ఆత్మ ఉన్నదని నమ్మటమే కాకుండా పునర్జన్మ సిద్ధాంతాన్ని కూడా బలంగా నమ్మటం జరుగుతున్నది.

**ఆఫ్రికాలో జరిగిన యదార్ధ పునర్జన్మ మరియు ఆత్మ వృత్తాంతములు :**

క్రీ.శ. 2015వ సంవత్సరంలో, అమెరికాకు చెందిన ఒక పారాసైకాలజిస్ట్ ఆఫ్రికా ఖండంలో అకురె జాతి ప్రజలు నివసిస్తున్న అనేక ప్రాంతాలకు వెళ్ళి అక్కడ "పూర్వజన్మ సిద్ధాంతం" ఎంతవరకు ప్రచారంలో ఉన్నది? అన్న విషయాన్ని అధ్యయం చేసాడు. ఆ అధ్యయనంలో అతడికి ఎన్నో ఆసక్తికరమైన విషయాలు తెలిసాయి. అలాంటి

వాటిలో, యదార్ధంగా జరిగిన ఒక ప్రేతాత్మ మరియు ఒక పునర్జన్మ వృత్తాంతాన్ని ఆ పారాసైకాలజిస్ట్ మనకి ఇలా తెలియజేస్తున్నాడు.

క్రీ.శ. 1953లో అనగా డేల్ఓగున్సోలా అనే వ్యక్తి, ఐదు సంవత్సరాల బాలుడిగా ఉన్నప్పుడు అనగా ఒకటవ తరగతి చదువుతున్నప్పుడు అతడి తల్లి "ఘనా" దేశంలోని ఒక పట్టణంలో ఒక చిన్న వ్యాపారం చేస్తూ ఉండేది. ఒక శనివారం మధ్యాహ్నం 12.30 నిమిషాలకు అతడి తల్లి, చెల్లెలయిన డోనా అనే అమ్మాయి తన అక్కయ్య దుకాణానికి వెళ్ళింది. ఆపై తన అక్కతో ఇలా చెప్పింది. "మన నాన్నకి చాలా అనారోగ్యంగా ఉన్నది. నిన్ను చూడాలని నాన్న ఆశపడుతున్నాడు. అందువల్ల నేను నిన్ను వెంటపెట్టుకుని మన గ్రామానికి తీసుకువెళ్ళటానికి వచ్చాను". ఆ తరువాత ఆ అక్క, గ్రామం నుండి తన దగ్గరకు వచ్చిన చెల్లెల్ని వెంటపెట్టుకుని తన ఇంటికి వెళ్ళింది. ఆ తరువాత ఐదు సంవత్సరాల తన కొడుకు డేల్ మరియు చెల్లెలుతో కలిసి తన గ్రామానికి బయలుదేరింది. మొదట, వాళ్ళు ఆ గ్రామానికి పాతిక కి.మీ. దూరంలో ఉన్న ఒక పట్టణానికి చేరుకున్నారు. అప్పటికి బాగా పొద్దుపోయిన కారణంగా, వాళ్ళు ఆ పట్టణంలోని ఒక హెూటల్లో ఆ రాత్రికి బస చేసారు. మర్నాడు ఉదయం వాళ్ళు ముగ్గురూ ఒక అద్దె కారులో వాళ్ళు వెళ్ళాల్సిన గ్రామానికి చేరుకున్నారు. ఇంట్లోకి ప్రవేశించటానికి ముందు ఆ చెల్లెలు, తన అక్కవైపు ఒకసారి విచిత్రంగా చూసి "నాకు బైట కొంచెం పని ఉన్నది. నేను వెళ్ళి ఆ పని చూసుకుని పది నిమిషాల్లో తిరిగి వస్తాను. ఈ లోపల నీవు నీ కొడుకుని, నీ లగేజిని తీసుకుని ఇంట్లోకివెళ్ళు" అని చెప్పి, కన్నుమూసి తెరిచేలోగా అక్కడ నుండి నడుచుకుంటూ ప్రక్కనే ఉన్న చెట్లవైపు వెళ్ళిపోయింది. ఇక చేసేది లేక ఆమె, తన లగేజితో మరియు తన కొడుకుతో కలిసి తండ్రి ఇంట్లోకి ప్రవేశించింది. ఆమె ఇంట్లోకి వెళ్ళేసరికి ఆమె తండ్రి ప్రశాంతంగా కూర్చుని ఉన్నాడు. అతడిలో జబ్బుపడిన లక్షణాలు ఏవీ కనపడటంలేదు. దాంతో ఆమెకు ఎంతో ఆశ్చర్యం వేసింది. ఆపై, ఆమె తన తండ్రి దగ్గరకువెళ్ళి అతనితో ఇలా అన్నది. "నిన్న మధ్యాహ్నం 12.30 నిమిషాలకు నా దుకాణం దగ్గరకు నా చెల్లెలు వచ్చింది నీకు తీవ్రమైన అనారోగ్యం వచ్చిందని, అందుకని నన్ను వెంటపెట్టుకుని ఇక్కడికి తీసుకురావటానికి వచ్చానని చెప్పింది. మరి, నువ్వు ఆరోగ్యంగానే ఉన్నావు కదా. నా చెల్లెలు నాతో ఎందుకు అలా చెప్పింది?".

ఆమె చెప్పిన మాటలు విన్న ఆమె తండ్రి ఒక్కసారిగా నిర్ఘాంతపోయాడు. ఆపై అతడు, ఆమెతో ఇలా అన్నాడు. "నిన్న మధ్యాహ్నం నీ చెల్లెలు నీకు కనిపించింది

అని చెప్పావు. కానీ, నిన్న మధ్యాహ్నం అదే సమయానికి నీ చెల్లెలు మన ఇంట్లో పాము కరిచి చనిపోయింది. ఆమె మృతదేహాన్ని నువ్వు వచ్చేదాకా ఉంచటం సాధ్యంకాదని భావించిన నేను ఆ మృతదేహాన్ని మన ఇంటికి ప్రక్కనే ఉన్న తోటలో సమాధి చేసాను. నీకు నమ్మకం లేకపోతే నాతోపాటు రా. నిన్న సాయంత్రం నీ చెల్లెలుకి నేను కట్టిన సమాధిని చూపిస్తాను". ఇంతలో ఆమె తల్లి మరియు ఇతర బంధువులు అక్కడికి వచ్చారు. ఆ తరువాత వాళ్ళు అందరూ ఆమెను వెంటపెట్టుకుని అక్కడికి దగ్గరలో ఉన్న ఒక యూకలిప్టస్ చెట్ల తోటలోకి వెళ్ళారు. ఆ చెట్ల మధ్యలో ఒకచోట కొత్తగా కట్టిన సమాధి కనిపించింది. ఆ సమాధిమీద ఆమె చెల్లెలు ఫోటో పెట్టి ఉన్నది.

డేల్‌ఓగున్‌సోలా యువకుడిగా ఉన్నప్పుడు అతడికి ఎదురయిన ఒక పునర్జన్మ అనుభవం గురించి అతడు ఇలా చెప్పాడు...

మా అక్కయ్యకు 20వ సంవత్సరం జరుగుతున్నప్పుడు తొలిసారిగా ఒక ఆడ బిడ్డ పుట్టింది. అలా పుట్టిన బిడ్డ, కొద్ది గంటల్లోనే చనిపోయింది. మా ప్రాంతంలోని సాంప్రదాయం ప్రకారం, అలా పుట్టిన వెంటనే చనిపోయిన బిడ్డయొక్క శరీరంపై ఏదైనా గాయం చెయ్యటం జరిగితే ఆ బిడ్డ ఆత్మ మళ్ళీ జన్మించదని నమ్ముతారు. అందువలన, మా అక్కకి మొదట పుట్టిన చనిపోగానే ఆ బిడ్డ మృతదేహం కుడిచేయి యొక్క చిటికెన వేలుని నరికి అవతలపారేసి, ఆ తరువాత ఆ మృతదేహాన్ని సమాధి చేసారు. ఈ సంఘటన జరిగిన 18 నెలలకు మా అక్కయ్యకు రెండవ ఆడపిల్ల పుట్టింది. విచిత్రం ఏమంటే, ఆ పుట్టిన బిడ్డకి కుడిచేయి చిటికెనవేలు లేదు. ఆ బిడ్డ ఎలాగో రెండు సంవత్సరాలు బ్రతికి ఒకరోజు అర్ధరాత్రి చనిపోయింది. మళ్ళీ, సాంప్రదాయం ప్రకారం ఆ బిడ్డయొక్క కుడికాలి బొటనవ్రేలుని నరికి, ఆ తరువాత ఆ బిడ్డ మృతదేహాన్ని సమాధి చేసారు. మళ్ళీ కొంతకాలానికే మా అక్కకి మూడవ ఆడ పిల్ల పుట్టింది. ఆ బిడ్డకి కుడికాలు బొటన వ్రేలు లేదు. కుడి చేయి చిటికెన వ్రేలు లేదు. చచ్చిపోయిన బిడ్డే మళ్ళీ పుట్టిందని వాళ్ళు అర్ధంచేసుకున్నారు. కొద్ది రోజులకే ఆ బిడ్డ చనిపోయింది. అప్పుడు వాళ్ళు ఆ బిడ్డ మృతదేహానికి ఉన్న కుడి చెవిని నరికి ఆపై ఆ బిడ్డ మృతదేహాన్ని సమాధి చేసారు. మళ్ళీ కొన్నాళ్ళకు మా అక్కకి ఆడపిల్ల పుట్టింది. ఈ పిల్లకి కుడికాలు బొటనవ్రేలు, కుడిచేయి చిటికెనవ్రేలు, కుడివైపు చెవి లేవు. ఈసారి, ఆ బిడ్డ పుట్టగానే చావలేదు. 23 సంవత్సరాల వయస్సు వచ్చేదాక బ్రతికింది. ఆ సమయంలో ఆమె ఒక యూనివర్శిటీలో పోస్టుగ్రాడ్యుయేషన్ కూడా

చేసింది. ఆమెకి వివాహం చెయ్యాలి అనుకుంటున్న సమయంలో ఒక రోజు రాత్రి సమయంలో ఆమెకు విపరీతమైన తలనొప్పి వచ్చింది. ఆపై ఆమె, కొద్ది గంటలకే మరణించింది. గతజన్మ చెడుకర్మల ఫలితాలను వెంట వెంటనే అనుభవించటంకోసం నాలుగుసార్లు పుట్టిన బిడ్డ, ఆమె అని నాకు, మా బంధువులకు ఆ క్షణం స్పష్టంగా అర్ధమయ్యింది. మొత్తంమీద, ఆధునిక సైన్స్ తెలుసుకోవలసిన విషయం ఏమంటే, అనాగరికులు అని భావించబడుతున్న యెరూబా మరియు అకురె లాంటి జాతుల ప్రజలు తమకు స్వీయ అనుభవంలో ఎన్నో అనుభవాలు ఎదురైన తరువాతే వాళ్ళు "పునర్జన్మలు" నిజంగా ఉన్నాయని నమ్ముతున్నారు అని.



# 10. "పునర్జన్మ" సిద్ధాంతాన్ని బలపరచిన కొన్ని యదార్ధ వృత్తాంతాలు–ఇండియా?

### 1. నరేష్ కుమార్ పునర్జన్మ వృత్తాంతము :

ఉత్తర ప్రదేశ్ రాష్ట్రంలోని లక్నో జిల్లాలో ఉన్న కాకోరి పట్టణానికి దాదాపు 5 కి.మీ. దూరంలో ఉన్న బాజ్‌నగర్ అనే ఒక చిన్న గ్రామంలో 1981 ఫిబ్రవరి నెలలో – గురుప్రసాద్ మరియు బిస్వానా అనే దిగువ మధ్య తరగతి బ్రాహ్మణ దంపతుల యొక్క మూడవ కుమారుడిగా నరేష్‌కుమార్ జన్మించాడు. ఈ బిడ్డకు, పుట్టినప్పుడు ఛాతీ మధ్యభాగంలో ఇంకా చెప్పాలంటే, ఛాతీకి కొద్దిగా కుడివైపున ఒక గుంటలాగా కనిపించే నొక్కు ఉన్నది.

నరేష్, రెండు సంవత్సరాల బాలుడిగా ఉన్నప్పుడు అనగా అతనికి అప్పుడప్పుడే మాటలు వస్తున్న సమయంలో అన్నమాట. అతడు రోజులో అనేకసార్లు – "కాకోరి"–"కాకోరి"–"కాకోరి" అనేవాడు. అంతేకాకుండా, అప్పుడప్పుడూ "కార్కా", "కార్కా" అని అంటూ ఉండేవాడు. "కార్కా" అనగా ఆ ప్రాంతంలో మాట్లాడే స్థానిక భాషలో 'జట్కాబండి' అని అర్ధం. పసిబాలుడైన నరేష్ అనే మాటల వెనకాల ఉన్న అర్ధం ఏమిటో, అతడి తల్లిదండ్రులకు ఏమాత్రం అర్ధమయ్యేదికాదు. ఒక విశేషం ఏమంటే, నరేష్ తన ఇంట్లో ఉన్న మంచం యొక్క ఒక అంచుకి ఒక తాడుని కట్టి ఆపై ఆ మంచంమీద కూర్చుని ఆ తాడుని చేత్తో పట్టుకుని, తాను గుర్రపు బండిని నడుపుతున్నట్లుగా నటించేవాడు. అంతేకాకుండా, మధ్య మధ్యలో – బండి లాగుతున్న

గుర్రాన్ని బండివాడు ఏవిధంగా అయితే “ఛల్”, “ఛల్” అని అదిలిస్తాడో అదేవిధంగా నరేష్ కూడా మంచానికి కట్టిన తాడుని గుర్రం కళ్ళెంలాగా లాగుతూ ఛల్ ఛల్ మని అరుస్తూ ఉండేవాడు. ఇంకొక విశేషం ఏమంటే, నరేష్ అప్పుడప్పుడూ కొన్ని ఉర్దూ పదాలను కూడా మాట్లాడుతూ ఉండేవాడు. నిజానికి నరేష్ కుటుంబంలో ఎవరికీ ఉర్దూ భాషలో ఒక్క పదం కూడా రాదు.

ఆ తరువాత కొంత కాలానికి నరేష్ నడవటం ప్రారంభించాడు. ఆ సమయంలో ఆ గ్రామానికి భిక్షాటనకోసం వచ్చిన ఫకీర్‌హైదర్‌ని చూసి నరేష్ కేరింతలు కొడుతూ నవ్వేవాడు. అంతేకాదు, ఫకీర్‌హైదర్ ఆ గ్రామంలోని ఇళ్ళముందుకు భిక్షాటనకోసం వెళ్ళినప్పుడు నరేష్ కూడా ఫకీర్‌హైదర్ ఆలీ వెంట వెళ్ళేవాడు. అతనితోపాటు నాలుగైదు ఇళ్ళముందుకువెళ్ళి, ఆపై తన ఇంటికి తిరిగి వచ్చేస్తూ ఉండేవాడు. ఇంకొక విశేషం ఏమంటే, నరేష్, ఆ ఫకీర్‌హైదర్‌ని “అబ్బా”(తండ్రి/నాన్న) అని పిలుస్తూ ఉండే వాళ్ళు. ఒక విశేషం ఏమంటే, ఉత్తర ప్రదేశ్‌లోని లక్నో ప్రాంతంలో ఉండే ముస్లింలు మరియు కొంతమంది హిందువులు తమ తండ్రిని “అబ్బా” అనే ఉర్దూ పదంతో పిలుస్తారు. హిందూ మతంలో పుట్టిన నరేష్ ఆ ఫకీర్‌ని ఉర్దూ భాషలో “అబ్బా” అని పిలవటం గురుప్రసాద్‌కి నచ్చలేదు. అప్పుడు అతడు నరేష్‌ని దగ్గరకు తీసుకుని అతనితో ఇలా అన్నాడు. “నీవు ఆ ఫకీర్‌ని “అబ్బా” అని పిలువ కూడదు. “బాబా” అని పిలువు. చాలా బాగుంటుంది”.



నరేష్, రెండు సంవత్సరాల బాలుడిగా ఉన్నప్పటి నుండీ మోకాళ్ళపై కూర్చుని ఇస్లాం మతస్తుల లాగా “నమాజ్”(దైవ ప్రార్ధన) చెయ్యటం ప్రారంభిం చాడు. ఆ సమయంలో ఆ ఇంట్లో వారు ఎవరైనా చూసి నరేష్‌ని కోప్పడినప్పుడు నరేశ్ అలా నమాజ్ చెయ్యటం తాత్కాలికంగా మానేస్తూ ఉండేవాడు.

క్రీ.శ.1987, ఆగష్టు నెల రెండవ వారంలో నరేశ్ తన తల్లిదండ్రులతో ఇలా చెప్పాడు. "నేను ఇస్లాం మతస్తుడిని". నరేశ్ ఇలా చెప్పినప్పుడు అతని వయస్సు 6 సంవత్సరాల పైన ఉంటుంది. అలా చాలాసార్లు నరేష్ తన గతజన్మ గురించి చెబుతూ ఉండటంతో అతడి తల్లిదండ్రులు ఏం చెయ్యాలా? అని ఆలోచిస్తున్నారు. ఆ తరువాత వచ్చిన ఒక గురువారంనాడు ఫకీర్‌హైదర్, నరేష్ ఇంటి ముందుకు వచ్చాడు. అప్పుడు నరేష్ తల్లి బిస్వానా ఆ ఫకీర్‌ని తన ఇంట్లోకి ఆహ్వానించి అతనిని ఒక కుర్చీలో కూర్చోమని చెప్పి ఆ తరువాత అతడితో ఇలా అన్నది. "బాబా! నా మూడవ కొడుకు నరేష్, ముస్లిం మతస్తుడిలాగా నమాజ్ చేస్తున్నాడు. అంతేకాకుండా, కొద్ది రోజుల నుండి, తాను గతజన్మలో ముస్లింని అని పదే పదే చెబుతున్నాడు. వాడికి ఏదైనా గాలి సోకిందేమో అని నాకు అనుమానంగా ఉన్నది. వాడి గురించి నాకు చాలా భయం వేస్తున్నది. ఏం చెయ్యాలో అర్ధంకావటంలేదు". జన్మత: ముస్లిం అయిన ఫకీర్‌హైదర్‌కి సిద్ధాంత రీత్యా "పునర్జన్మ సిద్ధాంతం" మీద నమ్మకంలేదు. అందువలన ఆ ఫకీర్, నరేష్ – గతజన్మలో ముస్లిం అనుకోలేదు. ఆపై ఆయన కాసేపు మౌనం వహించి ఆ తరువాత గంభీరమైన స్వరంతో ఆమెతో "బేటీ! నీ కొడుకు నరేష్ చాలాసార్లు 'కాకోరి' అనే పదాన్ని ఉచ్ఛరిస్తున్నాడని చెప్పావు. కనుక నీవు నీ భర్తతో కలిసి నీ బిడ్డ నరేష్‌ని వెంటపెట్టుకుని కాకోరి పట్టణానికి వెళ్ళు. ఆ తరువాత నరేష్ గతజన్మ ఇంటికి అతడిని తీసుకువెళ్ళు. అక్కడికి వెళితే నీకు అసలు విషయం ఏమిటో స్పష్టంగా అర్ధమవుతుంది" అన్నాడు. అప్పుడు ఆమె విచిత్రమైన స్వరంతో ఆ ఫకీర్‌తో "బాబా! కాకోరి పట్టణానికి వెళ్ళటం నాకు వీలు అవుతుంది. అయితే, నరేష్ యొక్క గతజన్మకు చెందిన ఇల్లు ఎక్కడ ఉన్నదో నాకు ఎలా తెలుస్తుంది?" అన్నది. అప్పుడు ఆ ఫకీర్ చిన్న స్వరంతో "బేటీ! నువ్వు నీ కొడుకుని ముందు కాకోరికి తీసుకువెళ్ళు. అతడు నిజంగా గతజన్మలో కాకోరిలో ఉన్నట్లయితే అతడు తప్పకుండా తన గతజన్మ ఇల్లు ఎక్కడ ఉన్నదో నీకు చూపిస్తాడు. ఇందులో పెద్దగా ఆలోచించాల్సినది ఏమీ లేదు" అన్నాడు.

ఆ తరువాత వచ్చిన, గురువారం ఉదయం పూట ఫకీర్‌హైదర్ ఆ గ్రామానికి వచ్చి ఆపై గురుప్రసాద్ ఇంటి ముందుకు వచ్చి భిక్షకోసం నిలబడ్డాడు. ఆ సమయంలో బాలుడైన నరేష్ వేగంగా పరుగెత్తుకుని వాకిట్లోకి వచ్చాడు. ఆ తరువాత, వాకిటి బైట నిలబడిన ఫకీర్‌హైదర్ దగ్గరకువెళ్ళి ఆపై ఉత్సాహం, ఉద్వేగం కలిసిన స్వరంతో ఆ ఫకీర్‌తో "అబ్బా! నన్ను గుర్తుపట్టలేదా. మన ఇంటి పెరట్లో ఐదు వేపచెట్లు ఉన్నాయి. నన్ను ట్రాక్టరు గుద్దింది. నన్ను నీతోపాటు మన ఇంటికి తీసుకువెళ్ళు"

అన్నాడు. అయితే ఫకీర్‌హైదర్ అందుకు అంగీకరించలేదు. నరేష్‌కి కొద్ది అడుగుల దూరంలో ఆ ఇంటి అరుగుమీద కూర్చుని ఉన్న బిస్‌వానాకి నరేష్ ఆ ఫకీర్‌తో అంటున్న మాటలు వినిపించాయి. ఆపై ఆమె, ఏదిఏమైనా సరే, నరేష్‌ని కాకోరి పట్టణానికి తీసుకువెళితే నరేష్ మాటల వెనుకాల దాగి ఉన్న అర్థం ఏమిటో తెలిసిపోతుందని నిర్ణయించుకున్నది.

ఆ మర్నాడు ఉదయం బిస్‌వానా, నరేష్‌ని వెంటపెట్టుకుని కాకోరి పట్టణానికి వెళ్ళింది. ఆ తరువాత ఆ పట్టణంలో ఒకచోట తనకు ఎదురైన ఒకవ్యక్తిని ఆపి "ఈ పట్టణంలో ఫకీర్‌హైదర్ ఇల్లు ఎక్కడో దయచేసి చెప్పండి" అని ఆ వ్యక్తిని అడిగింది. ఆ వ్యక్తి సమాధానం చెప్పేలోగానే ఆమె ప్రక్కనే ఉన్న బాలుడైన నరేష్ కొంచెం కోపంతో కూడిన స్వరంతో తన తల్లితో ఇలా అన్నాడు. "మా నాన్న ఇల్లు (ఫకీర్‌హైదర్ ఇల్లు) ఎక్కడ ఉన్నదో నాకు తెలియదా? ఇతరుల్ని మా ఇంటి చిరునామా గురించి ఎందుకు అడుగుతున్నావ్?. నాతోపాటు రా. మా ఇంటికి నేను నిన్ను తీసుకువెళతాను". ఆపై నరేష్ తన తల్లి బిస్‌వానాని వెంటపెట్టుకుని ఆ పట్టణంలో మారుమూలగా ఉన్న ఒక ప్రదేశానికి తీసుకువెళ్ళాడు. అక్కడ, రోడ్డుకి ఒక ప్రక్కగా ఉన్న ఒక ఇంటిలోకి తన తల్లితోపాటు ప్రవేశించాడు. నిజానికి, అప్పటి వరకు నరేష్‌గాని, అతడి తల్లి బిస్‌వానా కానీ ఆ ప్రాంతానికి రాలేదు. అయినప్పటికీ నరేష్ తనకు ఎంతో పరిచయం ఉన్నట్లుగా చాలా చొరవగా ఆ ఇంటికి తన తల్లిని తీసుకువెళ్ళాడు. వీళ్ళు వెళ్ళే సరికి ఫకీర్‌హైదర్ ఆ ఇంటి మధ్య గదిలో కూర్చుని ఉన్నాడు. అతడిని చూడగానే నరేష్ – ఆనందం మరియు ఉత్సాహం కలగలిసిన స్వరంతో "అదుగో మా అబ్బా(తండ్రి)" అని ఫకీర్ హైదర్‌ని తన తల్లి బిస్‌వానాకి చూపించాడు. ఆ తరువాత, వంటింట్లోంచి అక్కడకు వచ్చిన ఒక స్త్రీని చూపిస్తూ "అదిగో ఆమె నా "అమ్మీ(తల్లి)" అని ఆ స్త్రీని (ఫకీర్‌హైదర్ భార్య నజీమా) అన్నాడు.

ఆ తరువాత అక్కడకు వచ్చిన తన గతజన్మ తమ్ముళ్ళను మరియు చెల్లెళ్ళను కూడా గుర్తుపట్టాడు నరేష్. అంతే కాకుండా, తన చెల్లెలు భర్తని కూడా గుర్తుపట్టి ఆపై అతడిని "నా ప్రియమైన మహమ్మద్ ఇస్లాం! కులాసాగా ఉన్నావా?" అని అతడిని (అతడి గతజన్మ బావగారు మహమ్మద్ ఇస్లాం) ప్రేమగా పలకరించాడు. ఆ తరువాత నరేష్, ఫకీర్‌హైదర్ భార్య నజీమాతో ఇలా అన్నాడు. "అమ్మీ! ఆ గట్టుమీద కనిపిస్తున్న ఐదు ట్రంకు పెట్టెల్లో (ఇనుప రేకుతో చేసిన పెట్టెలు) ఒక పెట్టె నాది. ఆ పెట్టె తాళం చెవులు తీసుకువచ్చి నాకు ఇవ్వు" అన్నాడు. నరేష్ చెబుతున్న మాటలు

వింటున్న, అక్కడ ఉన్నవారంతా తీవ్రమైన ఆశ్చర్యానికి గురి అవుతున్నారు. ఇంతలో నజీమా ఒక తాళం చెవి తెచ్చి దానిని నరేష్‌కి ఇచ్చింది. నరేష్ తన పెట్టె దగ్గరకువెళ్ళి ఆపై ఆ పెట్టెకు ఉన్న తాళాన్ని తియ్యటానికి ముందు, ఒకసారి అక్కడ నిలబడి ఉన్నవారందరికేసి పరిశీలనగా చూసి ఆపై వాళ్ళతో ఇలా అన్నాడు. "ఈ పెట్టెలో మూడు రూపాయి బిళ్ళలు మరియు నేను, గతంలో ధరించే రూమీటోపి (సాంప్రదాయ ఇస్లాం మతస్తులు తలపై ధరించే గుడ్డ టోపి) ఉన్నాయి" అని చెప్పాడు. ఆపై నరేష్ ఆ పెట్టె తాళం తీసి పెట్టెను తెరిచాడు. సరిగ్గా, నరేష్ చెప్పినట్లే అందులో మూడు రూపాయి బిళ్ళలు మరియు రూమిటోపి ఉన్నాయి. అదిచూసి ఆశ్చర్యపోయిన ఫకీర్‌హైదర్, వణుకుతున్న స్వరంతో నరేష్, ఈ జన్మ తల్లి బిస్‌వానాతో ఇలా అన్నాడు. "నా కొడుకు ముషీర్ చనిపోయిన తరువాత మేము ఏనాడూ అతని పెట్టెను తెరవలేదు. ఆ పెట్టెలో ఆ వస్తువులు ఉన్నాయి అన్న విషయం నాకు ఇప్పటివరకు తెలియదు. అలాంటిది, బాలుడైన నీ కొడుకు నరేష్‌కి, నా కొడుకు తన పెట్టెలో దాచుకున్న వస్తువుల గురించి ఎలా తెలిసిందో నాకు అంతుపట్టటంలేదు".

ఆ తరువాత నరేష్, ఫకీర్‌హైదర్ భార్య అయిన నజీమాతో "అమ్మీ! నా చిన్న తమ్ముడు నసీం ఎక్కడ ఉన్నాడు?" అన్నాడు. ఆమె ఎంతో ఆశ్చర్యంతో నజీమ్‌వైపు చూస్తూ "నసీం తన గదిలో నిద్రపోతున్నాడు" అని చెప్పింది. వెంటనే నరేష్ ప్రక్కనే ఉన్న గదిలోకివెళ్ళి చూసాడు. ఆ గదిలో ఒక మంచంమీద నసీం పడుకుని నిద్రపోతున్నాడు. అప్పుడు నరేష్, నసీం దగ్గరకువెళ్ళి అతడిని నిద్రలేపాడు. నిద్రలేచిన నసీం, ప్రక్కనే మంచంమీద కూర్చున్న నరేష్, నసీంని కౌగలించుకుని అతని బుగ్గలమీద ముద్దులు పెట్టటం ప్రారంభించాడు. అంతలో ఆ గదిలోకి నజీమా వచ్చింది. ఆపై ఆమె నరేష్‌తో ఇలా అన్నది. "గతజన్మలో నువ్వు నిజంగా ముషీర్‌వి అయినట్లయితే నీకు ఎంతమంది అన్నదమ్ములు, అక్కచెల్లెళ్ళు ఉన్నారో చెప్పు?".

అప్పుడు నరేష్ చిన్నగా నవ్వి, ఆపై పెద్ద స్వరంతో "నాకు ఐదుగురు తమ్ముళ్ళు, ఆరుగురు చెల్లెళ్ళు ఉన్నారు. అందులో ఒక చెల్లెలు నా సవితి తల్లి (ఫకీర్‌హైదర్ చిన్న భార్య కూతురు అన్నమాట. ప్రస్తుతం ఆ చిన్న భార్య ఈలోకంలో లేదు.) కూతురు" అన్నాడు. నరేష్ ఆవిధంగా అన్ని విషయాలు ఖచ్చితంగా చెప్పే సరికి నజీమా, నిర్ఘాంతపోయింది. అయితే, ఆమె అంతటితో ఊరుకోలేదు. ఆమె – అక్కడ ఉన్న ఆరు సంవత్సరాల ఒక బాలికను చూపించి "ఈ అమ్మాయి ఎవరో చెప్పు చూద్దాం?" అన్నది. అప్పుడు నరేష్ ఆ బాలిక ముఖంలోకి పరిశీలనగా చూసి ఆ

తరువాత ఇలా అన్నాడు. “నేను చనిపోయే సమయానికి ఈ పిల్ల నీ గర్భంలో ఉన్నది” అన్నాడు. – (ఆ ఆరు సంవత్సరాల బాలిక పేరు సబియా. ఆ బాలిక ఫకీర్‌హైదర్ ఆఖరి కూతురు. ముషీర్, ట్రాక్టరు ప్రమాదంలో చనిపోయే సమయానికి ముషీర్ తల్లి నజీమా, 3 నెలల గర్భవతిగా ఉన్నది. ముషీర్ చనిపోయిన ఆరు నెలలకు నజీమా ఆ బాలికను ప్రసవించింది అన్నమాట.)

ఆ తరువాత నజీమా, నరేష్ శరీరాన్ని పరిశీలనగా చూసింది. నరేష్ తలమీద ఒక గాయపు మచ్చ కనిపించింది. నరేష్ గతజన్మలో, ముషీర్‌గా జీవించినప్పుడు ఒకరోజున, ఏ కారణంచేతో బాగా కోపం వచ్చిన నజీమా, ముషీర్ తలమీద తన చేతిలో ఉన్న పట్కారుతో బలంగా ఒక దెబ్బ కొట్టింది. కొన్నాళ్ళకు ఆ దెబ్బ తగ్గిపోయినా మచ్చమాత్రం తలమీద అలాగే మిగిలిపోయింది. ఈ జన్మలో, నరేష్ తలమీద సరిగ్గా అలాంటి మచ్చే కనపడటంతో నజీమాతో పాటుగా ఆమె కుటుంబ సభ్యులు కూడా విపరీతమైన ఆశ్చర్యానికి గురి అయ్యారు.

ఆ తరువాత ఫకీర్ హైదర్, నరేష్ చొక్కా విప్పి ఆపై అతని ఛాతీని పరిశీలనగా చూసాడు. అతని ఛాతీకి కుడివైపున నొక్కుకుపోయినట్లుగా ఒక గంటు ఉన్నది. ముషీర్, ట్రాక్టరు క్రింద పడి చనిపోయినప్పుడు ట్రాక్టరు యొక్క కుడి ముందు చక్రం అతడి ఛాతీని బలంగా నొక్కేసింది. ఫలితంగా, అతడు చనిపోయాడు. నరేష్ ఛాతీ కుడివైపున భాగంలోకూడా పుట్టుకతోనే కొంత నొక్కుకు పోయినట్లుగా ఉన్నది. ఆరేళ్ళక్రితం చనిపోయిన ముషీర్, మళ్ళీ జన్మించి తన గతజన్మ తండ్రి ఫకీర్‌హైదర్ ఇంటికి తిరిగి వచ్చాడు అన్న విషయం క్షణాల్లో ఆ కాకోరి పట్టణం అంతా ప్రాకిపోయింది. దాంతో ఆ పట్టణంలోని చాలామంది ప్రజలు ఫకీర్‌హైదర్ ఇంటికి గుంపులు గుంపులుగా వచ్చారు. వాళ్ళల్లో చాలామందిని నరేష్, పేరుపెట్టి మరీ పలకరించాడు.

ఆ తరువాత, ఆ జనం మధ్యలో నిలబడి ఉన్న ఒక మధ్య వయస్కుడి దగ్గరకువెళ్ళి అతడితో “జహీద్! నీవు నాకు ఇవ్వాల్సిన 300 రూపాయలు మా అబ్బాకి(నాన్నకి) ఇచ్చావా?” అన్నాడు. అప్పుడు ఆ జహీద్ అనే వ్యక్తి ఆశ్చర్యంతో కూడిన స్వరంతో “నీవు చనిపోయిన మూడవ రోజునే నేను 300 రూపాయలు తెచ్చి మీ అబ్బాకి ఇచ్చాను. కావాలంటే మీ అబ్బానే అడుగు” అన్నాడు. తన ఇంట్లో దాదాపు 6 సంవత్సరాల క్రితం జరిగిన సంఘటన – ఆరు సంవత్సరాల వయస్సు ఉన్న ఒక బాలుడికి, అందులోనూ తమ ప్రాంతానికి ఏనాడూ రానివాడికి, అన్య మతానికి

చెందినవాడికి తెలియటం ఫకీర్‌హైదర్ కుటుంబానికి విపరీతమైన ఆశ్చర్యాన్ని కలిగించింది. ఇంతలో ఒక వృద్ధురాలు ఆ జనంలోంచి ముందుకు వచ్చి నరేష్ ముందు నిలబడింది. అప్పుడు ఫకీర్ హైదర్ భార్య నజీమా, నరేష్ వైపు చూస్తూ "ఈ వృద్ధురాలు ఎవరో చెప్పు చూద్దాం?" అన్నది. నరేష్ ఆ వృద్ధురాలి ముఖాన్ని కొద్ది సెకన్లపాటు పరిశీలనగాచూసి ఆపై "ఈమె షఫీక్ భార్య. వీళ్ళు మసీదుకి దగ్గరలో ఉన్న బంగ్లాలో ఉంటున్నారు. నాకు తెలియదు అనుకుంటున్నావా" అన్నాడు.

ఏదిఏమైనా, ఈనాడు ఒక బ్రాహ్మణ బిడ్డగా ఉన్న నరేష్, గతజన్మలో తన కొడుకు అయిన ముషీర్ అని. ఫకీర్‌హైదర్ కుటుంబానికి స్పష్టంగా అర్థమైపోయింది. కానీ, ఆ బాలుడిని తమ బిడ్డగా తమ ఇంట్లో ఉంచుకోవటం తమ ముస్లిం సంఘంలో ఉన్న పరిస్థితులను బట్టి సాధ్యంకాదని వాళ్ళకి తెలుసు. అనగా, ఫకీర్ హైదర్ బంధువులు మరియు అతని ప్రాంతంలో నివసించే సున్నీ వర్గానికి చెందిన ఇతర ముస్లింలు – పునర్జన్మ సిద్ధాంతాన్ని ఏమాత్రం నమ్మరు. అందువల్ల వాళ్ళు, కొన్నేళ్ళక్రితం చనిపోయిన ముషీర్ ఆలీ, మళ్ళీ నరేష్ కుమార్‌గా ఒక హైందవ కుటుంబంలో జన్మించాడు అంటే అంగీకరించరు. అలాంటప్పుడు వాళ్ళు, హిందువుగా భావించే నరేష్‌ని తన దగ్గర ఉంచుకోవటం సాధ్యంకాదని ఫకీర్‌హైదర్ గ్రహించాడు.

అందుకే ఫకీర్‌హైదర్, నరేష్‌ని మంచి మాటలతో ఒప్పించి, అతడిని మళ్ళీ అతడి ఈ జన్మలోని తల్లిదండ్రులకు దగ్గరకువెళ్ళిపోయి, అక్కడే ఉండి బాగా చదువుకుని వృద్ధిలోకి రమ్మని చెప్పాడు. నరేష్ మొదట్లో కొంచెం బాధపడినా ఆ తరువాత ఈ జన్మలోని తన తల్లితో కలిసి తన ఇంటికి వెళ్ళిపోవటానికి అంగీకరించాడు. నరేష్ తన తల్లితో వెళ్ళబోతున్నప్పుడు, ఐదు రూపాయి బిళ్ళలు అతడి చేతిలో పెట్టి అతడిని క్షేమంగా వెళ్ళమని ఫకీర్‌హైదర్ బాధతో నిండిన స్వరంతో చెప్పాడు. అప్పుడు నరేష్ విచిత్రంగా నవ్వి "అబ్బా! నాకు ఇష్టమైన గుడ్డు మరియు టీ ఇవ్వకుండానే నన్ను పంపించేస్తావా?" అన్నాడు. అతడు ఆ మాట అనగానే ఫకీర్ హైదర్ మరియు అతని భార్య నజీమా ఉలిక్కిపడ్డారు. అందుకు కారణం ఏమంటే, యాక్సిడెంట్‌లో చనిపోయిన వాళ్ళ పెద్దకొడుకు ముషీర్‌కి ఉడకపెట్టిన కోడిగుడ్లు, టీ, సేమ్యా అంటే చాలా ఇష్టం. ముఖ్యంగా, ముషీర్ – ప్రతిరోజూ ఇంట్లోంచి బైటకు వెళ్ళేటప్పుడు రెండు కోడిగుడ్లు తిని, ఆపై వేడి వేడి టీ త్రాగేవాడు. ఆ విషయం గుర్తుకు రాగానే నజీమాకు అప్రయత్నంగా కళ్ళవెంట నీళ్ళు కారాయి. ఆపై, ఆమె వెంటనే వంటింట్లోకివెళ్ళి అక్కడ ఒక గిన్నెలో ఉంచిన రెండు వేయించి కోడిగుడ్లు మరియు

ఒక గ్లాసులో వేడి టీ తీసుకుని ఇవతలికి వచ్చి, ఆపై వాటిని నరేష్‌కి ఇచ్చింది. నరేష్ చాలా వేగంగా ఆ రెండు కోడిగుడ్లు తినేసాడు. పూర్తి శాఖాహారులైన తమ కుటుంబంలో పుట్టిన నరేష్, ఏదో అలవాటు ఉన్నట్లుగా ఆ కోడిగుడ్లను చాలా మామూలుగా అలా తినివెయ్యటంతో నరేష్ ఈ జన్మ తల్లికి విపరీతమైన ఆశ్చర్యం కలిగింది. ఆ తరువాత నరేష్, టీ కూడా త్రాగి, ఆ తరువాత ఫకీర్‌హైదర్ కుటుంబంలోని అందరినీ పేరు పేరునా ఆప్యాయంగా పలకరించి ఆపై తన తల్లి చేయి పట్టుకుని ఆ ఇంట్లో నుండి బైటకు వచ్చి ఆపై అక్కడ నుండి ఒక జట్కా బండిలో కూర్చున్నాడు. జట్కాబండి ముందుకు వెళ్ళిపోతూ ఉంటే నరేష్ అప్రయత్నంగా తలతిప్పి వెనక్కి చూసాడు. ఫకీర్‌హైదర్ మరియు అతడి కుటుంబ సభ్యులు, చెమ్మగిల్లిన కళ్ళతో తమ ఇంటి బైట నిలబడి నరేష్‌కి వీడ్కోలు చెబుతున్నట్లుగా చేతులు ఊపుతూ కనిపించారు.

### ముషీర్ ఆలీషా చనిపోయి – నరేష్‌కుమార్‌గా జన్మించాడా?

ఫకీర్ హైదర్ అనే ఒక మహమ్మదీయుడి యొక్క మొదటి భార్యకి పెద్ద కొడుకుగా జన్మించాడు ముషీర్ ఆలీషా. ఈ ముషీర్ తన తల్లిదండ్రులతో కలిసి కాకోరి పట్టణంలో జీవిస్తూ ఉండేవాడు. ఈ ముషీర్ యుక్తవయస్సుకి వచ్చిన తరువాత – కూరగాయలు, పండ్లు లాంటి వాటిని తన జట్కాబండి(గుర్రపుబండి)లో వేసుకుని, ఆపై వాటిని లక్నో నగరంలో ఉన్న మార్కెట్‌కి చేరవేస్తూ ఉండేవాడు. 1980 జూన్ 30వ తేదీన ఎప్పటిలాగానే ముషీర్, మామిడిపండ్లతో నింపిన తన జట్కా బండిని లక్నో పట్టణంవైపు నడుపుతున్న సమయంలో ఎదురుగుండా వేగంగా వస్తున్న ఒక ట్రాక్టరు ఈ జట్కా బండిని బలంగా గుద్దింది. ఫలితంగా, ముషీర్ అక్కడికక్కడే ప్రాణాలు వదిలాడు. ఒక విశేషం ఏమంటే, కాకోరి – లక్నో పట్టణాల మధ్యగా వెళ్ళే రోడ్డు మార్గంలో బాజ్‌నగర్ గ్రామానికి అరకిలోమీటరు దూరంలో ఈ ప్రమాదం జరిగింది.

ముషీర్ చనిపోయే సమయానికి అతని వయస్సు సుమారు 25 సంవత్సరాలు ఉంటుంది. అతను తన జీవితంలో ఏనాడూ బాజ్‌నగర్ గ్రామానికి వెళ్ళలేదు. అంతేకాదు, ఆ గ్రామంలో నివసిస్తున్న గురుప్రసాద్ కుటుంబం గురించి అతనికి ఏమాత్రం తెలియదు. అయితే, సంసార జీవితం గడుపుతున్న ఇస్లాం ఫకీర్ (యోగి) అయిన ఫకీర్ హైదర్ ఆలీ గురించి గురుప్రసాద్ కుటుంబానికి తెలుసు. అందుకు కారణం ఏమంటే, ఫకీర్ హైదర్ ఆలీ, ప్రతి గురువారంనాడు బాజ్‌నగర్ గ్రామానికివెళ్ళి ఆపై ఆ గ్రామంలోని ఇంటింటికీ వెళ్ళి భిక్షాటన చేస్తూ ఉండేవాడు. ఫకీర్ హైదర్ గొప్ప దైవ భక్తి కలిగిన యోగి అని గురుప్రసాద్ కుటుంబీకులు ఫకీర్ హైదర్‌ని

గౌరవంగా చూస్తూ ఉండేవాళ్ళు. అయితే, ముషీర్ ప్రమాదంలో చనిపోయేవరకు అతడి గురించి గురుప్రసాద్ కుటుంబానికి ఏమాత్రం తెలియదు. ఏదిఏమైనా, తాము ఎంతగానో ఇష్టపడే ఫకీర్ హైదర్ పెద్దకొడుకు యాక్సిడెంట్‌లో అన్యాయంగా చనిపోయాడు అన్న విషయం తెలుసుకున్న బాజ్‌నగర్ గ్రామస్తులు చాలామంది తమ గ్రామం నుండి బయలుదేరి ఆపై మెయిన్‌రోడ్ మీదకి చేరుకుని ఆ తరువాత ప్రమాదం జరిగిన ప్రదేశానికి వెళ్ళారు. అలా వెళ్ళిన వారిలో గురుప్రసాద్ దంపతులు మరియు గురుప్రసాద్ చెల్లెలు రుకానా కూడా ఉన్నారు.

**2. మహావీర్‌సింగ్ పునర్జన్మ వృత్తాంతము :**

ఉత్తర ప్రదేశ్ రాష్ట్రంలోని ఆగ్రా జిల్లాలో ఉన్న షంషాబాద్ పట్టణానికి దగ్గరలో ఉన్న నాగలవిక్సీ అనే గ్రామంలో క్రీ.శ.1982 అక్టోబర్ 8వ తేదీన ఒక క్షత్రియ కుటుంబంలో రెండవ బిడ్డగా మహావీర్‌సింగ్ జన్మించాడు. ఈ బిడ్డకి 12 నెలల వయస్సులోనే మాట్లాడటం వచ్చేసింది. ఈ బిడ్డకి చిన్నతనంలో జంతువులమీద, ముఖ్యంగా ఒంటెలమీద విపరీతమైన ఆసక్తి ఉండేది. రెండు సంవత్సరాల వయస్సులోనే మహావీర్, ఇంట్లో అందరికన్నా ముందు నిద్రలేచి, ఆపై తమ ఇంటి పెరటివైపున ఉండే ఆవులకు నీళ్ళు పెడుతూ ఉండేవాడు. ఈ బాలుడు అప్పుడప్పుడూ “తనకు ఒక ఒంటెను కొనిపెట్టమని” తన తండ్రిని అడుగుతూ ఉండేవాడు. ఒక విశేషం ఏమంటే, నాగలవిక్సీ ప్రాంతంలో ఏ వ్యక్తి దగ్గర ఒంటె ఉండేదికాదు. ఒక విచిత్రం ఏమంటే, కొంతమంది ఒంటెల వ్యాపారులు తమ ఒంటెలను ఇతర ప్రాంతాలలో అమ్ముకోవటంకోసం కొన్ని ఒంటెల్ని నడిపించుకుంటూ ఈ నాగలవిక్సీ ప్రాంతం మీదుగా ఇతర ప్రాంతాలకు వెళుతూ ఉండేవాళ్ళు. ఆ సమయంలో ఆ ఒంటెలు ఆ ప్రాంతంలో ఏదో ఒకచోట కాసేపు నిలబడేవి. ఆ సమయంలో బాలుడైన మహావీర్ ఆ ఒంటెల దగ్గరకువెళ్ళి ఆపై ఆ ఒంటెల్లో ఏదో ఒక ఒంటె మెడకు కట్టిన తాడుని పట్టుకుని ఆ ఒంటెను తనవైపు నడిపించాలని ప్రయత్నిస్తూ ఉండేవాడు. కాలక్రమంలో మహావీర్‌కి మూడు సంవత్సరాల వయస్సు వచ్చింది. ఆ సమయంలో, మహావీర్ తన ఇంటి వాకిట్లో నిలబడి, ఇంటిముందు ఉన్న రోడ్డుమీదుగా వెళ్లే ఒంటెలను మరియు ఆ ఒంటెలపై కూర్చుని ఉన్న ఒంటెల వ్యాపారులను పరిశీలనగా చూస్తూ ఉండేవాడు. అలా, కొందరు వ్యాపారులు వెళుతున్నప్పుడు అప్పుడప్పుడూ మహావీర్ ఆ వ్యాపారులను తన తండ్రికి లేదా తల్లికి చూపించి “ఆ వ్యాపారులు తన బంధువులని” చెబుతూ ఉండేవాడు.

మహావీర్‌కి మూడు సంవత్సరాల వయస్సు జరుగుతున్న సమయంలో ఒకరోజున తన తల్లిని తన దగ్గరకు పిలిచి ఆమెతో ఇలా అన్నాడు. "అదిగో! ఆ ఒంటెమీద కూర్చుని వెళుతున్న వ్యక్తి నా తమ్ముడి కొడుకు. ఆ ఒంటె వెనకాలే వెళుతున్న ఇంకొక ఒంటెమీద కూర్చున్న వ్యక్తిపేరు "తేజాసింగ్. ఆ వ్యక్తి నాకు కొంత డబ్బు బాకీ పడి ఉన్నాడు. అవి నాకు ఎప్పుడు తిరిగి వస్తాయో అర్థం కావటంలేదు". ఇక మహావీర్‌కి నాల్గవ సంవత్సరం వచ్చినప్పటి నుండి అతడు, తనకు పెట్టిన భోజనాన్ని చిన్న చిన్న భాగాలుగా విభజించి, ఆపై ఆ విభజించిన భాగాల్లో కొన్నింటిని చూపించి "ఇవి నా బిడ్డలకు పెట్టటంకోసం ఉంచాను" అనేవాడు. చిన్నతనం నుండీ మహావీర్ మాట్లాడుతున్న మాటలను శ్రద్ధగా పరిశీలిస్తున్న అతని తండ్రి బలరామ్‌సింగ్, ఒకరోజు అతడిని తన దగ్గరకు తీసుకుని "నువ్వు ఏవేవో మాట్లాడుతున్నావ్, కాసేపు నీకు తమ్ముడు ఉన్నాడు అంటావ్, కాసేపు బిడ్డలు ఉన్నారు అంటావ్, అసలు నువ్వు ఏం మాట్లాడుతున్నావో నీకు అర్థమవుతుందా?" అన్నాడు. అప్పుడు మహావీర్ తన తండ్రివైపు పరిశీలనగా చూసి ఆపై గంభీరమైన స్వరంతో తన తండ్రితో "నాకు ఐదుగురు బిడ్డలు, ఒక భార్య ఉన్నారు. నా తమ్ముడికి కూడా ఐదుగురు పిల్లలు ఉన్నారు" అన్నాడు. ఆ సమయంలో మహావీర్ వయస్సు కేవలం మూడున్నర సంవత్సరాలు మాత్రమే. మరి కొద్ది రోజుల తరువాత మహీవీర్ తన తల్లితో ఇలా చెప్పాడు. "మా ఊరి పేరు బారాగామ్. నేను వ్యాపారం పనిమీద వెళ్ళినప్పుడు, పొరపాటున గంగానదిలో పడి చనిపోయాను. నేను చనిపోయే నాటికి నా ఐదుగురు బిడ్డల్లో ఒక అమ్మాయికి మరియు ఒక అబ్బాయికి వివాహం అయ్యింది. ఇంకా ముగ్గురికి పెళ్ళి చెయ్యాల్సి ఉన్నది. ఈలోగా నేను చనిపోయాను".

పూర్తిగా నాలుగు సంవత్సరాలు కూడా నిండని మహావీర్ అలా మాట్లాడటం అతడి తల్లికి విపరీతమైన ఆశ్చర్యాన్ని మరియు భయాన్ని కలిగించింది. ఆ తరువాత రోజున మహావీర్ తన తండ్రి దగ్గరకువెళ్ళి ఆపై పెద్దగా ఏడిచి, ఆ తరువాత వణుకుతున్న గొంతుతో "నన్ను వెంటనే నా భార్య దగ్గరకు తీసుకువెళ్ళు" అన్నాడు. దాంతో మహావీర్ తండ్రికి మరియు ఇతర కుటుంబ సభ్యులకు ఒక అనుమానం వచ్చింది. అది ఏమిటంటే..."బాలుడైన మహావీర్‌ని ఏదో మగ దయ్యం ఆవహించింది అని, అందువల్లే అతడు అలా మాట్లాడుతున్నాడని".

దాంతో అతని కుటుంబ సభ్యులు ఆ బాలుడిని తిరగలి మీద కూర్చోపెట్టి, ఆపై దాని పిడి పట్టుకుని ఆ తిరగలి పైన ఉండే రాయిని అపసవ్య దిశలో

(యాంటీక్లాక్‌వైజ్)లో నాలుగైదుసార్లు తిప్పారు. అలా చేస్తే ఆ బిడ్డను పట్టుకున్న దయ్యం వదిలిపోతుందని వాళ్ళు భావించారు. అయితే మహావీర్ మాత్రం ఏవేవో కొత్త విషయాలు మాట్లాడటం మానలేదు. దాంతో వాళ్ళు తమ ఇంటికి ఒక భూత వైద్యుడిని రప్పించి అతనిచేత మహావీర్‌కి మంత్రం వేయించారు. ఇంట్లో పూజలు చేయించారు. అయినా మహావీర్ తాను మాట్లాడే విధానాన్ని మార్చుకోలేదు. ఆ తరువాత ఒక రోజున, మహావీర్ ఎక్కడ నుంచో ఇంట్లోకి వచ్చి ఆపై ఆదుర్దా నిండిన స్వరంతో తన తండ్రితో ఇలా అన్నాడు. "నా సోదరుడు ఒంటె మీద నుండి క్రింద పడ్డాడు". మహావీర్ చెప్పిన మాట విన్న అతని తండ్రి – తన పెద్ద కొడుకు, ఊరి మధ్యలో ఉన్న చెట్టుక్రింద బస చేసిన ఏదో ఒక ఒంటె మీదకు ఎక్కి, దానిమీద నుంచి క్రింద పడి ఉంటాడని భావించి, ఆపై చాలా కంగారుగా ఇంట్లోంచి బైటకు వచ్చి ఒంటెలు ఆగి ఉన్న చోటుకి వెళ్ళాడు. అయితే అక్కడికి వెళ్ళి చూసినప్పుడు – ఎవరో పధీరామ్ అనే పేరుగల ఒక ఒంటెల వ్యాపారి పొరపాటున ఒంటెమీద నుండి జారి క్రింద పడ్డాడని తెలిసింది. అప్పుడు అర్ధమయ్యింది మహావీర్ తండ్రికి ఏమంటే, మహావీర్ తన గతజన్మ సోదరుడైన వధీరామ్ గురించి చెప్పాడు అని. ఆ తరువాత కాలంలో అనేకసార్లు రాధేశ్యామ్ అనే ఒక ఒంటెల వ్యాపారి, మహావీర్ ఇంటి ముందుగా ఒంటెపై ప్రయాణం చేస్తూ వెళ్ళాడు. అతడిని చూసినప్పుడల్లా మహావీర్, అతడిని 'రాధేశ్యామ్, రాధేశ్యామ్' అని పెద్ద గొంతుతో పిలుస్తూ ఉండేవాడు. ఎత్తుగా ఉన్న ఒంటెమీద కూర్చుని ఉన్న ఆ రాధేశ్యామ్‌కి బాలుడైన మహావీర్ పిలిచే పిలుపులు సరిగ్గా వినపడేవి కాదు. దాంతో అతడు మహావీర్‌ని పట్టించుకోకుండా ముందుకు వెళ్ళిపోతూ ఉండేవాడు.

ఏదిఏమైనా, "బాలుడైన మహావీర్‌కి గతజన్మ జ్ఞాపకాలు పదే పదే వస్తున్నాయి" అన్న విషయం చాలా తొందరలోనే ఆ ప్రాంతం అంతా తెలిసిపోయింది. ఈ విషయం పధేరామ్‌కి మరియు అతని కుటుంబ సభ్యులకు కూడా తెలిసింది. దాంతో వాళ్ళు అందరూ కట్టకట్టుకుని ఒకరోజు మధ్యాహ్న సమయంలో మహావీర్ ఇంటికి వచ్చారు. ఆ వచ్చినవారిలో ప్రతి ఒక్కరిని పేరు పేరునా పలకరించాడు మహావీర్. అదిచూసి ఇటు మహావీర్ కుటుంబం మరియు అటు నుండి వచ్చిన పధేరామ్ కుటుంబం కూడా చాలా ఆశ్చర్యపడ్డారు. అప్పుడు మహావీర్ అక్కడ ఉన్న జనాలను ఉద్దేశించి ఇలా అన్నాడు.

"నా పేరు ఖేమ్‌రాజ్. మాది బారాగామ్ అనే గ్రామం. నేను ఒంటెల వ్యాపారం చేసేవాడిని. నేను ఒంటెలను అమ్మటంకోసం వెళ్ళేటప్పుడు నాగలవిక్సీ గ్రామం

మీదుగా వెళుతూ ఉండేవాడిని. ఒకసారి, నేను ఒంటెలను అమ్మటంకోసం అలహాబాద్ పట్టణం దగ్గరకు వెళ్ళాను. ఆ సమయంలో నాకు తీవ్రమైన అనారోగ్యం వచ్చింది. అలా ఉన్నప్పటికీ నేను గంగానదిలో స్నానం చేద్దామని గంగానది దగ్గరకు వెళ్ళాను. ఆ సమయంలో నాకు ఒక్కసారిగా నీరసం వచ్చి నదిలో పడ్డాను. ఆ నదిలో మునిగిపోయి చనిపోయాను". అతడు చెప్పిన వివరాలు విన్న పథేరామ్ నిర్ఘాంతపోయాడు.

నాలుగు సంవత్సరాలు వయస్సు ఉన్న మహావీర్ చెప్పిన విషయాలన్నీ నిజమే అని పథేరామ్ ఒప్పుకున్నాడు. ఆ తరువాత పథేరామ్, మహావీర్ తండ్రితో ఇలా చెప్పాడు. "మా అన్న పేరు ఖేమ్‌రాజ్. ఆయన 50 సంవత్సరాల వయస్సులో ఉన్నప్పుడు అనగా ఇప్పటికి ఆరు సంవత్సరాల క్రితం -1976, మార్చి నెలలో ఒంటెలను అమ్మటంకోసం అలహాబాద్‌కి వెళ్ళాడు. ఆ సమయంలో ఆయన ఆరోగ్యం చెడిపోయింది. దురదృష్టవశాత్తు, ఆయన గంగానదిలో పడిపోయి చనిపోయాడు. ఆ తరువాత ఆ వార్త మాకు తెలిసింది. మేము, ఆయన మృతదేహాన్ని అక్కడే దహనంచేసి ఇంటికి వచ్చాం".

ఏదిఏమైనా, మహావీర్ చెప్పిన విషయాలను బట్టి "అతడు గతజన్మలో తన అన్న అయిన ఖేమ్‌రాజ్ అన్న విషయం" పథేరామ్‌కి మరియు అతని కుటుంబీకులకు స్పష్టంగా అర్థమయ్యింది. ఆపై వాళ్ళు, మహావీర్ దగ్గర వీడ్కోలు తీసుకుని తమ గ్రామానికి వెళ్ళి పోయారు. ఆ మర్నాడు ఉదయం మహావీర్ తన తండ్రి దగ్గరకు వెళ్ళి "తనని తన భార్య దగ్గరకు తీసుకువెళ్ళమని" గొడవ పెట్టాడు. అతడి గొడవకు లొంగిపోయిన అతడి తండ్రి, అతడిని వెంటపెట్టుకుని బారాగామ్‌లోని ఖేమ్‌రాజ్ ఇంటికి తీసుకువెళ్ళాడు. ఇంట్లోకి వెళ్ళగానే మహావీర్, గతజన్మలోని తన భార్యను గుర్తు పట్టాడు. ఆమె వయస్సు దాదాపు 50 సంవత్సరాలు ఉంటుందని మహావీర్ తండ్రికి అనిపించింది. తన భర్త చనిపోయి, మళ్ళీ ఈ బాలుడి రూపంలో తన ఇంటికి వచ్చాడని భావించిన ఖేమ్‌రాజ్ భార్య, ఒక ప్లేటులో నాలుగు లడ్లు ఉంచి ఆపై ఆ ప్లేటుని మహావీర్‌కి ఇచ్చి ఆ లడ్లు తినమన్నది. మహావీర్ ఆ లడ్లను తృప్తిగా తిని ఆపై చిన్నగా నవ్వి, అక్కడ ఉన్న వారికేసిచూసి "అప్పుడు నేను లడ్లు చెయ్యమని అడిగితే చెయ్యలేదు. సరే, ఇప్పటికైనా నా భార్య నా కోరిక తీర్చింది సంతోషం" అన్నాడు. ఆ మాట వినగానే ఖేమ్‌రాజ్ భార్య ఒక్కసారిగా ఉలిక్కిపడింది. అందుకు కారణం ఏమంటే, దాదాపు ఆరు సంవత్సరాల క్రితం ఒక రోజున ఖేమ్‌రాజ్, ఒంటెలను అమ్మటంకోసం అలహాబాద్‌కి బయలుదేరాడు. మార్గ మధ్యంలో తినటానికి కొన్ని

లడ్లు తయారుచేసి ఇవ్వమని భార్యను అడిగాడు. అయితే, ఆమె – ఇంట్లో ఉన్న పనుల వత్తిడి కారణంగా లడ్లుచేసి ఇవ్వటానికి ఒప్పుకోలేదు. దాంతో ఖేమ్‌రాజ్ తాను కోరినట్లుగా లడ్లు భార్య ఇవ్వకపోవటంతో కొంత విచారించి ఆపై తన ఒంటెలతో కలిసి అలహాబాద్‌కి బయలుదేరాడు. అలా వెళ్ళిన ఖేమ్‌రాజ్ మళ్ళీ ప్రాణాలతో తిరిగిరాలేదు. అతని మృతదేహం తిరిగి వచ్చింది. "ఖేమ్‌రాజ్ చివరిసారిగా తనని లడ్లు అడిగిన విషయం తనకి తప్ప ఇంకెవరికీ తెలియదు. అలాంటిది ఎక్కడో పుట్టిన నాలుగు సంవత్సరాల బాలుడు ఆ లడ్ల గురించి మాట్లాడేసరికి ఖేమ్‌రాజ్ భార్యకి ఆశ్చర్యంతో తల తిరిగిపోయింది". అయితే ఆమె ఆ విషయాన్ని ఎవరితోనూ అనలేదు. ఆపై మహావీర్ తన భార్య దగ్గరకువెళ్ళి ఆమెతో ఇలా చెప్పాడు. "నాకు అలహాబాద్ బ్యాంకులో ఐదువేలు, షంషాబాద్ బ్యాంకులో పదివేలు ఫిక్సిడ్ డిపాజిట్ రూపంలో ఉన్నాయి. మీరు వెళ్ళి అవి తెచ్చుకోండి. అంతేకాదు, తేజాసింగ్ అనే వ్యక్తి నాకు ఆరువేలు బాకీ ఉన్నాడు. అతడి దగ్గరకు వెళ్ళి ఆ డబ్బుకూడా వసూలు చేసుకోండి". బాలుడైన మహావీర్ మాటలను శ్రద్ధగా విన్న ఖేమ్‌రాజ్ బంధువులు ఆపై ఏమాత్రం ఆలస్యం చెయ్యకుండా, పైన చెప్పబడిన రెండు బ్యాంకులకు వెళ్ళి విచారించారు. ఖేమ్‌రాజ్ చెప్పినట్లుగానే ఆ రెండు బ్యాంకుల్లోను ఖేమ్‌రాజ్ పేరుమీదుగా ఫిక్సిడ్ డిపాజిట్లు ఉన్నట్లుగా నిర్ధారణ అయ్యింది. సాక్షాత్తు – ఖేమ్‌రాజ్ కుటుంబ సభ్యులైన తమకు తెలియని బ్యాంకు ఎకౌంట్ల సంగతి నాలుగు సంవత్సరాల బాలుడైన మహావీర్‌కి తెలిసింది అంటే ఖచ్చితంగా ఖేమ్‌రాజే మళ్ళీ మహావీర్‌గా పుట్టాడని అందరికీ స్పష్టంగా అర్ధమయ్యింది.

**3. సిఖ్ మతంలో మణిదీప్‌కౌర్ యదార్ధ పునర్జన్మ వృత్తాంతం :**

20వ శతాబ్దం మధ్య భాగంలో, న్యూఢిల్లీ నగరంలో ఒకచోట సిఖ్ మతానికి చెందిన మణిదీప్‌కౌర్ అనే ఒక యువతి నివసిస్తూ ఉండేది. ఆమె భర్త ఆ నగరంలో ఒకచోట సైకిళ్ళు బాగుచేసే ఒక చిన్న దుకాణాన్ని నడుపుతూ ఉండేవాళ్ళు. వచ్చే ఆదాయం చాలా తక్కువగా ఉండటంవల్ల మణిదీప్‌కౌర్ కుటుంబం చాలా పేదరికంలో బ్రతుకుతూ ఉండేది. 1961, జూన్ 2వ తేదీన మణీదీప్‌కౌర్‌కి తన భర్తతో పెద్ద తగాదా అయ్యింది. ఆ సందర్భంలో, ఆమె భర్త విపరీతమైన ఆగ్రహంతో రగిలిపోతూ ఆపై ఒక కత్తితో మణిదీప్‌కౌర్‌ని దారుణంగా పొడిచి చంపాడు. ఆ తరువాత సరిగ్గా నాలుగేళ్ళకు అనగా 1965, జూన్ 16వ తేదీన న్యూఢిల్లీలోని ఒక ప్రాంతంలో ఒక హైందవ కుటుంబంలో ఒక ఆడబిడ్డ జన్మించింది. ఆ బిడ్డపేరు పుష్ప. ఒక విచిత్రం

ఏమంటే, మణిదీప్‌కౌర్ ఏ ఇంట్లో నివసించిందో, సరిగ్గా ఆ ఇంటికి దాదాపుగా 380 గజాల దూరంలో ఉన్న గృహంలో నివసిస్తున్న హిందువుల కుటుంబంలో పుష్ప జన్మించింది. ఈ పుష్ప - 18 నెలల బిడ్డగా ఉన్నప్పుడు ఆమె తల్లి ఆ బిడ్డను ఎత్తుకుని తమ ఇంటి వాకిట్లో నిలబడినప్పుడు ఆ పసిబిడ్డ పుష్ప తన కుడిచేయిని పైకి ఎత్తి మణిదీప్‌కౌర్ ఇంటివైపు చూపించి, ఆపై తల్లి ముఖంలోకి చూస్తూ "ఊ", "ఆ" అని విచిత్రంగా రాగాలు తీస్తూ ఉండేది.

ఆ తరువాత కొంతకాలం తరువాత పుష్ప "తాను గతజన్మలో ఒక సిఖ్ మతస్తుడిని పెండ్లి చేసుకున్నానని చెప్పటమే కాకుండా, గతజన్మలో తనకు పుట్టిన బిడ్డల పేర్లు కూడా గడ గడా చెప్పింది. ఆపై, పుష్ప తల్లిదండ్రులు పుష్పతో ఒకసారి ఇలా అన్నారు. "నీ భర్త గతజన్మలో ఏం ఉద్యోగం చేసాడో చెప్పగలవా?". అప్పుడు పుష్ప నేలపై ఒకచోట కూర్చుని, ఆపై తన రెండు కాళ్ళను ముందుకుచాపి, సైకిల్ పెడళ్ళపై కాళ్ళుపెట్టి, సైకిల్ తొక్కుతున్నట్లుగా నటించి చూపించింది. అనగా, తన గతజన్మ భర్త యొక్క వృత్తి సైకిళ్ళకు సంబంధించినది అని తన తల్లిదండ్రులకు సూచింది అన్నమాట.

పుష్ప, రెండు లేదా మూడు సంవత్సరాల వయస్సులో ఉన్నప్పుడు ఏదైనా కత్తి కనపడితే ఆమె విపరీతంగా భయపడి వణికిపోతూ ఉండేది. అంతేకాకుండా, అంత చిన్న వయస్సులోనే పుష్ప, సిఖ్ మతానికి చెందిన అనేక మత సంబంధ కార్యక్రమాల గురించి తన తల్లిదండ్రులకు చెబుతూ ఉండేది. చాలా చిన్న వయస్సులో, అందునా హిందూ మతంలో పుట్టిన ఒక బాలికకి, పెద్దవాళ్ళకి మాత్రమే తెలిసే ఇతర మతాలకు సంబంధించిన విషయాలు తెలియటం పుష్ప కుటుంబ సభ్యులకు చాలా ఆశ్చర్యాన్ని కలిగించింది. ఆ తరువాత మరికొంతకాలానికి పుష్పకి తన గతజన్మ వివరాలు పూర్తిగా గుర్తుకు వచ్చాయి. ఆపై ఆమె తన తల్లిదండ్రులతో ఇలా చెప్పింది. "నేను గతజన్మలో మణిదీప్‌కౌర్ అనే అమ్మాయిగా ఉన్నాను. నా భర్త ఒకరోజు మధ్యాహ్నం నాతో తగాదాపడి నన్ను కత్తితో పొడిచి చంపాడు. నేను పోవటం వల్ల నా బిడ్డలు అనాధలు అయిపోయారు. నాకు నా బిడ్డలను చూడాలని ఎంతో ఆశగా ఉన్నది. నన్ను నా బిడ్డల దగ్గరకు తీసుకువెళ్లండి" ఈవిధంగా పుష్ప తన గతజన్మ గురించి చాలా వివరంగా చెప్పే సరికి ఆమె కుటుంబ సభ్యులకు పుష్పకు సంబంధించిన గతజన్మ సమాచారాన్ని పరిశోధించి, ఆమె చెప్పింది నిజమా? కాదా? అని తేల్చుకోవాలని నిర్ణయించుకున్నారు. ఆ తరువాత వాళ్ళు, తాము ఉంటున్న ప్రాంతంలో

అనగా పుష్ప చెప్పిన ప్రాంతంలో విచారణ చెయ్యగా, కొద్ది సంవత్సరాల క్రితం ఆ ప్రాంతంలో మణిదీప్‌కౌర్ అనే ఒక సిఖ్ మత గృహిణి ఉండేదని, ఆమె భర్త సైకిళ్ళు బాగుచేసే వృత్తిలో ఉండేవాడని, ఒక సమయంలో ఆ భర్త, మణిదీప్‌కౌర్‌ని కత్తితో పొడిచి చంపాడని తెలిసింది. ఆపై, పుష్ప తల్లిదండ్రులు ఒక మధ్యవర్తి ద్వారా మణిదీప్‌కౌర్ కుటుంబ సభ్యులను సంప్రదించి, తమ కుమార్తె యొక్క గతజన్మ వివరాల గురించి వాళ్ళకి తెలియజేసారు. ఆపై ఒకరోజున పుష్ప తల్లిదండ్రులు పుష్పను వెంటపెట్టుకుని నేరుగా మణిదీప్‌కౌర్ పుట్టింటికి వెళ్ళారు. అక్కడ మణిదీప్‌కౌర్ యొక్క చెల్లెళ్ళు కనిపించారు. విశేషం ఏమంటే, ప్రస్తుతం పుష్ప వయస్సు కన్నా ఆమె గతజన్మ చెల్లెళ్ళు చాలా పెద్ద వయస్సులో ఉన్నారు. అయినప్పటికీ, పుష్ప ఆ ఆడ పిల్లల్ని తన కన్నా చిన్నవాళ్ళు లాగా భావిస్తూ మాట్లాడింది. ఆ తరువాత అక్కడికి మణిదీప్‌కౌర్ యొక్క భర్త వచ్చాడు. అప్పుడు పుష్ప అతడికేసి ఏ భావాలు లేకుండా నిర్లిప్తంగా చూసింది. ఈ విషయం తెలుసుకున్న డాక్టర్ పాష్రికా అనే పారాసైకాలజిస్ట్ – మణిదీప్‌కౌర్ యొక్క రెండవ జన్మ వృత్తాంతం నిజమా? కాదా? అన్న విషయం తెలుసుకోవటానికి చేసిన పరిశోధనలో భాగంగా అటు మణిదీప్‌కౌర్ కుటుంబాన్ని, ఇటు పుష్ప కుటుంబాన్ని వేరు, వేరుగా కలుసుకుని అనేకసార్లు ఆ కుటుంబాలను ఇంటర్వ్యూచేసాడు. ఆ ఇంటర్వ్యూలో తేలిన విషయం ఏమంటే, పుష్ప తన గతజన్మ గురించి చెప్పటానికి ముందు ఆమె కుటుంబానికి పుష్ప గతజన్మ (మణిదీప్‌కౌర్) కుటుంబం గురించి ఏమాత్రం తెలియదు. అలాగే, మధ్యవర్తి ద్వారా పుష్పకు సంబంధించిన సమాచారం తెలిసే వరకు పుష్ప కుటుంబం గురించి మణిదీప్‌కౌర్ కుటుంబానికి కొంచెం కూడా తెలియదు. ఆ రెండు కుటుంబాలు నివసించే ఇళ్ళ మధ్య దూరం కేవలం 380 మీటర్లే అయినప్పటికీ ఆ రెండు కుటుంబాలు పూర్తిగా భిన్నమైన రెండు మతాలలో జీవించారు.

ఇంకొక ముఖ్యవిశేషం ఏమంటే, పుష్ప కుటుంబ సభ్యులు అందరూ విద్యావంతులే. ఆ కుటుంబంలో ఒక అల్లోపతి వైద్యుడు, ఒక సంస్కృత పండితుడు, ఒక జర్నలిస్ట్ మరియు ఒక స్కూలు టీచరు కూడా ఉన్నారు. అంతేకాకుండా, పుష్ప కుటుంబం చాలా సంపన్న వర్గానికి చెంది ఉన్నది. కానీ, మణిదీప్‌కౌర్ కుటుంబం చాలా పేద కుటుంబం. అంతే కాకుండా ఆమె కుటుంబంలో ఆమె భర్త మరియు ఆమె చెల్లెళ్ళు – కనీస విద్య కూడా లేనివాళ్ళు. అంతేకాదు, పుష్ప కుటుంబం సాంప్రదాయ హిందూ మతానికి చెంది ఉండగా , మణిదీప్‌కౌర్ కుటుంబం సిఖ్ మతాన్ని త్రికరణశుద్ధిగా పాటిస్తుంది. ఆ తరువాత కొంతకాలానికి మణిదీప్‌కౌర్

యొక్క మూడవ కూతురుకి వివాహం జరిగింది. ఆ వివాహానికి పుష్ప తన కుటుంబంతో సహా హాజరై, ఆ పెళ్ళి కూతురుకి అనగా తన గతజన్మ కూతురుకి తనకు తోచిన పెళ్ళి కానుకను ఇచ్చింది. డాక్టర్ పాష్‌రికా, 1973 నుండి 1975 వరకు నాలుగుసార్లు పుష్పను ఇంటర్వ్యూచేసాడు. అంతేకాదు, ఆ సమయంలో ఆయన, దాదాపు 17 మందిని ప్రశ్నించాడు. ఈ 17 మందీ, ఏదో ఒక రకంగా మణిదీప్‌కౌర్‌తో సంబంధం ఉన్నవాళ్ళు కావటం విశేషం. ఈ మొత్తం సమాచారాన్ని ఆధారంగా చేసుకుని – "మణిదీప్‌కౌర్ చనిపోయి మళ్ళీ పుష్పగా జన్మించింది" అన్నమాట పూర్తిగా యదార్ధమని పుష్పయొక్క పునర్జన్మ వృత్తాంతం – ఆధునికకాలంలో – రుజువులతో సహా లోకానికి తెలిసిన పునర్జన్మ సంఘటన అని డాక్టర్ పాష్‌రికా తీర్మానించాడు. పుష్ప పునర్జన్మ వృత్తాంతం – పునర్జన్మ సిద్ధాంతానికి ఒక బలమైన ఆధారంగా గుర్తించబడింది.



# 11. ప్రపంచంలోని ప్రముఖ మతాలలో చెప్పబడిన మరణానంతర జీవిత (Life after death) విశేషాలు?

**తన మరణం తనకే తెలియని ఒక ఆత్మ యదార్ధ వృత్తాంతము :**

దాదాపు 80 సంవత్సరాల క్రితం గుంటూరు జిల్లాలోని ఒక చిన్న గ్రామంలో యదార్ధంగా జరిగిన సంఘటన ఇది. ఆ కాలంలో ఎక్కువ మంది బ్రాహ్మణ గృహస్తులు నివసించే ఒక అగ్రహారం పొలిమేరల్లో ఒక చెరువు ఉండేది. ఆ చెరువు గట్టుమీద ప్రాచీన కాలం నాటి మరియు బాగా ఊడలు దిగిన ఒక పెద్ద మర్రి చెట్టు కూడా ఉండేది. ఆ వూరుకి చెందిన ఒక మధ్య వయస్సు దాటిన ఒక బ్రాహ్మణుడు తెల్లవారుఝాము సమయంలో నిద్రలేచి, ఆపై నడుచుకుంటూ (మార్నింగ్ వాక్ అన్నమాట) ఆ వూరి చివర ఉన్న చెరువుదాకా వెళ్ళి, అక్కడ కాలకృత్యాలు తీర్చుకుని ఆ తరువాత మెల్లిగా నడుస్తూ సూర్యోదయం సమయానికి ఇంటికి వస్తూ ఉండేవాడు. ఒకరోజు ఉదయం 4 గంటలకు, ఆయన ఎప్పటిలాగానే నడుచుకుంటూ ఊరు చివరికి వెళ్ళాడు. అది పౌర్ణమి పక్ష (శుక్లపక్ష) చివరి రోజులు కావటంతో తెల్లవారు ఝాము సమయంలో కూడా బాగా వెలుతురుగా ఉన్నది. అది ఎండాకాలం కూడా కావటం వల్ల ఆ ప్రాంతం అంతా పొడిగా కనిపిస్తున్నది. ఏదిఏమైనా, ఆ చెరువు

గట్టుకి వెళ్లిన ఆ బ్రాహ్మణుడికి ఆ గట్టుమీద ఉన్న ఒక ముళ్ళ పొద దగ్గర నిలబడి ఏడుస్తున్న దాదాపు 5 సంవత్సరాలు వయస్సు ఉన్న ఒక బాలుడు కనిపించాడు. ఆ బాలుడి వంటిమీద ఒక్క నూలుపోగు కూడా లేదు. జన సంచారం లేని అలాంటి సమయంలో ఆ బాలుడు ఆ చెరువు గట్టుకి ఎలా వచ్చాడో?, ఆ బ్రాహ్మణుడికి అర్థంకాలేదు. ఏదిఏమైనా ఆయన ఆ బాలుడి దగ్గరకు వెళ్ళి వాడితో మృదువైన స్వరంతో "అయ్యా! నువ్వు ఎవరి అబ్బాయివి? ఇక్కడికి ఎలా వచ్చావు?" అన్నాడు. అప్పుడు ఆ బాలుడు ఏడుపు ఆపి, ఆపై విచిత్రమైన స్వరంతో "నేను నిన్న మధ్యాహ్నం ఈ చెరువు దగ్గరకి ఆడుకోవటానికి ఒక్కడినే వచ్చాను. ఆ సమయంలో నేను కాలుజారి ఈ చెరువులో పడ్డాను. అప్పుడు ఈ చెరువులో ఉన్న కప్పలు నా రెండు కళ్ళను తినేసాయి. అందువల్ల నాకు ఇప్పుడు కళ్ళు కనపడటంలేదు. అందుకే మా ఇంటికి వెళ్ళలేక ఇక్కడే ఉండి ఏడుస్తున్నాను" అన్నాడు. ఆ బాలుడి దీనస్థితిని చూసి ఎంతో బాధపడిన ఆ బ్రాహ్మణుడు ఆ బాలుడి ఎడమ చేతిని, తన కుడిచేత్తో జాగ్రత్తగా పట్టుకుని ఆ బిడ్డని తన వెనకాల నడిపించుకుంటూ ఆ బిడ్డ చెప్పిన ఇంటి దగ్గరకు తీసుకువెళ్లాడు. ఆపై ఆ బ్రాహ్మణుడు ఆ బాలుడిని ఆ ఇంటి వాకిట్లో నిలబెట్టి, తాను ఒక్కడే ఆ ఇంటి దగ్గరకువెళ్ళి తలుపు తట్టాడు. కొద్ది నిమిషాలు తరువాత ఆ ఇంటి తలుపులు తెరుచుకున్నాయి. ఒక వృద్ధుడు ఆ తలుపుల మధ్య నుండి బైటకు వచ్చి ఆపై, తన ఎదురుగా నిలబడిన బ్రాహ్మణుడివైపు చూసి "ఏమిటి విషయం? ఉదయాన్నే మా ఇంటి తలుపు తట్టారు" అన్నాడు. అప్పుడు ఆ బ్రాహ్మణుడు ఆ వృద్ధుడితో "అయ్యా! మీ కుటుంబానికి చెందిన ఒక బాలుడు చెరువులో పడిపోయి, ఆపై కప్పలు కరవటం ద్వారా తన కళ్ళుపోగొట్టుకుని ఆ చెరువు గట్టుమీద ఉండిపోయాడు. నేను ఇందాక అటువైపుగా వెళ్ళినప్పుడు నాకు ఈ బాలుడు కనిపించాడు" అన్నాడు. ఆ బాలుడు చెప్పిన గుర్తుల ప్రకారమే అతడిని ఇలా మీ ఇంటి దగ్గరకు తీసుకు వచ్చాను" అన్నాడు.

ఆ బ్రాహ్మణుడు అలా చెబుతూ ఉండగానే ఆ ఇంట్లోంచి ఇద్దరు, ముగ్గురు పురుషులు బైటకు వచ్చి ఆపై ఆ బ్రాహ్మణుడితో సంయుక్త స్వరంతో ఇలా అన్నారు. "అయ్యా! మీరు చెప్పినట్లుగా మా ఇంట్లో ఒక పిల్లవాడు గతంలో ఉన్నమాట నిజమే. కానీ, 13 రోజుల క్రితం మన అగ్రహారం చివర ఉన్న చెరువులో పడి ఆ పిల్లవాడు చనిపోయాడు. మీరు ఒక నెల రోజులుగా అగ్రహారంలో లేని కారణంగా మీకు మా పిల్లవాడు చనిపోయిన విషయం తెలిసి ఉండదు అనుకుంటా. ఇవాళ మా అబ్బాయికి 13వ రోజు శార్ధ కర్మలు చెయ్యబోతున్నాం. మరి, మీకు మా అబ్బాయి

ఎలా కనిపించాడు?". వాళ్ళు అనగానే ఆ బ్రాహ్మణుడు ఆ బాలుడిని – తాను నిలబడి ఉండమని చెప్పిన చోటుకి వచ్చి చూడగా అక్కడ ఆ బాలుడు లేడు. అంటే, తనకి ఇందాక చెరువు గట్టు దగ్గర కనిపించింది ఆ బాలుడియొక్క ప్రేతాత్మ అని – కొద్ది నిమిషాల్లోనే ఆయనకు అర్ధమయ్యింది. హైందవ సాంప్రదాయాన్ని పాటించే కుటుంబాలలో, ఒక వ్యక్తి చనిపోయినప్పుడు ఆ వ్యక్తికి 9వ రోజున లేదా 13వ రోజున లేదా 15వ రోజున "పెద్దకర్మ" (దినాలు చెయ్యటం) తప్పనిసరిగా నిర్వహిస్తారు. అందుకు కారణం ఏమంటే, 13వ రోజు వరకూ – చనిపోయిన వ్యక్తియొక్క ఆత్మ తాను చనిపోయిన ప్రదేశంలోనే సంచరిస్తూ ఉంటుంది. చీకటి పడిన సమయం నుండి మళ్ళీ తూర్పున వెలుతురు వచ్చే సమయం వరకు ఆ ఆత్మ – తాను చనిపోయినప్పుడు ఏ శరీర రూపంలో ఉన్నదో ఆ రూపంలోనే, తాను చనిపోయిన ప్రదేశంలో సంచరిస్తూ ఉంటుంది.

ఇటీవల కాలంలో కొందరు వ్యక్తులు, తాము చనిపోవటానికి ముందుగా వ్రాసే వీలునామాలో – తమ మృతదేహంలోని కళ్ళను ఎవరైనా చూపులేనివారికి దానం చెయ్యమని వ్రాస్తారు. అలాంటి సందర్భాలలో, ఆ వ్యక్తి చనిపోయిన కొద్ది సేపట్లోనే ఆ వ్యక్తి కళ్ళను లేదా కళ్ళలోని ముఖ్య భాగాన్ని సేకరించి, ఆపై వెంటనే ఆ భాగం అవసరమైన వ్యక్తికి దాన్ని అమరుస్తారు. ఫలితంగా, అలా అమర్చబడిన వ్యక్తికి చూపు వస్తుంది. మానవతా దృక్పధంతో ఇలా నేత్రాలను దానం చెయ్యటం మంచిదే కావొచ్చు. ఆధ్యాత్మిక పరంగా చూసినట్లయితే ఈవిధంగా ఒక వ్యక్తియొక్క కళ్ళను/గుండెను/లివర్‌ను/మూత్రపిండాలను ఇంకొక వ్యక్తికి అమర్చినప్పుడు ఆ వ్యక్తికి ఆరోగ్యం చక్కబడే మాట వాస్తవమే కానీ, ఎవరి శరీర భాగాలు – తన శరీరంలో అమర్చబడ్డాయో ఆ వ్యక్తి యొక్క చెడు కర్మ ఫలితాలు ఆ శరీర భాగాలను అమర్చుకున్న వ్యక్తికి ఖచ్చితంగా సంక్రమిస్తాయి. ఆపై, ఆ కొత్త వ్యక్తి తనకు సంబంధం లేకపోయినా అనగా, తను ఆ చెడు కర్మలకు కర్త కాకపోయినప్పటికీ ఆ వ్యక్తి, ఇంకొక వ్యక్తి (అవయవాలను దానంచేసిన మృతుడు అన్నమాట) చేసిన చెడు కర్మలయొక్క ఫలితాలను అనుభవించటం జరుగుతుంది. కొన్ని సందర్భాలలో ఆ శరీర భాగాలకు అసలు యజమాని అయిన వ్యక్తియొక్క ఆత్మ, ఆ శరీర భాగాలు అమర్చబడ్డ వ్యక్తి శరీరంలోకి ప్రవేశించి, ఆపై ఆ వ్యక్తి మరణించేదాకా ఆ శరీరంలోనే ఉంటుంది. దీనివల్ల, ఆ శరీర భాగాలు ఎవరి మృతదేహం నుండి తీసుకోబడ్డాయో ఆ మృత దేహానికి సంబంధించిన ఆత్మ తన చెడుకర్మ లేదా మంచికర్మయొక్క ఫలితాలను అనుభవించటంకోసం మళ్ళీ జన్మ ఎత్తే అవకాశం, కొన్నేళ్ళ దాకా లేకుండా పోతుంది.

అనగా, ఆ శరీర భాగాలను అమర్చుకున్న వ్యక్తి చనిపోయేదాకా ఈ ఆత్మకూడా అతని శరీరంలోనే ఉండి, ఆపై ఆ వ్యక్తి చనిపోయినప్పుడు అతని శరీరం నుండి బైటకువెళ్ళి అప్పుడు మళ్ళీ పునర్జన్మ ఎత్తే ప్రక్రియకు సిద్ధపడుతుంది.

కొన్ని సందర్భాలలో, ఒకవ్యక్తి అనుమానాస్పద పరిస్థితుల్లో మరణించినప్పుడు, ఆ వ్యక్తి మరణించటానికి గల కారణం ఏమిటో? తెలుసుకోవటం కోసం ప్రభుత్వం – శవ పరీక్ష (అటాప్సీ) చేయిస్తుంది. ఆ సందర్భంలో ఆ వ్యక్తియొక్క మృతదేహాన్ని సంపూర్తిగా కోసి చూడటం జరుగుతుంది. చట్టపరంగా చూస్తే, ఇలా చెయ్యటం మంచిదే. కానీ, ఆధ్యాత్మికపరంగా చూసినట్లయితే ఇలాంటి శవ పరీక్షవల్ల ఆ శవానికి లేదా మృతదేహానికి చెందిన ఆత్మ, తీవ్ర ఆందోళనకు గురి అవుతుంది. తన శరీరం ఆవిధంగా చీల్చబడటం చూసే ఆత్మ, తీవ్రమైన విచారానికి, భయానికి గురి అవుతుంది. ఫలితంగా, ఆ ఆత్మ పై లోకాలకు వెళ్ళలేక ఈ లోకంలోనే అశాంతితో కుమిలిపోతుంది. ఆ తరువాత చాలా కాలంపాటు, తన మృతదేహానికి శవ పరీక్ష జరిగిన ప్రదేశంలోనే సంచరిస్తూ ఉంటుంది.



ఆసుపత్రులలో ఉండే, శవాలను భద్రపరచే ప్రదేశాలలో (మార్చురీ) మరియు శవ పరీక్షలు చేసే ప్రదేశంలో ఆత్మలు సంచరిస్తూ ఉంటాయి అని కొందరు పారాసైకాలజిస్టులు పేర్కొన్నారు.

**గ్రీకు పురాణాలలో చెడు ఆత్మల అధిదేవత “పండోరా” వృత్తాంతము :**

ప్రాచీన గ్రీకు పురాణాలలో చెప్పబడిన సమాచారం ప్రకారం చూసినట్లయితే ‘పండోరా’ అనే పేరుగల భూదేవి దగ్గర ‘పిథోస్’ అనే పేరుగల ఒక జగ్గు(జార్) ఉంటుంది. ఈ పాత్రలో వేలాది చెడు ఆత్మలు బంధించబడి ఉంటాయి. దీనిమీద ఒక బలమైన మూత లేదా బిరడా ఉంటుంది. దేవతలకు మానవులపై ఏ కారణం చేతైనా ఆగ్రహం కలిగినప్పుడు ఆ దేవతలలో ఒకరైన “పండోరా” తన వద్ద ఉన్న ఆ పాత్రయొక్క మూతను తీసివేస్తుంది. దాంతో ఆ పాత్రలో ఉన్న చెడు ఆత్మలు – గుంపులు గుంపులుగా బైటకువచ్చి ఆపై భూమిపై ఉన్న మానవులను అతి భయంకరమైన

వ్యాధులకు గురిచేసి చంపటం జరుగుతుంది. అందువల్ల ఆనాటి గ్రీకులు, పండోరా దేవత ఎల్లప్పుడూ శాంతంగా ఉండటంకోసం ఆమెను పూజిస్తూ ఉండేవారని తెలుస్తున్నది.

గ్రీకు పురాణాలలో భూగోళానికి 'పండోరా' అనే దేవత అధిపతిగా ఉంటుంది. ఇక, హైందవ పురాణాలలో చెప్పబడిన సమాచారం చూసినట్లయితే, భూగోళానికి 'భూదేవి' అనే దేవత అధిపతిగా ఉంటుంది. ఈ భూమిమీద పాప భారం పెరిగిపోయినప్పుడు భూకంపాలు, వరదలు, పెను తుఫాన్లు వస్తాయి. ఫలితంగా, జనాభా సర్వనాశనం అవుతుంది. ఇళ్ళు, పంటలు, ఇతర ఆస్తులు మట్టిలో కలిసి పోతాయి. అంతేకాకుండా, ఇలాంటి ప్రకృతి విపత్తులు జరిగిన వెంటనే భయంకరమైన వ్యాధులను వ్యాపింపచేసే వైరస్‌లు పుడతాయి. అవి, తమ ప్రభావంతో వేలాది మంది మనుషుల్ని చంపటమో లేదా జీవశ్చవాలుగా మార్చటమో చేస్తాయి. అనగా, అటు 'పండోరా' దేవత ఆగ్రహించినా, ఇటు భూ మాత లేదా భూదేవి ఆగ్రహించినా మనుషులకు సర్వనాశనం తప్పదు అని గ్రహించాలి.

**చనిపోయిన వారి ఆత్మలు మానవులపై చూపే ప్రభావం :**

చనిపోయినవారి ఆత్మలకు, బ్రతికి ఉన్న మానవుల మీద తీవ్రమైన అసూయ ఉంటుంది. అందుకే, చక్కగా ఆరోగ్యంగా ఉండే వారిని అనారోగ్యంగా మార్చటం, అన్యోన్యంగా ఉండే దంపతులను లేదా స్నేహితులను లేదా బంధువులను తీవ్రమైన విరోధులుగా మార్చటం ఈ ఆత్మలయొక్క స్వభావంగా ఉంటుంది. బాగా స్నేహంగా ఉండేవాళ్ళు, హఠాత్తుగా పరమ విరోధులుగా మారిపోయినప్పుడు లేదా బాగా ఆరోగ్యంగా ఉన్నవాళ్ళు హఠాత్తుగా రోగాల బారినపడి, క్షీణించిపోయినప్పుడు – వాళ్ళకి ఎవరిదైనా దిష్టి తగిలిందేమో అని అనుకుంటారు కానీ 'ఆ 'దిష్టి' మానవుల నుండి వచ్చింది కాదని, చెడు స్వభావంగల ఆత్మల నుండి వచ్చిందని ఎవరికీ తెలియదు. ఇక, ఆత్మలకు ఒంటరితనం అధికంగా ఉంటుంది. అందువల్ల అవి తమకు సంబంధించిన వారుకూడా చనిపోయి, తమ దగ్గరకు తొందరగా రావాలని భావిస్తారు. ఇలాంటి ఆత్మలకు సంబంధించిన కుటుంబాలలో అకాల మరణాలు అధికంగా ఉంటాయని గుర్తించాలి.

భారతదేశంలోని హైందవులు తమ పూర్వీకులకు చేసే పూజలలో భాగంగా బ్రాహ్మణులకు విందు భోజనాలు పెట్టటం జరుగుతుంది. పితృదేవతలు ఆ బ్రాహ్మణులను శార్ధకర్మల సమయంలో ఆవహిస్తారని, అందువలన ఆ బ్రాహ్మణులు

ఆహారం తీసుకున్నట్లయితే, ఆ కర్మలను చేయిస్తున్న వ్యక్తులయొక్క పితృదేవతలు ఆ ఆహారాన్ని తీసుకున్నట్లుగా భావించాలని వేదాలలో చాలా స్పష్టంగా చెప్పబడి ఉన్నది. ఇక, రష్యా ప్రాంతంలో నివసించే ప్రజలు తమ పూర్వీకుల ఆత్మశాంతికోసం చేసే పూజలలో భిక్షగాళ్ళు పాల్గొంటారు. ఆ పూజా కార్యక్రమాలు జరిగే సమయంలో కొందరు భిక్షగాళ్ళు ప్రార్ధనలు చెయ్యటం, పాటలు పాడటం లాంటివి చేస్తారు. ఆ తరువాత ఆ భిక్షగాళ్ళకు ఎంతో ఆదరంతో భోజనాలు పెడతారు. తమ పితృదేవతలు ఆ భిక్షగాళ్ళను ఆ విందు సమయంలో ఆవహించి వారి ద్వారా ఆహారం తీసుకుంటారని రష్యా ప్రాంతంలోని ప్రజలు భావిస్తారు. అదేవిధంగా, ప్రాచీన రోమన్ దేశంలోని (నేటి ఇటలీ) ప్రజలు, తమ పెద్దల (పూర్వీకులు) వర్ధంతి రోజున తమ ఇళ్ళకి కొందరు వ్యక్తుల్ని ఆహ్వానించి, వారిని తమ పెద్దలయొక్క ప్రతినిధులుగా భావించి వారికి ఆ పెద్దలయొక్క జ్ఞాపకార్ధం విందు భోజనం పెట్టటం ఆపై కానుకలను ఇవ్వటం జరిగింది. చనిపోయినవారియొక్క ఆత్మలు, బ్రతికి ఉన్నవారిని ఆవహించి ఆహారం ఏవిధంగా తీసుకుంటాయో, అదేవిధంగా ఆత్మలు, బ్రతికి ఉన్న మానవులను ఆవహించి ఆ మానవుల మనస్సులను తమ అదుపులో ఉంచుకుని వాళ్ళని తమ ఇష్టంవచ్చినట్లు ఆడిస్తాయని భారతదేశంతో సహా అనేక ఐరోపా దేశాలలో ఈనాటికీ బలంగా విశ్వసిస్తున్నారు.

పాశ్చాత్య పారాసైకాలజిస్టు అయిన డబ్లు.క్రూక్, భారతదేశంలో అనేకచోట్ల పర్యటించి 'ఆత్మలు ఆవహించటం' అనే అంశం మీద విస్తృతంగా పరిశోధనలు చేసాడు. తన పరిశోధనలో తెలిసిన విషయాలలో కొన్నింటిని ఆయన ఇలా వివరించాడు...

ఉత్తర భారతదేశంలోని ఒక గ్రామంలోని ఒక ఇంట్లో ఒకవ్యక్తి చనిపోయాడు. ఆ ఇంట్లో వారందరూ ఆ వ్యక్తి మృతదేహం చుట్టూ గుమిగూడి రోదిస్తున్నారు. కొద్దిసేపు గడిచిన తరువాత, చచ్చిపోయిన వ్యక్తియొక్క ఆత్మ, అక్కడ గుమిగూడి ఉన్న వారిలో ఉన్న ఒక 16 సంవత్సరాల అమ్మాయిని ఆవహించింది. ఆపై, ఆ అమ్మాయి, అచ్చుగా చనిపోయిన వ్యక్తిలాగా ప్రవర్తిస్తూ, ఆ వ్యక్తి స్వరంతోనే మాట్లాడుతూ తన ఇంట్లో వాళ్ళని ఒక్కొక్కరినీ పేరుపెట్టి పిలిచి, ఆపై వారు భవిష్యత్తులో ఏమేమి పనులు చెయ్యాలో వివరించింది. ఆ తరువాత ఆ అమ్మాయి నేలపై కూలిపోయింది. అక్కడ ఉన్న జనం అంతా ఆ అమ్మాయి ముఖంపై నీళ్ళుచల్లి స్పృహలోకి రప్పించారు. స్పృహలోకి వచ్చిన ఆ అమ్మాయి చాలా మామూలుగా ఎప్పటిలాగానే ప్రవర్తించింది.

అనగా, ఆ ఇంట్లో చనిపోయిన వ్యక్తియొక్క ఆత్మ ఆ అమ్మాయిని కొంచెంసేపు ఆవహించి ఆ ఇంట్లోని వారికి తాను చెప్పాలనుకున్న విషయాలను చెప్పింది అన్నమాట.

భారతదేశంతో పాటుగా అనేక ఐరోపా దేశాల్లో కూడా దయ్యాలకు సంబంధించిన విశ్వాసాలు బలంగా ఉన్నాయి. ఒకవ్యక్తి బ్రతికి ఉన్నప్పుడు ఏవిధమైన రూపంలో ఉన్నాడో లేదా ఉన్నదో చనిపోయిన తరువాత కూడా అటువంటి రూపంలోనే కనిపించటం జరుగుతుందని ప్రపంచ వ్యాప్తంగా నమ్ముతున్నారు. కొన్ని పురుష ఆత్మలు, రాత్రి సమయాలలో సంచరిస్తూ – ఒంటరిగా తమకు ఎదురైన స్త్రీలను తమ వశం చేసుకుని ఆపై ఆ స్త్రీలను శారీరకంగా అనుభవించటం జరుగుతుంది. ఫలితంగా, ఆ స్త్రీలు గర్భవతులుకావటం, పిల్లల్ని కనటం జరుగుతుంది. పిశాచాలు "ముక్కుతో మాట్లాడతాయని" ఉత్తర భారతదేశంలో చెప్పుకుంటారు. పిశాచాలు ఎక్కువగా రాత్రి సమయంలో సంచరిస్తాయి. అయితే, మధ్యాహ్న సమయంలో సంచరించే పిశాచాలు మానవులకు ఎక్కువ హాని చేస్తాయని తెలుస్తున్నది. రోమన్లు మరియు గ్రీకులు – దయ్యాల గురించి ఇంచుమించు ఒకేవిధమైన అభిప్రాయాన్ని కలిగి ఉన్నారు. అసంతృప్తితో లేదా బాధతో చనిపోయిన మానవులయొక్క ఆత్మలు ఒక ప్రత్యేక లక్ష్యంతో మానవులకు కనిపిస్తాయని గ్రీకులు నమ్ముతారు.

పురాతనకాలంలో గ్రీసు దేశాన్ని పరిపాలించిన గెయస్ అనే ఒక అమాయకుడైన చక్రవర్తిని కొందరు విశ్వాస ఘాతకులు కుట్రతో హత్య చేసారు. ఆ తరువాత అతడి శరీరాన్ని దహనం చేసారు. అయితే, అతని శరీరం సగం వరకు తగలబడి – సగభాగం మిగిలిపోయింది. ఆపై, ఆ సగ భాగాన్ని లామియన్‌విల్లా అనే భవనంలో ఒకచోట సమాధి చేసారు. అప్పటి నుండి అర్ధరాత్రి సమయాలలో ఆ భవనం అంతటా భయంకరమైన శబ్దాలు, వికృతమైన అరుపులు చాలాసేపు వినపడుతూ ఉండేవి. అర్ధరాత్రి సమయాలలో, ఆ భవనంలో ఉన్న అనేకమందికి ఒక వికృత రూపం ఆ భవనంలో సంచరిస్తూ కనిపించేది. ఆ దృశ్యం చూసిన చాలామందికి పిచ్చిపట్టిందని చెబుతారు. ఏదిఏమైనా, చక్రవర్తి యొక్క సగం శరీరం సమాధి చెయ్యటం వల్ల ఆ చక్రవర్తియొక్క ఆత్మ ఆ సమాధిని అంటిపెట్టుకుని ఉన్నదని, ఆ ఆత్మే అర్ధరాత్రి సమయాలలో ఆ భవనంలో గందరగోళం సృష్టిస్తున్నదని ఆ రాజ్య అధిపతులకు కొద్దికాలంలోనే అర్థమైపోయింది. ఆ తరువాత ఒక మంత్రగాడి సలహాతో – ఆ లామియన్‌విల్లా భవనంలో సమాధి చేసిన చక్రవర్తియొక్క అర్ధ శరీరాన్ని బైటకుతీసి దహనం చేసారు. ఆ తరువాత ఏనాడూ ఆ చక్రవర్తియొక్క ఆత్మ ఆ భవనంలో కనపడలేదని చెబుతారు.

అదేవిధంగా ప్రాచీనకాలంలో రోమన్ సామ్రాజ్యాన్ని పరిపాలించిన మహా నియంత "నీరో", ఒకసారి ఏదో ఒక సందర్భంలో తన కన్నతల్లిమీద ఆగ్రహించి ఆమెను హత్య చేయించాడు. ఈ హత్య జరిగిన మూడవ రోజు నుండి నీరో తల్లి ఆత్మ, నీరోకి రాత్రి సమయాలలో కనపడుతూ అతడిని భయ భ్రాంతులకు గురిచెయ్యటం ప్రారంభించింది. అంతేకాకుండా, నీరో నివసిస్తున్న భవనానికి చుట్టూ ఉన్న కొండల మీద నుండి అర్ధరాత్రి సమయాలలో చాలా పెద్ద స్థాయిలో డప్పుల మోతలు వినపడుతూ ఉండేవి. అంతేకాదు, నీరో తల్లి సమాధి నుండి అర్ధరాత్రి సమయాలలో వికృతమైన ఏడుపులు వినపడుతూ ఉండేవి. ఈవిధంగా రోమన్ చరిత్రలో కూడా ఆత్మలకు సంబంధించిన వృత్తాంతాలు ఎన్నో కనిపిస్తాయి.

చనిపోయిన వ్యక్తులయొక్క ఆత్మలు కొన్ని సమయాలలో జంతువులను ఆవహిస్తాయని ప్రపంచంలోని చాలా ప్రాంతాలలో ఈనాటికీ నమ్ముతున్నారు. అది ఎలాగంటే...ఒక మనిషి చనిపోయి నేలపై పడి ఉన్నప్పుడు ఏవైనా జంతువులు ఆ మృతదేహాన్ని పీక్కుతింటాయి. ఆ సమయంలో ఆ మృతదేహం చుట్టూ సంచరించే ఆ మృతదేహం తాలూకు ఆత్మ తన మృతదేహాన్ని తిన్న ఏదో ఒక జంతువుని ఆవహించే అవకాశాలు ఉంటాయి. అలాంటి సమయాలలో ఆ జంతువులు మతి స్థిమితాన్ని కోల్పోయి పిచ్చిగా పరుగులు తియ్యటం, హింసాత్మకంగా ప్రవర్తించటం లాంటివి జరుగుతాయి. చివరికి ఆ జంతువులు ఏదోఒక విధానంలో ఆత్మహత్య చేసుకుని చనిపోవటం జరుగుతుంది.

ప్రపంచంలోని చాలా దేశాల్లో నరకం(హెల్) అనే భావన ప్రచారంలో ఉన్నది. జొరాస్ట్రియన్ మతంలో చెప్పబడిన సిద్ధాంతాల ప్రకారంచూసినట్లయితే, నరకానికి అధిపతిగా ఉండే దుష్టశక్తిని 'అహ్రిమాన్' అని పిలుస్తారు. క్రైస్తవ, యూదు మతాలలో చెప్పబడిన దైవ ప్రత్యర్థి అయిన సాతాన్ మరియు అహ్రిమాన్ ఒకటే అని పరిశీలకు భావిస్తున్నారు. ఈ నరకంలో దుష్ట ఆత్మలు ఉంటాయని తెలుస్తున్నది. ఇక, స్వర్గం అని పేర్కొనబడే లోకానికి 'అహురమజిద' అనే దైవం అధిపతిగా ఉంటాడు. భూమిమీద జీవించి ఉన్నప్పుడు మంచి పనులు చేసిన మానవులు చనిపోయిన తరువాత ఈ స్వర్గలోకానికి చేరుకుంటారని జొరాస్ట్రియన్ మత గ్రంథమైన 'అవెస్తా'లో పేర్కొనబడి ఉన్నది.

చనిపోయిన వ్యక్తి తల దగ్గర ఒక దీపాన్నో, ఒక కొవ్వొత్తినో ఉంచటం ప్రపంచ వ్యాప్తంగా ప్రచారంలో ఉన్నది. అందుకు కారణం ఏమంటే...చనిపోయిన వ్యక్తి

యొక్క ఆత్మకి ఏమీ కనపడదని, ఇలా తల దగ్గర దీపం పెట్టటం వల్ల ఆ ఆత్మకి ఆ దీపం దగ్గర నుండి పై లోకాలకు వెళ్ళే మార్గం కనపడుతుందని, ఆ మార్గాన్ని అనుసరించి ఆ ఆత్మ ఈ లోకం నుండి తాను వెళ్ళ వలసిన లోకానికి ప్రయాణం ప్రారంభిస్తుందని చెబుతారు. భారతదేశంలోని హిందువులు తమ గృహంలో ఎవరైనా చనిపోతే వరుసగా పది రోజులపాటు తమ వాకిట్లో ఒకచోట, రాత్రి సమయాలలో ఒక నూనె దీపాన్ని వెలిగించి ఉంచుతారు. ఒక విశేషం ఏమంటే... ఆధునిక ఐరోపా దేశాలలో కూడా చనిపోయిన వ్యక్తియొక్క తల దగ్గర మరియు కాళ్ళ దగ్గర వెలిగించిన కొవ్వొత్తులను ఉంచుతారు.

ఒకవ్యక్తి చనిపోయినప్పుడు సాధారణంగా ఆ ఇంట్లో వారు మరియు చనిపోయిన వ్యక్తికి శ్రద్ధాంజలి ఘటించటానికి వచ్చినవాళ్ళు – ఆ శరీరాన్ని దహనం చెయ్యటమో లేక సమాధి చెయ్యటమో జరిగేదాకా ఆ శవం ప్రక్కన నిద్రపోకుండా కూర్చుని ఉంటారు. ముఖ్యంగా, రాత్రి సమయాలలో ఈ శవ జాగారం (నిద్ర లేకుండా మెళు కువగా ఉండటం) కొనసాగుతుంది. ఇలా జాగారం చెయ్యటానికి కారణం ఏమంటే – ఒకవ్యక్తి మరణించిన తరువాత అతని శరీరాన్ని పాతి పెట్టటమో లేక దహనం చెయ్యటమో జరిగేదాకా ఆ వ్యక్తియొక్క ఆత్మ తన మృతదేహాన్ని అంటిపెట్టుకుని ఉంటుంది. అలాంటి మృతదేహం ప్రక్కన కూర్చున్న వారిలో ఎవరైనా నిద్రపోతే ఆ నిద్ర పోయిన వ్యక్తిని ఆ మృతదేహం తాలీకు ఆత్మ ఆవహించే అవకాశాలు బలంగా ఉంటాయి. ఇలా జరక్కుండా ఉండటంకోసమే మృతదేహం ప్రక్కన జాగారం చెయ్యటం జరుగుతుంది. ఇంకొక విశేషం ఏమంటే, రష్యాలోని కొన్ని ప్రాంతాలలో ఒక ఇంట్లో ఎవరైనా వ్యక్తి చనిపోతే ఆ వ్యక్తి మృతదేహానికి అంత్య క్రియలు జరిగేదాకా కేవలము ఆ ఇంట్లోని వారే కాక ఆ ఇంట్లో వారికి చెందిన పాడి పశువుల్ని కూడా నిద్రపోకుండా జాగ్రత్త పడతారు.

మృతదేహాలను సమాధి చెయ్యటం లేదా దహనం చెయ్యటం అనే ఆచారం ఇండో–యూరోపియన్ దేశాలలో వాడుకలో ఉండేది. ఆధునిక కాలం వచ్చే సరికి ఇండియా మరియు కొన్ని బౌద్ధమత సంబంధ దేశాలలో మినహా మిగిలిన దేశాలలో మృతదేహాలను సమాధి చెయ్యటం అనే సాంప్రదాయం ప్రధానంగా పాటించబడుతున్నది. వేదాలను, ప్రామాణికంగా తీసుకునే భారతదేశంలోని హిందువులు తమ కుటుంబాలలో చనిపోయిన వారిని దహనం చేస్తారు. ఈ దహనం చేసే విధానం కూడా శాస్త్రోక్తంగా జరుగుతుంది. ఊరి చివర స్మశానంలో శవ

దహనం జరుగుతుంది. నదీ తీరాల్లో మృతదేహాలకు అగ్ని సంస్కారం చేస్తే ఆ మృతదేహాలకు చెందిన ఆత్మలకు పుణ్యలోకాలు లభిస్తాయని హైందవ మతంలో నమ్ముతారు. ఏది ఏమైనా, ఒక చితిపైన దహించబడుతున్న మృతదేహంయొక్క కపాలం (పుఱ్ఱె) పెద్ద శబ్దంతో పగిలేదాకా శవ దహనం కొనసాగుతుంది. పుఱ్ఱె పగలటంతో, ఆ శరీరాన్ని అంటిపెట్టుకుని ఉన్న ఆత్మ ఆ పుఱ్ఱెపగలటం ద్వారా ఏర్పడిన మార్గం ద్వారా బైటకువచ్చి అనంత వాయువుల్లో కలిసిపోతుంది. కొన్ని సమయాలలో, శరీరం అంతా దహనం అయిపోయినప్పటికీ కపాలం మాత్రం పగలదు. అప్పుడు, అక్కడ ఉండే కాటికాపరి ఒక బలమైన కఱ్రతో - చితిపై ఉన్న పుఱ్ఱెపై బలంగా రెండు దెబ్బలు వేస్తాడు. దాంతో ఆ పుఱ్ఱె పగిలిపోతుంది. అనగా కపాల మోక్షం జరుగుతుంది అన్నమాట. కొన్ని సందర్భాలలో హైందవ కుటుంబాలకు చెందిన కొందరు వ్యక్తులు ఎక్కడో దూరంగా దిక్కుమాలిన చావు చనిపోతారు. కనీసం వాళ్ళ మృతదేహం కూడా లభించదు. అలాంటి సందర్భాలలో వస్త్రాలతో, దర్భలతో ఒక మనిషి బొమ్మను తయారుచేసి, ఆ బొమ్మనే చనిపోయిన వ్యక్తియొక్క మృతదేహంగా భావించుకుని దానికి శాస్త్రోక్తంగా అగ్ని సంస్కారం చెయ్యటం జరుగుతుంది.

ప్రతి జీవికీ తన శరీరం మీద ఎంతో మమకారం ఉంటుంది. ఏదైనా ఇంట్లో కొద్దినెలలపాటు ఉంటేనే ఆ ఇంటిమీద మనిషికి ఎంతో అభిమానం (ఎటాచ్‌మెంట్ అనుకుందామా) ఏర్పడుతుంది. ఆపై ఆ ఇంటిని వదిలివెళ్ళాల్సి వచ్చినప్పుడు ఆ వ్యక్తికి ఎంతో బాధ కలుగుతుంది. అలాంటిది, పుట్టినప్పటి నుండి 'తను' అని భావించబడిన తన శరీరాన్ని మరణ సమయంలో వదిలిపెట్టి వెళ్ళటానికి ఆ వ్యక్తి తాలీకు ఆత్మ, మాటల్లో చెప్పలేని ఆవేదనకు గురి అవుతుంది. తన మృతదేహం చుట్టూ ఆ ఆత్మ, అశాంతితో గిరికీలు కొడుతుంది. ఆ మృతదేహానికి ఉన్న 9 రంధ్రాలలో ఏదో ఒక రంధ్రం గుండా మళ్ళీ ఆ శరీరంలో ప్రవేశించాలని శతవిధాలా ప్రయత్నిస్తుంది. కానీ, ఆ ప్రయత్నం ఫలించదు. అప్పుడు ఆ ఆత్మ ఆ శరీరాన్ని అదేపనిగా చూస్తూ రోదిస్తుంది. ఆత్మ పడుతున్న ఈ వేదన, ఆ మృతదేహం చుట్టూ ఉన్న మానవుల భౌతిక నేత్రాలకు కనపడదు. ఆధ్యాత్మిక సాధనలో పండిపోయిన వారికి ఆత్మలు పడే వేదన స్పష్టంగా తెలుస్తుంది మరియు కనపడుతుంది. ఏదిఏమైనా ఆ మృతదేహం యధాతథంగా ఉన్నంతవరకు ఆ ఆత్మ పై లోకాలకు వెళ్ళలేక మహావేదన పొందుతుంది. ఆ కారణంగానే వీలైనంత తొందరలో మృతదేహాన్ని దహనం చేస్తారు.

భారతదేశానికి చెందిన ప్రాచీన ఆర్యులలో మృతదేహాలను దహనం చెయ్యటం మరియు సమాధి చెయ్యటం అనే రెండు పద్ధతులు వాడుకలో ఉండేవి. అయితే, తమ ప్రాంతానికి చెందిన మహా వీరులు, నాయకులు, ప్రభువులు లాంటివారు చనిపోయినప్పుడు వారి మృతదేహాలకు అగ్ని సంస్కారం చేసేవాళ్ళు. అందుకు కారణం ఏమంటే, అలాంటి గొప్పవాళ్ళు దైవాంశతో జన్మించి ఉంటారని, అగ్ని - దైవ సంబంధ లోకాలతో సంబంధం కలిగి ఉంటుందని, అందువలన ఆ అగ్నిలో అటువంటి వ్యక్తులయొక్క మృతదేహాలు దహనం చేసినట్లయితే ఆ మృతదేహాలకు చెందిన ఆత్మలు ఆ అగ్ని సహకారంతో చాలా తొందరగా పైలోకాలకు వెళ్ళిపోతాయని భావించటం జరిగింది. ఇక, ఆనాటి ఆర్యుల ప్రాంతాలలోని సామాన్యుల మృతదేహాలను భూమిలో సమాధి చేసేవారు.

చనిపోయినవారియొక్క ఆత్మలకు మరియు పితృదేవతలకు తేనె చాలా ప్రీతికరమైనదని భారతదేశానికి చెందిన ఆర్యులతో సహా అనేక ఐరోపా దేశాలలో భావించటం జరిగింది. ఆర్యులు, తమ పితృదేవతలకు ఇచ్చే నైవేద్యాలలో తేనె కలిపిన బియ్యపు గంజి లేదా బార్లి గంజి ప్రధానంగా గుర్తించబడింది. ఇక, గ్రీకులు రష్యా ప్రజలు కూడా తమ పెద్దల ఆత్మలకు ఇచ్చే ఆహారంలో తేనెను కూడా కలిపేవారు.



# 12. ప్రాచీన చైనా వేదాంత శాస్త్రంలో 'మరణాంతర జీవితం' గురించి చెప్పబడిన రహస్యాలు?

"ఇన్ (Yin)" మరియు "యాంగ్ (Yang)" అనే రెండు ప్రధాన, ప్రకృతి శక్తుల కలయిక కారణంగా, ఈ సృష్టిలోని అన్ని జీవులు (మనిషితో సహా) మరియు చెట్లు, పర్వతాలు లాంటివి ఏర్పడతాయని, ప్రాచీన చైనా వేదాంతశాస్త్రం ప్రకటించింది. ఇక, మనిషి శరీరంలో ఉండే ప్రాణంలో రెండు భాగాలు ఉంటాయి. అందులో ఒక భాగమైన "పో (Po)", ప్రకృతి శక్తిలోని 'స్త్రీ' భాగం అయిన "ఇన్ (Yin)"కి సంబంధించి ఉంటుంది. ఇక, రెండవ భాగం అయిన "హన్ (Hun)", ప్రకృతి శక్తిలోని పురుష భాగం అయిన "యాంగ్ (Yang)"కి సంబంధించి ఉంటుంది. ఇంకా స్పష్టంగా చెప్పాలంటే ప్రాణంలోని లేదా ఆత్మలోని "హన్ (Hun)" అనే భాగం, ఆకాశ లోకానికి సంబంధించినది కాగా, "పో (Po)" అనే భాగం భౌతిక దేహానికి లేదా

పాతాళలోకానికి సంబంధించినదిగా గుర్తించాలి. మనిషి మరణ సమయంలో అతని ఆత్మలో ఒక భాగంగా ఉండే "హన్ (Hun)", "యాంగ్ (Yang)" స్వభావాన్ని కలిగి ఉండటం వల్ల అనగా వేగవంతమైన స్వభావాన్ని కలిగి ఉన్న కారణంగా, ఆ భాగం చాలా వేగంగా శరీరం నుండి బైటకు వచ్చి, అంతకన్నా వేగంగా పై లోకానికి బయలుదేరుతుంది. ఇక, ఆత్మలో రెండవ భాగంగా ఉండే "పో (Po)", "ఇన్ (Yin)" స్వభావాన్ని కలిగి ఉన్న కారణంగా, అది చాలా నిదానంగా శరీరాన్ని వదిలిపెట్టి వెళుతుంది.

ఆ కారణంగానే ప్రాచీన చైనాలో ఎవరైనా ఒక వ్యక్తి పూర్తిగా స్పృహ కోల్పోయి పడిపోయినా? లేదా చనిపోయినా? – ఆ వ్యక్తి తాలీకు బంధువులు ఒక మంత్రవాదిని వెంటనే అక్కడకు పిలిపించి ఆపై అతనిచేత, పై లోకాలకు వెళ్ళిపోతున్న "హన్ (Hun)"ని క్రిందకు రప్పించటానికి కొన్ని ప్రత్యేకమైన పూజలను చేయించేవాళ్ళు. ఒకవేళ, ఆ మంత్రవాదియొక్క పూజలు ఫలించినట్లయితే, పైకి వెళుతున్న "హన్ (Hun)" మళ్ళీ క్రిందకు తిరిగివచ్చి ఆ శరీరంలోకి ప్రవేశించేది. అప్పటికీ ఇంకా శరీరంలోనే ఉన్న "పో (Po)"తో కలవటం జరిగేది. ఎప్పుడైతే "పో (Po)" మరియు "హన్ (Hun)"లు కలిసాయో ఆ క్షణమే పరిపూర్ణమైన ఆత్మ ఆ శరీరంలో ఏర్పడేది. ఫలితంగా, ఆ మనిషి మళ్ళీ బ్రతకటం జరిగేది. కొన్ని సమయాలలో ఒకవ్యక్తి హఠాత్తుగా చనిపోవటం లేదా హింసాత్మకమైన మృతికి గురి కావటం జరిగినప్పుడు – ఆ వ్యక్తి శరీరంలోని "పో (Po)" మరియు "హన్ (Hun)"లు తీవ్రమైన అసంతృప్తికి గురి అవుతాయి. అలాంటి పరిస్థితుల్లో ఆ వ్యక్తియొక్క మృతదేహాన్ని భూమిలో సమాధి చేసినప్పటికీ, ఆ మనిషిలో "పో (Po)" మరియు "హన్ (Hun)"లు అలాగే ఉండిపోతాయి. ఫలితంగా, ఆ మనిషి ఏదో సమయంలో ఆ సమాధిని చీల్చుకుని బైటకు వస్తాడు. అలా వచ్చిన మనిషి, నిజమైన మనిషి కాదని – ఒక భయంకరమైన పిశాచి అని గుర్తించాలి. ఎందుకంటే, ఒక మనిషి చనిపోయిన తరువాత కూడా అతని శరీరంలో ఆత్మ ఉన్నట్లయితే అతడు పిశాచిగానే గుర్తించబడతాడు. ఏదిఏమైనా, అలా పిశాచిగా మారిన మనుషులు, జీవించి ఉన్న మానవులకు తీవ్రమైన ప్రమాదాలను, అనారోగ్యాలను కలిగిస్తారని ఆ కాలంలో బలంగా విశ్వసించారు. మనిషి ఆత్మలోని "హన్ (Hun)" భాగం, ఆధ్యాత్మిక లేదా జ్ఞాన స్వభావాన్ని కలిగి ఉండగా "పో (Po)" అనే భాగం పశుత్వాన్ని అనగా మూర్ఖత్వాని లేదా అజ్ఞానాన్ని కలిగి ఉంటుందని ప్రాచీన చైనా మేధావులు ఉద్ఘాటించారు.

ప్రాచీన చైనా వేదాంత శాస్త్రంలో చెప్పిన సమాచారం ప్రకారం చూసినట్లయితే – మానవ శరీరం జీవించటానికి అనగా ప్రాణంతో ఉండటానికి రెండు రకాల శక్తులు ("పో (Po)" మరియు"హన్ (Hun)") కారణం అవుతాయి. అందులో "పో (Po)" అనే శక్తి, శరీరానికి సంబంధించింది మరియు భూ తత్వానికి అనగా "ఇన్ (Yin)" తత్వానికి చెంది ఉన్నది. ఆ కారణంగానే మానవ శరీరం – భూమి నుండి లభించే ఆహారం, జలం తీసుకుని బ్రతుకుతుంది. ఇక, రెండవ భాగం అయిన "హన్ (Hun)" విషయానికి వస్తే, ఈ భాగం "చి(Chi)" అనే శక్తిపైన ఆధారపడి ఉంటుంది. అది ఎలాగంటే...ఈ అనంత విశ్వంలో వ్యాపించి ఉండే వాయువులో "చి(Chi)" దాగి ఉంటుంది. మనిషి శరీరంలో ఉండే "హన్ (Hun)" – మనిషి తీసుకునే శ్వాస ద్వారా లభించే "చి(Chi)" శక్తిని స్వీకరించి, ఆ శక్తితో జీవిస్తుంది. అనగా, శ్వాస పీల్చటం మరియు ఆహారం తీసుకోవటం అనే రెండు ముఖ్య కార్యాలపై ఆధారపడి మనిషి బ్రతుకుతాడు అన్నమాట. ఈ అంశాన్ని ప్రాచీన చైనాకు చెందిన ఒక విజ్ఞాని ఒక ఉదాహరణ ద్వారా ఇలా వివరించాడు. "పో (Po)" అనే భాగం – ఒక కొవ్వొత్తి వెలగటానికి కారణమైన పదార్థం అయితే, "హన్ (Hun)" అనే భాగం ఆ కొవ్వొత్తి నుండి వెలువడే లేదా వెదజల్లబడే కాంతి అని గుర్తించాలి.

మనిషి శరీరంలోని కాలేయంలో (లివర్) రక్తం నిలువ చేయబడుతుంది. ఆ రక్తంలో "హన్ (Hun)" నివాసం ఉంటుంది. ఎప్పుడైతే కాలేయంలో ప్రాణశక్తులు (వైటల్ ఎనర్జీస్) బలహీనపడతాయో అనగా బాగా తగ్గిపోతాయో అప్పుడు ఆ మనిషిలో విపరీతమైన భయం కనిపిస్తుంది. అలా కాకుండా కాలేయంలో ప్రాణశక్తుల పరిమాణం అధికంగా పెరిగిపోయినప్పుడు ఆ మనిషిలో క్రోధం కనిపిస్తుంది. ఇక – ఊపిరితిత్తులలో (లంగ్స్) శ్వాస నిలువ ఉంటుంది. ఆ శ్వాసలో "పో (Po)" నివాసం ఉంటుంది. ఎప్పుడైతే ఊపిరితిత్తులలోని ప్రాణశక్తులు బలహీనపడతాయో లేదా ఖాళీ అవుతాయో – అప్పుడు మనిషియొక్క నాసికా రంధ్రాలు మూసుకుపోతాయి. ముక్కు దిబ్బడ పడుతుంది. ఆ సమయంలో మనిషికి ముక్కు ద్వారా శ్వాసించటం సాధ్యంకాదు. అనగా, ఆ సమయంలో ముక్కు తాత్కాలికంగా పనికిరాకుండా పోతుంది అన్నమాట. ఫలితంగా, మనిషి శరీరంలోకి వెళ్ళే శ్వాస పరిమాణం తగ్గిపోతుంది. ఎప్పుడైతే మనిషి ఊపిరితిత్తులలో ప్రాణశక్తి బాగా నిండిపోతుందో లేదా అధికం అవుతుందో అప్పుడు ఆ మనిషి రొప్పటం జరుగుతుంది. అతని ఛాతీ భాగం ఉప్పొంగుతుంది.

కొన్ని సమయాలలో మనిషి, రాత్రిపూట నిద్రపోతున్నప్పుడు అతని శరీరంలో ఉండే "హన్ (Hun)" మరియు "పో (Po)"లు బైటకు వెళ్ళిపోతాయి. ఫలితంగా, మనిషికి భయంకరమైన పీడ కలలు వస్తాయి. ప్రాచీన చైనాకు చెందిన ఒక వైద్యశాస్త్ర గ్రంథంలో ఇలా చెప్పబడి ఉన్నది. "కొన్ని సమయాలలో మనిషి శరీరం నుండి "హన్ (Hun)" మరియు "పో (Po)"లు బైటకు వెళ్ళిపోయి, కొంతకాలం వరకు తిరిగి రావు. ఆ సమయంలో ఆ మనిషి చనిపోడు. కానీ, తీవ్రమైన గందరగోళానికి, ఉన్మాదానికి గురి అవుతాడు. ఎప్పుడైతే మళ్ళీ ఆ రెండు ప్రాణ భాగాలు, శరీరంలోకి చేరుకుంటాయో ఆ వ్యక్తి మళ్ళీ సమతౌల్య స్థితికిచేరుకుని లేచి కూర్చుంటాడు".

స్త్రీ, పురుషుల కలయిక జరిగిన కొన్ని గంటల తరువాత, స్త్రీ గర్భంలో గర్భధారణ ప్రక్రియ మొదలయిన క్షణంలో "పో (Po)" అనే ప్రాణం, ఆ గర్భంలో రూపొందుతున్న పదార్థంలోకి ప్రవేశిస్తుంది. ఆ తరువాత కొద్ది నెలలకు ఆ గర్భం శిశువుగా రూపాంతరం చెంది, ఆపై తొమ్మిది నెలల తరువాత ఏదో ఒక సమయంలో తల్లి గర్భం నుండి బైటకు రాబోతున్న సమయంలో, "హన్ (Hun)" అనే ప్రాణం ఆ బిడ్డ దేహంలోకి ప్రవేశిస్తుంది. అప్పుడు ఆ బిడ్డ, తల్లి గర్భం నుండి బైటకు వస్తుంది. అలా తల్లి గర్భం నుండి బైటకు వచ్చిన బిడ్డ శరీరంలో "ఇన్ (Yin)" మరియు "యాంగ్ (Yang)" ల కలయికతో ఏర్పడిన సంపూర్ణమైన ప్రాణం ఉంటుంది. ఆపై, ఆ బిడ్డ పెరిగి పెద్దవాడై చివరిగా వృద్ధుడు అయి చనిపోయినప్పుడు అతడి భౌతిక దేహంలోని రెండు ప్రాణాలలో ఒకటైన "పో (Po)" ఆ శరీరాన్ని అంటిపెట్టుకుని ఉంటుంది. అలాంటి సమయంలో ఆ మృతదేహానికి సంబంధించిన బంధువులు ఆ మృతదేహం ముందు ఏవైనా నైవేద్యాలు పెట్టటంకాని, జంతువుల్ని బలి ఇవ్వటంగాని చేసినట్లయితే ఆ ప్రాణం, శరీరంలో కొంతకాలంపాటు ఉండిపోతుంది. ఒకవేళ బంధువులు ఏవిధమైన నైవేద్యాలు ఇవ్వనట్లయితే ఈ "పో (Po)" అనే ప్రాణం ఆ మృతదేహాన్ని వదిలిపెట్టి, భూగోళం క్రింద భాగంలో ఉండే మృతుల లోకానికి లేదా నరక లోకానికి వెళ్ళి పోతుంది. నరకలోకంలోకి వెళ్లిన "పో (Po)" ఆత్మలు (ఆత్మలోని సగభాగం) తీవ్రమైన ఆకలిని మరియు దాహాన్ని అనుభవిస్తాయి. అందువల్ల, ఒకవ్యక్తియొక్క మృతదేహాన్ని సమాధి చేసిన తరువాత ఆ మృతదేహంయొక్క బంధువులు ఆ సమాధిమీద ఆహారాన్ని, వస్త్రాన్ని, విలువైన వస్తువుల్ని కూడా ఉంచుతారు. ఆ సమాధిలో ఉండే "పో (Po)" అనే ఆత్మ వాటిని ఉపయోగించుకుని తనయొక్క ఆకలిని మరియు ఇతర అవసరాలను తీర్చుకుంటుందని విశ్వసిస్తారు.

ఇక, ఆత్మలోని రెండవ భాగం అయిన "హన్ (Hun)" – "చి (Chi)" అనే ప్రాణశక్తితో తయారవుతుందని చైనా వేదాంత శాస్త్రం తెలియజేసింది. ఈ "చి (Chi)" అనే శక్తి ఈ విశ్వం అంతా వ్యాపించి ఉంటుందని, అది, ప్రతి జీవిలోను మనిషితో సహా – కదలికలు అనగా చైతన్యం ఉండేలా చేస్తుందని చెబుతారు. ఒక మనిషి చనిపోయినప్పుడు అతని ఆత్మలోని ఒక భాగమైన "పో (Po)" శరీరంలోనే ఉండిపోగా, రెండవ భాగం అయిన "హన్ (Hun)" దైవలోకానికి వెళ్లిపోతుంది. ఈ భూమిమీద మనిషి జీవించినప్పుడు మంచి పనులు చేసాడా? లేదా చెడ్డ పనులు చేసాడా?, పాపాన్ని పొందాడా?, పుణ్యాన్ని సంపాదించాడా? – లాంటి విషయాలన్నీ దైవ లోకంలో నమోదు చెయ్యబడి ఉంటాయి. అందువలన ఏ మనిషి మరణించినా అతని ఆత్మలోని "హన్ (Hun)" అనే భాగం పై లోకానికివెళ్ళి అక్కడ జరిగే పాప–పుణ్య విచారణకు హాజరు అవుతుంది. అక్కడ జరిగే విచారణలో "హన్ (Hun)"కి మంచి చెయ్యాలా? లేదా శిక్ష వెయ్యాలా? అన్న విషయం నిర్ణయం అవుతుంది. ఆ ప్రకారమే "హన్ (Hun)"కి నరక శిక్ష విధించటం లేదా సుఖాలు లభించే పై లోకాలకు వెళ్ళే అవకాశం ఇవ్వటం జరుగుతుంది.

మనిషి శరీరానికి మరియు ఆత్మకు మధ్య చాలా ప్రత్యేకమైన తేడా ఉన్నదని చైనా వేదాంత శాస్త్రం తెలయజేసింది. మనిషి నిద్రపోతున్న సమయంలో అతని ఆత్మ తన శరీరాన్ని వదిలిపెట్టి ఈ భూగోళంతో సహా అంతరిక్షంలో ఉండే అనేక లోకాలకు వెళ్ళి వస్తుందని, ఆ సమయంలో ఆత్మకు కనిపించిన దృశ్యాలు లేదా అనుభవాలు ఆ ఆత్మకు సంబంధించిన వ్యక్తికి స్వప్నాల రూపంలో కనిపిస్తాయని ప్రాచీన చైనా వేదాంతులు ఉద్ఘాటించారు. ఈ సృష్టిలో మనిషికి తెలిసినంతవరకు అత్యంత వేగంగా వెళ్ళగలిగింది "మనస్సు" అని చెబుతారు. కానీ "ఆత్మ" అంతకన్నా వేగంగా ప్రయాణించగలదని, ప్రాచీన చైనాలో చెప్పబడి ఉన్నది. ఒక మనిషి నిద్రపోతున్నప్పుడు, అనంతమైన దూరం ప్రయాణించి ఒకచోటకు చేరుకున్న ఆత్మ, ఆ మనిషి హఠాత్తుగా నిద్రలేచినప్పటికీ అతి కొద్ది సెకన్లలలో అంత దూరం నుండి వచ్చి మళ్ళీ ఆ మనిషి శరీరంలో చేరిపోతుంది.

కొన్ని సమయాలలో మానవులకు మూర్ఛలు వస్తూ ఉంటాయి. అలాంటి సమయంలో మనిషియొక్క ఆత్మ తాత్కాలికంగా శరీరం నుండి బైటకువచ్చి అక్కడికి దగ్గరలో సంచరిస్తూ ఉంటుంది. ఏదిఏమైనా, మనిషి ఆవిధమైన మూర్ఛ స్థితిలో ఉన్నప్పుడు ఆత్మకు మళ్ళీ తన శరీరంలోకి ప్రవేశించటం చాలా కష్టం అయిపోతుంది.

అలాంటి పరిస్థితుల్లో ఆ వ్యక్తికి సంబంధించిన కుటుంబీకులు తమ ఇంట్లో ఉండే ఒక గంటను ఆ వ్యక్తికి ప్రక్కన నిలబడి పెద్ద శబ్దం వచ్చేలా మ్రోగిస్తారు. ఆ శబ్దాన్ని బట్టి తన శరీరం ఎక్కడ ఉన్నదో ఆ ఆత్మకు స్పష్టంగా తెలుస్తుంది. అప్పుడు ఆ ఆత్మ చాలా సులువుగా మళ్ళీ తన శరీరంలోకి ప్రవేశిస్తుంది. ఆ వ్యక్తి మూర్ఛల నుండి బైటపడతాడు. కొన్ని సమయాలలో ఒక మనిషి, మరణశయ్యమీద ఉన్నప్పుడు అనగా ఇంకా కొద్దిసేపట్లో చనిపోవటానికి సిద్ధంగా ఉన్నప్పుడు అతని ఆత్మ శరీరం నుండి బైటకువచ్చి ప్రక్కనే నిలబడుతుంది. అలా మరణ సమయంలో బైటకు వచ్చి నిలబడిన ఆత్మయొక్క రూపం సరిగ్గా ఆ ఆత్మకు సంబంధించిన శరీరం ఏ రూపంలో ఉంటుందో అలా ఉంటుందని తెలుస్తున్నది. మరణ శయ్యమీద ఉన్న ఒకవ్యక్తి ప్రక్కన అతడిని పోలిన రూపమే కనిపించినట్లయితే ఆ వ్యక్తి అతి కొద్దిసేపట్లో ఖచ్చితంగా చనిపోతాడని నిర్ణయిస్తారు.



**ప్రేతలోకంలో సంచరిస్తున్న ఆత్మలు**

ప్రాచీన చైనా మతంలో ఆత్మను 'కువే' అనే పేరుతో పిలిచేవాళ్ళు. ఆత్మకు ఒక ప్రత్యేకమైన ఉనికి ఉంటుందని భావించారు. మనిషి శరీరం నుండి తాత్కాలికంగా బైటకు వెళ్ళినప్పుడు మరియు శాశ్వతంగా బైటకువెళ్ళినప్పుడు (మరణ సమయంలో) కూడా ఆత్మ తన ప్రత్యేక ఉనికిని కలిగి ఉంటుంది. ఇంకొక విశేషం ఏమంటే, ప్రాచీన చైనా భాషలో 'కువే' అనగా "మళ్ళీ తిరిగివచ్చుట" అని అర్థం. ఆ తరువాత కాలంలో ఆత్మకు 'షెన్' అనే ఇంకొక పేరుకూడా ఇవ్వబడింది. ఏదిఏమైనా కాలక్రమంలో ఆత్మకు 'కువే–షెన్' అనే ఒక పేరు స్థిరపడిపోయింది.

ఒక మనిషి చనిపోయిన తరువాత అతని ఆత్మ పై లోకాలకు వెళుతుందని, అప్పుడు దానికి కొన్ని మానవాతీత శక్తులు సంక్రమిస్తాయని, ఆ తరువాత ఆ ఆత్మ భూమిమీదకు తిరిగివచ్చినప్పుడు, అది ఇక్కడ ఉండే మనుషుల కన్నా ఎన్నోరెట్లు అధికమైన శక్తిని ప్రదర్శిస్తుందని చైనా మతంలో విశ్వసించబడింది. ఆ కారణంగానే ప్రాచీన చైనాలో ప్రేతాత్మలకు పూజలు కూడా చేసే సాంప్రదాయం ప్రారంభం అయ్యింది. ఇప్పటికి కూడా చైనాలో ప్రేతాత్మలను పూజించే సాంప్రదాయం కొనసాగుతున్నది.

చనిపోయిన మనిషిని సమాధి చేసిన తరువాత, సమాధి చెయ్యబడిన వ్యక్తియొక్క పేరును చెక్కిన ఒక శిలాఫలకాన్ని ఆ సమాధిపై ఉంచటం జరిగేది. అందుకు కారణం ఏమంటే, ఒక మనిషి చనిపోయిన తరువాత అతని ఆత్మ ఆ శరీరాన్ని వదిలిపెట్టి తాత్కాలికంగా పైలోకాలకు వెళుతుంది. అలా పై లోకాలకు వెళ్లిన కొద్ది రోజులకో లేదా కొద్ది నెలలకో మళ్ళీ తిరిగి భూమిమీదకు వస్తుంది. అక్కడకు వచ్చిన తరువాత దానికి – తన మృతదేహం సమాధి చెయ్యబడిందని తెలుస్తుంది. అప్పుడు అది తన సమాధి ఎక్కడ ఉన్నదో వెతుక్కుంటూ వెళుతుంది. ఏ సమాధి పైన అయితే తన పేరు కనిపిస్తుందో ఆ సమాధిలో తన మృతదేహం ఉన్నదని అర్థంచేసుకుని ఆపై ఆ సమాధిలోకి ప్రవేశించి అప్పటి నుండి ఆ సమాధినే తన శాశ్వత నివాసంగా మార్చుకుంటుంది.

ఏదిఏమైనా, సమాధిలో ఉన్నప్పటికీ ఆత్మలు తమకు ఇష్టమైనప్పుడు సమాధుల నుండి బైటకు వచ్చి, ఆపై ప్రాణం ఉన్న జీవులను, మనుషులను ఆవహించి ఆ జీవులను తమ ఇష్టం వచ్చినట్లుగా ఆడిస్తాయి. అలాగే, ప్రాణంలేని వస్తువులను కూడా ఆత్మలు ఆవహించి ఆ వస్తువుల్ని కదిలేలా చెయ్యగలవని ప్రాచీన చైనా మత పండితులు ఉద్ఘాటించారు.

చనిపోయిన వ్యక్తులయొక్క ఆత్మలతో సంభాషించి, ఆపై వాటి ద్వారా భవిష్యత్తుకు సంబంధించిన విషయాలను తెలుసుకునే సాంప్రదాయం ప్రాచీన చైనాలో ప్రముఖంగా సాగినట్లుగా తెలుస్తున్నది. ఆత్మలతో మాట్లాడటంకోసం ఆనాటి మంత్రవాదుల కొన్ని ప్రత్యేకమైన పద్ధతులను పాటించినట్లుగా తెలుస్తున్నది. అది ఎలాగంటే...

వెడల్పుగా ఉండే ఒక బల్లమీద పల్లగా ఇసుకని పరుస్తారు. ఆ తరువాత ఒకవ్యక్తి, 12 అంగుళాలు పొడవు ఉండే ఒక కఱ్ఱపుల్లని చేత్తో పట్టుకుని ఆ బల్ల దగ్గర నిలబడతాడు. ఆ తరువాత ఇంకొొక వ్యక్తి, తనకు పరిచయం ఉన్న ఏదో ఒక

ఆత్మని మంత్రాలతో అక్కడికి రప్పిస్తాడు. ఆ తరువాత తనకు కావలసిన ఒక సమాచారం గురించి సమాధానం చెప్పమని ఆ ఆత్మను అడుగుతాడు. అప్పుడు ఆ ఆత్మ, ఇసుక బల్ల దగ్గర నిలబడి ఉన్న వ్యక్తి చేతిలోని పుల్లను ఆవహిస్తుంది. ఆపై, ఆ పుల్లను పట్టుకున్న వ్యక్తి ప్రయత్నంతో సంబంధం లేకుండా ఆ పుల్ల మెల్లిగా కదులుతూ ఆ ఇసుకలో ఆ వ్యక్తి అడిగిన ప్రశ్నలకు సంక్షిప్తంగా సమాధానాలు వ్రాస్తుంది. కొన్ని సమయాలలో అసలు ఆత్మకు బదులుగా వేరే ఆత్మ వచ్చి ఆ పుల్లను ఆవహించి తప్పుడు సమాధానాలు వ్రాస్తుంది. అలాంటి సమయాలలో భవిష్యత్తును గురించి సరైన సమాచారం రాదని చెబుతారు.

ప్రాచీన చైనాలో జనసంఖ్య తక్కువగా ఉండేది. అడవుల సంఖ్య అధికంగా ఉండేది. అలాంటి సమయంలో ఎవరైనా మనిషి పొరపాటున క్రూరమైన ఒక పులికి ఎదురుపడితే ఆ పులి ఆ మనిషిని చంపి తినివెయ్యటం జరిగేది. అలా ఆ పులిచేత చంపబడిన మనిషియొక్క ఆత్మ, ఆ పులి శరీరాన్ని ఆవహించేది. అలా ఆవహించిన ఆత్మ ఆ పులిని తన ఇష్టంవచ్చినట్లుగా ఆడించేది. అనగా ఆ పులి పిచ్చిపట్టినదానిలాగా అటు ఇటు పరుగెడుతూ ఆపై తనకు కనిపించిన ప్రతి మనిషినీ లేదా తన కన్నా తక్కువ బలం ఉన్న జీవుల్ని నిర్దాక్షణ్యంగా చంపుతూ ఉండేది. ఆ తరువాత ఆ పులిని ఎవరో ఒక వేటగాడు లేదా దానికన్నా ఏదైనా బలమైన జంతువు చంపినప్పుడు, అప్పటి దాకా ఆ పులి దేహాన్ని ఆవహించి ఉన్న మనిషి ఆత్మ, ఆ పులి మృతదేహం నుండి బైటకువచ్చి ఆపై ఆ పులిని చంపిన మనిషిని లేదా జంతువుని ఆవహించటం జరిగేది. ఈవిధంగా ఒక మనిషి ఆత్మ చాలాకాలంపాటు ఒక జీవి నుండి ఇంకొక జీవికి లేదా ఒక మనిషి నుండి ఇంకొక మనిషికి బదిలీ అవుతూ, ఎంతోమందిని చంపుతూ ఉండేది. ఇంకొక విశేషం ఏమంటే, కొన్ని సమయాలలో మనిషి ప్రేతాత్మచేత ఆవహించబడిన పులిని చంపిన వ్యక్తిని ఆ మనిషి ప్రేతాత్మ ఆవహించిన తరువాత ఆ మనిషి రాత్రి సమయాలలో పులిగా మారి, జనాలు ఉన్న ప్రదేశాలలో సంచరిస్తూ ఆపై తనకు ఒంటరిగా దొరికిన మనిషిని చంపి తినివెయ్యటం, ఆపై తెల్లవారే సరికి మళ్ళీ మానవ రూపం ధరించి మానవ సమాజంలో మామూలుగా జీవించటం జరిగేది. ఇలా మనిషిరూపం నుండి పులి రూపంలోకి, మళ్ళీ పులి రూపం నుండి మనిషి రూపంలోకి మారిన వ్యక్తుల యొక్క అనేక యదార్ధ సంఘటనలు క్రీ.పూ. 6 మరియు 7వ శతాబ్దాల మధ్యకాలంలో చైనాలో జరిగినట్లుగా ఆ కాలంలో లిఖించబడిన గ్రంధాలలో నమోదు చెయ్యబడి ఉన్నది. కొన్నిసార్లు శ్మశానాలలో ఉన్న కొన్ని సమాధులను – తోడేళ్ళు, హైనాలు, గుంటనక్కలు, నక్కలు, అడవి

ఎలుకలు, గుడ్లగూబలు, త్రాచుపాములు లాంటి జంతువులు లేదా జీవులు తమ నివాసాలుగా మార్చుకోవటం జరిగేది. ఆ సందర్భంలో, ఆ సమాధులలో ఉండే ఆత్మలు, ఆ జీవుల్ని ఆవహించటం జరిగేది. ఫలితంగా, ఆ జీవులకు సృష్టికి విరుద్ధంగా అనేక అద్భుతమైన శక్తులు సంక్రమించేవి.

ఒకచోట చనిపోయి పడి ఉన్న ఒక మనిషి దేహాన్ని ఒక ఆత్మ వచ్చి ఆవహించి నప్పుడు ఆ మృతదేహం హఠాత్తుగా లేచి నిలబడటం జరిగేది. ఇలా మళ్ళీ బ్రతికిన ఆ మృతదేహాలకు కూడా ఆహారం అవసరం అయ్యేది. మనిషి రక్తమే వాటికి ఆహారం అయిన కారణంగా అవి, రాత్రి సమయాలలో గ్రామాలలోకి ప్రవేశించి ఆపై తమకి ఒంటరిగా దొరికిన మనిషిని మెడ కొరికి చంపి అతడి రక్తాన్ని సంపూర్తిగా త్రాగేసేవి. మళ్ళీ తెల్లవారే సమయానికి తమ సమాధిలోకి వెళ్ళిపోయేవి. ఆ కారణంగానే ఎక్కడైనా ఒక మృతదేహం మళ్ళీ లేచి నిలబడి అటు ఇటు నడుస్తూ కనపడినట్లయితే ఆ సమయంలో అటుగా వచ్చిన వ్యక్తులు ఆ మృతదేహాన్ని తగలపెట్టి నాశనం చెయ్యటం జరిగేది. కొన్ని సమయాలలో ఒక మృతదేహాన్ని ఆవహించిన ఆత్మ, ఆ విషయాన్ని రెండో మనిషికి తెలియకుండా రహస్యంగా ఉంచి, ఆపై ఆ మృతదేహానికి సంబంధించిన వ్యక్తియొక్క కుటుంబంలో ప్రవేశించి ఆ తరువాత కొంతకాలంపాటు ఆ కుటుంబంలో మామూలుగా జీవించటం జరిగేది. ఇలాంటి సంఘటనలు ప్రాచీన చైనాలో చాలా జరిగాయి. అలాంటి వాటిలో ఒకదాని గురించి ఇక్కడ తెలుసుకుందాం...

దాదాపు 500 సంవత్సరాల క్రితం, ఒక సమయంలో చౌచీచింగ్ అనే ఒక వ్యక్తి, బీజింగ్ పట్టణంలో నివసిస్తూ ఉండేవాడు. అతడు ఒకసారి పాము కరిచి చనిపోయాడు. ఆపై అతని ఆత్మ, ప్రేత లోకానికివెళ్ళి అక్కడ 12 సంవత్సరాల పాటు కాలం గడిపి ఆపై ఒకరోజున భూమిమీదకు తిరిగి వచ్చింది. అలా తిరిగి వచ్చిన ఆ ఆత్మ, మొదట తన సొంత ఇంటి ముందుకు వచ్చింది. ఆ సమయంలో చౌచీచింగ్ ప్రక్కింటి యజమాని అయిన ఒక యువకుడు చనిపోయాడు. ఆ యువకుడి యొక్క అందమైన భార్య మరియు ఇద్దరు చిన్నపిల్లలు మరియు ఆ యువకుడి బంధువులు ఆ మృతదేహం దగ్గర నిలబడి రోదిస్తున్నారు. ఆ సమయానికి అక్కడకు వచ్చిన చౌచీచింగ్ ఆత్మ, పరిస్థితిని శ్రద్ధగా పరిశీలించింది. ఆ తరువాత ఆ యువకుడి మృతదేహంలోకి ప్రవేశించింది. సరిగ్గా రెండు నిమిషాలలో ఆ యువకుడు లేచి కూర్చుని ఆపై 5 సార్లు పెద్దగా తుమ్మాడు. ఆ యువకుడు తిరిగి బ్రతకటంతో అతడి

భార్య మరియు కుటుంబ సభ్యులు చాలా ఆనంద పడ్డారు. ఆ తరువాత ఆ యువకుడు చాలా ఏళ్లపాటు ఆ అందమైన భార్యతో కాపురంచేసి ఇద్దరు మగ పిల్లల్నికూడా కన్నాడు. అంతేకాదు, ఆమెకు ఆమె అసలు భర్తవల్ల ఇంతకముందు పుట్టిన ఇద్దరు మగ పిల్లల్ని కూడా ఎంతో ప్రేమగా పెంచి పెద్దచేసాడు.

చైనాలోని గ్రామీణ ప్రాంతాలలో గతంలో ఏదో ఒక కారణం వల్ల వయస్సుకి వచ్చిన ఆడపిల్లలు పెళ్ళి కాకుండానే చనిపోవటం జరిగేది. అలా చనిపోయిన ఆడ పిల్లలయొక్క మృతదేహాలను – ఏవైనా ఆత్మలు ఆవహించేవి. ఫలితంగా, ఆ మృతదేహాలు మళ్ళీ బ్రతికి లేచేవి. ఈ విధంగా ఆత్మలు ఆవహించటంవల్ల తిరిగి బ్రతికిన కొందరు అమ్మాయిలు ఆపై చక్కటి యువకుల్ని వివాహం చేసుకుని అనేక సంవత్సరాలపాటు కాపురాలు సాగించిన సంఘటనలు ప్రాచీన చైనాలో వందలకొద్ది జరిగినట్లుగా ఆనాటి గ్రంథాలలో చెప్పబడి ఉన్నది.

మానవ లోకంలోకి తిరిగి వచ్చిన ఆత్మలు తమ గతంలో లాగానే మళ్ళీ మానవ జీవితం గడపాలని ఆశిస్తాయి. అలా గడపాలంటే అవి, కొన్నిసార్లు మళ్ళీ మనిషిగా జన్మించాల్సి ఉంటుంది. అలాంటి పరిస్థితుల్లో ఆత్మ, ఒక గర్భస్థ శిశువును ఆవహించి, ఆపై మనిషిగా జన్మిస్తుంది. అలా మళ్ళీ జన్మించిన ఒక చైనా పండితుడి యదార్ధ సంఘటన గురించి తెలుసుకుందాం...

ప్రాచీన చైనాలో పావోచింగ్ అనే 25 సంవత్సరాల వయస్సు ఉన్న ఒక మహా పండితుడు ఉండేవాడు. అతడు ఒక సమయంలో తన శిష్యులతో ఇలా చెప్పాడు. “నేను, గతజన్మలో తొమ్మిది సంవత్సరాల బాలుడిగా ఉన్నప్పుడు ఒక పాడు పడిన బావిలో పడిపోయి చనిపోయాను”. ఈ విషయం నిజమో? కాదో? తెలుసుకోవాలని నిర్ణయించుకున్న కొందరు శిష్యులు ఆ పండితుడు చెప్పిన పాడుపడిన బావి దగ్గరకు వెళ్ళి, ఆపై ఆ బావిలోకి దిగి అడుగుకి వెళ్ళారు. అక్కడ ఇసుకలో కూరుకుపోయిన ఒక బాలుడి అస్థిపంజరం వాళ్ళకి కనిపించింది. ఆ తరువాత వాళ్ళు ఆ అస్థిపంజరాన్ని బైటకు తీసుకువచ్చి, ఆ బావికి దగ్గరగా ఉన్న గ్రామంలోకివెళ్ళి ఆ గ్రామంలో 25 లేదా 26 ఏళ్ళ క్రితం ఎవరైనా బాలుడు అకస్మాత్తుగా అదృశ్యం అయిపోయాడా? లేదా? అని తెలుసుకోవాలని ప్రయత్నించాడు. చివరికి ఆ గ్రామంలోని ఒక కుటుంబానికి చెందిన తొమ్మిది సంవత్సరాల బాలుడు, 26 సంవత్సరాల క్రితం ఒక రోజు ఉదయంపూట బైటకువెళ్ళి మళ్ళీ తిరిగి రాలేదని తెలిసింది. ఆ బాలుడు ఇంట్లోంచి బైటకు వెళ్ళే సమయంలో అతని మెడలో ఒక ఎర్రటి రంగులో ఉన్న ఒక

రత్నం పొదిగిన లాకెట్ ఉన్నదని తెలిసింది. ఆపై ఆ శిష్యులు, తాము బావిలో నుండి తీసిన అస్థిపంజరం దగ్గరకువెళ్లి ఆ అస్థిపంజరాన్ని పరిశీలనగా చూసినప్పుడు దాని మెడలో, బాగా తుప్పుపట్టి ఉన్న లాకెట్ మరియు ఆ లాకెట్‌లో పొదగబడి ఉన్న మరియు మురికిపట్టి ఉన్న రత్నం కనిపించింది. తమ గురువు, గతజన్మలో చనిపోయిన ఆ బాలుడే అని ఆ రుజువుతో వాళ్ళకి స్పష్టంగా అర్థమయ్యింది.

చైనాలోని ఒక గ్రామీణ ప్రాంతంలో నివసించిన యాంగ్‌హూ అనే 5 సంవత్సరాల బాలుడు తన తల్లిదండ్రులను తరచుగా ఇలా అడుగుతూ ఉండేవాడు. “నేను ఎప్పుడూ ఆడుకునే ఆ ఉంగరం ఎక్కడ ఉన్నదో చెప్పండి”. నిజానికి ఆ బాలుడికి ఆ తల్లిదండ్రులు అప్పటి వరకు ఎలాంటి ఉంగరాన్ని ఇచ్చి ఉండలేదు. అదే విషయాన్ని వాళ్ళు ఆ బాలుడికి చెప్పారు. అప్పుడు ఆ బాలుడు వాళ్ళతో ఇలా అన్నాడు. “నాతోపాటు రండి. నేను గతంలో ఆడుకున్న ఉంగరాన్ని మీకు చూపిస్తాను”. ఆపై ఆ బాలుడు తన తల్లిదండ్రులను వెంటపెట్టుకుని వాళ్ళ పక్కింటి పెరట్లో ఉన్న ఒక పెద్ద మల్బరీ చెట్టు దగ్గరకు తీసుకువెళ్ళాడు. ఆ తరువాత ఆ చెట్టు కాండంమీద ఉన్న ఒక చిన్న రంధ్రంలో తన చేయి పెట్టి, ఆపై ఆ రంధ్రంలో నుండి ఒక ఉంగరాన్ని బైటకుతీసి తన తల్లిదండ్రులకు చూపించాడు. అది చూసిన ఆ తల్లిదండ్రులు నిర్ఘాంతపోయారు. ఎందుకంటే, కొద్ది సంవత్సరాల క్రితం – పది సంవత్సరాల వయస్సు ఉన్న వాళ్ళ పెద్ద కొడుకు చనిపోయాడు. ఆ ఉంగరాన్ని వాళ్ళు ఆ అబ్బాయికి ఒక పుట్టినరోజు సందర్భంలో కానుకగా ఇచ్చారు. ఆ అబ్బాయి ఆ ఉంగరంమీద ఎంతో ప్రేమ పెంచుకున్నాడు. అప్పుడప్పుడు దానిని వేలు నుండి ఇవతలికి తీసి దాంతో ఆడుకుంటూ ఉండేవాడు. ఆ అబ్బాయి అప్పుడప్పుడూ పక్కించివాళ్ళ పెరట్లో ఉన్న మల్బరీ చెట్టు దగ్గరకువెళ్ళి, దాని మొదలు దగ్గర కూర్చుని ఆడుకుంటూ ఉండేవాడు. – అనగా గతంలో చనిపోయిన వాళ్ళ పెద్దకొడుకే మళ్ళీ కొన్నేళ్ళ తరువాత వాళ్ళ చిన్న కొడుకుగా పుట్టాడు అన్నమాట.

ఇంకొక విశేషం ఏమంటే, ఒక బాలుడు లేదా యుక్తవయస్కుడు జీవించి ఉన్నప్పుడు వాళ్ళ శరీరంపైన ఏదైనా భాగంలో ఏవైనా పుట్టుమచ్చలు లేదా గాయపు మచ్చలు ఉన్నట్లయితే – వాళ్ళు చనిపోయి మళ్ళీ జన్మించిన తరువాత కూడా అవే మచ్చలు సరిగ్గా అవే శరీర భాగాల మీద ఉండటం జరుగుతుందని ప్రాచీన చైనాలో బలంగా విశ్వసించారు. విచిత్రం ఏమంటే, ఆధునిక కాలానికి చెందిన పాశ్చాత్య పరిశోధకులు కూడా ఇదే అంశాన్ని బలపరచటం జరుగుతున్నది.

కొన్ని సమయాలలో, ఒక స్త్రీ చనిపోయి మళ్ళీ పురుషుడిగా జన్మించవచ్చు. అలాగే ఒక పురుషుడు మళ్లీ స్త్రీగా జన్మించవచ్చు. ఇందుకు సంబంధించిన ఒక యదార్థ ఉదాహరణ ప్రాచీన చైనాలో ఒకటి కనిపిస్తుంది. అది ఏమిటంటే...సియాంగ్ అనే ఒక పది సంవత్సరాల బాలిక, ఏదో భయంకరమైన వ్యాధి కారణంగా హఠాత్తుగా చనిపోయింది. ఆ తరువాత ఆ బాలిక మళ్ళీ తన తల్లికి కొడుకుగా జన్మించింది. అలా జన్మించిన ఆ మగబిడ్డకి మూడేళ్ళకు మాటలు రావటం మొదలయ్యింది. అప్పుడు ఆ మగబిడ్డ తరచుగా తన తల్లిని ఇలా అడుగుతూ ఉండేవాడు. "నేను ఇది వరకు ఆడుకునే బొమ్మలు ఎక్కడ పెట్టావో చెప్పు?". అనగా – ఆ మగబిడ్డ గత జన్మలో ఆడ పిల్లగా ఉన్నప్పుడు ఆడుకున్న బొమ్మలు, తనకు ఇప్పుడు కావాలని అడుగుతున్నాడు. ఆ బొమ్మల గురించి కేవలం, గతంలో చనిపోయిన ఆ ఆడపిల్లకి మరియు ఇప్పుడు బ్రతికి ఉన్న ఆమె తల్లికి తప్ప ఇప్పుడు పుట్టిన బాలుడికి తెలిసే అవకాశం లేదు. ఎవరూ చెప్పకుండానే ఆ బాలుడికి ఆ బొమ్మల గురించి తెలిసింది అంటే, గతంలో చనిపోయిన ఆ బాలికే ఇప్పుడు ఈ బాలుడిగా జన్మించింది అన్నమాట.

కొన్ని సమయాలలో ఆత్మలు, కొందరు మానవుల్ని ఆవహించి వాళ్ళకి ప్రమాదకరమైన వ్యాధులు వచ్చేలా చేస్తాయి. ఆ వ్యాధులతో వాళ్ళు నరకయాతన పడుతూ ఉండే – వాళ్ళని ఆవహించిన ఆత్మలు ఒకవిధమైన రాక్షస ఆనందాన్ని పొందుతూ ఉంటాయని చెబుతారు. అదేవిధంగా, కొన్ని సమయాలలో కొందరు వీరులు చనిపోయినప్పుడు ఆ వీరుల మృతదేహాలతోపాటుగా వారి ఆయుధాలను కూడా భూమిలో సమాధిచేస్తూ ఉండేవాళ్ళు. అలా సమాధి చేయబడిన ఆయుధాలు ఆ తరువాతకాలంలో మానవులకు తీవ్రమైన శారీరక బాధను కలిగించటం జరుగుతుంది. కొన్నిసార్లు ఆ ఆయుధాల ప్రభావంవల్ల మానవులు చనిపోవటం కూడా జరుగుతుంది. ఈ విషయం నిరూపించే అనేక సంఘటనలు ప్రాచీన చైనాలో జరిగాయి. అలాంటి వాటిలో ఆసక్తికరమైన ఒక సంఘటన గురించి ఇక్కడ తెలియజేస్తాను.

ప్రాచీన చైనాలోని పెకింగ్ పట్టణ పొలిమేరల్లో ఉన్న ఒక ప్రాంతంలో టుంగ్ అనే వ్యక్తి తన భార్య మరియు ముగ్గురు కూతుళ్ళతో కలిసి ఒక పాతకాలం నాటి భవనంలో నివసిస్తూ ఉండేవాళ్ళు. ఆ భవనం, టుంగ్ యొక్క ముత్తాత కాలంలో కట్టబడింది. అయితే టుంగ్, మొదట్లో పెకింగ్‌లోని ఇంకొక ప్రదేశంలో నివసిస్తూ ఉండేవాడు. ఆ తరువాత కొంతకాలానికి తన పూర్వీకుల గృహానికి మారిపోయాడు.

ఏదిఏమైనా, టుంగ్ తన కుటుంబంతో సహా ఆ పాతకాలం ఇంటికి వచ్చినప్పటి నుండి అతడి గృహంలోని ఆడవాళ్ళకి తీవ్రమైన శారీరక బాధలు ప్రారంభం అయ్యాయి. అది ఎలాగంటే, అతడి భార్యకి మరియు చిన్న కూతుళ్ళు ఇద్దరికి రోజులో చాలా సేపు తలని శూలాలతో పొడుస్తున్నట్లుగా విపరీతమైన తలనొప్పి ఉండేది. అంతేకాకుండా, వాళ్ళ ముగ్గురికి గుండె విపరీతంగా కొట్టుకుంటూ ఉండేది. ఇంకొక విశేషం ఏమంటే, రాత్రి సమయంలో ఆ ఆడవాళ్ళు తమ తమ పడకలపై పడుకుని నిద్రపోతున్నప్పుడు ఏవో అదృశ్య హస్తాలు వాళ్ళ కంఠాలను చాలా బలంగా పిసుకుతున్నట్లుగా వాళ్ళకి అనిపించేది. అందుకు కారణం ఏమిటో అర్థంకాక ఆ ఆడవాళ్ళు ఎన్నోరాత్రులు నిద్రలేక అలమటించిపోతూ ఉండేవాళ్ళు.

మొదట్లో టుంగ్, వాళ్ళకి ఏదో అనారోగ్య సమస్య ఉన్నదని భావించి కొంతమంది వైద్యులను తన ఇంటికి రప్పించి వాళ్ళచేత తన భార్యకు మరియు కూతుళ్ళకు వైద్యం చేయించాడు. అయినా సరే, వాళ్ళ శారీరక బాధలు ఏమాత్రం తగ్గలేదు. ఆ పరిస్థితుల్లో టుంగ్, ఆ కాలంలో పెకింగ్ ప్రాంతంలో మహా జ్యోతిష్కుడిగా మరియు మంత్రవాదిగా గుర్తించబడిన 'కున్‌లు' అనే ఒక వృద్ధుడిని తన ఇంటికి రప్పించి అతడికి తన ఇంట్లోని ఆడవాళ్ళు పడుతున్న శారీరక బాధల గురించి వివరించాడు. అప్పుడు ఆ పండితుడు, కాసేపు ధ్యానం చేసుకుని ఆపై కొన్ని మంత్రాలు జపించాడు. ఆ తరువాత వణుకుతున్న స్వరంతో టుంగ్‌తో ఇలా అన్నాడు.

"ఈ గృహం మధ్య భాగంలో ఉన్న హాలుకి నైఋతి మూలలో ఇద్దరు మనుషుల మొండాలు 50 సంవత్సరాల క్రితం సమాధి చేయబడ్డాయి. ఆ మొండాలతో పాటుగా వాళ్ళ ఆయుధాలైన ఒక బరిసె, ధనస్సు మరియు బాణాలు కూడా సమాధి చేయబడ్డాయి. ఇంకొక విశేషం ఏమంటే, ఆ ఇద్దరి యొక్క తలలు ఈ హాలులోని ఆగ్నేయ మూలలో సమాధి చేయబడ్డాయి. ఆ సమాధులలో ఉంచబడిన ఆయుధాలయొక్క చెడు ప్రభావం కారణంగా నీ భార్య మరియు కుమార్తెలకు శిరస్సు మరియు గుండెకు సంబంధించిన బాధలు కలుగుతున్నాయి. అంతేకాదు, ఆ సమాధులలో ఉన్న వ్యక్తులయొక్క ఆత్మలు, రాత్రి సమయంలో బైటకువచ్చి నీ భార్య మరియు కుమార్తెల గొంతులను పిసుకుతున్నాయి. ఆ ఆత్మలు ఏ క్షణంలో అయినా సరే, నీ భార్య మరియు కుమార్తెలను చంపేసే అవకాశం ఉన్నది. తొందరగా ఏదో ఒక పరిహారం ఆలోచించు".

ఆ వృద్ధ పండితుడు చెప్పిన మాటలు విన్న టుంగ్, కొద్ది నిమిషాల పాటు భయంతో విగ్రహంలాగా ఉండిపోయాడు. ఆ తరువాత ధైర్యం తెచ్చుకుని ఆ వృద్ధ పండితుడితో ఇలా అన్నాడు. "నీవే నా సమస్యకి పరిష్కారం ఏమిటో చెప్పాలి. నువ్వు ఏది చెబితే అది చేస్తాను". అప్పుడు ఆ వృద్ధ పండితుడు గంభీరమైన స్వరంతో ఇలా అన్నాడు. "నీవు వెంటనే నీ ఇంటి హాలులో సమాధి చేయబడిన అస్థిపంజరాలను బైటకు తీయించి, ఆపై వాటిని ఈ ప్రాంతానికి మూడు మైళ్ళ దూరంలో ఉన్న పర్వత పాదం దగ్గర సమాధి చేయించు. అలా చేస్తే నీ ఇంటిపై ఉన్న ఆ ఆత్మలయొక్క చెడు ప్రభావం తొలగిపోతుంది. ఆపై, నీ కుటుంబ సభ్యుల ఆరోగ్యం చక్కబడుతుంది". ఆ రోజు మధ్యాహ్నమే టుంగ్, కొంతమంది పనివాళ్ళను రప్పించి, ఆ వృద్ధ పండితుడి సమక్షంలోనే ఆ హాలు రెండు మూలల్లో ఉన్న సమాధులను త్రవ్వించి, ఆపై వాటిలోంచి అస్థిపంజరాలను, ఆయుధాలను, పుట్టెలను బైటకు తీయించి దూరంగా ఉన్న పర్వతపాదం వద్ద సమాధి చేయించాడు. అప్పటి నుండి టుంగ్ కుటుంబ సభ్యులకు ఏ అనారోగ్యం రాలేదు.

కొన్ని సమయాలలో ఒక మనిషి బ్రతికి ఉన్నప్పుడు కూడా అతడిని లేదా ఆమెను ఏదో ఒక ఆత్మ ఆవహించే అవకాశం ఉంటుందని ప్రాచీన చైనా మంత్రశాస్త్రంలో చెప్పబడి ఉన్నది. ఇలా, బ్రతికి ఉన్న మనుషుల్ని ఆత్మలు ఆవహించినప్పుడు ఆ మనుషులకు తాత్కాలికంగా పిచ్చి పడుతుంది. సాధారణంగా, ఒక వ్యక్తిచేత హత్యచేయబడిన వ్యక్తియొక్క ఆత్మ లేదా ఒకవ్యక్తిచేత తీవ్రంగా హింసించబడి ఆపై చనిపోయిన వ్యక్తియొక్క ఆత్మ – తన మరణానికి కారణమైన వ్యక్తిని ఆవహించి ఆ వ్యక్తిచేత హత్యలు, మానభంగాలు, దౌర్జన్యాలు లాంటివి చేయించటం జరుగుతుంది. ఇలా ఆత్మ ఆవహించటంవల్ల తీవ్రమైన నేరాలు చేసిన వ్యక్తిని అతడు ఉండే సమాజంలోని మానవులు ఏదో ఒక సమయంలో కొట్టి చంపటం జరుగుతుంది లేదా ఆ ప్రాంతంలో ఉండే ప్రభుత్వం ఆ వ్యక్తిని తన అదుపులోకి తీసుకుని, ఆపై అతనికి కఠినమైన ఉరిశిక్షను విధిస్తుంది. ఆ వ్యక్తిని ఆవహించిన ఆత్మలు ఆవిధంగా తమకు ఆ వ్యక్తివల్ల జరిగిన అన్యాయానికి ప్రతీకారాన్ని తీర్చుకుంటాయి అన్నమాట.

చాలా మంది భారతీయ విద్యావంతులకు కూడా తెలియని ఒక ఆశ్చర్యకరమైన విషయం ఏమంటే, కొన్ని వందల సంవత్సరాల క్రితమే ఆనాటి చైనాలోని ప్రభుత్వం – ఆ దేశంలోని విద్యావంతులైన యువకులకు వ్రాత పరీక్షలు (రిటెన్ టెస్ట్‌లు)

మరియు మౌఖిక పరీక్షలు (ఇంటర్వ్యూలు) నిర్వహించి, ఆపై ఆ పరీక్షలలో ఉత్తీర్ణులైన వారికి ప్రభుత్వ ఉద్యోగాలు ఇవ్వటం జరిగేది. అంతేకాదు, ప్రజలందరికీ న్యాయం చెప్పే న్యాయమూర్తి (జడ్జి) ఉద్యోగాలకు కూడా ప్రాచీన చైనాలో పరీక్షలు నిర్వహించబడేవి. సరే, ఈ విషయం అలా ఉంచి ఆత్మల విషయానికి వద్దాం.

ప్రాచీన చైనాలో ప్రభుత్వ ఉద్యోగాలకోసం పరీక్షలు వ్రాయటానికి సిద్ధపడుతున్న యువకులలో కొందరు యువకులు తాము పరీక్షల్లో విజయం సాధించటానికి ఏదో ఒక ఆత్మ సహాయాన్ని ఆశించేవాళ్ళు. అలా ఆత్మల సహాయాన్ని ఆశించిన విద్యార్థులు పరీక్షలు వ్రాయటానికి ఒక హాలులో వరుసగా కూర్చుని ఉన్నప్పుడు వాళ్ళలో ఎవరైతే ఆత్మల సహాయం కోరారో, ఆ విద్యార్థులను వాళ్ళు కోరిన ఆత్మలు ఆవహించేవి. ఆత్మలకు అసాధారణమైన మేధస్సు కూడా ఉంటుంది కనుక ఆ ఆత్మలు, తాము ఆవహించిన విద్యార్థులచేత అద్భుతంగా పరీక్షలు వ్రాయించేవి. ఫలితంగా, ఆ విద్యార్థులు ఆ పరీక్షల్లో విజయం సాధించి మంచి మంచి ప్రభుత్వ ఉద్యోగాలు సంపాదిస్తూ ఉండేవాళ్ళు. అంతవరకు బాగానే ఉన్నది. కొన్నిసార్లు – వాళ్ళు పిలిచిన లేదా ఆవాహన చేసిన ఆత్మలు కాకుండా ఏవైనా ఇతర చెడు ఆత్మలు అనగా దుర్మార్గ స్వభావం కలిగిన ఆత్మలు, వాళ్ళు పరీక్షలు వ్రాసే సమయంలో వాళ్ళను ఆవహించేవి. ఫలితంగా, ఆ విద్యార్థులు తమకు వచ్చింది కూడా వ్రాయలేకపోయేవారు. అంటే వాళ్ళకి ఆ పరీక్షల్లో ఘోర పరాజయం వచ్చేది అన్నమాట. ఇక్కడ ఇంకొక విచిత్రం కూడా అప్పుడప్పుడూ జరుగుతూ ఉండేది. అది ఏమిటంటే, కొంతమంది విద్యార్థులు తెలిసో, తెలియకో కొన్ని నేరాలు చేసేవాళ్ళు. ఆ విద్యార్థుల అదృష్టమో లేక వాళ్ళ మేధస్సో తెలియదుగాని వాళ్ళు చేసిన నేరాలు ఎవరికీ తెలిసేవి కాదు. ఫలితంగా, వాళ్ళు ఎలాంటి శిక్ష లేకుండా తప్పించుకునేవాళ్ళు. ఇలాంటి విద్యార్థులు పరీక్షలకు వెళ్ళినప్పుడు, వాళ్ళు అడక్కుండానే లేదా కోరకుండానే వాళ్ళని ఆ సమయంలో ఆవ హించిన ప్రేతాత్మలయొక్క ప్రభావం కారణంగా



ఆ విద్యార్థులు – తమ సమాధాన పత్రాలలో, గతంలో తాము చేసిన నేరాల యొక్క వివరాలను చక్కటి దస్తూరిలో వ్రాసేవాళ్ళు. పరీక్ష పూర్తి అయ్యే సమయానికి వాళ్ళని ఆవహించి ఉన్న ఆత్మలు వాళ్ళని వదిలిపెట్టి వెళ్ళిపోయేవి. తమ సమాధాన పత్రాలలో, తమకు తెలియకుండానే – తాము గతంలో చేసిన నేరాల గురించి వివరంగా వ్రాసామన్న విషయం వాళ్ళకి తెలియని కారణంగా వాళ్ళు తమ సమాధాన పత్రాలను ఆ పరీక్ష నిర్వాహకుడికి శ్రద్ధగా అందజేసేవాళ్ళు. ఆ తరువాత ఆ ప్రశ్నా పత్రాలను దిద్దిన ఉపాధ్యాయుడికి ఆ విద్యార్థి చేసిన నేరాల వివరాలు తెలిసేవి. ఆపై ఆ ఉపాధ్యాయుడు ఆ వివరాలను ప్రభుత్వానికి అందించేవాడు. ఆ తరువాత ఆ విద్యార్థి ఇంటికి ప్రభుత్వం పంపించిన రక్షకభటులు వచ్చి, ఆ విద్యార్థిని బంధించి తమతోపాటు తీసుకువెళ్ళి న్యాయాధిపతి ముందు ఉండేవాళ్ళు. ఆ న్యాయాధిపతి ఆ విద్యార్థి చేసిన నేరాలకు అతడికి కఠినమైన శిక్షలు విధించేవాడు.

చనిపోయిన వ్యక్తులయొక్క ఆత్మలు, మొదట అంతరిక్షంలో ఉండే లేదా ఉందని భావించబడే నరకలోకంలోకి లేదా ప్రేతలోకంలోకి వెళ్ళి అక్కడ కొంతకాలం ఉండి, ఆ తరువాత భూమిమీదకి తిరిగి వచ్చిన తరువాత, అక్కడక్కడా మనుషులకు అవి పిశాచాల రూపంలో కనపడతాయని ప్రాచీన చైనా మతంలో స్పష్టంగా చెప్పబడి ఉన్నది. ఒక విశేషం ఏమంటే, బాలుడిగా ఉన్నప్పుడు చనిపోయిన వ్యక్తియొక్క ఆత్మ ఈ లోకానికి తిరిగివచ్చి మళ్ళీ బాలుడి రూపంలో ఉన్న ప్రేతాత్మలాగా కనిపిస్తుంది. అలాగే వృద్ధుడియొక్క ప్రేతాత్మ వృద్ధుడి రూపంలోనే దర్శనమిస్తుందని గుర్తించాలి. అదేవిధంగా, తల నరకటంవల్ల చనిపోయిన వ్యక్తులయొక్క ఆత్మలు, తలలేని మొండాల రూపంలో కనిపిస్తాయి. ప్రాచీనచైనాలో ఏ ప్రాంతంలో అయినా పిశాచాలు ఎక్కువగా సంచరిస్తూ ఉంటే, ఆ ప్రాంత ప్రజలు తమ గృహాలలో సొంతంగా తయారుచేసిన బాణా సంచాను కాల్చేవాళ్ళు. బాణాసంచా కాల్చినప్పుడు వచ్చే భారీ శబ్దాలవల్ల మరియు ఆ సమయంలో వెలువడే రంగుల రంగుల మెరుపుల వల్ల భయానికి గురైన ప్రేతాత్మలు ఆ ప్రాంతం నుండి పారిపోయేవి. మళ్ళీ కొంతకాలం దాకా అటువైపు వచ్చేవి కాదు. (ఈ ప్రపంచంలో తొలిసారిగా బాణా సంచాను తయారు చేసింది చైనా ప్రజలే అని గుర్తించాలి. అంతేకాదు హైందవులు, దీపావళినాడు బాణాసంచా కాల్చటం అనే సాంప్రదాయం – ప్రాచీన చైనా నుండే ఆనాటి భారతదేశానికి దిగుమతి అయ్యిందని గ్రహించాలి.)

మనిషిని ప్రేతాత్మలు ఆవహించగలవని చైనాలో నమ్మేవాళ్ళు. అయితే, మనిషిని ఆవహించిన ప్రేతాత్మలను ఆకాలం నాటి మంత్రవాదులు ఎలా వదిలించేవాళ్ళో తెలుసుకోకపోతే ఈ అధ్యాయం పరిపూర్ణంగా ఉండదు అనే అభిప్రాయంతో ఆ

అంశాన్ని కూడా ఇక్కడ చివరగా వివరించటం జరుగుతున్నది. ప్రేతాత్మలను తరిమివేయటంకోసం సంవత్సరంలో మూడుసార్లు అనగా, వసంత రుతువు (ఫిబ్రవరి – మార్చి నెలల మధ్యకాలం.) మధ్యకాలంలో, వర్షాకాలం మధ్యలో, శీతాకాలం చివరి నెలలో – ప్రేతాత్మలకు బలులు ఇవ్వటం జరిగేది.

“తమ ప్రాంతంలోకి చెడు స్వభావంగల ప్రేతాత్మలు ప్రవేశించాయి” అని నమ్మకం కలిగిన మరుక్షణం ఆ ప్రాంత ప్రజలు, పెద్ద శబ్దం వచ్చే బూరాలను ఊదుతూ, తప్పెట్లను మ్రోగిస్తూ, ఇంకా పెద్ద శబ్దంతో మ్రోగే బాణా సంచాలు కాలుస్తూ ఆ ప్రేతాత్మలను తమ ప్రాంతం నుండి (గ్రామం లేదా పట్టణం) దూరం తరిమివేసేవారు. శబ్దాలు అంటే ప్రేతాత్మలకు చాలా భయం అని చైనా భూతశాస్త్రంలో చెప్పబడి ఉన్నది. ఇంకొక ముఖ్యవిశేషం ఏమంటే, చీకటికి ఆధిపత్యం వహించే లేదా చీకటికి సంబంధించిన “ఇన్ (Yin)” వర్గానికి చెందిన ప్రేతాత్మలకు వెలుతురు అంటే భయం. ఆ కారణంగానే బాగా వెలుతురు వచ్చే మరియు రంగు రంగులతో కూడిన నిప్పులను వెదజల్లే బాణాసంచాను కాల్చటం జరిగేది. ఎందుకంటే బాణాసంచా నుండి వచ్చే ప్రకాశం ఈ సృష్టిలోని “యాంగ్(Yang)”కి చెంది ఉంటుంది.

కొన్ని సమయాలలో ప్రేతాత్మలు ఆవహించటం వల్ల మానవులకు విచిత్రమైన మరియు ఔషధాలకు తగ్గని వ్యాధులు రావటం జరిగేది. అలాంటి సమయాలలో చైనా వైద్యులు, చాలా అసహ్యకరమైన రుచి మరియు వాసన కలిగిన ఔషధ ద్రవాలను, రోగుల చేత త్రాగించేవాళ్ళు. వాళ్ళు త్రాగిన ఆ ఔషధం యొక్క చెడు వాసన మరియు రుచి – వాళ్ళని ఆవహించి ఉన్న ప్రేతాత్మకు విపరీతమైన ఆందోళన, భయం కలిగించేది. ఫలితంగా, ఆ ప్రేతాత్మ, తాను ఆవహించిన రోగిని వదిలిపెట్టి వెళ్ళిపోయేది. అనగా, ఆ రోగికి రోగం తగ్గిపోయేది అన్నమాట. ఇంకొక విశేషం ఏమంటే, పులి లేదా కోడిపెట్టల బొమ్మల్ని చూస్తే ప్రేతాత్మలు భయపడతాయని భావిస్తారు. ఆ కారణంగానే – ప్రేతాత్మలచేత ఆవహించబడిన వ్యక్తులకు పులి బొమ్మలు లేదా కోడి బొమ్మలు చూపించేవాళ్ళు. ఆ బొమ్మల్ని చూసి భయపడిన ప్రేతాత్మలు వారిని వదిలిపెట్టి వెళ్ళిపోతూ ఉండేవి. ప్రాచీన చైనాలో, దయ్యాలను వదిలించే ప్రక్రియను అనగా భూతవైద్యాన్ని (Exorcism) టావోయిస్టు మతానికి చెందిన పురోహితులే నిర్వహిస్తూ ఉండేవాళ్ళు.



# 13. జైన మతంలో 'ఆత్మ'కు సంబంధించిన విశ్వాసాలు?

"ఆత్మ" అనే ఒక శక్తి లేదా అంశం లేదా పదార్థం నిజంగా ఉన్నదా? లేదా? అన్న సందేహం, ప్రాచీనకాలంలోని అనేకమంది మేధావుల్ని తీవ్రంగా ఆలోచింప చేసింది. నాస్తికులకు 'ఆత్మలేదు' అని నిర్ధారణ అయ్యింది. కర్మ సిద్ధాంతాన్ని అనుభవపూర్వకంగా నమ్మిన కొందరు మేధావులకు, యోగులకు 'ఆత్మ ఉన్నది' అని అర్ధం అయ్యింది. మొత్తం మీద ప్రపంచవ్యాప్తంగా ఉన్న వేదాంత శాస్త్రజ్ఞులు అందరూ "ఆత్మ" ఉన్నదని, మరణానంతర జీవితం ఉంటుందని, "పునర్జన్మలు" ఉంటాయని నిర్ధారించటం జరిగింది. ఆసియా ఖండానికి చెందిన చైనా, జపాన్, ఇండియా, శ్రీలంక లాంటి దేశాలలో పునర్జన్మ సిద్ధాంతాన్ని బలపరచే అనేక ఆధారాలు లభించాయి. అలాగే ఐరోపా ఖండంలోని ప్రాచీన గ్రీస్, జర్మనీ లాంటి దేశాలలో కూడా ఆత్మయొక్క ఉనికిని బలపరచిన అనేకమంది వేదాంతులు వెలుగులోకి వచ్చారు.



అలాగే ఆఫ్రికా ఖండంలో కూడా మరణానంతర జీవితాన్ని విశ్వసించే కోట్లాది మంది ప్రజలు – ఆనాటి నుండి ఈనాటి వరకు ఆత్మయొక్క ఉనికిని బలంగా నమ్ముతున్నారు. ఇక, భారతదేశం విషయానికి వచ్చినట్లయితే హైందవ మతంలో, బౌద్ధ మతంలో, జైన మతంలో 'ఆత్మ' నిజంగా ఉన్నదని, మనిషి బ్రతికి ఉన్నప్పుడు చేసిన కర్మలకు ఫలితాన్ని ఆ ఆత్మ స్వర్గంలోనో లేదా నరకంలోనో అనుభవించాల్సి ఉంటుందని, కొన్ని సమయాలలో 'ఆత్మ' భూలోకంలో జంతువుగానో, మనిషిగానో మళ్ళీ మళ్ళీ జన్మించటం జరుగుతుందని ప్రబోధించబడింది.

'ఆత్మ' – శాశ్వతమైనది. దానికి పుట్టుక లేదు. చావు లేదు. అది సృష్టి ఉన్నంతకాలం ఉంటుంది అని జైన మత వేదాంతం తెలియజేసింది. మనిషి ఆత్మ, ఒక పుట్టుక తరువాత ఒక పుట్టుక అనగా ఒక జన్మ తరువాత ఒక జన్మ ఎత్తుతూ తన పయనాన్ని అనంతకాలం కొనసాగిస్తుంది. ఆ జన్మలలో మనిషి, జంతువు, జలచరం (చేపలు వగైరా), పక్షి, ఈగ, కంటికి కనిపించని సూక్ష్మ క్రిమి – లాంటి అనేక

జన్మలను ఎత్తుతుంది. జైనమత ప్రధాన సిద్ధాంతం ఏమంటే, ప్రతి మనిషీ అనేక పుణ్య కర్మలను కొన్ని జన్మలలో చేసి, అదే సమయంలో తాను గతజన్మలలో చేసిన పాప కర్మలను – కష్టాలు/శిక్షల రూపంలో అనుభవించి అంతిమంగా సిద్ధలోకంలో జన్మించాలి. సిద్ధలోకం, జైనమతంలో చెప్పబడిన స్వర్గలోకాలకన్నా అత్యున్నతమైన స్థాయిలో ఉంటుంది. అక్కడ జీవించే జీవులకు అనంతమైన స్వేచ్ఛ ఉంటుంది. ఇంకో విధంగా చెప్పాలంటే, హైందవ మతంలో చెప్పబడిన – జనన–మరణ రహితమైన మోక్షలోకం ఎలాంటిదో ఈ సిద్ధలోకం కూడా అలాంటిదే అని గుర్తించాలి.

జైన మతాన్ని ప్రచారం చేసిన అనేకమంది గురువులు కూడా అనేక జన్మలు ఎత్తినట్లుగా జైన సాహిత్యంలో లిఖించబడి ఉన్నది. జైనమతంలో ముఖ్య గురువుగా చెప్పబడిన వర్ధమాన మహావీరుడు కూడా అనేక గతజన్మలను కలిగి ఉన్నట్లుగా జైనమత గ్రంథాలలో స్పష్టంగా లిఖించబడి ఉన్నది.

జైన మతాన్ని స్థాపించిన తొలి జైన గురువు అయిన వర్ధమాన మహావీరుడు, ఆ కాలంలో ఉత్తర భారతదేశంలో – నాస్తికవాదాన్ని ప్రబలంగా ప్రచారం చేస్తున్న 'చార్వాక' మతస్తులయొక్క వాదాన్ని ఖండించి, ఆత్మయొక్క ఉనికిని బలపరచే కొన్ని సూత్రాలను లోకానికి అందించాడు. ఆత్మ ఉన్నది అని నమ్మటానికి తగిన ఆధారాలను వర్ధమాన మహావీరుడు ఇలా తెలియజేసాడు....

1. ఈ ప్రపంచంలో, కంటికి కనిపించే ఏ వస్తువులో అయినా సరే 'అణువు'(ఆటం) అనే అత్యంత సూక్ష్మ పదార్థం ఉంటుంది. అనేక అణువులు కలిస్తేనే ఏదైనా భౌతిక పదార్థం ఏర్పడుతుంది. అయితే, అణువు మాత్రం కంటికి కనపడదు. అదేవిధంగా 'ఆత్మ' అనే శక్తి కూడా అణు రూపంలో ఉంటుంది. అందువలన అది కంటికి కనపడదు. ఆత్మ లేనిదే ఏ జీవీ చలించలేదు మరియు తన ధర్మాలను నిర్వర్తించలేదు. కనుక, ఆత్మ ఉన్నది అని నమ్మక తప్పదు.

2. భౌతికంగా కనపడే లేదా ఉండే వస్తువుతో పోల్చి, ఇంకొక వస్తువును ఉందా? లేదా? అని చెప్పటం సాధ్యపడుతుంది. అయితే 'ఆత్మ' లాంటి ఇంకొక శక్తిగాని, రూపంగాని, వస్తువుగాని ఇంకొకటి ఉండదు. అందువల్ల, ఆత్మను దేనితోనూ పోల్చటం సాధ్యంకాదు. పోల్చటానికి ఇంకొక సమానమైనది లేదా ఏదైనా పోలిక కలిగినది లేనప్పుడు 'ఆత్మ' ఏవిధంగా ఉంటుందో? తెలియనప్పుడు 'ఆత్మ' లేదని తీర్మానించటం అజ్ఞానం అవుతుంది.

3. మనిషిలో ఉండే అజ్ఞానం, మనిషిలోని సంతోషం, మనిషికి కలిగే కోపం, మనిషియొక్క స్వభావం కంటికి కనపడవు. కేవలము, ఒక మనిషియొక్క ప్రవర్తనబట్టి అతనిలో ఉండే లక్షణాలు ప్రదర్శించబడతాయి. అంతమాత్రంచేత అజ్ఞానం, ఆనందం, ఆగ్రహం, ఆవేదన లాంటి భావాలు లేదా భావనలు నిజంగా లేవని భావించరాదు.

4. "అహం ప్రత్యయ" అనగా "నేను" అని తెలుసుకోవటం. ఈ సూత్రం ప్రకారం, ప్రతి మనిషీ – నేను చేసాను, నేను చేస్తాను, నేను చెయ్యగలను లాంటి – వాక్యాలు పలుకుతాడు. ఈ వాక్యాలలో చెప్పబడిన "నేను" అనగా ఆ వ్యక్తియొక్క దేహం అని అర్థంకాదు. మరి, "నేను" అంటే ఏమిటి? – "నేను" అనగా నా ఆత్మ అని అర్థం చేసుకోవాలి. ఒక విషయాన్ని చూడటం, జ్ఞాపకం పెట్టుకోవటం, అవసరం అయినప్పుడు గుర్తించటం – అనే చర్యలు, మనిషి శిరస్సులో ఒక మాంసం ముద్దలాగా ఉండే మెదడు వల్ల జరగవు. శరీరంలో ఉండే ఆత్మయొక్క శక్తి కారణంగానే మెదడు – పైన పేర్కొన్న చర్యలను లేదా కార్యాలను నిర్వహించగలుగుతుంది.

5. ఆత్మ లేనప్పుడు, కేవలము శరీరము మాత్రమే నిజమైనప్పుడు – లావు, సన్నం, ఎరుపు, నలుపు, అందంగా ఉండటం, వికృతంగా ఉండటం – అనే లక్షణాలు శరీరానికి చెందుతాయని అంగీకరించవచ్చు. మరి, జ్ఞానం, జ్ఞాపకశక్తి, మంచితనం కుటిలత్వం – లాంటి లక్షణాలు శరీరానికి ఎందుకు చెందటంలేదు?. మరి, ఈ అగోచరమైన అనగా కంటికి కనపడని లక్షణాలు ఎవరివి అయి ఉండాలి?. ఆత్మకు మాత్రమే ఈ గుణాలు ఉంటాయని అంగీకరించటంలో దోషం లేదని అర్థం చేసుకోవాలి.

6. "ఆత్మ" లేదు అని వాదించే వ్యక్తి – ఈ సృష్టిలో, నిజంగా లేని వస్తువుని లేదు అని వాదించకూడదు. ఎందుకంటే, "గగనపుష్పం/గగనకుసుమం (ఆకాశంలో ఉండే పువ్వు) నిజంగా ఉండదు" అని ఎవరైనా అంగీకరించి తీరాలి. కానీ, దీంట్లో పూర్తి వాస్తవం లేదని గుర్తించాలి. అది ఎలాగంటే, గగనం అనగా "ఆకాశం" నిజంగా ఉన్నది. అనగా, కంటికి కనిపిస్తున్నది. అలాగే, కుసుమం లేదా పుష్పం కూడా నిజంగా ఉంటుంది. కానీ, ఆ రెండు అంశాల కలయిక అయిన "గగన కుసుమం" నిజంగా ఉండదు. అదేవిధంగా, "ఆత్మ" లేదు అని చేసే వాదన, ఆత్మ నిజంగా ఉన్నది అని నిరూపిస్తుంది. నిజంగా ఆత్మ లేకపోతే, లేదు అని చెబుతున్నది దేని గురించి?.

7. "ఆత్మ" అనగా చేతన (Consciousness) అని గుర్తించాలి. ఈ సృష్టిలో కనిపించే ప్రతి జీవులలో ఈ 'చేతన' ఉంటుంది. కొండల్లో మరియు కదలికలు లేని జడ పదార్థాలలో 'చేతన' అనే శక్తి ఉండదు. అనగా, వాటిలో చర్యలుగాని, ప్రతిచర్యలుగాని ఉండవు. కదలికలు కూడా ఉండవు. జీవులకు మరియు నిర్జీవులకు మధ్య ఉండే తేడా 'చేతన' అనగా 'ఆత్మ' అని గుర్తించాలి.

ఒకవిశేషం ఏమంటే, హైందవ మతంతో సహా అనేక ఇతర ప్రపంచ మతాలలో చెప్పబడిన సమాచారం ప్రకారం చూసినట్లయితే 'ఆత్మ' చాలా సూక్ష్మ పరిమాణంలో ఉంటుందని తెలుస్తున్నది. కేవలము, ఒక జైన మతంలో మాత్రమే 'ఆత్మ' – ఒక మనిషి ఎంత పరిమాణంలో ఉంటాడో, అంత పరిమాణంలో ఉంటుందని చెప్పబడి ఉన్నది.

ప్రతి ఆత్మ ఒక ప్రత్యేకమైన ఉనికిని మరియు చరిత్రను కలిగి ఉంటుందని, ఈ సృష్టిలో అనేక విభిన్నమైన కోట్లకొద్ది ఆత్మలు ఉన్నాయని జైన మతం ప్రబోధిస్తుంది. ఒక విశేషం ఏమంటే, హైందవ మతానికి చెందిన ద్వైత వేదాంతంలో (మధ్వాచార్య మతం)లో కూడా దేవుడు వేరు, జీవుడు వేరు అని తీర్మానించబడి ఉన్నది.



## 14. ఆత్మలు, మానవుల్ని ఆవహించటం నిజమా?

ఆత్మలు, మనిషి చుట్టూ ఉండే జీవ–అయస్కాంత క్షేత్రాల (బయో–మాగ్నటిక్ ఫీల్డ్స్)తో సంబంధం ఏర్పరచుకుని, ఆపై టెలీపతి (మనసుతో మాట్లాడే భాష) విధానంలో మనిషికి సూచనలు ఇస్తూ, క్రమ క్రమంగా ఆ మనిషియొక్క మనసుని తన ఆధీనంలోకి తెచ్చుకుంటుంది. ఫలితంగా, ఆ మనిషియొక్క శరీరం కూడా ఆ ఆత్మ ఆధీనంలోకి వెళ్ళిపోతుంది. ఫలితంగా, ఆ ఆత్మ ఎలా చెబితే ఆవిధంగా ఆ మనిషి ప్రవర్తించటం జరుగుతుంది. కొన్ని సమయాలలో ఆత్మలు నేరుగా మనిషియొక్క శరీరంలోకి ప్రవేశించి, ఆపై ఆ మనిషియొక్క ఆత్మను తన ఆధీనంలో పెట్టుకుంటాయి. అనగా ఆ మనిషియొక్క మేధస్సు కూడా ఆ ఆత్మయొక్క ఆధీనంలోకి వెళ్ళిపోతుంది. ఈ పరిస్థితినే 'దయ్యంపట్టటం' (Possession) అని పిలుస్తారు. ఈ ప్రక్రియను ఇస్లాం మతంలో మసాహ్ (దయ్యం పట్టటం) అని పిలుస్తారు.

చనిపోయిన వ్యక్తులయొక్క ఆత్మలు – మానవుల్ని ఆవహించగలిగే శక్తిని కలిగి ఉంటాయని రాజస్థాన్ ప్రాంతంలో ఈనాటికీ బలంగా నమ్ముతున్నారు. అయితే, ఈ ఆత్మలలో కొన్ని మంచివి ఉంటాయని, కొన్ని చెడ్డవి ఉంటాయని కూడా వీళ్ళు చెబుతారు. అప్పులు తీర్చలేక చనిపోయిన వ్యక్తులు, పుట్టగానే చనిపోయిన పసిబిడ్డలు, భర్త చనిపోవటంవల్ల దిగులుపడి మరణించిన స్త్రీలు, ఇతర దేశాల నుండి ఇక్కడకు వచ్చి ప్రమాదాలలో మరణించిన విదేశీయులు – చనిపోయిన తరువాత పిశాచాలుగా మారతారని, ఆపై తమకు అవకాశం దొరికినప్పుడు ఏదో ఒక మనిషిని ఆవహిస్తారని ఈ ప్రాంతంలో విశ్వసిస్తారు. ఒక విశేషం ఏమంటే, ఒక మనిషిని మంచి స్వభావం కలిగిన ఆత్మ ఆవహించినప్పటికీ ఆ మనిషికి చెడు జరుగుతుందని చెబుతారు. ఎందుకంటే, మంచి ఆత్మ ఆవహించినా సరే ఆ వ్యక్తి విపరీతంగా ప్రవర్తించటం, ఒంటిమీద స్పృహ లేకుండా రోజులు తరబడి మూర్ఛలో ఉండటం లాంటివి జరుగుతాయి.



ఇక, తమిళనాడు ప్రాంతంలో కూడా పిశాచాలకు సంబంధించిన విశ్వాసాలు బలంగా ఉన్నాయి. తమిళంలో దయ్యాన్ని 'పేయీ" అనే పేరుతో పిలుస్తారు. పెళ్ళి అయిన కొద్ది రోజులకే, ఏవిధమైన శృంగార సంబంధ కోరికలు తీరకుండానే చనిపోయిన లేదా చంపబడిన స్త్రీలు ఈ "పేయీ" అనే పిశాచాలుగా మారతారని తమిళ ప్రజలు భావిస్తారు.

ఇజ్రాయేల్ దేశ అధికార మతంగా గుర్తించబడిన యూదు మతానికి సంబంధించిన గ్రంథాలలో ఇవ్వబడిన సమాచారం ప్రకారం చూసినట్లయితే, 'డిబక్' అనే ప్రేతాత్మ, నిరంతరం అశాంతితో రగిలిపోతూ ఉంటుందని, అందుకు కారణం దానికి ఒక నివాసం లేకపోవటమే అని, అందువల్ల అది – మానసికంగా బలహీనంగా ఉన్న ఎవరో ఒక మనిషిని ఆవహిస్తుంది. ఆ తరువాత అతడి ద్వారా తాను చెయ్యాలనుకున్న కార్యాలను చేయిస్తుంది. ఈవిధంగా "డిబక్" అనే ప్రేతాత్మచేత ఆవహించబడిన వ్యక్తికి యూదు మతంలో చెప్పబడిన విధానంలో భూత వైద్యం (Exorcism) చేస్తారు. ఫలితంగా, ఆ డిబక్ ఆ వ్యక్తిని వదిలి వెళ్ళిపోతుంది. ఈ

నాటికీ కేరళ రాష్ట్రంలోని కొన్ని ప్రాంతాలలో నివసిస్తున్న యూదులు – డిబక్ అనే పేరుగల ప్రేతాత్మలు, మనుషుల్ని ఆవహించి పీడిస్తాయని బలంగా నమ్ముతున్నారు.

సహజంగా, ఆత్మలు చెడు స్వభావాన్ని కలిగి ఉంటాయి. అందుకు కారణం ఏమంటే, వాటికి శరీరం ఉండదు. అందువల్ల అవి మానవులు లాగా కోరిన కోర్కెలు తీర్చుకోలేవు. ఫలితంగా – అవి, శరీరాన్ని కలిగి ఉన్న మానవుల పట్ల అసూయను, ద్వేషాన్ని పెంచుకుంటాయి. అందువలన అవి మానవులకు తమకు వీలైనవిధంగా హాని చెయ్యటానికి ప్రయత్నిస్తాయి. ఇంకొక విశేషం ఏమంటే, ప్రేతాత్మలు – మనిషి చుట్టూ ఉండే "జీవ – అయస్కాంత శక్తి"ని తమ ఆహారంగా తీసుకుంటాయి. ఫలితంగా, మనిషికి తీవ్రమైన శారీరక బాధ మరియు కారణం తెలియని భయం ప్రాప్తిస్తాయి.

**ప్రేమిక జిన్నులు** (ఆషిక్ జిన్/Lover Jinn) **:**

సాధారణంగా జిన్నులు (ఆడ జిన్నులు కావొచ్చు లేదా మగ జిన్నులు కావొచ్చు) మనిషి యొక్క శరీరం మీద ముఖ్యంగా, బాగా అందంగా ఉన్న మనుషుల శరీరం మీద విపరీతమైన వ్యామోహం కలిగినప్పుడు ఆ మనుషుల్ని ఆవహిస్తాయి. అలా ఆవహించిన ఆ జిన్నులు ఆ శరీరాన్ని తమ సొంతంగా భావించుకుంటాయి. ఉదాహరణకి – ఒక పెళ్ళికాని అందమైన అమ్మాయిని ఒక మగ జిన్ను ఆవహించి తనకి కోరిక కలిగినప్పుడు ఆ అమ్మాయి శరీరం నుండి బైటకువచ్చి, ఆపై అదృశ్య రూపంలో ఆ అమ్మాయిని తనివితీరా అనుభవిస్తుంది. ఇలా ఎంతో కాలం జరుగుతుంది. ఆ అమ్మాయి ఇంకొక మనిషిని పెళ్ళిచేసుకోవాలని ప్రయత్నించినప్పుడు ఈ అమ్మాయి శరీరాన్ని ఆవహించి ఉన్న ఆ జిన్ను, ఈమెకు కాబోయే భర్తను ఏదో ఒక రకంగా చంపటంగాని, సంసారానికి పనికిరాకుండా చెయ్యటం గాని జరుగుతుంది. కొన్ని సమయాలలో వివాహం అయిన స్త్రీలను మగజిన్ను ఆవహించినప్పుడు, ఆ స్త్రీలు తమ భర్తలతో కాపురం చెయ్యకుండా ఈ మగజిన్ను అడ్డుకుంటుంది. ఫలితంగా, కొంతకాలానికి ఆ దంపతుల మధ్య తీవ్రమైన విభేదాలు తల ఎత్తుతాయి. ఫలితంగా, వాళ్ళు విడిపోతారు. ఆపై, అలా తన భర్త నుండి విడిపోయిన ఆ స్త్రీపై తనకు వ్యామోహం ఉన్నంతకాలం ఆ మగజిన్ను ఆ స్త్రీని ఆవహించి ఉంటుంది.

ఇక, మానవ పురుషులను ఆవహించే ఆడ జిన్నుల విషయానికి వచ్చినట్లయితే అవికూడా ఆ పురుషుల్ని తమకు ఇష్టం వచ్చినప్పుడు అనుభవించి తృప్తిపడతాయి. అంతేకాకుండా, ఆ పురుషులు తమ భార్యలతో కాపురం చెయ్యకుండా తీవ్రంగా

అడ్డుకుంటాయి. ఇంకొక ముఖ్యవిశేషం ఏమంటే, అటు ఆడజిన్నులుగాని, ఇటు మగ జిన్నులుగాని – తాము ఆవహించిన వ్యక్తులు – వారి సంతానాన్ని దగ్గరకు తీసుకోవటం లేదా ముద్దుచెయ్యటం గాని జరగకుండా తీవ్రంగా అడ్డుకుంటాయి.

ఇంకొక విచిత్రం ఏమంటే, మానవ శరీరాలపై (పురుషులు లేదా స్త్రీలు) వ్యామోహానికి గురై ఆపై వారిపై ప్రేమను పెంచుకుని వాళ్ళ శరీరాలను ఆవహించే జిన్నులు, వాళ్ళ శరీరంలోని ఏదో ఒక భాగాన్నిచూసి వాళ్ళని విపరీతంగా ఇష్టపడటం జరుగుతుందని బాంగ్లాదేశ్‌కు చెందిన 'సిద్ధిక్ బాబా' అనే ఒక ఇస్లాం మంత్రగాడు తెలియజేసాడు. అతడు చెప్పిన సమాచారం ప్రకారం చూసినట్లయితే....

ఒక స్త్రీ లేదా పురుషుడియొక్క అందమైన కళ్ళు/చేతులు/ముఖం/శిరోజాలు/పెదవులు/ఛాతి లేదా వక్షోజాలు – లాంటి భాగాలనుచూసి వ్యామోహానికి గురైన జిన్ను – ఆ స్త్రీ లేదా పురుషుడిని ఆవహించి ఎంతోకాలంపాటు పీడించటం జరుగుతుంది. అంటే, ఒక పురుషుడు లేదా స్త్రీ యొక్క అందమైన శరీర భాగాలను చూసి ముచ్చటపడి, ఆపై ఆ స్త్రీ లేదా పురుషుడిని జిన్ను విపరీతంగా ప్రేమించటం జరుగుతుంది అన్నమాట. జిన్నులలో మూడు రకాలు ఉంటాయని ఖురాన్‌లో చెప్పబడి ఉన్నది. 1. మానవ రూపంలో ఉండే జిన్నులు 2. జంతువుల రూపంలో ఉండే జిన్నులు (సింహం, పులి, తోడేలు, పంది, కోతి) 3. సర్పాలరూపంలో ఉండే జిన్నులు. జాతి ఏదైనప్పటికీ, ఏ జిన్ను అయినా సరే, మనిషిని ఆవహించగలదు. అయితే, మనిషిని ఆవహించినప్పటికీ అది తన స్వభావాన్ని మార్చుకోదు. అందువల్ల, జంతుజాతికి చెందిన జిన్ను ఆవహించిన మనుషులు – జంతువులలాగా ప్రవర్తించటం జరుగుతుంది. ఉదాహరణకి, ఒక జంతు జాతికి చెందిన జిన్ను చేత ఆవహించబడిన పురుషుడు – మానవ స్త్రీతో శృంగారం జరపటానికి ఏమాత్రం ఇష్టపడడు. మేకలతో లేదా బర్రెలతో శృంగారం జరపటానికి ఇష్టపడతాడు. సభ్య సమాజం ఏమాత్రం ఆమోదించని మరియు పరమఅసహ్యకరమైన జంతు సంభోగానికి ఒక పురుషుడు పాల్పడుతున్నాడు అంటే, దాని అర్థం అతడిని ఒక జంతు జాతికి చెందిన జిన్ను ఆవహించింది అని గుర్తించాలి.

ఏదిఏమైనా, "ప్రేమిక జిన్నుల" చేత ఆవహించబడిన స్త్రీ లేదా పురుషుడి మనస్తత్వంలో విపరీతమైన మార్పులు వస్తాయి. వాళ్ళు ఏ విషయంలోనూ సరైన నిర్ణయం తీసుకోలేక తికమక పడుతూ ఉంటారు. ప్రతి చిన్న విషయానికి తీవ్రంగా ఆగ్రహించటం జరుగుతుంది. పరువు, మర్యాద సంగతి మర్చిపోయి, సమాజంలో

చవకబారుగా మాట్లాడటం లేదా ప్రవర్తించటం జరుగుతుంది. కొన్ని సమయాలలో ఈ ప్రేమిక జిన్నుల ప్రభావం విపరీతం అయినప్పుడు ఆ వ్యక్తులు ఆత్మహత్య చేసుకుని చనిపోవటం కూడా జరుగుతుంది.

ప్రేమిక జిన్నుల చేత పీడించబడుతున్న స్త్రీ, పురుషులకు ప్రపంచ వ్యాప్తంగా ఉన్న ముస్లిం దేశాలలో "రుకియా" నిర్వహిస్తారు. రుకియా అనగా "దయ్యాన్ని వదిలించటం" (Exorcisim) అని గుర్తించాలి. ప్రపంచంలో ముస్లిం ప్రజలు అత్యధిక సంఖ్యలో ఉన్న ఇండోనేషియాలో ఇలాంటి రుకియా ప్రక్రియను నిర్వహించే మంత్రగాళ్ళు చాలా ఎక్కువ సంఖ్యలో ఉన్నారని చెప్పుకుంటారు. కొన్ని సమయాలలో – ఒకవ్యక్తిపట్ల శత్రుత్వం కలిగిన ఇంకొక వ్యక్తి ఒక మంత్రగాడి సహాయంతో ఆ వ్యక్తిమీద షిర్ (చేతబడి/క్షుద్రప్రయోగం) చేయిస్తారు. ఈ చేతబడిలో భాగంగా ఒక ఆడ లేదా మగ జిన్నుని ఆ వ్యక్తిమీదకి ప్రయోగిస్తారు. అప్పుడు ఆ జిన్ను ఆ వ్యక్తిని లైంగికంగా, మానసికంగా, శారీరకంగా అనేక రకాలు బాధించి, చివరికి తనంతట తానే ఆ వ్యక్తి చనిపోయేలా చేస్తుంది.

వహీబ్మున్నబీ – అనే ప్రాచీన కాలానికి చెందిన సౌదీ అరేబియా మత పండితుడు జిన్నుల గురించి ఇలా చెప్పాడు. "జిన్నులలో రెండు రకాలు ఉంటాయి. వాటిలో మొదటి రకం – స్వచ్ఛమైన మంచి స్వభావంగల జిన్నులు. ఇవి వాయు స్వరూపంలో అనగా గాలి రూపంలో ఉంటాయి. ఇవి నీరు త్రాగవు, ఆహారం తీసుకోవు. ఏనాటికీ మరణించవు మరియు పునరుత్పత్తి చెయ్యవు. ఇక, రెండవ జాతికి చెందిన జిన్నులు తాము కోరిన రూపాన్ని ధరిస్తాయి. ఇవి ఆహారం తీసుకుంటాయి. నీళ్ళు త్రాగుతాయి. అటు తమ జాతికి చెందిన జిన్నులతోను, ఇటు మానవులతోను శృంగారం జరుపుతాయి, సంతానాన్ని ఉత్పత్తి చేస్తాయి.

హదిత్ (ఇస్లాం మత గురువుల ప్రబోధాలు)లో చెప్పబడిన సమాచారం ప్రకారం చూసినట్లయితే ఈ జిన్నులు – అత్యంత మురికిగా మరియు అసహ్యంగా ఉండే ప్రదేశాలలో ఉంటాయి. అనగా – బాత్రూమ్లు, లావెట్రీలు, జంతు వధ జరిగే కబేళాలు, చికెన్ దుకాణాలు లాంటి ప్రాంతాలలో నివాసం ఉండటానికి ఇష్టపడతాయి. అందువల్ల, ఇలాంటి ప్రదేశాలలో పొరపాటున కూడా దైవ ప్రార్థనలు చెయ్యరాదని గుర్తించాలి. ప్రాచీనకాలంలో ఈజిప్టులోని ఎడారుల గుండా ఒంటెలమీద లేదా గుర్రాలమీద వెళ్ళే ప్రయాణీకులకు రాత్రి సమయాలలో ఈ జిన్నులు కనిపించి, ఆపై వారిని తీవ్రమైన భయభ్రాంతులకు గురిచేసేవని ఆ కాలంలో ఈజిప్టులో

రచించబడిన అనేక గ్రంధాలలో చెప్పబడి ఉన్నది. కొన్ని సమయాలలో ఒకే వ్యక్తిని ఐదు లేదా ఆరు జిన్నులు కూడా ఆవహించే అవకాశం ఉంటుంది. ఇస్లాం మంత్రగాడు, ఆ వ్యక్తికి 'రుకియా' అనగా భూత వైద్యం చేస్తున్నప్పుడు ఆ విషయం బైటపడుతుంది. ఒక మనిషి శరీరంలో ఎక్కువ సంఖ్యలో జిన్నులు ఉన్నప్పుడు ఆ వ్యక్తి – అనేక రకాల వ్యక్తిత్వాలను ప్రదర్శించటం జరుగుతుంది. ఫలితంగా, ఆ వ్యక్తియొక్క నిజ స్వభావం ఏమిటో? అతడి కుటుంబ సభ్యులకు కూడా ఏమాత్రం అర్థంకాదు.

కొన్ని ప్రాంతాలలో ఉండే మార్గాలను కూడా జిన్నులు ఆవహించి ఉంటాయని కొందరు ఇస్లాం మత పండితులు తెలియజేస్తున్నారు. ఈ విషయాన్ని రుజువుచేసే ఒక ఉదాహరణను వాళ్ళు ఇలా చెబుతున్నారు...సౌదీ అరేబియాలోని మదీనా పట్టణానికి వాయువ్య దిశలో 35 కి.మీ. దూరంలో ఒక లోయ ప్రాంతం ఉన్నది. ఆ ప్రాంతం గుండా వెళ్ళే ఒక రోడ్డు మార్గంలో కొంత దూరాన్ని అనగా షుమారు ఒక కిలోమీటరు రోడ్డు మార్గాన్ని – అదృశ్య రూపంలో ఉండే కొన్ని జిన్నులు ఎల్లప్పుడూ ఆవహించి ఉంటాయి. ఈ రోడ్డు మీదుగా వెళ్ళే వ్యక్తులు ఈ రోడ్డులోని ఈ భాగం మీదగా వెళ్ళేటప్పుడు, వాళ్ళ వాహనాలలోని ఇంజన్లు వాటంతట అవే గేర్‌లు మార్చుకుంటాయి. ఫలితంగా, వాహన వేగం 120 కి.మీ. దాకా పెరుగుతుంది. ఆ డ్రైవర్ల ప్రమేయం లేకుండానే ఇలా వాహనాల వేగం పెరిగిపోతుంది అన్నమాట. ఆ ప్రాంతాన్ని ఆవహించి ఉన్న జిన్నుల వల్ల ఇలా జరుగుతుందని సౌదీ అరేబియాలోని ప్రజలు బలంగా విశ్వసిస్తున్నారు.

**రుకీయా (భూతవైద్యం/Exorcism) :**

అబుసైద్ మరియు ఇబన్ అబ్బాస్ అనే ఇద్దరు ఇస్లాం మత గురువులు తమ అనుచరులతో కలిసి ఒక ఎడారి గుండా కాలినడక ప్రయాణం చేస్తున్నారు. ఆ సమయంలో వాళ్ళు, బెడోయిన్ అనే ఒక తెగ ప్రజలు నివసిస్తున్న ప్రదేశం మీదుగా వెళుతున్నారు. అప్పటికి రాత్రి కావటంతో ఈ మత గురువులు అక్కడ ఆగిపోయి ఆపై తమకు ఆహారం పెట్టమని ఆ తెగకు చెందిన కొంతమంది ప్రజలను అడిగారు. అయితే, ఆ ప్రజలు ఈ ఇస్లాం మత గురువులకు ఆహారం ఇవ్వటానికి అంగీకరించలేదు. ఆ సమయంలో ఆ తెగ నాయకుడిని ఒక నల్లతేలు (నల్లతేలు రూపంలో ఉన్న ఒక జిన్ను ఆ నాయకుడిని ఆవహించింది అన్నమాట.) కరిచింది. దాంతో ఆ నాయకుడు భరించలేని బాధతో నేలమీద పడి దొర్లుతున్నాడు. ఆ తెగకు చెందిన ఇద్దరు, ముగ్గురు

వైద్యులు – శరవేగంతో అక్కడకు వచ్చి ఆపై తమకు తెలిసిన వైద్యాలన్నీ ఆ నాయకుడికి చేసారు. అయినా ఆ నాయకుడికి బాధ ఏమాత్రం తగ్గలేదు. అప్పుడు అబూసైద్ అనే పేరుగల మత గురువు ఆ తెగ ప్రజలను ఉద్దేశించి పెద్ద స్వరంతో ఇలా "మీ నాయకుడిని నల్లతేలు రూపంలో వచ్చిన ఒక జిన్ను, కాటువేసి ఆపై అతడిని ఆవహించింది. అందువలన అతడు నరకయాతన అనుభవిస్తున్నాడు. ఆ అల్లా దయవల్ల నేను, 'రుకియా' చేసి మీ నాయకుడియొక్క బాధను తగ్గించగలను. మీరు, మాకు ఆహారం ఇవ్వటానికి తిరస్కరించారు. అందువలన, నేను మీ నాయకుడికి 'రుకియా' (భూతవైద్యం) చెయ్యను. మాకు 30 గొర్రెలను నైవేద్యంగా ఇస్తే, నేను మీ నాయకుడి బాధను తగ్గిస్తాను" అన్నాడు. ఆ తెగ ప్రజలు ఆ షరతుకి అంగీకరించారు. ఆపై అబూసైద్, నేలమీద పడి గిలగిలలాడుతున్న ఆ తెగ నాయకుడి దగ్గరకువెళ్ళి ఆపై అతడి కాలిమీద ఉన్న తేలికొండి గాయం మీద "థూ" అనే శబ్దం చేస్తూ కొద్దిపాటి ఉమ్మి నీరు ఆ గాయం మీద పడేలా ఊదాడు. ఆ తరువాత ఖురాన్‌లోని 'అల్–ఫతీహా'ను పెద్ద స్వరంతో పఠించాడు అంతే, ఆ తెగ నాయకుడి బాధ కన్నుమూసి తెరిచేలోగా అదృశ్యం అయిపోయింది. ఆపై, ఆ తెగ నాయకుడు లేచి నుంచుని ఆ మత గురువులకు, తన తెగ ప్రజలు ఇచ్చిన వాగ్దానం ప్రకారం 30 బలిష్టమైన గొర్రెలను కానుకగా ఇచ్చారు. ఆ తరువాత ఆ ఇద్దరు మత గురువులు మరియు వాళ్ళ అనుచరులు ఆ గొర్రెల మందను వెంటపెట్టుకుని కొద్ది రోజులు ప్రయాణంచేసి 'అల్–మదీనా' పట్టణానికి చేరుకున్నారు.

# 15. జపాన్ మరియు ఇంగ్లాండ్ దేశాలలో పునర్జన్మ వృత్తాంతాలు?

**జపాన్‌లో యదార్థంగా జరిగిన కానన్ పునర్జన్మ వృత్తాంతం :**

జపాన్‌కు చెందిన స్త్రీ సంబంధ వ్యాధుల నిపుణుడు (గైనకాలజిస్ట్) మరియు ప్రసూతి విద్యా నిపుణుడు (ఓబ్‌స్ట్రటీషియన్) అయిన డా.ఇకేగవా అకీరా, ఈ వృత్తాంతం గురించి లోకానికి తెలియజేసాడు. ఒక అమ్మాయి చనిపోయి, మళ్ళీ అదే తల్లికి అబ్బాయిగా జన్మించింది. అనగా, తనకు తానే తమ్ముడిగా జన్మించింది అన్నమాట. ఒక విశేషం ఏమంటే, ఈ వృత్తాంతంలో 'కానన్' అనే బాలుడు ఏనాడూ తాను,

మళ్ళీ జన్మించానని ఎవరితోనూ చెప్పలేదు. కానీ, అతడి ప్రవర్తన, రూపం లాంటి వాటిని బట్టి, గతంలో చనిపోయిన తన కూతురే మళ్లీ తన కొడుకుగా పుట్టిందని కానన్ తల్లి ఖచ్చితంగా తీర్మానించుకున్నది.

'కానన్' అనే అబ్బాయికి ఇద్దరు సవతి అక్కలు ఉన్నారు. అనగా, ఆ ముగ్గురు పిల్లలికి ఒకే తల్లి ఉండగా, తండ్రులు మాత్రం ఇద్దరు ఉన్నారు. కానన్ – 2009, జూలై 26వ తేదీన జపాన్‌లోని ఒక మెట్రోపాలిటిన్ నగరంలో జన్మించాడు. అప్పటి నుండి ఈ వృత్తాంతం, ప్రపంచ దృష్టికి వచ్చేదాకా అతడు అక్కడే ఉన్నాడు.

కానన్‌కి ఇద్దరు సవితి అక్కలు ఉన్నారు. వారిలో ఒక అమ్మాయిపేరు 'రీకా'. ఆ అమ్మాయి 1995 జనవరి నెలలో పుట్టింది. ఇక రెండవ అమ్మాయి మమోకా మే 27, 1997లో పుట్టింది. అయితే, దురదృష్టవశాత్తు 2004, జనవరి నెలలో మమోకా చనిపోయింది. ఆ తరువాత 2009, జూలై 26న కానన్‌గా అనగా తన తమ్ముడిగా మళ్ళీ అదే తల్లికి జన్మించింది.

మమోకా, చిన్నతనం నుండి బాగా చురుగ్గా ఉండేది. తన అక్క రీకాతో కలిసి కుందేలు బొమ్మలతో ఆటలు ఆడుకుంటూ ఉండేది. నియమిత సంఖ్యలో కుందేలు బొమ్మలు ఉండే ఈ బొమ్మల సెట్‌ని 'సిల్వేలియన్ ఫామిలీ' అని పిలుస్తారు. ఈ అక్కాచెల్లెళ్ళు ఈ బొమ్మలతో ఆడుకునేటప్పుడు అక్క ఒక బొమ్మకు ప్రతినిధిగా, చెల్లెలు ఇంకొక బొమ్మకు ప్రతినిధిగా ఉంటూ, ఆ బొమ్మలతో ఆటలు కొనసాగించేవాళ్లు. ఉదాహరణకి – ఆ ఆట ఆడుకునేటప్పుడు మమోకా, రీకాతో ఇలా అనేది. "అక్కా! నువ్వు ఈ కుందేలువి (ఒక ప్రత్యేక పేరుగల కుందేలు బొమ్మకి ప్రతినిధి అన్నమాట). కనుక, 'పార్క్‌కి వెళదాం పద' అనాలి". రీకా, మమోకా చెప్పమన్న పదాల్ని చెప్పినప్పుడు మమోకా, తాను ప్రాతినిధ్యం వహించే కుందేలు బొమ్మకు ప్రతినిధిగా ఇలా అనేది. "ఓ! నీవు చెప్పింది చాలా బాగుంది. మనిద్దరం కలిసి పార్క్‌కి వెళదాం పద".

జపాన్‌లోని పిల్లల్లో చాలామందికి అత్యంత ఇష్టమైన రంగు – గులాబిరంగు (పింక్). అయితే మమోకా విషయానికి వచ్చినట్లయితే ఆమె, పేరునుబట్టి ఆమెకు గులాబిరంగు ఇష్టంగా మారింది. అది ఎలాగంటే...ఆమె పేరును రెండుగా విడకొట్టినప్పుడు "మోమో" అనగా పీచ్ అని, 'కా' అనగా పుష్పం అని అర్థం. మమోకా అనగా పీచ్ మొక్క యొక్క పువ్వు అని అర్థం. అంతే కాకుండా, ఆ పువ్వు

కూడా గులాబీ రంగులోనే ఉంటుంది. ఆ కారణంగానే, జపాన్‌లో గులాబిరంగుని "పీచ్ పుష్పం రంగు" అనే ఇంకొక పేరుతో కూడా పిలుస్తారు. మమోకాకి పుస్తకాలంటే చాలా ఇష్టం. మమోకా, రాత్రిపూట నిద్రపోవటానికి ముందు ఆమె తల్లి ఆమెకు రెండు పుస్తకాలు చదివి వినిపించేది. అవి వినటం పూర్తి అయిన తరువాత మాత్రమే మమోకా నిద్రపోయేది.

మమోకాకి మూడు సంవత్సరాల వయస్సు ఉన్నప్పుడు ఆమెకు కాన్సర్ వ్యాధి ఉన్నదని తెలిసింది. రెండు సంవత్సరాలపాటు ఆమెకు చాలా శక్తివంతమైన వైద్యం చేయించబడింది. ఆపై ఆమెకు ఆ వ్యాధి తగ్గిపోయింది. ఆమెను ఆసుపత్రి నుండి డిశ్చార్జి చేస్తున్న సమయంలో వైద్యులు ఆమెను పరిశీలించినప్పుడు ఆమెకు కొత్తగా లుకేమియా కాన్సర్ వ్యాధి సోకినట్లుగా తేలింది. ఆ రోగానికి చికిత్సగా ఆమెకు "బోన్‌మారో ట్రాన్స్‌ప్లాన్‌టేషన్" అనే క్లిష్టమైన శస్త్రచికిత్స చేసారు. అది విజయవంతం అయ్యింది. కానీ, దురదృష్టవశాత్తు 2003, ఫిబ్రవరి నెలలో ఆమెకు మళ్ళీ లుకేమియా వ్యాధి సోకింది. వైద్యులు, ఆమెకు ఇక ఏవిధమైన సహాయం చెయ్యలేరని గ్రహించిన ఆమె తల్లి, ఆమెను ఆసుపత్రి నుండి ఇంటికి తీసుకువచ్చింది. మమోకాను కారులో ఇంటికి తీసుకువస్తున్నప్పుడు ఆమె తన తల్లితో వణుకుతున్న స్వరంతో ఇలా అన్నది.

"నేను మంచు ప్రపంచానికి తొందరగా తిరిగి వెళ్ళిపోవాలి". (జపాన్ మత గ్రంధాలలో చెప్పబడిన సమాచారం ప్రకారం చూసినట్లయితే, ఆత్మల లోకం అద్భుతమైన మంచు పర్వతాలు మరియు ప్రకృతి దృశ్యాలతో కూడి ఉంటుంది. అందువల్లే ఆ లోకాన్ని 'మంచు ప్రపంచం' అని పిలుస్తారు.) కూతురు అన్న మాటలు విన్న తల్లి ఒక్కసారి భయంతో ఉలిక్కిపడింది. ఆపై ఆమె, దాదాపు ఏడ్చినంత పనిచేసి, ఆపై దీనమైన స్వరంతో "నీవు ఎక్కడికీ వెళ్ళవొద్దు. ఎప్పటికీ నా దగ్గరే ఉండు" అన్నది. అప్పుడు మమోకా బలహీనంగా నవ్వుతూ "మమ్మీ! నేను ఇప్పటికే ఆలస్యం చేసాను. తొందరగా వెళ్ళకపోతే వాళ్ళు నన్ను తిడతారు. నేను వెళ్ళిపోయానని బాధపడకు. నీవు ఎలా ఉన్నావో తెలుసుకోవటానికి నీకు ఒక ఉత్తరం కూడా వ్రాస్తాను" అన్నది. కూతురు అన్న మాటల్ని మమోకా తన జన్మలో మర్చిపోలేదు. ఏదిఏమైనా, ఇంటికి చేరుకున్న తరువాత మమోకా ఆరోగ్యం కొద్ది రోజులపాటు చక్కబడినట్లుగా కనిపించింది. కానీ, 2004, జనవరి 24వ తేదీన సూర్యాస్తమయ సమయంలో మమోకా పెద్దగా వెక్కిళ్ళు పెడుతూ తన ప్రియమైన తల్లి చేతుల్లో ప్రాణాలు వదిలింది. ఆ సమయంలో మమోకా వయస్సు – 6 సంవత్సరాల 8 నెలలు అని తెలుస్తున్నది.

మమోకా మృతదేహానికి శాస్త్రోక్తంగా అంత్యక్రియలు జరిగాయి. ఆమె చనిపోయిన రెండు రోజుల తరువాత – ఒక రోజు రాత్రి 10 గంటల సమయంలో ఆమె తల్లి మరియు అక్కయ్య "రీకా" తమ ఇంటి డ్రాయింగ్ రూంలో కూర్చుని ఉన్నారు. ఆ సమయంలో హఠాత్తుగా ఆ గదిలోని లైట్లు ఆరిపోయాయి. ఆపై వాటంతట అవే ఆరుసార్లు – వెలగటం మరియు ఆరటం జరిగింది. ఆ తరువాత ఆ లైట్లు "టుప్" అనే శబ్దంతో పేలిపోయాయి. మొదట్లో ఆ విషయాన్ని వాళ్ళు పెద్దగా పట్టించుకోనప్పటికీ కానన్ పుట్టిన తరువాత అతడి ప్రవర్తనను పరిశీలించిన తరువాత – గతంలో తమ డ్రాయింగ్ రూంలో లైట్లు ఆవిధంగా విచిత్రంగా వెలిగి ఆరిపోవటానికి కారణం – ఆ సమయంలో మమోకా ఆత్మ తిరిగి తమ ఇంటికి రావటమే అని మమోకా తల్లికి మరియు అక్కకు స్పష్టంగా తెలిసింది.

మమోకా చనిపోయిన ఆరు నెలల తరువాత ఒకరోజున మమోకా చదివిన స్కూల్లో సర్టిఫికెట్లు ఇచ్చే రోజు వచ్చింది. ఆ సర్టిఫికెట్ తీసుకోవటానికి మమోకా లేదు. అందువల్ల ఆమె తల్లి ఆ స్కూలుకి వెళ్ళి, ఆ సర్టిఫికెట్‌ని తీసుకుని, ఆపై దాన్ని తన గుండెలకు హత్తుకుని కన్నీళ్ళు పెట్టుకుంది. సరిగ్గా అదే సమయంలో, మమోకా క్లాసులో చదివిన కొందరు పిల్లలు ఆమె దగ్గరకు వచ్చి ఆమెతో ఇలా అన్నారు. "ఆంటీ! మాకు ఎన్నోసార్లు మా క్లాసులోను, ప్లే గ్రౌండ్‌లోను మమోకా కనిపిస్తున్నది. ఆమెను పట్టుకోవటంకోసం దగ్గరగా వెళితే అక్కడ ఎవరూ ఉండటంలేదు. ఇలా ఎందుకు జరుగుతున్నదో మాకు అర్థం కావటంలేదు".

మమోకా స్కూల్లో సర్టిఫికెట్లు ప్రదానం చేసే సమయంలో ఒక అద్భుతమైన సంఘటన జరిగింది. అది ఏమిటంటే, సర్టిఫికెట్లు ఇచ్చే సమయంలో స్టేజిమీద ఆ స్కూలుకి సంబంధించిన ఉపాధ్యాయులు, అధికారులు కూర్చుని ఉంటారు. స్టేజి ముందు – అనగా క్రింద వరుసగా వేసిన కుర్చీలలో సర్టిఫికెట్లు తీసుకోవలసిన పిల్లలు మరియు వారి తల్లిదండ్రులు కూర్చుని ఉంటారు. ఏ విద్యార్థికి సర్టిఫికెట్ ఇవ్వబోతున్నారో, ఆ విద్యార్థి పేరును స్టేజిమీద ఉన్న వ్యక్తి మైకులో చెబుతాడు. అప్పుడు, ఆ పేరుగల విద్యార్థి "యస్" అని చెప్పాలి. అనగా "నేను వచ్చాను" అని అర్థం. ఆపై, ఆ 'యస్' అని చెప్పిన విద్యార్థి, స్టేజిమీదకు వెళ్ళి తన సర్టిఫికెట్‌ను తీసుకోవాల్సి ఉంటుంది. సర్టిఫికెట్ ఇచ్చే సమయంలో అక్కడ ఉన్న ప్రతి విద్యార్థి – స్టేజి మీద నుండి తన పేరుని అక్కడ వ్యక్తి పలకగానే 'యస్' అని సమాధానం చెప్పాడు. కానీ, మమోకా చనిపోయిన కారణంగా ఆమె 'యస్' అని చెప్పలేదు. సరే, మర్నాటి సాయంత్రం ఆ సర్టిఫికెట్ల ప్రధాన కార్యక్రమం ఆ ప్రాంతంలో ఉన్న

ఒక లోకల్ టి.వి. ఛానల్‌లో రెండు మూడు సార్లు ప్రసారం అయ్యింది. ఆ ప్రసారంలో ఒక అద్భుతం కనపడింది. అది ఏమిటంటే, మమోకా చనిపోయిన విషయాన్ని మర్చిపోయిన స్టేజిపై ఉన్న వ్యక్తి అప్రయత్నంగా వరుస ప్రకారం వచ్చిన మమోకా పేరును కూడా చదివాడు. అప్పుడు “యస్” అన్న ఒక విచిత్రమైన స్వరం వినిపించింది. ఈ స్వరం నిజంగా ఎవరికీ వినపడలేదు కానీ, ఆ కార్యక్రమాన్ని షూట్ చేసి ఆపై టి.వి.లో ప్రదర్శించినప్పుడు ఆ స్వరం స్పష్టంగా అందరికీ వినపడింది. అంటే, ఆ సర్టిఫికెట్ల ప్రదాన కార్యక్రమానికి ‘మమోకా ఆత్మ’ వచ్చింది అని ఆమె తల్లికి స్పష్టంగా అర్థమయ్యింది.

ఆ తరువాత కొన్ని పరిస్థితుల కారణంగా తనకి 35 సంవత్సరాల వయస్సు ఉన్నప్పుడు మమోకా తల్లి తన భర్త నుండి విడాకులు తీసుకుని, వేరుగా జీవించటం ప్రారంభించింది. కొద్దికాలం గడిచిన తరువాత ఆమెపట్ల అభిమానం పెంచుకున్న ఒక వ్యక్తి, ఆమెను పెళ్ళి చేసుకున్నాడు. ఆ తరువాత కొంతకాలానికి అనగా 2008 నవంబర్‌లో ఒకరోజు తెల్లవారుఝామున ఆమెకు ఎంతో ఇష్టమైన ఒక పాట స్వప్నంలో కనిపించింది. సాధారణంగా, జపాన్‌లోని పిల్లలు బాండ్ వాయిస్తూ ఆ పాట పాడుతూ ఉంటారు. తనకు ఎంతో ఇష్టమైన ఆ పాట స్వప్నంలో కనిపించే సరికి ఆమెకు ఎంతో ఆనందం కలిగింది. ఆ రోజు మధ్యాహ్న సమయంలో టి.వి. ఆన్‌చేసినప్పుడు ఆమెకు టి.వి.లోకూడా అదే పాట ప్రసారం అవుతూ కనపడింది. ఆ పాటలోని అర్థం ఇలా ఉన్నది. “ఇది నీకు నేను చెబుతున్న శాశ్వత వీడ్కోలు అయినప్పటికీ, నీ శ్వాస శబ్దాన్ని నేను వినగలుగుతున్నాను. నీ వెచ్చటి శ్వాస నాకు తెలుస్తున్నది. ఏదో ఒక రూపంలో మళ్ళీ నేను నీ దగ్గరకు వస్తాను” – ఆ పాటను శ్రద్ధగా విన్న ఆమెకు కొన్నేళ్ళ క్రితం చనిపోయిన, తన ప్రియమైన కూతురు మమోకా మళ్ళీ తనకి జన్మిస్తుంది అన్న విపరీతమైన ఆశ ఆమెలో ఆ క్షణంలో మొలకెత్తింది. ఇంకొక విశేషం ఏమంటే, ఆమె రెండవ భర్తకు కూడా కలలో ఇద్దరు ఆడ పిల్లలు ఒక అరణ్యంలో ఎంతో సంతోషంతో కేరింతలు కొడుతూ ఆడుకుంటున్నట్లుగా కల వచ్చింది. అంతేకాదు, ఈ కల అతడికి చాలాసార్లు వచ్చినట్లుగా తెలుస్తున్నది. ఏదిఏమైనా, మమోకా తల్లికి కలలో ఆ పిల్లల పాట కనిపించిన 11వ రోజున, ఆమె ఏదో కారణంగా హాస్పటల్‌కి వెళ్ళింది. ఆ సమయంలోనే ఆమెకి తాను గర్భవతి అయినట్లుగా తెలిసింది. ఆ తరువాత 2009, జూలై 26వ తేదీన మగబిడ్డ పుట్టాడు. ఆ బిడ్డకి ‘కెనాన్’ అనే పేరు పెట్టారు. ఆ తల్లిదండ్రులకు ఎంతో ఇష్టమైన ఒక సంగీత రాగం పేరు కెనాన్.

సంగీతం పట్ల వారికి ఉన్న అభిమానంతోనే తమ మగబిడ్డకి ఆ పేరు పెట్టారని తెలుస్తున్నది.

మమోకా తిరిగి తన తల్లికి కొడుకుగా (కానన్)గా జన్మించిందని నిరూపించే కొన్ని సాక్ష్యాలను డా.అకీరా, తన దేశానికి వచ్చిన అమెరికన్ పారాసైకాలజిస్టులకు ఇలా తెలియజేసాడు...

1. జపాన్‌లోని కిండర్‌గార్డెన్‌లో చదివే చిన్న పిల్లలు, తమ తమ పుట్టిన రోజున తమ స్కూలుకివెళ్ళి తమయొక్క చేతి ముద్రలను (హ్యాండ్ ప్రింట్స్) గులాబి (పింక్) లేదా నీలం (బ్లూ) రంగులో ముంచి, ఆపై దానిని ఒక అట్టపై ముద్రించి తమ స్కూలు టీచర్లకు ఇస్తారు. సాధారణంగా, జపాన్‌లో ఉన్న సాంప్రదాయం ప్రకారం – మగపిల్లలు నీలిరంగులోను, ఆడపిల్లలు గులాబి/పింక్ రంగులో తన చేతి ముద్రలను ముద్రించి ఇస్తారు. కానీ 4 సంవత్సరాల వయస్సు ఉన్న కానన్ గులాబి రంగులో తన చేతిముద్రను రూపొందించి తన టీచర్‌కి ఇచ్చాడు. మమోకాకి గులాబి రంగు అంటే ఎంతో ఇష్టమని, ఆమె చనిపోయిన ఐదు ఏళ్ళ తర్వాత పుట్టిన కానన్‌కి తెలియదు లేదా ఎవరూ అతనికి చెప్పలేదు.

2. మమోకా బ్రతికి ఉన్నప్పుడు 'రాబిట్స్ ఆఫ్ సిల్వేలియన్ ఫామిలీ' అనే పేరుతో పిలిచే కుందేళ్ళ బొమ్మల సెట్‌తో ఎంతో సంతోషంగా ఆడుకునేది. కానన్, ఒకసారి తన తల్లితో బజారుకి వెళ్ళినప్పుడు అక్కడ ఆట బొమ్మలు అమ్మే ఒక దుకాణంలో కనిపించిన ఆ కుందేలు బొమ్మల సెట్‌ని తనకు కొని పెట్టమని బాగా గొడవ చేసాడు. దాంతో, అతని తల్లి ఆ బొమ్మల సెట్‌ని కొనిపెట్టింది. ఇంటికి వెళ్ళిన తరువాత కెనన్ తన సవతి అక్క రీకాతో ఆ కుందేలు బొమ్మలతో ఆడుకున్నాడు. – గతంలో, మమోకా ఏవిధంగా అయితే తన అక్కతో ఆడుకునేదో సరిగ్గా అదేవిధంగా కానన్ అలాగే మాట్లాడుతూ తన అక్కతో ఆ కుందేలు బొమ్మలతో ఆడుకోవటం జరిగింది. ఒక సందర్భంలో బాలుడైన కానన్, హడావుడిగా తన తల్లి దగ్గరకు వచ్చి ఆమెతో ఇలా అన్నాడు. "ఒకసారి నేను తగలబడిపోయాను". మమోకా మళ్ళీ కానన్‌గా జన్మించింది అని అప్పటికే అర్థం చేసుకున్న కానన్ తల్లిదండ్రులు – కానన్ చెబుతున్నది, గతజన్మలో తాను మమోకాగా ఉన్నప్పుడు జరిగిన సంగతి అని అర్థం చేసుకున్నారు. అందుకే ఆ బాలుడిని "ఎందుకు అలా అంటున్నావు?" అని ప్రశ్నించలేదు. ఆధునిక కాలంలో కంప్యూటర్ టెక్నాలజీని ఉపయోగించి – దాదాపు ఒకే పోలికలతో ఉండే ఇద్దరు వ్యక్తుల యొక్క ఫోటోలను పోల్చిచూసి, వారిద్దరి

మధ్య పోలికలు ఎంత శాతం అధికంగా ఉన్నాయో తెలుసుకునే అవకాశం ప్రస్తుతం ప్రపంచ వ్యాప్తంగా ఉన్నది. కానన్, పునర్జన్మ వృత్తాంతం గురించి తెలుసుకున్న కొందరు ఔత్సాహిక ఫోటోగ్రాఫర్లు, కానన్ మరియు చనిపోయిన అతని అక్క మమోకా యొక్క ఫోటోలను టెక్నాలజీ సహాయంతో పోల్చి చూసినప్పుడు స్కోరు ఎలా వచ్చింది అంటే – 100కి 82 వచ్చాయి. ఇంకొక విశేషం ఏమంటే, మమోకాకి 5 సంవత్సరాల వయస్సు ఉన్నప్పుడు తీసిన ఫోటోని మరియు కానన్‌కి 5 సంవత్సరాల వయస్సు ఉన్నప్పుడు తీసిన ఫోటోని పోల్చిచూసి ఈ స్కోరు ఇవ్వటం జరిగింది.

3. తనకి నాలుగు సంవత్సరాల వయస్సు ఉన్నప్పుడే కానన్ బాగా చదివేవాడు. అంతేకాకుండా, జపనీస్ అక్షరమాలలోని అన్ని అక్షరాలను ఏమాత్రం పొరపాటు లేకుండా వ్రాసేవాడు. – (జపాన్‌కి చెందిన విద్యాశాఖకు సంబంధించిన కొందరు పరిశోధకులు తమ దేశంలోని పిల్లల మేధస్సు ఏవిధంగా ఉన్నది? అని తెలుసుకోవటం కోసం చేసిన పరిశోధనలో – ఏ పిల్లవాడు లేదా పిల్ల – నాలుగు సంవత్సరాల వయస్సులో జపాన్ భాషా పదాలను సంపూర్తిగా వ్రాయలేదు.)

4. కానన్‌కి మూడు సంవత్సరాల వయస్సు ఉన్నప్పుడు ఒకరోజు రాత్రి నిద్రపోవటానికి ముందు తన తల్లితో ఇలా అన్నాడు. "నేను చాలా దూరం నుంచి తొందరగా ప్రయాణంచేసి నా తల్లి గర్భంలోకి వచ్చాను". గర్భవతి అయ్యే సమయంలో అతడి తల్లి వయస్సు 41 సంవత్సరాలు. తాను ఆలస్యంగా వచ్చినట్లయితే తన తల్లికి ఎక్కువ వయస్సు వచ్చేస్తుందని, అప్పుడు ఆమె బిడ్డను కనటం కష్టం అవుతుందని భావించిన తాను చాలా వేగంగా తన తల్లి గర్భంలోకి రావటం జరిగిందని – కానన్ మాటల్ని బట్టి పరిశోధకులకు అర్థమయ్యింది.

**తల్లి గర్భంలో చనిపోయిన బిడ్డ మళ్ళీ ఆ తల్లికే జన్మిస్తుంది అని నిరూపించిన "టకుమా" పునర్జన్మ వృత్తాంతము :**

కొన్ని సందర్భాలలో కొంతమంది గర్భిణీ స్త్రీలకు 6వ నెలలో లేదా 7వ నెలలో హఠాత్తుగా గర్భవిచ్ఛిత్తి (ఎబార్షన్) అవుతుంది. ఫలితంగా, కడుపులో అప్పుడప్పుడే పూర్తి రూపంలోకి వస్తున్న శిశువు మరణించి, బైటకు రావటం జరుగుతుంది. ఇలా జరగటానికి కారణం, ఆ గర్భిణీ స్త్రీలలో ఉండే శారీరక లోపాలు అని వైద్యశాస్త్రం తెలియజేస్తుంది. ఆ స్త్రీలయొక్క గతజన్మ లేదా ఈ జన్మ చెడు కర్మల వల్ల మరియు గర్భంలో ఉన్న శిశువుయొక్క ఆత్మ, గతజన్మలో చేసిన చెడు కర్మల వల్ల – కడుపులో శిశువు, కడుపులోనే చనిపోవటం జరుగుతుందని

ధర్మశాస్త్రాలు ఉద్ఘాటిస్తున్నాయి. ఏది ఏమైనా, ఒక తల్లియొక్క గర్భంలోనే చనిపోయి మృత శిశువుగా లేదా మృత పిండంగా బైటకు వచ్చిన జీవి, మళ్ళీ అతి కొద్ది రోజుల్లోనే అదే తల్లి గర్భంలో ప్రవేశించి, కొన్ని నెలలు పెరిగి ఆ తరువాత ఆ తల్లికి గర్భస్రావం (అబార్షన్) జరగటంవల్ల తల్లి గర్భంలోనే చనిపోవటం జరుగుతుంది. కొన్ని సందర్భాలలో కొంతమంది స్త్రీలకు కనీసం నాలుగైదు సార్లు ఈవిధంగా కడుపులోనే బిడ్డలు చనిపోయే దౌర్భాగ్యం ఎదురవుతుంది.



కొన్ని సందర్భాలలో, ఒకే ఆత్మ, ఒకే తల్లి గర్భంలో పదే, పదే పిండంగా లేదా శిశువుగా జీవించి ఆ తరువాత ఆ గర్భంలోనే చనిపోవటం జరుగుతుంది. ఇలాంటి సంఘటనలు భారతదేశంతో సహా ప్రపంచంలోని చాలా దేశాలలో జరుగుతూ ఉన్నాయి. ఏదిఏమైనా, ఒక తల్లికి రెండుసార్లు గర్భవిచ్ఛిత్తి (అబార్షన్) జరగటం వల్ల రెండుసార్లు గర్భంలోనే చనిపోయి, మళ్ళీ అదే తల్లి గర్భంలో శిశువుగా పెరిగి ఈ లోకంలోకి వచ్చిన ఒక బిడ్డ, తాను పుట్టిన కొద్ది ఏళ్ళపాటు తన గతజన్మయొక్క అనుభవాలను (తాను తల్లి గర్భంలో ఉన్నప్పుడు తనకు ఎదురైన అనుభవాలు అన్నమాట.) తన తల్లికి మరియు ఇతరులకు చెప్పటం జరిగింది. అలా గతజన్మ జ్ఞాపకాలతో పుట్టిన ఆ మగబిడ్డ పేరు “టకుమా”.

“టకుమా” అనే మగబిడ్డ 2009, ఏప్రియల్ 18వ తేదీన జపాన్ దేశంలోని “ఐచి” రాష్ట్రంలో జన్మించాడు. ఆ మగబిడ్డకు మూడు సంవత్సరాల వయస్సు ఉన్నప్పుడు అతని తల్లి అతనితో కలిసి ఒక స్విమ్మింగ్ పూల్‌లో స్నానం చేస్తున్నది. “టకుమా”, వచ్చీరాని మాటలతో తన తల్లితో ఇలా అన్నాడు. “గర్భంలో ఉండే స్విమ్మింగ్‌పూల్ చాలా చిన్నదిగా ఉంటుంది”. గర్భంలో ఉండే స్విమ్మింగ్‌పూల్ అంటే – తాను తన తల్లి గర్భ సంచిలో ఉన్న విషయం గురించి టకుమా చెప్పినట్లుగా గుర్తించారు.

2015, అక్టోబర్ నెల 6వ తేదీ ఉదయం – టకుమా తన తల్లితో కలిసి తన ఇంటిలోని లివింగ్ రూమ్‌లో ఏదో పలహారం తింటూ, ఆపై తనలో తాను

గొణుక్కుంటున్నట్లుగా ఇలా అన్నాడు. "నేను, నా తల్లి గర్భంలోకి రెండుసార్లు ప్రవేశించాను. కానీ చనిపోయాను. అయితే, మూడవ సారి, నేను ఆశపడినట్లుగా ఈ లోకంలోకి వచ్చాను". (అతడి తల్లికి 2012 మరియు 2014లో ఎబార్షన్లు జరిగాయి. ఈ రెండు సందర్భాలలోను ఆమె గర్భంలో ఉన్న బిడ్డ వయస్సు దాదాపు రెండు నెలలు మాత్రమే ఉన్నది.) టకుమా పుట్టటానికి ముందే అతడి తల్లికి ఈ ఎబార్షన్లు జరిగాయి కనుక ఆ బిడ్డకి వాటి గురించి తెలిసే అవకాశం లేదు. అదీ కాక అంత చిన్న వయస్సు ఉన్న ఆ బిడ్డకి ఎబార్షన్ల గురించి ఎవరూ చెప్పరు. ఒకవేళ చెప్పినా అర్థంచేసుకునే జ్ఞానం ఆ బిడ్డకు ఉండదు.

టకుమా, ఏ సందర్భంలోనూ తన గతజన్మయొక్క జ్ఞాపకాలను తన తల్లితో ఏనాడూ నేరుగా చెప్పలేదు. అతడు మాట్లాడే మాటలను బట్టి గతంలో, "తనకు రెండుసార్లు పోయిన గర్భాలలో ఉన్నది ఆ బిడ్డే" అని అతడి తల్లికి స్పష్టంగా అర్థమయ్యింది. టకుమా, అసాధారణమైన మేధస్సుని చాలా చిన్నతనంలోనే ప్రదర్శించాడు. టి.వి.లో, ఒకసారి ఒక యోగా కార్యక్రమాన్ని కొంచెంసేపు శ్రద్ధగా చూసిన టకుమా, ఆ మర్నాడు సాయంత్రం తన తల్లికి వివిధ రకాల యోగాసనాల గురించి మరియు యోగాసనాలు వెయ్యటం వల్ల మనిషికి లభించే లాభం గురించి – ఒక యోగా టీచరు చెప్పినట్లుగా చాలా వివరంగా చెప్పాడు. అతడికి గతజన్మలో యోగాకు సంబంధించిన ఉన్న జ్ఞానం కారణంగానే, ఎవరూ చెప్పకుండానే యోగశాస్త్రానికి సంబంధించిన అంత ఎక్కువ సమాచారం అతడికి తెలిసి ఉంటుందని అతడిని ఇంటర్వ్యూ చేసిన కొందరు పారాసైకాలజిస్టులు నిర్ధారించారు.

**పునర్జన్మ సిద్ధాంతానికి రుజువుగా నిలిచిన "పొల్లాక్" కవలల(ఇంగ్లాండ్) వృత్తాంతము :**

**ఇయాన్ స్టీవ్‌సన్ – (1918, అక్టోబర్ 31 – 2007, ఫిబ్రవరి 8) :** అమెరికాలో జన్మించిన ఈ కెనడా దేశస్తుడు, ఆధునిక పాశ్చాత్య దేశాలలో ఒక గొప్ప సైకియాట్రిస్టుగా గుర్తించబడ్డాడు. ఈయన, అమెరికాలోని "యూనివర్సిటీ ఆఫ్ వర్జీనియా స్కూల్ ఆఫ్ మెడిసిన్" అనే విశ్వవిద్యాలయంలో 50 సంవత్సరాలపాటు సైకియాట్రి విభాగంలో పనిచేసాడు. ఈయన ప్రపంచంలోని చాలా దేశాలలో ముఖ్యంగా, ఇండియా, శ్రీలంక, చైనా, పాకిస్తాన్ లాంటి దేశాలలో అనేక సంవత్సరాలపాటు తిరిగి, పునర్జన్మలకు సంబంధించిన ఎన్నో వృత్తాంతాలను – తగిన ఆధారాలతో సహా లోకానికి తెలియజేసాడు. ఈయన కారణంగానే

పాశ్చాత్యదేశాల్లో పునర్జన్మ సిద్ధాంతానికి ఒక గొప్ప విలువ వచ్చిందని చెబుతారు.

అమెరికా పారాసైకాలజిస్ట్ మరియు ఎదురులేని సైకియాట్రిస్ట్ అయిన డాక్టర్ ఇవాన్ స్టీవ్‌సన్, స్వయంగా పరిశోధనచేసి తెలుసుకున్న ఈ పొలాక్ కవల - అక్కాచెల్లెళ్ళ పునర్జన్మ వృత్తాంతం ఆధునికకాలంలో, పునర్జన్మ సిద్ధాంతానికి ఎదురులేని రుజువుగా గుర్తించబడింది. 1987లో స్టీవ్‌సన్, స్వయంగా ఇంగ్లాండ్‌కివెళ్ళి ఆ కవలలను కలుసుకుని, ఆపై వారి గతజన్మ గురించి మరియు ఈ జన్మ గురించిన వివరాలను సేకరించి, ఈ కవలల వృత్తాంతం యదార్థమే అని రుజువులతో సహా లోకానికి అందించాడు. ఇక, ఆ కవలల పునర్జన్మ వృత్తాంత వివరాలను పరిశీలిద్దాం...



డాక్టర్ ఇవాన్ స్టీవ్‌సన్

హెక్స్‌హమ్ అనే ఒక చిన్న పట్టణం ఇంగ్లాండ్‌లో ఉన్నది. ఇక్కడే జాన్ పొలాక్ ఇద్దరు కూతుళ్ళూ కారు ప్రమాదంలో చనిపోయారు. వాళ్ళపేర్లు జాక్వెలిన్ మరియు జొన్నా.

యునైటెడ్ కింగ్‌డమ్ (యు.కె.) దేశంలోని భాగమైన ఇంగ్లాండ్‌లోని హెక్స్‌హామ్ అనే చిన్నస్థాయి పట్టణంలో నివసిస్తున్న జాన్‌పొలాక్ మరియు ఫ్లోరెన్స్‌పొలాక్ అనే దంపతులకు జొన్నా అనే 11 సంవత్సరాల మరియు జాక్వెలిన్ అనే 6 సంవత్సరాల కూతుళ్ళు ఉండేవాళ్ళు. దురదృష్టవశాత్తు, 1957, మే 5వ తేదీన జరిగిన ఒక కారు ప్రమాదంలో అనగా, కారు వాళ్ళని బలంగా గుద్దుకోవటం వల్ల ఆ ఇద్దరు అక్కాచెల్లెళ్ళు అక్కడికక్కడే మరణించారు.

ఆ తరువాత దాదాపు ఒకటిన్నర సంవత్సరాలకు అనగా 1958, అక్టోబర్ 4వ తేదీన జాన్‌పొలాక్ దంపతులకు ఇద్దరు ఆడపిల్లలు "కవలలుగా" (Twins) జన్మించారు. అంతకుముందు సంవత్సరం చనిపోయిన జాన్‌పొలాక్ ఇద్దరు కూతుళ్ళే (జాక్వెలిన్, జొన్నా) మళ్ళీ, అదే తల్లిదండ్రులకు కవల పిల్లలుగా జన్మించారని రుజువు అయ్యింది. ఆ రుజువులు ఏమిటో మనం కూడా తెలుసుకోవాలి మరి...

1957, మే 5వ తేదీ ఉదయం జొన్నా మరియు జాక్వెలిన్‌లు తమ స్నేహితురాలితో కలిసి తమ ఇంటికి దగ్గరలో ఉన్న ఒక చర్చి దగ్గరకు నవ్వుకుంటూ నిదానంగా

నడిచి వెళుతున్నారు. ఆ సమయంలో ఒక కారు, అడ్డదిడ్డంగా పరుగెడుతూ అటువైపుగా వస్తున్నది. ఆ కారు నడుపుతున్న డ్రైవరు ఒక స్త్రీ. ఆమె భర్త, ఆమె పిల్లల్ని ఆమెనుండి బలవంతంగా తీసుకువెళ్ళిపోయాడు. దాంతో, ఆమెకి తన జీవితం మీద పట్టరాని విరక్తి మరియు ద్వేషం కలిగాయి. దాంతో, ఆమె – ఆత్మహత్య చేసుకోవాలని నిర్ణయించుకుని ఆపై తన కారుని అడ్డదిడ్డంగా పరుగెత్తిస్తూ అటువైపుగా వచ్చింది. ఆ కారు తమవైపుగా దూసుకువస్తూ కనిపించేసరికి జాక్వెలిన్, జొన్నాలకు విపరీతమైన భయం కలిగింది. దాంతో ఆ పిల్లలు, ఆ కారు బారి నుండి తప్పించుకోవటానికి ప్రక్కకి పరుగెత్తారు. దురదృష్టవశాత్తు, అక్కడ ఒక పెద్దగోడ అడ్డుగా ఉన్నది. దాంతో వాళ్ళు తప్పించుకునే అవకాశం లేకుండా పోయింది. ఇంతలో ఆ కారు ఆ గోడవైపు దూసుకు వచ్చింది. ఆ గోడకి ఆనుకుని, ప్రాణభయంతో వణకిపోతున్న ఆ ఇద్దరు చిన్న పిల్లల్ని ఆ కారు బలంగా "ఢీ" కొన్నది. ఫలితంగా, ఆ ఇద్దరు పిల్లలు సెకన్లలలో మృతదేహాలుగా, నెత్తురు ముద్దలుగా మారిపోయారు. ఉన్మాద స్థితికిలోకి చేరిన ఒక స్త్రీ చేసిన యాక్సిడెంట్‌లో దారుణంగా చనిపోయిన ఈ ఆడపిల్లల వృత్తాంతం బ్రిటన్‌లో ప్రచురించబడే అన్ని వార్తా పత్రికలలో ప్రముఖంగా ప్రచురించబడింది.



**కారు ప్రమాదంలో మరణించిన అక్కాచెల్లెళ్ళు జొన్నా–జాక్వెలిన్**

"తాము ఎంతగానో ఇష్టపడే తమ కూతుళ్ళు అలా దారుణంగా మరణించే సరికి జాన్‌పొలాక్ దంపతులు కుప్పకూలి పోయారు". ఏదిఏమైనా, అతడి భార్య

ఫ్లోరెన్స్ మాత్రం ఎలాగో కోలుకుని జాన్‌పొలాక్‌ని తన శక్తికి మించి ఓదార్చింది. పొలాక్ కొద్ది రోజుల్లోనే ఆ బాధ నుండి కోలుకున్నాడు. జాన్‌పొలాక్, క్యాథలిక్ క్రైస్తవ మతాన్ని పాటిస్తాడు. "చనిపోయిన మనుషులు మళ్ళీ ఏదో ఒక సమయంలో తిరిగి వస్తారని" క్యాథలిక్ మతంలో చెప్పబడి ఉన్నది. అందువలన, జాన్‌పొలాక్ ప్రతిరోజూ తాను పూజించే దేవుడి పటం ముందు నిలబడి "ఓ ప్రభూ! నీవు కరుణామయుడివి. నేను కోల్పోయిన బిడ్డలను మళ్ళీ నాకు తిరిగి ఇవ్వు. ఇంతకు మించి నిన్ను ఏమీ కోరను" అని మనస్ఫూర్తిగా ప్రార్థిస్తూ ఉండేవాడు. ఇలా కొద్ది రోజులు గడిచాయి. ఒకరోజు రాత్రి సమయంలో జాన్‌పొలాక్ మంచి నిద్రలో ఉన్నాడు. ఆ సమయంలో అతడికి ఒక కల వచ్చింది. ఆ కలలో...కొద్ది నెలల క్రితం యాక్సిడెంట్‌లో చనిపోయిన అతడి ఇద్దరు కూతుళ్ళు, అతడి ప్రక్కగా వచ్చి నిలబడి అతడితో ఏవేవో మాటలు చెబుతున్నారు. ఆ కల పూర్తి కాగానే జాన్‌పొలాక్‌కి మెళుకువ వచ్చింది. తనకు వచ్చిన కల సాధారణమైన కల కాదని, చనిపోయిన తన ఇద్దరు పిల్లలు, మళ్ళీ తనకు బిడ్డలుగా జన్మించబోతున్నారని ఆ కల ద్వారా జాన్‌పొలాక్‌కి నమ్మకం కలిగింది. ఆ తరువాత కొద్ది రోజులకే ఫ్లోరెన్స్ గర్భవతి అయ్యింది. దాంతో, తనకు వచ్చిన కల ఖచ్చితంగా నిజమవుతుందని జాన్‌పొలాక్ గట్టిగా తీర్మానించుకున్నాడు. ఆ విషయాన్నే తన భార్య ఫ్లోరెన్స్‌తో అన్నప్పటికీ ఆమె, అతడి మాటలను కొట్టిపారేసింది. "చచ్చిపోయిన వాళ్ళు మళ్ళీ పుట్టటం జరిగే పని కాదు" అని ఆమె వాదించింది. ఇంకొక విశేషం ఏమంటే, ఆ సమయంలో ఆమెను పరిశీలించిన వైద్యుడు "ఆమె గర్భంలోని గర్భస్థ శిశువుయొక్క హృదయస్పందన (హార్ట్‌బీట్) బట్టి ఆమె కడుపులో ఉన్నది ఒక్క బిడ్డే అని నిర్ధారించాడు". అంతే కాకుండా అటు జాన్‌పొలాక్ వంశంలోగాని, ఇటు అతడి భార్య ఫ్లోరెన్స్ విషయంలో గాని అప్పటి వరకు కవల పిల్లలు పుట్టిన చరిత్రే లేదు.


పొలాక్ కవలలు

అందువల్ల, జాన్‌పొలాక్ భావిస్తున్నట్లుగా తనకి కవల పిల్లలు పుట్టరని ఫ్లోరెన్స్ ఖచ్చితంగా నిర్ణయించుకున్నది.

ఏదిఏమైనా, 1958, అక్టోబర్ 4వ తేదీన జాన్‌పొలాక్ దంపతులకు ఇద్దరు ఆడపిల్లలు "కవలలుగా" (Twins) జన్మించారు. మళ్ళీ పుట్టిన ఆ కవల పిల్లల్లో మొదటి బాలిక పేరు జిల్లియన్, రెండవ బాలిక పేరు జెన్నిఫర్. వీళ్ళిద్దరూ అచ్చుగుద్దినట్లుగా, ఇంకా బాగా చెప్పాలంటే ఫోటోస్టాట్ తీసినట్లుగా – ఒకే రకంగా కనిపించేవాళ్ళు.

కారు ప్రమాదంలో చనిపోయిన జాక్వెలిన్ మరియు జొవాన్నాలు తిరిగి జిల్లియన్ మరియు జెన్నిఫర్‌లుగా జన్మించారు అని ఆ పిల్లల తల్లిదండ్రులు నిర్ణయించుకోవటానికి కొన్ని ఆధారాలు లభించాయి. అవి ఏమిటంటే...

జాక్వెలిన్‌కి ఎక్కడైతే మచ్చలు (గాయపు మచ్చలు) ఉన్నాయో జెన్నీఫర్‌కి కూడా సరిగ్గా అక్కడే జన్మచిహ్నాలు (బర్త్‌మార్క్స్) ఉన్నాయి. జాక్వెలిన్‌కి మూడు సంవత్సరాల వయస్సు ఉన్నప్పుడు ఒకరోజున ఆడుకుంటూ, పొరపాటున నీళ్ళ బక్కెటులో పడిపోయింది. ఫలితంగా, ఆమె నుదుటిమీద అనగా కుడి కన్నుకి కొంచెం పైభాగంలో ఒక చిన్న గాయం అయ్యింది. ఆ గాయం తగ్గిపోయినప్పటికీ మచ్చ మాత్రం మిగిలిపోయింది. ఫలితంగా, ఆ ప్రాంతంలో అస్పష్టంగా ఒక గంటు (లోతైన మచ్చ) ఏర్పడింది. జెన్నిఫర్‌కి కూడా నుదుటికి కుడివైపున ఒక గంటు ఉన్నది.

ఈ కవలలకు 3 నెలల వయస్సు ఉన్నప్పుడు జాన్‌పొలాక్ కుటుంబం, హెక్స్‌హామ్ పట్టణం నుండి వైట్లేబె అనే ఇంకొక ప్రాంతానికి వెళ్ళిపోయింది. ఆ తరువాత కొంతకాలం పాటు పొలాక్ దంపతులు అక్కడే ఉన్నారు. వీళ్ళు అక్కడకు వెళ్ళిన రెండేళ్ళ తరువాత ఈ కవల పిల్లలకు మెల్లిమెల్లిగా మాటలు రావటం మొదలయ్యింది. "తమ బొమ్మలు తమకు ఇవ్వమని" వాళ్ళు, తరచుగా తమ తల్లి ఫ్లోరెన్స్‌ని అడుగుతూ ఉండేవాళ్ళు. నాలుగేళ్ళ క్రితం, కారు ప్రమాదంలో చనిపోయిన తన పెద్ద కూతుళ్ళు ఆడుకునే బొమ్మల గురించి, వాళ్ళ తరువాత పుట్టిన ఈ కవల పిల్లలకు ఎలా తెలిసిందో? ఫ్లోరెన్స్‌కి అర్థంకాలేదు.

**గతజన్మ జ్ఞాపకాలు :**

ఈ కవల పిల్లలకి మూడు సంవత్సరాల వయస్సు ఉన్నప్పుడు, జాన్‌పొలాక్ ఒకరోజు ఉదయం తన ఇంటి అటక మీద నుండి ఒక పెట్టెను క్రిందకి దింపి, ఆపై

దాంట్లో ఉన్న కొన్ని బొమ్మలు తీసి ఆ కవల పిల్లల ముందు ఉంచాడు. (జొన్నా, జాక్వెలిన్‌లకు చెందిన ఆ బొమ్మలను జాన్‌పొలాక్, ఆ పిల్లలు చనిపోయిన తరువాత ఒక పెట్టెలో పెట్టి, ఆపై ఆ పెట్టెను ఆటకమీద భద్రపరచాడు.) తమ ముందు ఉంచబడిన బొమ్మలను పరిశీలనగా చూసిన ఆ కవలలు ఆ బొమ్మల్లో, ఎవరి బొమ్మ ఎవరిదో గుర్తుపట్టారు. ఆపై, జొన్నాకు చెందిన బొమ్మని జిలియన్ తీసుకున్నది. ఇక, జాక్వెలిన్‌కి చెందిన చింపాంజి బొమ్మని జెన్నీఫర్ "ఇది నా బొమ్మ అని" ఆ బొమ్మిని తీసుకుని తన గుండెకు హత్తుకున్నది.

ఎవరి బొమ్మలను వాళ్ళు అలా తీసుకోగానే జాన్‌పొలాక్‌కి అశ్చర్యం కలిగింది. ఇంతలో, ఆ కవలలలో పెద్దది అయిన జిలియన్, తన తండ్రితో ఇలా అన్నది. "ఈ బొమ్మల్ని శాంటాక్లాజ్ మాకు బహుమతిగా ఇచ్చాడు". జిలియన్ ఆ మాట అనగానే జాన్‌పొలాక్ ఒక్కసారిగా ఆశ్చర్యపడ్డాడు. అందుకు కారణం ఏమంటే, యాక్సిడెంట్‌లో చనిపోయిన తన కూతుళ్ళకి, ఆ ప్రాంతంలోని (హెక్సహామ్ పట్టణంలోని) ఒక చర్చి ప్రీస్ట్, శాంటాక్లాజ్ వేషంలో వచ్చి ఆ బొమ్మల్ని ఇచ్చాడు. అలా ఆ బొమ్మలు వచ్చిన విషయం కేవలం తనకి మరియు తన భార్యకు మాత్రమే తెలుసు. మరి, ఆ పిల్లలు చనిపోయిన తరువాత పుట్టిన ఈ కవలలకి ఆ విషయం ఎలా తెలిసింది?.

ఈ కవల పిల్లలకు 3 నెలల వయస్సు ఉన్నప్పుడు – జాన్‌పొలాక్ తన కుటుంబంతో సహా హెక్సహామ్ నుండి వెళ్ళిపోయాడు. మళ్ళీ, ఆ పిల్లలకు దాదాపు 4 సంవత్సరాల వయస్సు ఉన్నప్పుడు హెక్సహామ్‌కి మళ్ళీ తన కుటుంబంతో సహా తిరిగి వచ్చాడు. అలా తిరిగి వచ్చిన తరువాత ఈ కవలలు, ఒక రోజు సాయంత్రం – ఆ ప్రాంతంలో ఉన్న ఒక పార్క్‌వైపు నడుచుకుంటూ వెళ్ళారు. నిజానికి, ఆ ప్రాంతంలో ఒక పార్క్ ఉన్న విషయం మరియు ఆ పార్క్ ఎటువైపు ఉన్నది? అన్న విషయం ఆ కవలలకు అప్పటిదాకా తెలియదు. కారణం, వాళ్ళు ఆ ప్రాంతానికి పూర్తిగా కొత్త. కానీ, ఆ కవలలు తమకి ఆ ప్రాంతం బాగా తెలిసినట్లుగా ప్రవర్తిస్తూ తమ ఇంటిని నడుస్తూ వెళ్ళి, ఆ తరువాత ఒకచోట రోడ్డుదాటి రోడ్డుకి అవతలవైపు ఉన్న పార్క్‌లోకి వెళ్ళారు. ఆ తరువాత ఆ పార్క్‌లో ఉన్న ఉయ్యాల(స్వింగ్)లో కాసేపు ఊగి ఆ తరువాత తమ ఇంటికి తిరిగి వచ్చారు.

ఈ కవలలు – ఒకరోజున తమ ఇంట్లో భోజనం చేస్తున్నారు. ఆ సమయంలో ఆ కవలలో ఒకటైన జెన్నీఫర్ కొంచెం కోపంతో కూడిన స్వరంతో తన తల్లితో ఇలా అన్నది. "నువ్వు వండుతున్న ఆహారం రుచిగా లేదు". అప్పుడు ఫ్లోరెన్స్ కొంచెం చిరాకుతో కూడిన స్వరంతో "మీకు నేను వండినది నచ్చకపోతే మీ స్కూల్లోనే లంచ్

చెయ్యండి" అన్నది. అప్పుడు ఆ కవలలు ముక్త స్వరంతో ఇలా అన్నారు. "గతంలో మేము లంచ్, మా స్కూల్లోనే తీసుకునేవాళ్ళం. ఇప్పుడు అలా చెయ్యటం మాకు ఇష్టంలేదు". (గతజన్మలో జొన్నా మరియు జాక్విలిన్‌గా ఉన్న ఆ కవలలు తమ మధ్యాహ్న భోజనం తమ స్కూల్లోనే తీసుకుంటూ ఉండేవాళ్ళు. మరి, ఆ విషయం ఈ కవలలకు ఎలా తెలిసింది?)

పారాసైకాలజిస్ట్ స్టీవ్‌సన్‌కి ఆ కవలల తండ్రి జాన్‌పొలాక్ ఒక సమయంలో ఇలా చెప్పాడు. "ఈ కవలలు – తమకు గతజన్మలో ఎదురైన యాక్సిడెంట్ గురించి వారిలో వారు మాట్లాడుకునేవారు. ఆ యాక్సిడెంట్ – ఈ మధ్య జరిగినట్లుగా వాళ్ళు భావిస్తున్నట్లుగా నాకు అనిపించింది". (గతజన్మలో తమకు ఎదురైన ఆ ప్రమాదాన్ని వాళ్ళు ఇప్పటికీ మర్చిపోలేదని, వాళ్ళు మాట్లాడుకునే విధానాన్ని బట్టి అర్థంచేసుకోవచ్చు.) గతంలో చనిపోయిన ఇద్దరు పిల్లలలాగానే ఈ కవలలు కూడా తమ ఇంట్లోనివాళ్ళకు ఒక దువ్వెనతో తల దువ్వటం జరిగింది. ముఖ్యంగా, ఈ కవలలు ఒకరి తరువాత ఒకరు తమ తండ్రి జాన్‌పొలాక్‌కి తల దువ్వి సంతోషించే వాళ్ళు. ఇంకొక విశేషం ఏమంటే, ఆ కవల పిల్లల ఇద్దరికీ కార్లు అంటే విపరీతమైన భయం ఉండేది. తాము ఉండే ప్రాంతంలో ఉన్న రోడ్లను దాటేటప్పుడు ఆ కవలలు ఎంతో కంగారు పడేవారు. ఒకరిచేయి ఒకరు పట్టుకుని అటు, ఇటు చూస్తూ చాలా జాగ్రత్తగా రోడ్డుదాటేవాళ్ళు. ఒక సమయంలో, వాళ్ళు తమ ఇంటి బైటకువచ్చి నిలబడ్డారు. ఆ సమయంలో – వాళ్ళకు కొంచెందూరంలో ఒక కారు స్టార్ట్ చేయబడింది. ఆ సమయంలో వచ్చిన శబ్దం విన్న ఆ కవలలు భయంతో వణికిపోయి, ఆపై ఒకరిని ఒకరు గట్టిగా కౌగలించుకుని ఆపై పెద్ద స్వరంతో "కారు", "కారు" అని కేకలు పెట్టారు. ఆ కారు, వాళ్ళకి ఒక భూతంలాగా కనిపించి కాబోలు.

జాక్వెలిన్ చనిపోయే నాటికి అప్పుడప్పుడే వ్రాయటం నేర్చుకుంటున్నది. ఆ బాలిక స్కూలులో ఏదైనా వ్రాసేటప్పుడు పెన్సిల్‌ని తన గుప్పెట్లో ఏటవాలుగా ఉండే విధంగా పట్టుకునేది. అది గమనించిన ఆ బాలిక క్లాసులోని టీచరు ఆ తరువాత ఆమె తండ్రి జాన్‌పొలాక్‌తో ఇలా చెప్పింది. "మీ అమ్మాయి జాక్వెలిన్ వ్రాసేటప్పుడు పెన్సిల్‌ని గుప్పెట్లో పట్టుకుంటుంది. అలా పట్టుకున్నప్పుడు ఆమె చేతిమీద చిన్న చిన్న దెబ్బలు వెయ్యండి. ఆమెకు ఆ అలవాటు పోతుంది". ఇక, ఈ కవల పిల్లలు అనగా జిలియన్ మరియు జెన్నిఫర్‌లకు నాలుగు సంవత్సరాల వయస్సు ఉన్నప్పుడు వ్రాయటం మొదటు పెట్టారు. విచిత్రంగా, జెన్నిఫర్, పెన్సిల్‌ని తన గుప్పెట్లో నిలువుగా

పట్టుకుని వ్రాయటం మొదలుపెట్టింది. కానీ, జిలియన్ మాత్రం మామూలుగా తన చేతివేళ్ళతో పెన్సిల్‌ని పట్టుకుని వ్రాసింది. జెన్నిఫర్‌కి 7 సంవత్సరాల వయస్సు దాటిన తరువాత ఆమె పెన్సిల్‌ని సరిగ్గా పట్టుకుని వ్రాయగలిగింది. (అనగా గత జన్మలో జాక్వెలిన్‌గా ఉన్న ఆమె, తన అలవాటుని మార్చుకోవటానికి 7 సంవత్సరాలు పట్టింది అన్నమాట.)

ఆ కవలలు తాము గతజన్మలో ఎలా ప్రవర్తించేవారో? – ఈ జన్మలో కూడా సరిగ్గా అలాగే ప్రవర్తించటం జరిగింది. జెన్నిఫర్–జాక్వెలిన్‌లాగా ప్రవర్తించగా, జిలియన్ – జొాన్నా లాగా ప్రవర్తించింది.

ఒక మధ్యాహ్న సమయంలో జిలియన్ తన స్కూలు ముందు నిలబడి ఉన్నది. ఆ సమయంలో ఆమెకు కొద్ది అడుగుల దూరంలో జెన్నిఫర్ నిలబడి ఉన్నది. సరిగ్గా, అదే సమయంలో ఒక కారు వేగంగా, వాళ్ల ప్రక్కనే ఉన్న రోడ్డుమీదుగా వస్తున్నది. ఆ కారుని చూసిన జిలియన్, హిస్టీరియా వచ్చిన దానిలా వణకిపోతూ ఆపై, పెద్ద స్వరంతో జెన్నిఫర్‌ని ఇలా హెచ్చరించింది. "జెన్నిఫర్! జాగ్రత్త, పొరపాటున ఆ కారు మనల్ని గుద్దింది అంటే మనం చచ్చిపోతాం". (ఒక విశేషం ఏమంటే, గత జన్మలో జాక్వెలిన్ మరియు జొాన్నాలను ఏ రూపంలో ఉండే కారు గుద్దిందో, అదే రకంగా ఉన్న కారు కనపడగానే జెలియన్‌కి తమ గతజన్మలో జరిగిన ప్రమాదం గుర్తు వచ్చింది అన్నమాట.)

జాక్వెలిన్ మరియు జొాన్నాలు – కారు ప్రమాదంలో చనిపోయి, మళ్లీ కవలలుగా జన్మించారు అని చెప్పటానికి తిరుగులేని రుజువు ఏమంటే – తమ అక్కలు (అనగా గతజన్మలో తామే) కారు ప్రమాదంలో చనిపోయిన విషయం ఆ కవలలకి 13 ఏళ్ళ వయస్సు వచ్చేదాకా తెలియదు. మరి, అలాంటప్పుడు ఆ కవలలు, చాలా చిన్న వయస్సులోనే కార్ల గురించి ఎందుకు భయపడ్డారు?. – గతజన్మలో తమకు ఎదురైన ఆ మరణ అనుభవాన్ని వాళ్ళు ఈ జన్మలో కూడా మర్చిపోలేదని గుర్తించాలి.

**కవల పిల్లల జననం వెనకాల దాగి ఉన్న శాస్త్రీయ మర్మం :**

జాయ్‌గోటా – బ్లాస్టోసిస్ట్ – ఎంబ్రియో – ఫీటస్ అనే నాలుగు దశల్లో ఒక బిడ్డ శరీరం, తల్లి గర్భంలో అభివృద్ధి చెందుతుంది.

పురుషుడియొక్క వీర్య కణంతో ఫలదీకరణం చెందిన స్త్రీ అండము (ఫెర్టిలైజ్డ్ ఎగ్) నుండి ఆవిర్భవించిన ఏకకణ ప్రాణిని 'బీజము/జీవకణం' (Zygote/జాయ్‌గోటా)

అని పిలుస్తారు. ఆ తరువాత వారాలలో 'బీజం', కొన్ని కణాల సముదాయంగా మారుతుంది. అప్పుడు దానిని 'బ్లాస్టోసిస్ట్' అని పిలుస్తారు.

స్త్రీ గర్భంలోని జీవ పదార్ధం – 5–10 వారాల మధ్యలో 'గర్భస్థ పిండం' (ఎంబ్రియో) అని పిలువబడుతుంది. ఆపై, 11వ వారం నుండి – శిశువు, తల్లి గర్భం నుండి బైటకు వచ్చే వరకు ఆ జీవపదార్థాన్ని 'ఫీటస్' (Foetus) అని పిలుస్తారు. 'ఫీటస్' అనగా 'మొలక' అని అర్ధం.

కవల పిల్లలలో రెండు రకాలు ఉంటారు. వారిలో మొదటి రకాన్ని 'మోనో జాయ్‌గోటా ట్విన్స్' అని పిలుస్తారు. ఈ విధానంలో, ఫలదీకరణం చెందిన ఒక అండం (ఫెర్టిలైజ్డ్ ఎగ్) – దైవ నిర్ణయం వల్ల లేదా ఊహించని తల్లియొక్క శారీరక పరిస్థితుల వల్ల – రెండుగా విడిపోతుంది. ఫలితంగా, ఒకేవిధమైన DNA కోడ్ మరియు ఒకేవిధమైన రూపు రేఖలు మరియు ఒకే లింగానికి చెందిన ఇద్దరు బిడ్డలు ఆ తల్లి గర్భసంచిలో అభివృద్ధి చెందుతారు. (అనగా ఇద్దరూ ఆడ పిల్లలే అవుతారు లేదా ఇద్దరూ మగ పిల్లలే అవుతారు అన్నమాట) ఒక ఆశ్చర్యకరమైన విషయం ఏమంటే, ఒకే అండం (స్త్రీ) మరియు ఒకే శుక్రకణం (పురుషుడు) కలవటం వల్ల ఏర్పడే "ఫలదీకరణం చెందిన అండం" నుండి నూరుశాతం ఒకేరకంగా ఉండే మరియు ఒకే DNA కోడ్ కలిగిన ఇద్దరు బిడ్డల్లో – వేరు వేరు గ్రూపుల రక్తం ప్రవహించటం జరుగుతుంది.

నోట్ : జాన్‌పొలాక్ దంపతులకు జన్మించిన కవల ఆడపిల్లల (జిలియన్ మరియు జెన్నిఫర్)ను వైద్య పరిభాషలో "ఐడెంటికల్ ట్విన్స్" అని పిలుస్తారు. అనగా, ఒకే రూపంలో ఉండే కవలలు అని అర్ధం. పొలాక్ కవలలు – 'మోనోజైగోటిక్' వర్గానికి చెందిన కవలలు అని గ్రహించాలి.

రెండవ రకం కవలల పేరు 'డై జాయ్‌గోటా ట్విన్స్. ఒకే కాన్పులో మగబిడ్డ మరియు ఆడబిడ్డ పుడితే వాళ్ళని "డై జాయ్‌గోటా ట్విన్స్" అని పిలుస్తారు. డై జాయ్‌గోటా ట్విన్స్ విషయానికి వస్తే, ఫలదీకరణం చెందిన రెండు వేర్వేరు అండాల నుండి ఇద్దరు విభిన్న లింగ బిడ్డలు పుడతారు. ఈ ఇద్దరు బిడ్డలకు వేరు వేరుగా బొడ్డుతాళ్ళు ఉంటాయి.



# 16. యూదు మతం (Jewish religion) లో ప్రేతాత్మలకు సంబంధించిన విశ్వాసాలు ఎలా ఉన్నాయి?

'జోహార్' అనే హిబ్రూ భాష గ్రంధం, యూదు మతంలో ప్రధాన గ్రంధంగా పరిగణించబడింది. ఈ గ్రంధంలో అనేక తంత్ర సంబంధ, పిశాచ సంబంధ రహస్యాలు చెప్పబడి ఉన్నాయి. ఈ గ్రంధంలో చెప్పబడిన సమాచారం ప్రకారం చూసినట్లయితే, మరణించిన వ్యక్తియొక్క ఆత్మ, మూడు రకాల అనుభవాలలో – ఏదో ఒక రకమైన అనుభవాన్ని పొందుతుందని తెలుస్తున్నది.

1. మరణించిన వ్యక్తియొక్క ఆత్మ – ఈ సృష్టిని చేసిన ఒక మహా శక్తిలోకి వెళ్లిపోతుంది.

2. తనకి ప్రశాంతత కలిగే విధంగా తన మృతదేహానికి నిర్మించిన సమాధిలో విశ్రాంతి తీసుకుంటుంది.

3. "గాన్ ఈడెన్" అనే స్వర్గలోకంలోకి ప్రవేశించి, ఆపై భూమిమీద మానవ రూపంలో ఉన్నప్పుడు, తాను ఏవిధమైన సుఖాలు పొందిందో అలాంటి సుఖాలనే ఆ స్వర్గంలో కూడా పొందుతుంది.

యూదుల ఇంకొక పవిత్ర గ్రంధమైన 'తోరాహ్'లోని ఒక అధ్యాయంలో ఇలా చెప్పబడి ఉన్నది. "చనిపోయిన వ్యక్తులయొక్క ఆత్మలను తాంత్రిక ప్రక్రియలతో ఆహ్వానించి, ఆపై వాటితో మాట్లాడి భవిష్యత్తులో జరగబోయే సంఘటనలను తెలుసుకోవటం మహా పాపం. అలాంటి కార్యాలు చేసే యూదు మతస్తుడిని యూదు మతం నుండి తప్పనిసరిగా బహిష్కరించాలి". ఈ గ్రంధంలో చెప్పబడిన ఆ సమాచారాన్నిబట్టి చూసినట్లయితే "ప్రేతాత్మలు" ఉన్నాయి అని యూదు మతం అంగీకరించిందని చెప్పక తప్పదు.

ఒక మనిషి చనిపోయిన రోజున లేదా పుట్టిన రోజున లేదా అమావాస్య రోజున యూదులు – తమ మతానికి సంబంధించిన శ్మశానానికి వెళ్ళి, అక్కడ ఉండే ఆ మనిషి యొక్క సమాధి దగ్గర ప్రార్ధనలు చేస్తారు. ఎందుకంటే, అలాంటి ప్రత్యేక సందర్భాలలో ఆ మనిషికి సంబంధించిన ఆత్మ, అతడి సమాధిలోకి తాత్కాలికంగా

ప్రవేశిస్తుంది. ఆ ఆత్మ – ఆ లోకంలో జీవిస్తున్న మానవులకు మరియు పై లోకంలో ఉండే దైవానికి మధ్య వారధిగా పనిచేస్తుందని చెబుతారు. అంతటి పవిత్రస్థానం ఆత్మకు ఇవ్వబడింది. ఆ కారణంగానే, యూదుల ఆలయం అయిన "సినగోగు"కి ఉన్న పవిత్ర స్థానం కన్నా యూదువ్యక్తి యొక్క సమాధికి అధిక పవిత్రస్థానం ఇవ్వబడింది. కొంతమంది యూదు యోగుల అభిప్రాయం ప్రకారం చూసినట్లయితే, మనిషి చనిపోయిన తరువాత కూడా అతని మృతదేహానికి ఒక ఇంద్రియజ్ఞానం అనగా మాటల్ని వినేశక్తి ఉంటుంది. ఒక వ్యక్తి యొక్క మృతదేహాన్ని సమాధి చెయ్యటానికి ముందు, ఆ మృతదేహం ప్రక్కన ఉన్న వ్యక్తులు మాట్లాడుకునే మాటల్ని ఆ మృతదేహం స్పష్టంగా వింటుంది మరియు అర్థంచేసుకుంటుంది అని చెబుతారు.

యూదు మతంలో (Jewish religion) ఒక వ్యక్తియొక్క మృతదేహానికి ఎంతో ప్రాధాన్యత ఇవ్వబడుతుంది. చనిపోయిన వ్యక్తిపట్ల తమకు ఉన్న గౌరవాన్ని చూపటంకోసం, మృతదేహాన్ని ఒక పద్ధతి ప్రకారం సమాధిచేసి, ఆపై దానిమీద తమకు వీలైనవిధంగా ఒక మంచి సమాధిని కడతారు. ఆ సమాధిమీద – ఆ వ్యక్తి జీవించి ఉన్నప్పుడు చేసిన మంచి పనులు లేదా గొప్ప పనుల గురించి చెక్కిస్తారు. మనిషి మరణించిన తరువాత అతని ఆత్మ పై లోకానికి వెళుతుందని, ఆత్మకి ఏనాటికీ మరణం ఉండదని, అందువలన, భవిష్యత్తులో ఏదో ఒక సమయంలో ఆ ఆత్మ తిరిగి భూమి మీద ఉన్న తన సమాధిలోని మృతదేహంలోకి ప్రవేశించి మళ్ళీ మనిషిగా బ్రతుకుతుందని యూదు మతంలో చాలా బలంగా విశ్వసించబడుతున్నది. అందువలన, సమాధిలో ఉన్న మృతదేహానికి ఏదైనా ఇబ్బంది కలిగించటం అనగా ఆ సమాధిని త్రవ్వివెయ్యటం లాంటివి చెయ్యటం వల్ల, పైలోకంలో ఉండే ఆ సమాధిలోని మృతదేహం యొక్క ఆత్మ, తీవ్రమైన ఆవేదనకు గురి అవుతుందని నమ్ముతారు. ఇంకొక విశేషం ఏమంటే, కొన్ని సమయాలలో ఆత్మ తన సమాధిలోని ఉన్న మృతదేహాన్ని చూడటానికి ఆ సమాధిలోకి వస్తుంది. ఆ సమయంలో ఆ సమాధిలో ఉన్న తన మృతదేహానికి సంబంధించిన ఒక చిన్న ఎముకను తొలగించి ఉన్నా, ఆ ఆత్మ తీవ్రమైన ఆవేదనకు గురి అవుతుంది. ఆ కారణంగానే, సమాధి చేయబడిన మృతదేహానికి లేదా సమాధిలో మిగిలిన ఎముకలకు – వైద్య సంబంధమైన పరీక్షలు (ఆ వ్యక్తి మృతికి కారణం ఏమిటో తెలుసుకోవటానికి చేసే పరీక్షలు) యూదు మతంలో చాలా తీవ్రంగా నిషేధించబడ్డాయి. చనిపోయిన వ్యక్తియొక్క ఆత్మ, ఎప్పుడో ఒకప్పుడు మళ్ళీ తిరిగి వస్తుంది కనుక, దాని శరీరాన్ని సమాధిలో భద్రపరచటం యూదు మతంలో ఒక సాంప్రదాయంగా మారింది. అందువల్ల

యూదు ప్రభుత్వ (ఇజ్రాయేల్ దేశం) చట్టాలు కూడా, మృతదేహాన్ని దహనం చెయ్యటం నిషేధించాయి.

యూదు మతంలో చెప్పబడిన సూత్రాల ప్రకారం చూసినట్లయితే, ఒకవ్యక్తి మరణించినప్పుడు అతని ఆత్మకు పరిపూర్ణమైన శాంతి కలగటంకోసం ఆ వ్యక్తికి సంబంధించిన బంధువులు లేదా కుటుంబీకులు – ఒక మంచి పనికోసం ధన సహాయం చెయ్యటం లేదా యూదుల పవిత్ర గ్రంథమైన 'తోరా' పఠనానికి అయ్యే ఖర్చును భరించటం లాంటివి చెయ్యాలని తెలుస్తున్నది. ఇవన్నీ చేసినంత మాత్రాన – ఆ వ్యక్తి యొక్క సమాధిని నిర్లక్ష్యం చేసినా ఫర్వాలేదని పొరపాటున కూడా భావించకూడదు. కారణం, సమాధి అనేది ఆత్మయొక్క మూలస్థానం అయిన 'భౌతికదేహానికి' రక్షణ కల్పించేది అని గుర్తించాలి. కనుక, ఒకవ్యక్తి మరణించిన చాలా కొద్ది సేపట్లోనే అతడి మృతదేహాన్ని సమాధి చేసినట్లయితే ఆ మృతదేహానికి సంబంధించిన ఆత్మ, శాంతిస్తుంది.

మనిషి మృతదేహాన్ని సమాధి చేసినప్పుడు అతని శరీరం మట్టిలో లీనం అవుతుంది. కానీ, ఆత్మ మాత్రం దైవం దగ్గరకు వెళుతుంది. ఇందుకు కారణం ఏమంటే, మానవ దేహం – మట్టి నుండి వచ్చింది. ఇక, ఆ దేహంలో ఉండే ఆత్మ దైవం నుండి వచ్చింది. అందువలన, ఒకవ్యక్తి మరణానంతరము అతని మృతదేహం మట్టిలో కలిసి పోతుంది. అతని ఆత్మ పైలోకానికివెళ్ళి, అక్కడ ఉండే దైవంలో కలిసిపోతుంది. ఆత్మకు చావు ఉండదని యూదు మతంతో సహా ప్రపంచంలోని చాలా మతాలు ఉద్ఘాటించాయి. అయితే, యూదు మతానికి ఈ విషయంలో ఒక మినహాయింపు ఇవ్వబడింది. అది ఏమిటంటే, భవిష్యత్తులో ఏదో ఒక సమయంలో దైవం – అప్పటి వరకు జీవించి–మరణించిన వ్యక్తుల యొక్క పాప పుణ్యాలను తనలోకంలో విచారించి, ఆపై పాపాలు చేసిన వారియొక్క ఆత్మలను నాశనం చేస్తాడని, మంచి పనులను చేసిన వారియొక్క ఆత్మలను స్వర్గానికి పంపిస్తాడని యూదు మత సిద్ధాంతాలు ఉద్ఘాటిస్తున్నాయి. అందువలన, భవిష్యత్తులో జరగబోయే పాప–పుణ్య విచారణను ఎదుర్కోవటంకోసం మానవ శరీరాలను దహనం చెయ్యకూడదని, సమాధి చెయ్యాలని యూదు మతంలో చెప్పబడి ఉన్నది. మరి, ఒక మృతదేహాన్ని సమాధి చేసిన అనేక ఏళ్ళ తరువాత ఆ మృతదేహం అస్థిపంజరంలాగానో లేక ఎముకల పోగులాగానో మారిపోతుంది. అనగా, ఆ సమయానికి భౌతికదేహం యధాతథంగా ఉండే అవకాశం ఏమాత్రం ఉండదు.

అలాంటప్పుడు ఆ ఎముకల్ని భగవంతుడు ఎలా విచారిస్తాడు?, అన్న సందేహం ఎవరికైనా వస్తుంది. దానికి యూదు మత గ్రంథాలలో ఇలా సమాధానం చెప్పబడి ఉన్నది. "సర్వశక్తివంతుడైన ఆ భగవంతుడు – సమాధిలో ఉన్న ఎముకలను కూడా మళ్ళీ సజీవమైన మనిషిగా మార్చి, అతడిని తన వద్దకు రప్పించికుని, ఆపై అతడి పాప–పుణ్య కర్మ విచారణ చేస్తాడు".

**దుష్ట మానవ ప్రేతాత్మ 'డిబక్' :**

మరణంతో మనిషి జీవితం ముగిసిపోదని, ఆ మనిషికి సంబంధించిన ఆత్మ చాలాకాలంపాటు సజీవంగా ఉంటుందని యూదు మతంలో చెప్పబడి ఉన్నది. కొన్ని సమయాలలో, ఈ ఆత్మలు తమకు సంబంధించిన వ్యక్తులకు స్వప్నాలలో కనిపించి, భవిష్యత్తులో జరగబోయే సంఘటనల గురించి ఆ వ్యక్తులకు తెలియజేయటం జరుగుతుంది.

యూదు తాంత్రిక గ్రంథాలలో చెప్పబడిన సమాచారం ప్రకారం చూసినట్లయితే, అనేక పాపాలు చేసి చనిపోయిన మనిషియొక్క ఆత్మ, స్వర్గ లోకానికి అనగా దైవ సన్నిధికి చేరుకోలేదు. అది, తాను చేసిన పాపాలకు శిక్షగా ఒక ప్రేతాత్మగా మారుతుంది. ఇలా ప్రేతాత్మగా మారిన ఆత్మను యూదు మతంలో 'డిబక్' అనే పేరుతో పిలుస్తారు. యూదుల మాతృ భాష అయిన హిబ్రూలో 'డిబక్' అనగా 'అంటుకొని ఉండుట' లేదా 'అతుక్కుపోయి ఉండుట' అని అర్థం. అతి తీవ్రమైన చెడు స్వభావం కలిగిన ఈ డిబక్ – మానసిక బలం తక్కువగా ఉన్న మానవుల్ని ఆవహించి, ఆపై వారిని తన ఇష్టం వచ్చినట్లుగా ఆడిస్తుంది. డిబక్ ఒక మనిషిని ఆవహించినప్పుడు ఆ మనిషికి అనేక రకాల వ్యాధులు వస్తాయి. ఒక్కో సమయంలో ఆ మనిషి ఉన్మాదానికి కూడా గురికావొచ్చని చెబుతారు.

ఈ డిబక్‌లు – నిర్మానుష్యంగా ఉండే భవనాలలో, శ్మశానాలలో, తీవ్రమైన హింస జరిగే ప్రాంతాలలో నివసిస్తూ ఉంటాయని యూదు మత గ్రంథాలలో చెప్పబడి ఉన్నది. యూదు మతంలో చెప్పబడిన – చెడు స్వభావం కలిగిన డిబక్, మానవులకు తీవ్రమైన హాని చేస్తుంది. కానీ, ఆత్మలలో మంచి స్వభావంగల కొన్ని ఆత్మలు కూడా ఉంటాయి. ఆ ఆత్మలు మానవులకు మంచి చేస్తాయి. ఇలాంటి ఆత్మలు ఆవహించిన వాళ్ళు, ప్రజలకు ఉపయోగించే ఎన్నో మంచి పనులు చెయ్యటం జరిగిందని యూదు మత చరిత్రలో స్పష్టంగా వ్రాయబడి ఉన్నది.

ఇంకొక ముఖ్య విశేషం ఏమంటే, ఇతరులకు తెలియకుండా అనగా రహస్యంగా ఏదైనా తీవ్రమైన పాపం చేసిన మనిషిని డిబక్ ఆవహించి పీడిస్తుందని యూదు మతానికి చెందిన ఒక కబల మంత్రవాది తెలియజేసాడు. డిబక్‌లు, మానవుల్ని ఆవహించి పీడించిన అనేక సంఘటనలు, యూదులు నివసించే ప్రతి ప్రాంతంలోను జరిగినట్లుగా తెలుస్తున్నది. కేరళలోని ఒక ప్రాంతంలో చాలా శతాబ్దాల నుండి యూదు కుటుంబాలు నివసిస్తున్నాయి. ఆ కుటుంబాలలోని కొందరు వ్యక్తుల్ని డిబక్‌లు ఆవహించినట్లుగాను, ఆపై కొందరు యూదు మంత్రగాళ్ళు ఒక ప్రత్యేక భూతవైద్య విధానంలో ఆ డిబక్‌లను వదిలించినట్లుగా తెలుస్తున్నది. ఈ డిబక్‌లు కొన్నిసార్లు తాము, మానవులుగా ఉన్నప్పుడు, చనిపోయిన లేదా హత్యచేయబడిన ప్రదేశాలను అంటిపెట్టుకుని ఉంటాయి. కొన్నిసార్లు, తమకు ఇష్టమైన వస్తువుల్ని ఆవహించి ఉంటాయి. డిబక్ చేత ఆవహించబడిన వస్తువుల్ని ఇంట్లో పెట్టుకున్నవాళ్ళకి తీవ్రమైన అనర్థాలు జరుగుతాయని యూదు మత తాంత్రిక గ్రంథాలలో చెప్పబడి ఉన్నది. సాధారణంగా ఈ డిబక్‌లు ఇంటిని అంటిపెట్టుకుని ఉండే గృహిణులను ఆవహిస్తాయని చెబుతారు.

**'డిబక్'గా మారిన ఒక యువకుడి యదార్థ వృత్తాంతము :**

ప్రాచీన, అనగా దాదాపు వంద సంవత్సరాల క్రితం ఉన్న రష్యా మరియు దానికి దగ్గరలో ఉన్న యుక్రైన్ అనే దేశంలోని అనేక ప్రాంతాలలో వేలాదిమంది యూదులు స్థిరపడ్డారు. ఈ యూదులు నివసించే గ్రామాలను 'షెటిల్స్' అనే పేరుతో పిలుస్తారు. ఈ గ్రామాలలోని ఒక గ్రామంలో 20వ శతాబ్దం ప్రారంభ భాగంలో డిబక్‌కి సంబంధించిన ఒక సంఘటన జరిగింది. ఈ సంఘటన ఆధారంగా, ఆ తరువాతకాలంలో అనగా 1914లో ఆనాటి రష్యా నాటక రచయిత అయిన ఎస్.అన్‌స్కీ 'ది డిబక్' అనే నాటకాన్ని వ్రాసాడు. ఈ నాటకం ఐరోపా ఖండంలో చాలా ప్రఖ్యాతిని పొందింది. ఇక, ఈ నాటకానికి ఆధారమైన ఆ యదార్థ సంఘటన గురించి క్లుప్తంగా తెలియజేస్తాను.

యుక్రైన్ దేశంలోని ఒక గ్రామంలో ఇద్దరు వ్యక్తులు ప్రాణ స్నేహితులుగా బ్రతుకుతూ ఉండేవాళ్లు. ఒక సమయంలో వారిలో ఒకడు, రెండవ వ్యక్తికి ఇలా మాట ఇచ్చాడు. "సంవత్సరం క్రితం పుట్టిన నీ కొడుక్కి త్వరలో పుట్టబోతున్న నా కూతుర్ని ఇచ్చి పెళ్ళి చేస్తాను. మన ఇద్దరి మధ్య ఉన్న స్నేహానికి గుర్తుగా మన పిల్లల పెళ్లి నిలిచిపోవాలి". కాలక్రమంలో 20 ఏళ్ళు గడిచిపోయాయి. ఆడపిల్లను

కన్న ఆ మిత్రుడు, తాను తన స్నేహితుడికి ఇచ్చిన మాటను మర్చిపోయి, తన కూతురుని ఆ ప్రాంతంలో ఉంటున్న ఒక ధనికుడి కొడుక్కి ఇచ్చి వివాహం చెయ్యాలని నిర్ణయించాడు. చిన్నప్పటి నుండి తనకి ఇస్తారు అని నమ్మిన ఆ అమ్మాయిని ఈ స్నేహితుడి కొడుకు ఎంతగానో ప్రేమిస్తూ ఉండేవాడు. అయితే, తాను ప్రేమిస్తున్న అమ్మాయిని ఆమె తండ్రి ఇంకొక ధనికుడికి ఇచ్చి వివాహం చెయ్యబోతున్నాడు అని ఈ అబ్బాయికి తెలిసింది.



ఇక, తాను ప్రేమించిన అమ్మాయికి వేరే అబ్బాయితో ఇంకా రెండు నెలల్లో పెళ్లి అవుతుందని, ఆమె, తనకు ఇక జీవితంలో దక్కదని అర్థంచేసుకున్న ఆ అబ్బాయి, యూదు మతానికి చెందిన కొన్ని తాంత్రిక మంత్రాలను 21 రోజులపాటు సాధన చేసాడు. ఆ సాధన ఫలితంగా, కొన్ని క్షుద్రశక్తులు అతడి ముందు ప్రత్యక్షం అయ్యాయి. అతడు కోరినట్లుగా ఆ క్షుద్రశక్తులు, అతడు ప్రేమించిన అమ్మాయిని తీసుకువచ్చి అతడికి అప్పగిస్తాయని అతడు ఆ సాధన చేసాడు. క్షుద్ర శక్తులు వచ్చాయి. కానీ, ఆ సమయంలో అతడు ఆ సాధనలో ఏదో తీవ్రమైన తప్పు చేసాడు. ఫలితంగా, ఆ క్షుద్రశక్తులు అతడిమీద ఆగ్రహించి అతడిని చంపేసాయి. ఆవిధంగా బలన్మరణం పొందిన ఆ అబ్బాయి ఆత్మ ఒక ఉగ్ర స్వభావం కలిగిన 'డిబక్'గా మారింది. ఆ తరువాత ఆ డిబక్ – ఇంకా, రెండు మూడు రోజుల్లో పెళ్లి జరగబోతున్న ఆ అమ్మాయిని ఆవహించింది. ఆ తరువాత ఆ యువకుడి ప్రేతాత్మ (డిబక్) ఆ అమ్మాయిని అనేక రకాలుగా బాధించింది. ఆ అమ్మాయిని కూడా చంపితే ఆ అమ్మాయి ఆత్మ తనతోపాటు జీవిస్తుందని నిర్ణయించుకున్న ఆ డిబక్ ఆ అమ్మాయిని చంపటానికి అనేక ప్రయత్నాలు చేసింది. తన కూతుర్ని, డిబక్‌గా మారిన తన మిత్రుడి కొడుకు ఆవహించాడని కొంచెం ఆలస్యంగా తెలుసుకున్న ఆ వ్యక్తి, కొందరు యూదు మత మంత్రవాదుల్ని తన ఇంటికి రప్పించి, వాళ్ళచేత అనేక తాంత్రిక ప్రక్రియలు చేయించి, తన కూతుర్ని ఆవహించిన డిబక్‌ని వదిలేలా చెయ్యాలని ప్రయత్నించాడు. ఆ మంత్రవాదులు

తమ శక్తి కొద్ది ప్రయత్నించినప్పటికీ, వాళ్ళు ఆ అమ్మాయి నుండి ఆ డిబక్‌ని విడదీయలేకపోయారు. చివరికి, ఆ డిబక్ యొక్క ప్రభావం వల్ల ఆ అమ్మాయి ఒక కొండ మీద నుండి క్రిందకు దూకి చనిపోయింది. అలా డిబక్ చేత చంపబడిన ఆ అమ్మాయి యొక్క ఆత్మ ఆ డిబక్‌తో కలిసింది. తాను కోరినవిధంగా తన ప్రేమికురాలి ఆత్మను తన సొంతం కావటంతో ఆ అబ్బాయి ప్రేతాత్మ (డిబక్) శాంతించింది. ఫలితంగా, ఆ డిబక్ తన ప్రేమికురాలి ఆత్మతో కలిసి పై లోకాలకు సంతోషంగా వెళ్ళిపోయింది.

క్రీ.శ.16వ శతాబ్దంలో ఇజ్రాయేల్ దేశంలోని (యూదుల మాతృభూమి) సఫేద్ అనే చిన్న పట్టణంలో నివసిస్తున్న ఒక అమ్మాయిని ఒక డిబక్ ఆవహించింది. ఫలితంగా, ఆ అమ్మాయి హఠాత్తుగా నేలపై పడి దొర్లింది. కాసేపు అలా దొర్లిన తరువాత ఆ అమ్మాయి లేచి నుంచున్నది. అప్పటి నుండి ఆ అమ్మాయి ప్రవర్తన మారిపోయింది. తరచుగా ఏడవటం, వణికిపోవటం, వికృతమైన మగ గొంతుతో మాట్లాడటం లాంటివి చెయ్యటం ప్రారంభించింది.

తమ కూతుర్ని ఒక డిబక్ ఆవహించింది అని అర్థం చేసుకున్న ఆ అమ్మాయి తల్లిదండ్రులు ఆ ప్రాంతంలో ఉన్న ఒక "రబ్బీ"ని (యూదు మత పూజారి) తమ ఇంటికి రప్పించారు. ఆ రబ్బీ, యూదు మత గ్రంథాలలోని మంత్రాలను కొంచెం సేపు పఠించాడు. ఫలితంగా, ఆ అమ్మాయిని ఆవహించిన డిబక్ తన గురించి మరియు తనకు సంబంధించిన వివరాల గురించి ఆ రబ్బీకి చెప్పింది. కొద్ది సంవత్సరాల క్రితం తన శత్రువులచేత దారుణంగా చంపబడిన ఒక



దుర్మార్గుడి యొక్క ఆత్మ 'డిబక్'గా మారిందని, ఆ ఆత్మే ఈ అమ్మాయిని ఆవహించిందని ఆ రబ్బీకి స్పష్టంగా తెలిసింది. అప్పుడు ఆ రబ్బీ, యూదు మంత్రశాస్త్రంలో చెప్పబడిన అనేక ప్రక్రియలను ఉపయోగించి, ఆ అమ్మాయిని ఆవహించిన డిబక్‌ని తరిమివేసాడు. సాధారణంగా, మంత్రవాదులచేత వదిలించబడిన డిబక్‌లు పై లోకానికి వెళ్ళిపోవటం లేదా ప్రేతాత్మగా తిరుగుతూ, తమకు అవకాశం వచ్చినప్పుడు ఇంకొక మనిషిని ఆవహించటం జరుగుతుంది.

**డిబక్ ప్రేతాత్మని వదిలించే ప్రక్రియ :**

యూదుల మత సంబంధ గ్రంధాలలో ఒకటైన 'తాల్‌మడ్' అనే గ్రంధంలో ఇవ్వబడిన సమాచారం ప్రకారం చూసినట్లయితే, చనిపోయిన వ్యక్తులయొక్క ఆత్మలు మాత్రమే కాక, దైవం చేత సృష్టించబడిన వివిధ రకాల భూతాలు కూడా ఈ భూమిమీద అదృశ్య రూపంలో సంచరిస్తూ ఉంటాయని, అవి, కొన్ని సమయాలలో మానవుల్ని ఆవహించటం ద్వారా వారిని తీవ్రంగా బాధిస్తాయని, వాటిని కొన్ని రకాల మంత్రాలతో, యంత్రాలతో అదుపు చెయ్యవచ్చని తెలుస్తున్నది.

'డిబక్' చేత ఆవహించబడి పీడించబడుతున్న మనిషి నుండి ఆ డిబక్‌ని తరిమి వేయటం కేవలము అపారమైన దైవబలం కలిగిన వ్యక్తులకు మాత్రమే సాధ్యపడుతుంది. కొన్నిసార్లు, డిబక్‌ని మనిషి నుండి తరిమివేసే ప్రక్రియలో (Exorcism) ఒక 'మాగిడ్' అనగా, ఒక మంచి స్వభావం కలిగిన ఆత్మయొక్క సహాయాన్ని తీసుకోవటం జరుగుతుంది. సాధారణంగా, డిబక్‌ని వదిలించే ప్రక్రియ 'మిన్‌యాన్' (ఎంపికచేసిన కొందరు యూదు మత పెద్దలు) సమక్షంలో  లేదా యూదు మత ఆలయం అయిన సినగోగ్‌లో చేస్తారు. కొన్నిసార్లు, సినగోగ్‌లోకి హాజరైన యూదు మత పెద్దల సమక్షంలో ఈ ప్రేత నిర్మూలనా కార్యక్రమం జరుగుతుంది.

మొదట, ఒక యూదు మత యోగి లేదా యూదు మంత్రవాది – డిబక్ చేత ఆవహించబడిన వ్యక్తి దగ్గరకువెళ్ళి అతడితో కాసేపు మాట్లాడతాడు. ఆ డిబక్, ఆ మనిషిని ఎందుకు ఆవహించింది, మరియు ఏ కారణంగా ఆ మనిషిని వదిలిపెట్టకుండా ఇంకా అతడిలోనే దాగి ఉన్నది? లాంటి విషయాలు – ఆ మనిషిని ఆవహించి ఉన్న డిబక్ ద్వారా ఆ మంత్రగాడు లేదా యోగి తెలుసుకుంటాడు. ఇంకొక ముఖ్య విశేషం ఏమంటే, యూదు మత తంత్రశాస్త్రంలో చెప్పబడిన ఒక సూత్రం ప్రకారం చూసినట్లయితే "ఇతర లోకాలకు చెందిన ఒక శక్తియొక్క పేరును తెలుసుకుని, ఆపై ఆ పేరుతో పిలిస్తే, ఆ శక్తి – అలా పిలిచిన వ్యక్తికి చాలా వరకు లొంగిపోతుంది. అదేవిధంగా, ఒక మనిషిని ఆవహించి ఉన్న డిబక్‌ని దానియొక్క పేరుతో (అనగా ఆ డిబక్ మనిషిగా జీవించి ఉన్నప్పుడు ఆ మనిషికి ఉన్న పేరు అన్నమాట.) పిలిచినట్లయితే ఆ డిబక్, తప్పనిసరిగా ఆ మంత్రవాదికి కొంతవరకు విధేయత ప్రదర్శించి, ఆపై ఆ మంత్రగాడు అడిగే సమాచారాన్ని తెలియజేస్తుంది.



## పార్టు-2

# 1. ఇండియాలో యదార్ధంగా జరిగిన కొన్ని 'ప్రేత' సంబంధ వృత్తాంతాలు?

**సహాబా–కొరివి దయ్యాలు/వెలిగే ప్రేతాత్మలు :**

ఉత్తర భారతదేశంలోని గ్రామీణ ప్రాంతాలలో రాత్రి సమయాలలో ముఖ్యంగా, చీకటి రాత్రులలో దాదాపు ఆరు అంగుళాల పొడవు, రెండు అంగుళాల వెడల్పు ఉండే ప్రకాశ వంతమైన అనేక దీపాలు గాలిలో తేలుతూ కనిపిస్తూ ఉంటాయి. నేలపైన, దాదాపుగా పది అడుగుల ఎత్తులో ఈ వెలుగులు కనిపిస్తూ ఉంటాయి. ఏనాడో, చనిపోయిన వ్యక్తులయొక్క ఆత్మలు ఈ వెలుగుల రూపంలో సంచరిస్తూ ఉంటాయని ఆ ప్రాంత ప్రజలు ఈనాటికీ బలంగా విశ్వసిస్తున్నారు. ఇలా వెలుగుల రూపంలో కనిపించే ఆత్మలను 'సహాబా' అనే పేరుతో పిలుస్తారు.

ఉత్తర భారతదేశంలోని హొసంగాబాద్ పట్టణ పొలిమేరల్లో ఉన్న ఒక చెరువు గట్టుమీద కొన్ని దశాబ్దాల క్రితం ఒక బాబా (యోగి) నివసిస్తూ ఉండేవాడు. ఆయన పేరు ఖాప్రా. రాత్రి సమయాలలో ముఖ్యంగా, చీకటి రాత్రులలో ఆయన నివసిస్తున్న ప్రాంతంవైపు చూసిన వారికి గాలిలో తేలుతున్న దీపాలు ఒక ఊరేగింపులాగా కనిపించేవని చెబుతారు.



ఔధ్ ప్రాంతంలోని పశ్చిమ జిల్లాలు మరియు రోహిల్ ఖండ్ ప్రాంతంలో కొన్ని ప్రాంతాలలో దశాబ్దాల క్రితం అనేక "సహాబాలు" కనిపించేవని చెబుతారు. ఆ ప్రాంతంలోని శ్మశానాలలో, – యుద్ధాలలో చనిపోయిన వ్యక్తులయొక్క మృతదేహాలను పాతిపెట్టేవాళ్ళు. అయితే, రాత్రి

సమయాలలో ముఖ్యంగా, పౌర్ణమి రాత్రులలో ఆ శ్మశానాలలో అక్కడక్కడా, పాతిన కర్రలకు – వెలుగుతున్న కాగడాలు అమర్చబడినట్లుగా కనపడేది. బల్లలపైన, కుర్చీలపైన విశ్రాంతిగా కూర్చుని ఉన్న సైనికులు కనిపించేవాళ్ళు. అంతేకాదు, ఆ శ్మశానంలో అక్కడక్కడా సైనికుల గుడారాలు మరియు ఆ గుడారాలకు ప్రక్కన తాళ్ళతో కట్టివేయబడిన గుర్రాలు కనిపించేవి. అంతేకాకుండా, కొందరు అందమైన ఆడపిల్లలు ఆ సైనికుల ముందు నిలబడి నృత్యాలు చేస్తూ కనిపించేవాళ్ళు. ఆ శ్మశానానికి దగ్గరలో ఉన్న గ్రామాలలోని ఎవరైనా వ్యక్తి, ఆ శ్మశానంలో కనిపిస్తున్న సైనికులను మరియు అక్కడ జరుగుతున్న హడావిడిని చూసి, అక్కడ ఏదో తమాషా జరుగుతున్నది – చూద్దామని అక్కడికి వెళ్ళినట్లయితే, ఆ వ్యక్తికి అక్కడ, వికృతమైన పిశాచాలు భయంకరంగా అరుస్తూ కనిపించేవి. దాంతో, ఆ అభాగ్యుడు అక్కడికక్కడే గుండె ఆగి, నెత్తురు కక్కుకుంటూ నేలమీద పడి చనిపోయేవాడు. అలా వెళ్ళిన వారిలో కొంతమంది ప్రాణాలతో తిరిగి గ్రామానికి వచ్చినప్పటికీ వాళ్ళు మతి చలించిపోయి, పిచ్చివాళ్ళుగా మారిపోవటం జరిగింది.

కొన్ని సమయాలలో, ఉత్తర భారతదేశంలోని గ్రామీణ ప్రాంతాలలో – రాత్రి సమయాలలో నిర్మానుష్యంగా ఉండే మార్గాలలో ప్రయాణించే వ్యక్తులకు గాలిలో ఎగురుతూ వెళ్ళే ఈ హబాబాలు కనిపించేవి. అవి ప్రేతాత్మలు అని తెలియని ఆ ప్రయాణీకులు, వాటిని, ఎవరో వ్యక్తులు చేతులలో పట్టుకుని తీసుకువెళుతున్న కాగడాలుగా భావించి, తాముకూడా ఆ కాగడాల వెలుగులో ఆ మార్గంగుండా క్షేమంగా వెళ్ళవచ్చని నిర్ణయించుకుని మరింత వేగంగా నడుస్తూ ఆ వెలుగుల దగ్గరకువెళ్ళటం జరిగేది. అయితే, ఆ వెలుగులు ఆ మార్గం నుండి వాటికి ఇష్టం వచ్చిన దిక్కుకి ఎగిరిపోతూ ఉండేవి. చీకటిలో ఆ విషయం గ్రహించలేకపోయిన ఆ ప్రయాణీకులు ఆ వెలుగులు ఎటువైపు వెళితే అటువైపు వెళ్ళిపోవటం జరిగేది. చివరికి, ఆ వెలుగులు ఏ పాడుపడ్డ దిగుడు బావి దగ్గరో లేదా కీకారణ్యంలోకో చేరుకునేవి. అక్కడిదాకా చేరుకున్న ఆ



ప్రయాణీకులు ఆ దిగుడు బావిలో పడిపోయి చనిపోవటం జరిగేది లేదా కీకారణ్యంలో చిక్కుకుని తెల్లవారే దాకా అక్కడే పిచ్చిపట్టినట్లుగా అటు ఇటు నడవటం జరిగేది. ఇలాంటి సంఘటనలు దాదాపు 90 సంవత్సరాల క్రితం వరకు జరిగాయని ఒక పాశ్చాత్య రచయిత తన గ్రంథంలో వ్రాసాడు. ఇప్పటికీ, ఉత్తర భారత దేశంలోని కొన్ని గ్రామీణ ప్రాంతాలలో రాత్రి సమయాలలో ఈ హబాబాలు కనిపిస్తాయని చెప్పుకుంటారు.

**మళ్ళీ తిరిగి వచ్చిన ఆత్మలు :**

◆ ఢిల్లీ నగరానికి చెందిన ఒక గృహిణియొక్క 8 సంవత్సరాల కుమారుడు 1995లో ఒక కారు ప్రమాదంలో మరణించాడు. ఆ తరువాత రెండు సంవత్సరాలు గడిచాయి. అప్పటి నుండి ఆమెకు, ఆమె కుమారుడియొక్క ప్రేతాత్మ తరచుగా కనిపించటం ప్రారంభం అయ్యింది. ఆపై, దాదాపు ఒక సంవత్సరం పాటు ఆ ప్రేతాత్మ ఆమెకు కనపడింది. ఆ గృహిణి తన అనుభవాన్ని ఇలా చెబుతున్నది...

నేను ఒకరోజు ఉదయం మా డ్రాయింగ్ రూంలో ఉన్న కొయ్య నేలను (ఉడెన్‌ఫ్లోర్)ని చీపురుతో ఊడుస్తూ ఒక నిమిషం ఆ పని ఆపాను. అప్పుడు నాకు – కొన్ని అడుగుల దూరంలో నిలబడి నావైపు పరిశీలనగా చూస్తున్న నా కొడుకు కనిపించాడు. రెండు సంవత్సరాల క్రితం చనిపోయిన వాడు, ఇప్పుడు నాకు ఎలా కనిపిస్తున్నాడో? అర్థంకావటంలేదు. దాంతో నేను “బెగ్గీ! అక్కడే ఉండు, నేను వస్తున్నా” అంటూ వాడివైపు వేగంగా నడిచాను. నేను, వాడి దగ్గరకువెళ్ళే సరికి వాడు నా కళ్ళముందే అదృశ్యం అయిపోయాడు. వాడు, రెండు సంవత్సరాల క్రితం కారు యాక్సిడెంట్‌లో చనిపోయినప్పుడు వాడు ఏ దుస్తులు ధరించి ఉన్నాడో సరిగ్గా అవే దుస్తులు ప్రస్తుతం వాడి వంటిమీద నాకు కనిపించాయి. ఆ తరువాత రెండుసార్లు వాడు అదే ప్రదేశంలో నాకు కనిపించాడు. మా ఇంటికి కిలోమీటరు దూరంలో ఉన్న మా అత్తగారింట్లో మా అత్తగారికి కూడా వాడు ఒకసారి కనిపించాడని మా అత్తగారు నాతో చెప్పింది.

◆ అలహాబాద్‌కు చెందిన ఒక యువతి ఒక హాస్పటల్‌లో ఒక బిడ్డను ప్రసవించి ఆపై మూడవ రోజున బిడ్డను తీసుకుని తన ఇంటికి వచ్చింది. అలా వచ్చిన ఆమె తన బిడ్డని తన బెడ్‌రూంలో పడుకోపెట్టి, ఆపై స్నానం చెయ్యటానికి ఆ బెడ్‌రూంకి ఎటాచ్‌డ్‌గా బాత్‌రూంలోకి వెళ్ళింది. ఇంతలో, బెడ్‌మీద పడుకోపెట్టబడి ఉన్న పసిబిడ్డ పెద్దగా ఏడవటం ఆరంభించాడు. దాంతో ఎవరో ఆ బెడ్‌రూంలోకి వచ్చినట్లుగా

అలికిడి, బాత్‌రూంలో ఉన్న ఆ యువతికి వినిపించింది. బహుశా, బైటకు వెళ్ళిన తన తల్లి తిరిగి వచ్చి ఉంటుందని, బెడ్‌రూంలోంచి బిడ్డ ఏడుపు విని, ఆమె బెడ్ దగ్గరకు వచ్చి ఉంటుందని ఆ యువతి అనుకున్నది. ఆ తరువాత ఆ యువతి స్నానం పూర్తిచేసుకుని, ఆపై బాత్‌రూం తలుపుతెరచి తలమాత్రం బైటకుపెట్టి బెడ్‌రూంలోకి తొంగి చూసింది. బెడ్‌మీద పసిబిడ్డ నిశ్శబ్దంగా పడుకుని కళ్ళు తెరుచుకుని చూస్తున్నాడు. ఆ బిడ్డ ప్రక్కన, మూడేళ్ళక్రితం చనిపోయిన ఆ యువతి అత్తగారు కూర్చుని ఆ బిడ్డకేసి పరిశీలనగా చూస్తున్నది. ఆ దృశ్యం చూడగానే బాత్‌రూంలో ఉన్న ఆ యువతికి భయంతో గుండె ఆగినంత పనయ్యింది. కొద్ది సెకన్ల తరువాత ఆమె, ధైర్యం తెచ్చుకుని ఒక్క గెంతులో బాత్‌రూంలోంచి బెడ్‌రూంలోకి దూకింది. ఆపై, ఒక్క అడుగులో బెడ్ దగ్గరకు వచ్చింది. విచిత్రం! అక్కడ ఆమె అత్తగారు లేదు. "మూడు సంవత్సరాల క్రితం చనిపోయిన ఆ యువతి అత్తగారు, తన మనుమడిని చూడటానికి ప్రేతాత్మగా అక్కడికి వచ్చింది" అని ఆ యువతికి కొంచెం ఆలస్యంగా అర్థమయ్యింది.



## 2. ఇస్లాం మతంలో చెప్పబడిన జిన్నుల (పిశాచాలు) రహస్యాలు?

"మనిషి కంటికి కనిపించని ప్రపంచం (అల్-గాయబ్)" గురించి ఇస్లాం మతంలో బలమైన విశ్వాసం నెలకొని ఉన్నది. ఖురాన్ గ్రంథంలో, హాదిత్ (మహమ్మద్ ప్రవక్త బోధనలు)లలో - అనేక చోట్ల మానవాతీత శక్తుల గురించి చెప్పబడి ఉన్నది. జిన్నులు, నిర్మానుష్యంగా ఉండే కొండ గుహలలో, నిర్జన ప్రదేశాలలో, శ్మశానాలలో, చీకటిగా ఉండే ప్రాంతాలలో నివసిస్తూ ఉంటాయని ఖురాన్‌లో చెప్పబడి ఉన్నది. ఒక విశేషం ఏమంటే, జిన్నులు కూడా ఒక వయస్సు వచ్చిన తరువాత చనిపోతాయి. కాకపోతే, వాటికి కనీసం వెయ్యి లేదా రెండువేల సంవత్సరాల ఆయుర్దాయం ఉంటుంది అని గ్రహించాలి.

ఒకవ్యక్తిని ఒక జిన్ను ఆవహించినప్పుడు ఆ వ్యక్తియొక్క మనసుకి మరియు ఆ జిన్నుయొక్క మనసుకి మధ్య నిరంతరం యుద్ధం జరుగుతూ ఉంటుంది. ఫలితంగా, ఆ వ్యక్తి తన మనస్తత్వానికి విరుద్ధమైన పనులు చెయ్యటం జరుగుతుంది. 'రుకియా'

(Excorcism) చేసినప్పుడు, ఒక వ్యక్తిని ఆవహించి ఉండే జిన్ను బలహీనపడుతుంది. అలాంటి సమయంలో ఆ జిన్ను తాను ఎవరో?, తాను ఏ లక్ష్యంతో ఆ వ్యక్తిని ఆవహించిందో చెప్పేస్తుంది. జిన్నుచేత ఆవహించబడిన వ్యక్తి, తోటి మానవులకు అర్థంకాని విచిత్రమైన భాషలో మాట్లాడటం జరుగుతుంది. ఎందుకంటే, జిన్నుచేత ఆవహించబడిన వ్యక్తికి సొంత బుద్ధి పనిచెయ్యదు. జిన్ను, ఏది చెప్పాలనుకుంటే అది ఆ వ్యక్తి నోటి నుండి బైటకు వస్తుంది.

ఇస్లాం మతంలో "ఆత్మహత్య" మహాపాపం అని చెప్పబడి ఉన్నది. ఆ కారణంగానే, ఏ ముస్లిం మతస్తుడూ ఆత్మహత్య చేసుకోవటానికి పొరపాటున కూడా అంగీకరించడు. కానీ, ఒక జిన్ను అతడిని ఆవహించినప్పుడు అతడియొక్క మనస్సు అదుపు తప్పిపోతుంది. ఆ జిన్ను, అతడిని చంపటంకోసం "అతడిని ఆత్మహత్యచేసుకుని చనిపోమని పదే పదే పీడిస్తుంది". కొంతకాలానికి ఆ వ్యక్తి తన మనో నిగ్రహాన్ని పూర్తిగా కోల్పోయి చివరికి ఏదోఒక సమయంలో ఆత్మహత్య చేసుకుంటాడు.

జిన్నులుచేత పీడించబడే పురుషులకు సంతానోత్పత్తి చెయ్యగలిగేశక్తి, స్త్రీ సంభోగం చెయ్యగలిగే శక్తి తాత్కాలికంగా నశించిపోతుంది. ఇక, జిన్నులచేత ఆవహించబడిన స్త్రీలలో "వంధ్యత్వం (ఇన్‌ఫెర్టిలిటి)" ఏర్పడుతుంది. కొన్ని సమయాలలో గర్భస్రావాలు కావటం, ముత్యాలగర్భం ఏర్పడటం లేదా మృత శిశువులు జన్మించటం లాంటి చెడు సంఘటనలు జరుగుతాయి. ఇస్లాం మతంలోని విద్యాధికులు – జిన్నులయొక్క ఉనికిని ఏమాత్రం అంగీకరించరు. 'జిన్నులు' మూఢ నమ్మకమని వాళ్ళు వాదిస్తారు. ఒక విచిత్రం ఏమంటే, అల్లాయొక్క ఉనికిని అంగీకరించేవాళ్ళు, ఆ అల్లాచేత సృష్టించబడిన జిన్నులు ఉన్నాయని నమ్మరు. ఆధునిక వైద్యులు, రోగి శరీరంలో వచ్చే మార్పులను బట్టి రోగనిర్ధారణచేసి, ఆపై వైద్యాన్ని చేస్తారు. కానీ, జిన్ను ఒక మనిషిని ఆవహించినప్పుడు ప్రధానంగా, ఆ మనిషియొక్క మనసు పనిచేసే



విధానంలో మార్పులు వస్తాయి. ఆ మార్పుల కారణంగా ఆ మనిషి శరీరంలో రోగాలు ఏర్పడతాయి. కనుక, మొదట – ఆ మనిషి మనస్సుని ప్రభావితం చేస్తున్న జిన్నుని బైటకు తరిమివేసినప్పుడే, ఆ మనిషికి చేసే భౌతిక దేహపరమైన వైద్యం ఫలిస్తుంది అని గుర్తించాలి.

ఒకవ్యక్తి ఒకే సమయంలో రెండు, మూడు రకాల వ్యక్తిత్వాలు ప్రదర్శిస్తాడు. ఇది ఒకవిధమైన మానసిక వ్యాధి అని మనస్తత్వ శాస్త్రజ్ఞులు చెబుతారు. దీనినే వైద్య శాస్త్ర పరిభాషలో 'మల్టిబుల్ పర్సనాలిటీ డిజార్డర్' అని అంటారు. నిజానికి, జిన్నుచేత ఆవహించబడిన వ్యక్తి తనయొక్క వ్యక్తిత్వాన్ని కోల్పోతాడు. అతడి మనస్సుని తన ఆధీనంలోకి తెచ్చుకున్న 'జిన్ను' తనయొక్క ప్రవర్తనను, మనస్తత్వాన్ని – తాను ఆవహించిన వ్యక్తి ద్వారా ప్రదర్శిస్తుంది. కొన్ని సమయాలలో 'జిన్ను' మౌనంగా ఉండిపోతుంది. అప్పుడు ఆ వ్యక్తియొక్క అసలు స్వభావం కనిపిస్తుంది. అనగా, ఆ వ్యక్తి ఒకే సమయంలో లేదా కొద్ది వ్యవధిలో రెండు రకాల వ్యక్తిత్వాలను ప్రదర్శిస్తాడు అన్నమాట. ఇంకొక విశేషం ఏమంటే, కొన్ని సమయాలలో ఒక వ్యక్తిని ఒకటి కంటే ఎక్కువ అనగా ఐదు లేదా ఆరు జిన్నులు ఆవహిస్తాయి. అలాంటి సందర్భంలో ఒకవ్యక్తి కొద్ది నిమిషాల తేడాలో ఐదు లేక ఆరు రకాల వ్యక్తిత్వాలను ప్రదర్శిస్తాడు.

జిన్నులు, మానవుల్ని పీడించటానికి కొన్ని కారణాలు ఉంటాయి. కొన్ని సమయాలలో, మానవులు తమకు తెలిసి లేదా తెలియక జిన్నులను అవమానించటం జరుగుతుంది. అది ఎలాగంటే...



జిన్నులు – నిర్మానుష్య ప్రదేశాలలో, పాముపుట్టలలో, ముళ్ళ పొదలలో అదృశ్య రూపంలో నివసిస్తూ ఉంటాయి. ఎవరైనా మానవుడు ఆ ప్రదేశాలపైన మూత్రవిసర్జన చేసినట్లయితే ఆ ప్రదేశంలో నివసిస్తున్న జిన్నులు ఆ మనిషిమీద పగపట్టి, ఆపై అతడిని వెంటాడి వెంటాడి నాశనం చేస్తాయి. అదేవిధంగా, అదృశ్యరూపంలో లేదా కుక్క, పాము లాంటి జీవుల రూపంలో సంచరిస్తున్న జిన్నులపైన వేడినీళ్ళు పోసినప్పుడు కూడా జిన్నులు ఆగ్రహిస్తాయి. కొన్ని సమయాలలో జిన్నులు, తమలో ఉన్న కామ సంబంధ కోర్కెలు

తీర్చుకోవటంకోసం మనుషుల్ని ఆవహిస్తాయి. మరికొన్ని సమయాలలో జిన్నులు మానవ రూపాన్ని ధరించి మానవులతో శృంగార సంబంధాలు పెట్టుకుంటాయి. చాలామందికి తెలియని విషయం ఏమంటే, జిన్నులలో ఆడ జిన్నులు మరియు మగ జిన్నులు ఉంటాయి. సహజంగా, ఈ జిన్నులు తమలోతాము దాంపత్యం జరుపుకుంటాయి. అయితే, కొన్ని సమయాలలో ఆడజిన్ను, మానవ పురుషుడిమీద వ్యామోహాన్ని పెంచుకుని, ఆపై మానవ స్త్రీ రూపంలో ఆ పురుషుడి వద్దకువెళ్ళి అతడితో కొంతకాలంపాటు సంసారం సాగించి, సంతానాన్ని కూడా కంటుంది. అదేవిధంగా కొన్ని సమయాలలో మగజిన్ను, అందంగా ఉన్న మానవ స్త్రీపై ఆశను పెంచుకుని, ఆపై పురుషుడి రూపం ధరించి ఆమెతో సంసారం సాగిస్తుంది. ఫలితంగా, ఆ మానవ స్త్రీకి మగజిన్నువల్ల సంతానం కలుగుతుంది. ఒక విచిత్రం ఏమంటే, మానవ పురుష సంపర్కం వల్ల ఆడ జిన్నులకు పుట్టే బిడ్డలు జిన్నులే అవుతాయి. అలాగే మానవ స్త్రీకి మగ జిన్నువల్ల పుట్టే బిడ్డలు జిన్నులే అవుతాయి కాని మానవులు కావు.

సాధారణంగా, ఒక స్త్రీని లేదా పురుషుడిని ఒక జిన్ను ఆవహించింది అని తెలిసినప్పుడు ఆ వ్యక్తి చెవిలో ఖురాన్‌లోని కొన్ని ప్రత్యేక సూరాలను (శ్లోకాలను) పెద్ద స్వరంతో చదువుతారు. ఈ దైవ సంబంధమైన ప్రార్ధనలు వినపడటంతో ఆ వ్యక్తి శరీరంలోని జిన్ను తీవ్రమైన కంగారుకి మరియు భయాందోళనకు గురై ఆ శరీరంలోంచి బైటకు వచ్చేయటం జరుగుతుంది.

ఒకవ్యక్తిని జిన్ను ఆవహించినప్పుడు ఆ వ్యక్తియొక్క శరీరంలో మరియు మనసులో అనేక రకాల మార్పులు వస్తాయి. అవి ఎలా ఉంటాయి అంటే...ఆ వ్యక్తి శరీరంలో ఏదోఒక ద్రవ పదార్ధం చాలా వేగంగా ప్రవహిస్తున్నట్లుగా ఆ వ్యక్తికి అనిపిస్తుంది. అదే సమయంలో, వంట్లో బాగా వేడిగా ఉన్నట్లుగా అనిపిస్తుంది. ఇందుకు కారణం ఏమంటే, ఆ వ్యక్తిని ఆవహించి ఉన్న 'జిన్ను' అతడి శరీరం అంతా అనగా, క్రిందకు మరియు పైకి వేగంగా తిరుగుతూ ఉంటుంది. అదేవిధంగా, శరీరంలోని ఏదోఒక భాగం విపరీతంగా వణుకుతుంది. అనగా, ఆ భాగంలో జిన్ను నివసిస్తున్నదని గుర్తిస్తారు. ఒక మనిషిలో ఆరోగ్యపరంగా ఏ సమస్యా లేకున్నప్పటికీ పైన చెప్పిన లక్షణాలు కనిపించినట్లయితే అతడిని ఏదో ఒక జిన్ను ఆవహించింది అని నిర్ణయిస్తారు. జిన్ను ఆవహించటం వల్ల అనారోగ్యానికి గురైన వ్యక్తులకు ఔషధాలు పనిచెయ్యవు. కేవలము, మంత్రవాదులు మాత్రమే ఆ వ్యక్తికి స్వస్థతను చేకూర్చగలరు. ఆ కారణంగానే, జిన్ను చేత ఆవహించబడిన వ్యక్తి ముందుకి వచ్చే ఇస్లాం మత పండితుడు, ఆ వ్యక్తిముందు నిలబడి ఖురాన్‌లోని కొన్ని శ్లోకాలను

పెద్ద స్వరంతో పఠిస్తాడు. ఆ శ్లోకాలలోని మహత్యం కారణంగా, ఆ వ్యక్తి శరీరంలో ఉన్న జిన్ను విపరీతంగా ఆందోళనకు గురి అవుతుంది. ఫలితంగా, ఆ వ్యక్తి స్పృహ తప్పి పడిపోతాడు. అప్పుడు, ఆ వ్యక్తి శరీరంలోని జిన్ను మాట్లాడటం ప్రారంభిస్తుంది. ఆ మాటల్లో – పెద్దగా అరవటం, కీచుగొంతుతో కేకలు వెయ్యటం, అసభ్యంగా నిందించటం లాంటివి ఉంటాయి. అప్పుడు ఆ మంత్రవాది ఖురాన్‌లోని మరికొన్ని శ్లోకాలను (సురా) పెద్ద స్వరంతో పదే పదే పఠిస్తాడు. ఆ పఠనానికి విపరీతంగా భయపడిన జిన్ను ఆ వ్యక్తి శరీరాన్ని వదిలిపెట్టి బయటకు వెళ్ళిపోతుంది.

కొన్ని సమయాలలో, చేతబడి (షిర్) ద్వారా ఒక జిన్నుని ఒక వ్యక్తిమీద ప్రయోగించటం జరుగుతుంది. చేతబడి మంత్రాలతో మంత్రించబడిన ఒక తావీజుని లేదా లాకెట్‌ని మంత్రగాడు, ఎవరో ఒకరి సహాయంతో ఆ వ్యక్తి ధరించేలా చేస్తాడు. ఆ వ్యక్తి వంటిమీద మంత్రించిన తావీజు లేదా లాకెట్ ఉన్నంతకాలం ఆ వ్యక్తిని జిన్ను పీడిస్తూ ఉంటుంది. రుకియా (భూతవైద్యం) జరుగుతున్న సమయంలో – జిన్ను, తాను చేతబడి ద్వారా (తావీజు/లాకెట్) ఆ వ్యక్తిని చేరుకున్నానా? లేదా తానే స్వయంగా ఆ వ్యక్తిని ఆవహించానా? – అన్న విషయాన్ని చెబుతుంది. ఆ జిన్ను చేతబడి ద్వారా ఆ వ్యక్తిని ఆవహించినట్లయితే, చేతబడికి సంబంధించిన తావీజు ఆ వ్యక్తి శరీరంమీద ఏ భాగంలో కట్టబడి ఉన్నదో ఆ మంత్రగాడికి చెబుతుంది. అంతేకాదు, ఆ వస్తువుని తగలపెడితే తాను అక్కడ నుండి వెళ్ళిపోతాను అని కూడా చెబుతుంది. కేవలము, మంత్రగాడియొక్క మంత్రబలం కారణంగానే 'జిన్ను' ఆవిధంగా ఆ మంత్రగాడికి సహకరిస్తుంది అని గుర్తించాలి.

కొన్నిసార్లు ఇస్లాం మంత్రవాది, మొండిగా అడ్డం తిరిగే జిన్నులను మనిషి శరీరం నుండి వెళ్ళగొట్టటంకోసం ఆ వ్యక్తిని ఒక బెత్తంతో ఐదారు దెబ్బలు కొట్టటం జరుగుతుంది. ఆ దెబ్బలు, ఆ వ్యక్తిని ఆవహించి ఉన్న జిన్నుకి మాత్రమే తగులుతాయి. ఆ దెబ్బలు తట్టుకోలేక జిన్ను ఆ వ్యక్తి శరీరాన్ని వదిలిపెట్టి పారిపోతుంది. ఒకవిశేషం ఏమంటే, జిన్ను ఆ వ్యక్తిని వదిలి వెళ్ళిపోయిన తరువాత ఆ వ్యక్తికి తను దెబ్బలు తిన్న విషయం గుర్తు ఉండదు. అంతేకాదు, అతని శరీరంపై దెబ్బలు తాలీకు గుర్తులు కూడా ఏమాత్రం కనిపించవు.

జిన్నుచేత ఆవహించబడిన మనిషియొక్క కళ్ళు తరచుగా మూసుకుపోతూ ఉంటాయి. ఆ వ్యక్తి శరీరం గజ గజా వణకిపోతూ ఉంటుంది. అలాంటి సమయంలో ఆ మనిషియొక్క చెవిలో ఖురాన్ శ్లోకాలు చెప్పినట్లయితే, అప్పుడు ఆ మనిషిలోని జిన్ను తీవ్రమైన భయానికి గురై ఆపై తన పేరు ఏమిటో?, తాను ఏ ప్రాంతానికి చెందినదో? చెబుతుంది.

ఏదిఏమైనా, తాంత్రిక ప్రక్రియద్వారా ఒక వ్యక్తి నుండి జిన్నుని వదిలించిన తరువాత కూడా ఆ వ్యక్తిని కొంతకాలంపాటు జాగ్రత్తగా చూసుకోవాలి. ఎందుకంటే, ఒక వ్యక్తిని వదిలిపెట్టి వెళ్ళిపోయిన జిన్ను, మళ్ళీ ఆ వ్యక్తిని ఆవహించటానికి ఎదురు చూస్తూ ఉంటుంది. ఇలా జరక్కుండా ఉండాలంటే ఆ వ్యక్తి, ప్రతిరోజూ క్రమం తప్పకుండా దైవ ప్రార్ధనలు చేస్తూ ఉండాలని చెబుతారు.



ఒక మనిషిని ఒకటి కన్నా ఎక్కువ జిన్నులు ఆవహించే అవకాశం ఉంటుందని ఒక ఇస్లాం మత పండితుడు తెలియజేసాడు. సాధారణంగా, తీవ్రమైన మానసిక వేదనతో ఉండే వ్యక్తుల్ని-(వాళ్ళు స్త్రీలు కావొచ్చు, పురుషులు కావొచ్చు లేదా చిన్న పిల్లలు కావొచ్చు) ఆవహించటానికి జిన్నులు ప్రయత్నిస్తాయి. దాదాపు 30 సంవత్సరాల క్రితం, హైదరాబాద్‌లోని ఒక ప్రాంతంలో ఉన్న ఒక, రెండు అంతస్థుల భవనంలోని పై భాగంలో ఒక కుటుంబం కాపురం ఉండేది. ఆ కుటుంబంలో భార్య, భర్త మరియు 10 సంవత్సరాల బాలిక ఉండేవాళ్ళు. కారణం ఏదైనప్పటికీ, ఆ దంపతుల మధ్య ఎప్పుడూ ఏవో తగాదాలు కొనసాగుతూ ఉండేవి. వాళ్ళ తగాదాలను రోజూ చూసి, చూసి వాళ్ళ కూతురుకి తీవ్రమైన మానసిక వేదన ప్రారంభం అయ్యింది.

దాంతో ఆ బాలిక ప్రతిరోజూ స్కూల్ నుండి రాగానే తన బెడ్‌రూంలోకి వెళ్ళిపోయి తలుపులు వేసుకుని ఆపై తన ఇంట్లో జరిగే తగాదాలను తలచుకుని, తలచుకుని రోదిస్తూ ఉండేది. ఇలా కొద్ది నెలలు గడిచేసరికి కొన్ని జిన్నులు (పిశాచాలు) ఆ అమ్మాయి దగ్గరకు వచ్చాయి. అందులో కొన్ని జిన్నులు ఆ అమ్మాయిపట్ల సానుభూతితో ఉండగా, మరి కొన్ని జిన్నులు ఆ అమ్మాయిని మరింతగా బాధపెట్టాలని చూసాయి. ఏదిఏమైనా, అదృశ్య రూపంలో ఉండే ఆ జిన్నులు ఆ అమ్మాయితో మాట్లాడుతూ ఉండేవి. ఆ అమ్మాయికూడా ఆ జిన్నులతో తనకు తోచిన మాటలు మాట్లాడుతూ ఉండేది. ఇంకొక విశేషం ఏమంటే, ఆ అమ్మాయి ఆ జిన్నుల్ని ఏ ప్రశ్న అడిగినా ఏమాత్రం ఆలస్యం లేకుండా ఆ జిన్నుల నుండి సమాధానం వినిపించేది. అలా కొద్ది సంవత్సరాలు గడిచాయి. ఆ అమ్మాయి 19వ సంవత్సరం చివరిలోకి వచ్చింది. అప్పటి నుండి ఆమెలో విపరీతమైన కామవాంఛలు ప్రారంభం అయ్యాయి. కొద్ది ఏళ్ళుగా ఆమె చుట్టూ సంచరిస్తున్న జిన్నులలోని ఒక మగ జిన్ను, ఆమెలో చెలరేగుతున్న కామ సంబంధ ఆలోచనలను పసిగట్టింది. దాంతో, ఆ మగజిన్ను ఆ అమ్మాయితో శృంగారం జరపటం ప్రారంభించింది. ఆ అమ్మాయి కళ్ళకు ఎవరూ కనపడేవాళ్ళు కాదు. కానీ, ఆ అమ్మాయి నిద్రపోతున్నా, మెళుకువతో ఉన్నా సరే, తను ఎవరో శృంగారపరంగా అనుభవిస్తున్నట్లుగా ఆమెకు స్పర్శ చాలా స్పష్టంగా తెలుస్తూ ఉండేది. “తాను ఒక మగ జిన్ను చేత అనుభవించబడుతున్నాను” అన్న సంగతి ఆమెకు తెలియదు. కొద్ది నెలలు గడిచాయి.

తను ఎవరో ఒక వ్యక్తిని వివాహం చేసుకుంటే, తనకి ప్రశాంతత ఏర్పడుతుంది అని భావించిన ఆ అమ్మాయి తనకి నచ్చిన వ్యక్తితో కొంతకాలం సహజీవనంచేసి, ఆపై అతడు మంచివాడైతే అతడిని పెళ్ళి చేసుకోవాలని నిర్ణయించుకున్నది. ఆ ప్రయత్నంలో భాగంగా ఆమె, దాదాపు నలుగురు/ఐదుగురు యువకులతో సహజీవనం చేసింది. కానీ, ఎవరూ ఆమెకు నచ్చలేదు. దాంతో ఆమె తన తల్లిదండ్రులు చెప్పిన సంబంధం చేసుకోవాలని నిర్ణయించుకున్నది. అసలు సమస్య అప్పుడే ప్రారంభం అయ్యింది. అది ఏమిటంటే, ఆమె తండ్రి తన మేనల్లుడిని ఆమెకు ఇచ్చి వివాహం చెయ్యాలని భావించాడు. ఇక, ఆమె తల్లి తన మేనల్లుడిని ఆ అమ్మాయికి ఇచ్చి పెళ్ళి చెయ్యాలని ఆశపడింది. అయితే, చివరికి ఆమె తల్లి మాటే నెగ్గింది. ఆమె తన మేనమామ కొడుకుని పెళ్ళి చేసుకుని బొంబాయి వెళ్ళిపోయింది. ఆమె, తన కొడుకుని పెళ్ళి చేసుకోనందుకు తీవ్రంగా ఆగ్రహించిన ఆమె మేనత్త, ఆమె మీద ఒక మంత్రగాడిచేత చేతబడి చేయించింది. ఫలితంగా, ఆ అమ్మాయికి మరియు ఆమె

భర్తకు మధ్య తీవ్రమైన తగాదాలు ప్రారంభం అయ్యాయి. ఫలితంగా, వాళ్ళు చిన్న విషయాల గురించి కూడా కొట్టుకునే దాకా వెళ్ళిపోయారు. ఫలితంగా, వాళ్ళ మధ్య దాంపత్య సంబంధం లేకుండాపోయింది. అంతేకాకుండా, ఆ అమ్మాయికి నిద్రలో భయంకరమైన పీడ కలలు వస్తూ ఉండేవి. క్రమ క్రమంగా ఆమె శారీరక ఆరోగ్యం కూడా పాడై పోవటం మొదలయ్యింది. ఆమె భర్త, ఆమెను బొంబాయిలోని అనేకమంది పెద్ద డాక్టర్ల దగ్గరకు తీసుకువెళ్ళి ఆమెకు వైద్యం చేయించాలని ప్రయత్నించాడు. ఆమె వ్యాధి ఏమిటో? ఏ వైద్యుడికీ అర్థంకాలేదు. ఆమెకు M.R.I. స్కానింగ్‌తో సహా అన్ని రకాల వైద్య పరీక్షలు చేసారు. కానీ, ఆమెకు ఉన్న వ్యాధి ఏమిటో? వైద్యులకు అంతుపట్టలేదు.

నిజానికి, ఆమె మేనత్త ఆమెమీద చేతబడి ద్వారా ఒక జిన్నుని ప్రయోగించింది. ఆ జిన్ను, ఆమెను ఆవహించి ఆమెను అన్ని రకాలుగా పీడించింది. మనిషి శరీరాన్ని ఆవహించిన జిన్నుయొక్క ఉనికిని ఆధునిక సైన్స్ రూపొందించిన పరికరాలు కనుక్కోలేవు. కేవలం, మంత్రవాదం తెలిసిన మంత్రగాడు మాత్రమే 'జిన్ను' యొక్క ఉనికిని పసిగట్టి, ఆపై దానిని ఆ అమ్మాయి శరీరం నుండి బైటకు వెళ్ళగొట్టగలడు. ఈ విషయం ఆలస్యంగా గ్రహించిన ఆమె భర్త మరియు తల్లిదండ్రులు ఆమెను పూనాలోని ఒక ప్రముఖ ఇస్లాం మంత్రవాది వద్దకు తీసుకువెళ్ళారు. అక్కడ ఆమెకు కొన్ని పరీక్షలు చేయబడ్డాయి. అవి ఏమిటంటే...

1. ఒక వ్యక్తిని జిన్ను ఆవహించినప్పుడు ఆ వ్యక్తి శరీరంలో మరియు మనసులో ఆవిర్భవించే రోగాలయొక్క తీవ్రతను అంచనావేసే ఒక ప్రమాణిక కొలతను (స్కేల్) U.K.(యునైటెడ్ కింగ్‌డమ్)లోని ఒక ప్రఖ్యాత ఇస్లాం మంత్రవాది కనుగొన్నాడు. ఈ విధానంలో, మొదట "జిన్నుచేత ఆవహించబడింది" అని భావించబడిన వ్యక్తిని ఒకచోట కూర్చోపెట్టి, ఆపై ఆ వ్యక్తిని అనేక ప్రశ్నలువేసి వాటికి సమాధానాలు రాబట్టటం జరుగుతుంది. ఆ సమాధానాలను బట్టి ఆ వ్యక్తిని ఏ స్థాయి వరకు జిన్ను ఆవహించిందో తెలుసుకుంటారు. జిన్ను, ఆ వ్యక్తిని చాలావరకు తన ఆధీనంలోకి తెచ్చుకున్నట్లయితే ఆ వ్యక్తి నుండి జిన్నును వెళ్ళగొట్టటానికి చాలాకాలం పడుతుంది.

2. పైన చెప్పిన స్కేలు విధానం (కొన్ని నిర్ణీత ప్రశ్నలు అడిగి జిన్ను యొక్క ప్రభావాన్ని అంచనావేసే పద్ధతి) అనుసరించిన తరువాత, జిన్నుయొక్క ఉనికిని సంపూర్తిగా అంచనావెయ్యటంకోసం "రుకియా" విధానాన్ని అనుసరిస్తారు. రుకియా అనగా అరబ్బీ భాషలో "మంత్రోచ్ఛాటన" అని అర్థం. జిన్నుచేత ఆవహించబడింది

అని భావిస్తున్న వ్యక్తియొక్క చెవి దగ్గర పెద్ద స్వరంతో ఖురాన్‌లోని కొన్ని సురాలను (శ్లోకాలు) పఠిస్తారు. దైవశక్తిని సూచించే ఆ శ్లోకాలను విని భయభ్రాంతులకు గురైన జిన్ను ఆ వ్యక్తిని తీవ్రంగా ఊపివేస్తుంది. ఫలితంగా, ఆ వ్యక్తి విపరీతంగా ఊగిపోవటం, వికృతంగా నవ్వటం, పెద్దగా కేకలు వెయ్యటం, వాంతులు చేసుకోవటం లాంటివి జరుగుతాయి. దాంతో ఆ వ్యక్తిని ఒక జిన్ను ఆవహించిన మాట వాస్తవమే అని ఆ పరీక్షచేసే మంత్రవాదికి స్పష్టంగా అర్ధమవుతుంది. ఆపై, ఆ వ్యక్తికి కొంతమంది ఇస్లాం పండితుల సహకారంతో కొన్నిరకాల పరిహారాలు చెయ్యటం జరుగుతుంది. ఫలితంగా, ఆ వ్యక్తిని ఆవహించిన జిన్ను, ఆ వ్యక్తిని వదలిపెట్టి పారిపోతుంది.

ఏదిఏమైనా, పూనాలో ఉన్న ఇస్లాం మంత్రవాది, పైన చెప్పిన రెండు విధానాలలో ఆ అమ్మాయిని పరీక్షించి, షిర్ (చేతబడి) ద్వారా ఒక జిన్ను, ఆమె పైకి ప్రయోగించబడిందని తెలుసుకున్నాడు. ఆపై అతిశక్తివంతమైన 'రుకియా'ను ఉపయోగించి, ఆమెపై ఉన్న 'షిర్' ప్రభావాన్ని తొలగించాడు. ఫలితంగా, అప్పటి వరకు ఆమెను ఆవహించి పీడిస్తున్న జిన్ను, ఆమెను వదిలిపెట్టి వెళ్ళిపోయింది.

చేతబడి (షిర్) ప్రక్రియ ద్వారా కొంతమంది గృహాలమీదకి జిన్నులు ప్రయోగించబడతాయి. అలా, గృహాలను ఆవహించిన జిన్నులు ఆ ఇంట్లోని వస్తువులను అటు ఇటు విసరివేయటం, ఇంటి కప్పుమీద నుండి లోపలికి చిన్న చిన్న రాళ్ళు విసరటం లేదా ఇంటి బైట నుండి ఇంటిమీదకు రాళ్లు విసరటం లాంటి చర్యలకు పాల్పడ తాయి. కొన్నిసార్లు, ఏ కారణం లేకుండానే ఇంట్లోని వస్తువులకు నిప్పు అంటుకుని ఆ వస్తువులు మండిపోతాయి. ఒక విశేషం ఏమంటే, ఇస్లాం మత సూత్రాల ప్రకారం చూసినట్లయితే, అల్లాయొక్క అనుమతి లేకుండా ఏ జిన్ను, మనిషిని ఏ రకంగానూ పీడించలేదు. విపరీతమైన పాపాలు చేసిన వ్యక్తుల్ని శిక్షించటంలో భాగంగా అల్లా, జిన్నులు ఆ వ్యక్తుల్ని పీడించటానికి అంగీకరిస్తాడని చెబుతారు. అలా, జిన్నులచేత పీడించబడే వ్యక్తుల నుండి జిన్నులను తొలగించటానికి ఆ అల్లాకు సంబంధించిన ఖురాన్ శ్లోకాలనే పఠించటం జరుగుతుంది.



విపరీతమైన కోపం, నిద్రలేకపోవటం, పీడకలలు రావటం, ఏదో ఒక శరీర భాగంలోనే విపరీతమైన బలహీనత ఉండటం – లాంటి లక్షణాలు జిన్నుచేత ఆవహించబడిన వ్యక్తులలో కనిపిస్తాయి. అలాంటి వ్యక్తులు మొదట, ఆలీవ్ ఆయిల్‌ని తీసుకువచ్చి, ఆపై దానిని తమ శరీరంలో బలహీనంగా అనిపిస్తున్న భాగంపై మర్దనా చేసుకోవాలి. అలా, ఏడు రోజులపాటు మర్దనా చేసుకున్నట్లయితే జిన్ను ఆ వ్యక్తుల్ని వదిలిపెట్టి వెళ్ళిపోతుంది. ఇందుకు కారణం ఏమంటే, ఆలీవ్‌ఆయిల్‌యొక్క వాసన మరియు స్పర్శ, జిన్నులకు చాలా అసహ్యాన్ని కలిగిస్తాయి. ఈ ఆలీవ్‌ఆయిల్ మర్దనా ప్రక్రియ వల్ల జిన్ను వదలనట్లయితే, అప్పుడు ఇస్లాం మంత్రవాది యొక్క సహాయాన్ని కోరాల్సి వస్తుంది.

ప్రపంచవ్యాప్తంగా అనేక అభివృద్ధి చెందిన దేశాలలోని మనస్తత్వ శాస్త్రజ్ఞులు మరియు మనోరోగ వైద్యులు (సైకియాట్రిస్టులు), క్రమ క్రమంగా మానవాతీ శక్తుల యొక్క ఉనికిని గుర్తిస్తున్నారు. ఒక వ్యక్తికి తీవ్రమైన మానసిక రోగం వచ్చినప్పుడు ఆ రోగం వెనకాల ఉన్నది సాధారణ కారణాలా? లేక ప్రేతాత్మలు/జిన్నులు లాంటి అమానుష శక్తులా? అన్న విషయాన్ని నిర్ధారణ చేసుకుని, ఆపై తమ వైద్యాన్ని ప్రారంభిస్తున్నారు. ఒకవేళ, ఒక వ్యక్తికి వచ్చిన మనోవ్యాధికి కారణం ఒక జిన్ను లేదా ప్రేతాత్మ అయినట్లయితే, మనోరోగ వైద్యులు – మతానికి సంబంధించిన ప్రీస్టులు/ఇమామ్‌ల సహకారం కూడా తీసుకుని, ఆపై ఆ వ్యక్తికి వైద్యం చెయ్యటం జరుగుతుంది. అనగా, మనోవ్యాధివల్ల కలిగే శారీరక సమస్యలకు వైద్యులు వైద్యం చెయ్యగా, జిన్నుల వల్ల ఏర్పడే మానసిక రోగానికి మంత్రవాదులు వైద్యం చేస్తారు.

**బాంగ్లాదేశ్‌లో యదార్థంగా జరిగిన 'జిన్ను సంబంధ' వృత్తాంతాలు :**

బాంగ్లాదేశ్ రాజధాని నగరం అయిన ధాకాలోని ఒక ప్రాంతంలో అహమ్మద్ అనే ఒక నిర్మాణ పరిశ్రమ కార్మికుడు ఉన్నాడు. అతడికి ఆ ప్రాంతంలో రెండు అంతస్తుల భవనం ఉన్నది. అతడికి వివాహం అయి ఐదు సంవత్సరాలు గడిచినా పిల్లలు పుట్టలేదు. సంతానంకోసం రెండవ వివాహం చేసుకోవాలని అహమ్మద్ ఆలోచిస్తున్నాడు.

మరియమ్ వయస్సు 26 సంవత్సరాలు. ఆమె, టీచర్ ట్రైనింగ్ పట్టా పొందింది. అంతేకాకుండా, ఆమెకి ఆధునిక భావాలు అధికంగా ఉన్నాయి. దైవం మీద నమ్మకం కూడా అంతంత మాత్రంగానే ఉంటుంది. ముస్లిం సాంప్రదాయం ప్రకారం, 26 ఏళ్ళ వరకు ఒక అమ్మాయికి పెళ్ళి కాలేదంటే, అది చాలా పెద్ద తప్పుగా భావిస్తారు.

ఏదిఏమైనా, తన 26వ ఏట మరియమ్ తన అక్క భర్త అయిన అహమ్మద్‌ని పెళ్ళి చేసుకోవాలని నిర్ణయించుకున్నది. ఆమె, ఏ కారణంగా తన బావని పెళ్ళి చేసుకోవటానికి అంగీకరించిందో ఆమె తల్లిదండ్రులకు ఏమాత్రం అర్ధంకాలేదు. ఏదిఏమైనా, మరియమ్ – అహమ్మద్‌కి రెండవ భార్యగా అనగా తన సొంత అక్కకి సవతిగా అత్తగారింటికి వెళ్ళింది. బాంగ్లాదేశ్ ఇస్లాం సమాజంలో మగవాడు రెండవ పెళ్ళి చేసుకోవటం నేరంకాదు. పైగా, అది ఒక సాంప్రదాయంగా కూడా గుర్తించబడింది. ఏదిఏమైనా, అహమ్మద్ కొత్తగా వచ్చిన మరియమ్‌ని తన భవనం క్రింద భాగంలో ఉంచాడు. పెద్ద భార్యని ఆ భవనం పై అంతస్తులో ఉంచాడు. సంవత్సరంపాటు కాలం బాగానే గడిచిపోయింది. మరియమ్, అహమ్మద్‌తో చక్కటి దాంపత్య జీవితం అనుభవించింది. సంవత్సరం పూర్తి అయ్యేసరికి మరియమ్ గర్భవతి అయ్యింది. సరిగ్గా, అదే సమయానికి అహమ్మద్ పెద్ద భార్యకూడా గర్భవతి అయ్యింది. ఆ తరువాత కొద్ది నెలలకు మరియమ్‌కి ఒక కొడుకు, ఆమె అక్కకి ఒక కొడుకు పుట్టారు. అప్పటి నుండి మరియమ్ అక్కకి అనగా అహమ్మద్ పెద్ద భార్యకి హఠాత్తుగా ఆరోగ్యం పాడైపోయింది. ఆమె, తరచుగా ఇంట్లోంచి వెళ్ళిపోవటం, ఆపై ఎక్కడో ఉండే నిర్మానుష్య ప్రదేశాల్లోకి, పాడుపడ్డ భవనాల్లోకి వెళ్ళిపోయి, అక్కడ చాలాసేపు గడిపి, మళ్ళీ తెల్లవారుతున్న సమయంలో ఇంటికి వస్తూ ఉండేది. అహమ్మద్ ఎప్పుడూ తన చిన్న భార్య మరియమ్ దగ్గరే ఉండటంవల్ల, తన పెద్ద భార్య రాత్రి సమయాలలో ఇంట్లోంచి బైటకు వెళ్ళిపోతున్న విషయం తెలుసుకోలేకపోయాడు.

ఏదిఏమైనా, అహమ్మద్ పెద్ద భార్య, రోజు రోజుకి బక్కచిక్కిపోవటం ప్రారంభించింది. ఆ తరువాత ఏం జరిగిందో తెలియదుకాని, అహమ్మద్ పెద్దభార్య ఒక అర్ధరాత్రి సమయంలో ఇంట్లోంచి పారిపోయి, ఆపై ఎక్కడో ఉన్న ఒక పాడు పడ్డ బావిలో దూకి చనిపోయింది. ఆ తరువాత ఈ విషయం తెలుసుకున్న అహమ్మద్ కొంతమంది వ్యక్తుల సహాయంతో ఆ బావిలో నుండి తన భార్య మృతదేహాన్ని బైటకు తీసి శాస్త్రోక్తంగా సమాధి చేసాడు. ఈ సంఘటన జరిగిన కొద్ది రోజుల తరువాత ఎవరో ఒక ఇస్లాం మత పెద్ద, మరియమ్ దగ్గరకు వచ్చి ఆమెను 'హజ్ యాత్ర'కు వెళ్ళమని చెప్పాడు. (నోట్ : సౌదీ అరేబియాలోని మక్కా నగరంలో ఉన్న పురాతన కాలంనాటి 'కాబా' అనే ప్రార్ధనా మందిరంలోకి ఒక యాత్రలాగా వెళ్ళటమే 'హజ్‌యాత్ర' అని పిలుస్తారు.) అయితే, మరియమ్ ఏదో ఒక సాకు చెప్పి హజ్‌యాత్రను వాయిదా వేసింది. ఆ తరువాత అనేకసార్లు – తన దగ్గర డబ్బులు లేవనో, తన పిల్లలు ఇంకా చిన్నవాళ్ళు అనో లేదా తనకు ఆరోగ్యం బాగా లేదనో సాకులు చెప్పి

హజ్‌కి వెళ్ళకుండా తప్పించుకున్నది. చివరికి ఒక సమయంలో అనగా మరియమ్‌కి వివాహం అయిన పదవ సంవత్సరంలో ఆమె భర్త అహమ్మద్ ఆమెని బలవంతంగా హజ్‌యాత్రకి తీసుకువెళ్ళాడు. ఆ దంపతులు మక్కాలోని కాబా దగ్గరికి వెళ్ళేసరికి మరియమ్ ఒక్కసారి పెద్దగా అరిచి నేలమీద కూలిపోయింది. కారణం, కొద్ది సంవత్సరాలుగా ఆమెను ఆవహించి ఉన్న జిన్ను, ఆమెను హజ్‌యాత్రకు వెళ్ళకుండా అడ్డుపడుతూ వచ్చింది. కానీ, ఈ సారి ఆమె భర్త మొండిపట్టుదల వల్ల ఆమె, కాబా దగ్గరకు (మక్కా నగరంలోని కాబా నిర్మాణం) వచ్చింది. అయితే, పవిత్రమైన మరియు అల్లాయొక్క మహత్యంతో నిండిన ఆ కాబా ప్రవేశ ద్వారాన్ని దాట గలిగే శక్తి ఆ జిన్నుకి లేదు. అందువలన ఆ జిన్ను, తీవ్రమైన భయభ్రాంతులకు గురై, ఆపై తాత్కాలికంగా మరియమ్ దేహాన్ని వదిలిపెట్టి దూరంగా వెళ్ళిపోయింది. ఏదిఏమైనా, మరియమ్ తన భర్తతో కలిసి కాబాలో ప్రదక్షిణాలు, పూజలు పూర్తిచేసుకుని ఆపై బాంగ్లాదేశ్‌కి తిరిగి వచ్చింది.

అప్పటి నుండి మరియమ్ ప్రవర్తనలో విపరీతమైన మార్పులు వచ్చాయి. కాబా బైట మరియమ్‌ని వదిలిపెట్టి పారిపోయిన జిన్ను, మరియమ్ ఆ కాబాలోంచి బైటకు రాగానే మళ్ళీ ఆమెను ఆవహించింది. అంతేకాదు, అప్పటి నుండి ఆ జిన్ను తనయొక్క క్రూరమైన స్వభావాన్ని బహిరంగంగా ప్రదర్శించటం ప్రారంభించింది. దాంతో మరియమ్ సరిగ్గా నిద్రపోవటం, ఆహారం తీసుకోవటం మానేసింది. చిన్న వయస్సు ఉన్న తన పిల్లల్ని అదేపనిగా కొట్టటం మొదలుపెట్టింది. తన భర్తని మరియు తన ఇంటికి వచ్చిన బంధువులను మరియు తన ప్రక్క ఇంట్లో ఉన్న అత్తమామలను చాలా అసభ్యంగా తిట్టటం మొదలు పెట్టింది. అంతేకాదు, కొన్నిసార్లు ఆత్మహత్య చేసుకోవాలని ప్రయత్నాలుకూడా చేసింది. ఒక్కోసారి, ఇంట్లో ఎవరికీ అర్థంకాని విచిత్రమైన భాషను వికృతమైన స్వరంతో



మాట్లాడుతూ ఉండేది. "ఆమెను జిన్ను ఆవహించింది" అని మొదట్లో ఆమె భర్త అహమ్మద్‌కి గాని, ఆమె అత్తమామలకు గాని తెలియలేదు. దాంతో, వాళ్ళు ఆమెను ఢాకా నగరంలోని ఒక పెద్ద మనస్తత్వరోగ చికిత్సకుడు (సైకియాట్రిస్టు) దగ్గరకు తీసుకువెళ్లారు. ఆ వైద్యుడు, మరియమ్‌కి అన్నిరకాల పరీక్షలుచేసి, ఆపై ఆమెకు ఏవిధమైన మనోవ్యాధి లేదని తేల్చేసాడు. ఆ సమయంలో అహమ్మద్ ఇంటికి వచ్చిన ఒక వృద్ధుడు, మరియమ్‌ని కాసేపు పరిశీలనగాచూసి ఆపై అహమ్మద్‌తో ఇలా అన్నాడు. "నాకు ఉన్న అనుభవాన్ని బట్టి చెబుతున్నాను విను. నీ భార్యను ఒక జిన్ను ఆవహించి పీడిస్తున్నది నువ్వు ఏమాత్రం ఆలస్యం చెయ్యకుండా వెంటనే ఆమెను ఈ ఢాకా నగర పొలిమేరల్లో ఉన్న పెద్ద మసీదులో భూతవైద్యం చేస్తున్న షేక్‌ఆదె దగ్గరకు తీసుకువెళ్ళు. అతడు తప్పనిసరిగా నీ భార్యను ఆ జిన్ను బారి నుండి రక్షిస్తాడు". ఆ మర్నాడు ఉదయమే అహమ్మద్ తన తల్లిదండ్రులతో కలిసి తన భార్య మరియమ్‌ని తీసుకుని ఒక కారులో షేక్‌ఆదె వైద్యం చేస్తున్న మసీదు దగ్గరకు బయలుదేరాడు. తనను, అతి శక్తివంతుడైన ఒక మహా మాంత్రికుడి దగ్గరకు తీసుకువెళుతున్నారని మరియమ్‌ని ఆవహించి ఉన్న ఆ జిన్నుకి తెలిసిపోయింది. దాంతో, అది మరియమ్ శరీరంలో గందరగోళం సృష్టించింది. ఫలితంగా, మరియమ్ శరీరం చాలా తీవ్రంగా అటు, ఇటు ఊగిపోయింది. అంతేకాకుండా, ఆమె నోటి నుండి ఒకవిధమైన నురుగు బైటకు రావటం మొదలయ్యింది. ఆమె కనుగుడ్లు పూర్తిగా పైకి వెళ్ళిపోయి తెల్లగుడ్లు కనిపిస్తున్నాయి. మరియమ్, వికృతమైన స్వరంతో మూలగటం ప్రారంభించింది. ఇన్ని జరుగుతున్నా ఆమె భర్త అహమ్మద్ ఏమాత్రం భయపడకుండా కారుని తన లక్ష్యంవైపు నడుపుతున్నాడు. కొద్దిసేపట్లోనే ఆ కారు మసీదు ప్రహరీ గేటు దగ్గరకు చేరుకున్నది. ఆ తరువాత అహమ్మద్ కారుదిగి ఆపై, తన భార్యను తన తల్లిదండ్రుల సహాయంతో బలవంతంగా కారులోంచి క్రిందకు దించి, మసీదు ప్రహరీ గేటు దాటించి లోపలికి తీసుకువెళ్ళాడు. మరియమ్‌ని ఆవహించిన జిన్ను, మరియమ్ ఆ మసీదులోకి వెళ్ళకుండా తన ప్రయత్నం పూర్తిగా చేసినప్పటికీ ఆ మసీదులో ఉన్న మహత్యం కారణంగా ఆ జిన్ను శక్తి పనిచేయలేదు. ఫలితంగా, మరియమ్ ఆ మసీదులోకి అడుగు పెట్టింది.

షేక్ ఆదె, మనుషుల్ని ఆవహించిన జిన్నులను వెళ్ళగొట్టటంలో మొత్తం బాంగ్లాదేశ్‌లోనే అత్యంత ప్రముఖుడైన మంత్రవాదిగా లేదా భూత వైద్యుడిగా పేరు పొందాడు. సాధారణంగా, షేక్‌ఆదె ఒక వ్యక్తిని పీడిస్తున్న జిన్నుని వెళ్లగొట్టటానికి ఒక గంట నుండి మూడు గంటల వరకు సమయం తీసుకుంటాడు. ఆధునిక

మనోరోగ చికిత్సకులకు (సైకియాట్రిస్టులు) తీసిపోనివిధంగా అత్యంత ఆధునిక విధానంలో జిన్నులను వదిలించటం (Exorcising jinn) షేక్ఆదె యొక్క ప్రత్యేకత అని చెప్పుకుంటారు.

జిన్నుచేత ఆవహించబడి పీడించబడుతున్న మరియమ్‌ని ఆమె భర్త మహమ్మద్ తన వద్దకు తీసుకువచ్చినప్పుడు షేక్ఆదె, మొదట మరియమ్ యొక్క తలపై తన కుడిచేతిని ఉంచి, ఆపై ఖురాన్‌లోని మూడు ముఖ్య సూరాలను (శ్లోకాలు) మధ్యస్థాయి గొంతుతో పఠించాడు. అలా, జిన్నుచేత ఆవహించబడిన వ్యక్తిని తాకినప్పుడు, ఆ వ్యక్తిని ఆవహించి ఉన్న జిన్ను ఎంత శక్తిగలది?, ఎంత పట్టుదల గలది? అన్న విషయం షేక్ఆదెకి స్పష్టంగా తెలిసిపోతుంది. మరియమ్ శిరస్సుపై తన కుడిచేయి ఉంచిన షేక్ఆదెకి ఒక్కసారి చెయ్యి బాగా అదిరింది. దాంతో, “మరియమ్‌ని ఆవహించి ఉన్న జిన్ను అసాధారణమైన శక్తిని కలిగి ఉన్నది” అని షేక్ఆదెకి స్పష్టంగా అర్థమయ్యింది. ఆపై, అతడు మరియమ్ తల వెనకవైపు నుండి ఆమె రెండు చెవులకు రెండు హెడ్‌ఫోన్‌లను అమర్చి, ఆపై MP3 Player ద్వారా ఖురాన్‌లోని కొన్ని ముఖ్య సురాలను మరియమ్‌కి వినపడేలా చేసాడు. ఈ ప్రక్రియ దాదాపు 15 నిమిషాలపాటు కొనసాగింది. ఫలితంగా, మరియమ్‌ని ఆవహించి ఉన్న జిన్ను, తీవ్రమైన భయాందోళనకు గురై ఆపై మరియమ్ శరీరం నుండి మాట్లాడటం మొదలుపెట్టింది. అప్పుడు షేక్, ఆ జిన్నుని అనేక ప్రశ్నలు వేసాడు. ఆ జిన్ను అతి వికృతమైన స్వరంతో తాను ఎవరో?, ఎక్కడ నుండి వచ్చి మరియమ్‌ని ఆవహించిందో?, ఏ కారణంగా మరియమ్‌ని పీడిస్తున్నదో? వివరించింది. ఆ జిన్ను వయస్సు 200 సంవత్సరాలు అని, అది పాలస్తీనా దేశం నుండి బాంగ్లాదేశ్‌కి వచ్చిందని, మరియమ్ అపరిశుభ్రంగా ఉన్న సమయంలో ఆమెను ఆవహించిందని ఆ జిన్ను మాటలను బట్టి షేక్ఆదెకి అర్థమయ్యింది. ఆ సమయంలో మరియమ్ నిద్రపోతున్నట్లుగా ఒక కుర్చీలో కూర్చుని ఉన్నది. ఆమె కళ్ళు సగం తెరచి ఉన్నాయి. కానీ, ఆమె నోటి నుండి వచ్చే మాటలు ఆమెవి కాదని, జిన్నువని షేక్ఆదెకి స్పష్టంగా తెలుసు. అప్పుడు షేక్ ఆదె, గంభీరమైన స్వరంతో, మరియమ్ శరీరం నుండి మాట్లాడుతున్న ఆ జిన్నుతో ఇలా అన్నాడు. “ఇంత వరకు అయ్యింది ఏదో అయిపోయింది. ఇక, నీవు ఈమెను వదిలిపెట్టి వెళ్ళిపో. ఇది అల్లా ఆజ్ఞ”.

అప్పుడు మరియమ్ నోటి నుండి కొన్ని వికృతమైన శబ్దాలు వచ్చాయి. ఆపై, ఆ జిన్ను, మరియమ్ నోటితో ఇలా మాట్లాడింది. “నువ్వు ఏం చేసినా సరే, నేను ఈ మరియమ్‌ని వదిలిపెట్టను. ఈమె మీద నాకు ఇంకా వ్యామోహం తీరలేదు”.

మరియమ్‌ని ఆవహించింది ఒక మగ జిన్ను అని అప్పటికి షేక్‌ఆదెకి స్పష్టంగా అర్థమయ్యింది. అప్పుడు, అతడు తన రుకియా (భూతవైద్యం)లో రెండవ భాగాన్ని ప్రారంభించాడు. అది ఎలాగంటే...మొదట, మరియమ్‌ని కుర్చీ నుండి లేపి, నేలపై పడుకోపెట్టాడు. ఆ తరువాత ఆమెను తన చేతులతో నాలుగు దెబ్బలు కొట్టాడు. ఆమెను ఆవహించి ఉన్న జిన్ను, ఒకసారి వికృతంగా అరిచింది. అంతేగాని ఆమెను వదిలిపెట్టి వెళ్లటానికి అంగీకరించలేదు.


మగజిన్ను (ఊహాచిత్రం)

అప్పుడు షేక్‌ఆదె ఒక ప్లాస్టిక్ గొట్టాంతో మరియమ్ శరీరంపై నాలుగు దెబ్బలు బలంగా వేసాడు. ఆ దెబ్బల ప్రభావం మరియమ్ శరీరంలో ఉన్న జిన్‌కి బలంగా తగిలింది. ఆ దెబ్బలు తట్టుకోలేక మరియమ్ శరీరంలోని జిన్ను వికృతంగా అరిచింది. అయినా కానీ ఆ జిన్ను, మరియమ్ శరీరంలోంచి బైటకు రాలేదు. ఇక, మామూలుగా ఆ జిన్ను లొంగదని అర్థంచేసుకున్న షేక్‌ఆదె తన కాలి చెప్పుని చేతిలోకి తీసుకుని ఆపై దానితో మరియమ్ తలమీద మూడు దెబ్బలు కొట్టాడు. మరియమ్‌ని ఆవహించిన ఆ జిన్నుకి ఆ చెప్పు దెబ్బలు తీవ్రమైన అవమానాన్ని కలిగించాయి. దాంతో అది విపరీతమైన ఆగ్రహానికి గురై, ఆపై మరియమ్ శరీరం నుండి ఒక తెల్లటి దట్టమైన పొగ రూపంలో బయటకు వచ్చి, ఆపై ఆ మసీదు కప్పులోంచి ఆకాశంలోకి వెళ్ళిపోయింది. అంతటితో మరియమ్‌కి జిన్ను వల్ల కలుగుతున్న పీడలు ముగిసిపోయాయి. మరియమ్ ఎప్పటిలాగానే ఆరోగ్యవంతురాలు అయ్యింది.

**జిన్నుల స్వభావం :**

తాము, ఎవరో తెలిస్తే అనగా తమ పేరే ఏమిటో? తాము ఏ ప్రాంతానికి చెందినవో? అన్న రహస్యాలు మంత్రవాదికి తెలిస్తే అతడు, తమని ఏదో ఒక తాంత్రిక ప్రక్రియ ద్వారా బయటకు వెళ్లకొడతాడని జిన్నులకు ముందే తెలుస్తుంది. అందువల్ల అవి, వీలైనంత వరకు తమ పేరును మరియు ఇతర వివరాలను చెప్పకుండా

మొండికేస్తూ ఉంటాయి. సమర్ధుడైన మంత్రవాది మాత్రమే జిన్నుని భయపెట్టి ఆపై దాని ద్వారానే దాని వివరాలు తెలుసుకుని దాన్ని వెళ్ళకొడతాడు అని గ్రహించాలి.

ఏదిఏమైనా, మరియమ్‌ని ఆవహించి పీడిస్తున్న జిన్నుని తన మంత్రబలంతో వెళ్ళగొట్టిన షేక్‌ఆదె, ఆపై ఆ మసీదులో ఒక ప్రక్కగా ఉన్న పాతకాలంనాటి ఒక బల్లపై కూర్చుని మరియమ్ భర్తతో ఇలా అన్నాడు. “ఇప్పటికి నీ భార్య, జిన్ను పీడ నుండి బైట పడింది. కానీ, అదృశ్య రూపంలో ఈ మానవ సమాజంలో సంచరిస్తూ ఎప్పుడు, తమకి బలహీనమైన మనస్సు లేదా చెడు ప్రవర్తన కలిగిన వ్యక్తులు దొరుకుతారా? – వాళ్ళని ఎప్పుడు ఆవహిద్దామా? అని జిన్నులు ఎదురు చూస్తూ ఉంటాయి. ఇప్పుడు, ఈమెను వదిలిపెట్టి వెళ్ళిపోయిన జిన్నుకూడా మళ్ళీ ఈమెను ఎప్పుడు ఆవహిద్దామా అని ఎదురు చూస్తూ ఉంటుంది అనే విషయాన్ని నీవు ఎప్పటికీ మర్చిపోవద్దు. నిరంతరం నీ ఇంట్లో దైవ ప్రార్ధనలు చేస్తూ ఉండు. మరియమ్‌ని కూడా దైవాన్ని ప్రార్ధించమని ప్రోత్సహించు. అప్పుడు మాత్రమే నీ భార్య శాశ్వతంగా జిన్ను పీడకు దూరంగా ఉంటుందని గుర్తుపెట్టుకో”.



# 3. దయ్యాల ఉనికిని నిర్ధారించిన అనేక యదార్ధ సంఘటన?

**అపార్ట్‌మెంట్‌లో ఆత్మలు :**

ఈ సంఘటన దాదాపు 27 సంవత్సరాల క్రితం పాకిస్థాన్‌లోని కరాచి నగరంలో జరిగింది. కొన్ని గృహాలను ప్రేతాత్మలు ఆవహించి ఉంటాయని అనగా ఆయా గృహాలలో ప్రేతాత్మలు అదృశ్య రూపంలో నివసిస్తూ ఉంటాయని అనాదికాలం నుండి విశ్వసిస్తున్నారు. ఇలాంటి గృహాలలో నివసించే వాళ్ళకి ఆకస్మికంగా ప్రమాదాలు జరగటం, పెద్ద పెద్ద వైద్యులకు కూడా అంతుచిక్కని రోగాలు సంక్రమించటం లాంటి సంఘటనలు జరుగుతూ ఉంటాయి. సరే, ప్రస్తుతం అసలు కధలోకి వద్దాం...

దాదాపు 27 సంవత్సరాల క్రితం అనగా 1990వ సంవత్సరంలో అమీర్ అనే పేరుగల బాలుడియొక్క ఒక ముస్లిం కుటుంబం, కరాచి దగ్గర ఉన్న ఒక గ్రామం నుండి వ్యాపార నిమిత్తం కరాచి నగరానికి వచ్చారు. ఆ నగరంలోని ఒక

అపార్ట్‌మెంట్‌లోని పై భాగాన్ని రెండు సంవత్సరాలకి అద్దెకు తీసుకున్నారు. గతంలో ఆ అపార్ట్‌మెంట్‌లో ఇంకొక కుటుంబం ఉండి వెళ్ళింది. ఏదిఏమైనా, తాము తీసుకున్న ఆ అపార్ట్‌మెంట్‌లోకి ప్రవేశించటానికి ముందు, ఆ కుటుంబ యజమాని తన భార్య మరియు 12 సంవత్సరాల కూతురుతో కలిసి ఆ అపార్ట్‌మెంట్‌ని శుభ్రంగా కడిగించటానికి వెళ్ళాడు. ఆ సమయంలో ఆ 12 సంవత్సరాల బాలిక, అపార్ట్‌మెంట్ అంతటా నడిచింది. ఆ సమయంలో ఆమెకు ఆ అపార్ట్‌మెంట్‌లోని ఒక స్టోర్ రూం నుండి గుస గుస లాడుతున్నట్లుగా కొన్ని మాటలు ఇలా వినిపించాయి. "వీళ్ళు ఈ అపార్ట్‌మెంట్‌లోకి ప్రవేశించగానే వీళ్ళని నానా బాధలుపెట్టి ఇక్కడ నుంచి తరిమివెయ్యకపోతే చూడు". అప్పుడు ఇంకొక స్త్రీ కంఠం చాలా సన్నగా ఇలా వినిపించింది. "ఈ అపార్ట్‌మెంట్‌లోకి ఎవరు వచ్చినా అలాగే బైటకు వెళ్ళగొట్టాలి. ఈ అపార్ట్‌మెంట్‌లో మనుషులు ఉంటే మనకు ఏమాత్రం శాంతి ఉండదు". ఈ మాటలు విన్న ఆ 12 సంవత్సరాల ఆ పిల్లకి చాలా ఆశ్చర్యంగా అనిపించింది. దాంతో, ఆమె ఆ స్టోర్ రూం తలుపులు తెరచి లోపలకు వెళ్ళింది. అక్కడ ఆమెకు పాత సామాన్లు తప్ప, మనిషి అన్నవాడు కనిపించలేదు. అక్కడ ఎవరూ లేకపోయినా మాటలు ఎలా వినిపించాయో? ఆ అమ్మాయికి అర్థంకాలేదు. దాంతో ఆమె, స్టోర్‌రూం నుండి బైటకువచ్చి నేరుగా తల్లివద్దకు వెళ్ళింది. ఆ సమయంలో ఆమె తల్లి ఒక పనివాడి సహాయంతో ఆ అపార్ట్‌మెంట్‌లోని ఒక బెడ్‌రూంని శుభ్రం చేయిస్తున్నది. ఆ అమ్మాయి తన తల్లి దగ్గరకు వెళ్ళి ఆమెతో రహస్యంగా "అమ్మీ! ఆ స్టోర్ రూంలో ఎవరో మనుషులు చిన్నగా మాట్లాడుకుంటున్నారు. నేను లోపలికివెళ్ళి చూస్తే అక్కడ ఎవరూలేరు" అన్నది.



కూతురు మాటలు విన్న ఆ తల్లి విచిత్రంగా నవ్వి "నీ మొఖం, అక్కడ ఎవరూ లేరు. అదంతా నీ భ్రమ'' అని కూతురి మాటల్ని తేలిగ్గా కొట్టిపారేసింది. ఆ తరువాత మూడు రోజులకే ఆ కుటుంబం ఆ అపార్ట్‌మెంట్‌లోకి ప్రవేశించింది. వాళ్ళు ఆ అపార్ట్‌మెంట్‌లోని మొదటి అంతస్తులో

ఉన్న రెండవ నంబరు ఫ్లాట్‌లోకి ప్రవేశిస్తున్న సమయంలో ప్రక్క ఫ్లాట్‌లో ఉన్న ఒక స్త్రీ, వాళ్ళ దగ్గరకువచ్చి వాళ్ళతో ఇలా అన్నది.

"మీ ఫ్లాట్‌లో తలుపులు, కొన్నిసార్లు వాటంతట అవే మూసుకుని మళ్ళీ తెరుచుకుంటూ ఉంటాయి. అలా ఎందుకు జరుగుతుందో ఎవరికీ అర్థం కావటంలేదు. ఏదిఏమైనా మీరు కొంచెం జాగ్రత్తగా ఉంటే మంచిది".

ఏదిఏమైనా, అమీర్ కుటుంబం ఆ ఫ్లాట్‌లోకి వెళ్ళిన నెల రోజులకు అతడి తల్లి గర్భవతి అయ్యింది. ప్రక్క ఫ్లాట్‌లోని స్త్రీ – ముందు జాగ్రత్త చెప్పటంతో అమీర్ తల్లికి, ఆ ఫ్లాట్‌లో ఏదో "చెడుశక్తి" ఉన్నదన్న అనుమానం వచ్చింది. దాంతో, ఆమె తమ ఫ్లాట్‌లోని గోడలమీద ఖురాన్‌లోని శ్లోకాలను అరబిక్ భాషలో వ్రాసుకున్నది. అమీర్ తల్లి గర్భవతి అయ్యేవరకు అమీర్ మరియు అతడి చెల్లెలు, తమ తల్లితో కలిసి ఒకే బెడ్‌రూంలో పడుకునేవాళ్ళు ఇప్పుడు తల్లి గర్భవతి కావటంతో ఆమె తన ఇద్దరి పిల్లల్ని ఒక బెడ్‌రూంలో పడుకోపెట్టి, తను భర్తతో కలిసి ఇంకొక బెడ్‌రూంలో పడుకోవటం ప్రారంభించింది. అమీర్ కుటుంబం ఆ ఫ్లాట్‌లోకి చేరిన 3వ నెల నుండి అతడి తల్లి ప్రవర్తనలో విపరీతమైన మార్పు వచ్చింది. ఆమె, రాత్రి సమయాల్లో ముఖ్యంగా అర్ధరాత్రి దాటిన తరువాత పెద్దగా కేకలు వేస్తూ నిద్రలేచేది. అప్పుడు ఆమె భర్త ఆమెను దగ్గరకు తీసుకుని ఓదార్చి ఆమెకు ధైర్యం చెప్పేవాడు. ఆపై, ఆమె చాలాసేపటిదాకా నిద్రలేకుండా అలా కూర్చుండిపోయేది. ఆమె ఎందుకు అలా భయపడుతుందో? తెలుసుకోవాలనే ఉద్దేశంతో ఆమె భర్త ఆమెతో ఇలా అన్నాడు. "నువ్వు అర్ధరాత్రి సమయాలలో పెద్దగా అరిచి నిద్రలేస్తున్నావు. అంతేకాదు, ఆపై నిద్రపోకుండా భయంతో వణకిపోతూ మెళుకువతో ఉంటున్నావు. ఇందుకు కారణం ఏమిటో చెప్పు?".

అప్పుడు ఆమె, భయంతో వణుకుతున్న స్వరంతో ఇలా అన్నది. "తలలేని ఒక మొండెం, మన బెడ్ ప్రక్కనే నుంచుని ఉన్నట్లుగా నాకు కల వచ్చింది. నిజం చెప్పాలంటే, అది నాకు కలలా అనిపించటంలేదు. అందుకే భయంతో నిద్రలేస్తున్నాను". అలా ఒక వారం రోజులు గడిచాయి. ఒకరోజు అర్ధరాత్రి దాటిన తరువాత అమీర్, నిద్రపట్టక తన బెడ్‌రూంలోంచి లేచి తమ ఫ్లాట్‌కి ఉన్న తూర్పు బాల్కనీలోకి వెళ్ళి నుంచున్నాడు. ఆ సమయంలో అతనికి అతని తండ్రి ఆ బాల్కనీకి ఇంకొక వైపు నిలబడి సిగరెట్ కాలుస్తూ కనిపించాడు. తన తండ్రి సిగరెట్ కాలుస్తాడు అన్న విషయం అమీర్‌కి అప్పటిదాకా తెలియదు. అప్పటికి సమయం రాత్రి ఒంటిగంట

అవుతున్నది. అమీర్‌కి నిద్ర రావటంతో మళ్ళీ ఆ బాల్కని నుండి తన పడక గదిలోకి వెళ్ళిపోయాడు. మర్నాడు ఉదయం అతడు తన తల్లితో “అమ్మీ! నిన్నరాత్రి బాబాజి బాల్కనీలో నిలబడి సిగరెట్ కాల్చాడు” అన్నాడు. అప్పుడు అతడి తల్లి, అమీర్‌కేసి విచిత్రంగా చూస్తూ “నిన్నరాత్రి మీ డాడి ఇంట్లోనే లేడు. ఆయన నిన్న మధ్యాహ్నం బైటకు వెళ్ళి ఈ రోజు తెల్లవారుఝామున 5 గంటలకు ఇంటికి వచ్చాడు. మరి, అర్ధరాత్రి సమయంలో ఆయన సిగరెట్ కాలుస్తూ మన బాల్కనీలో నీకు ఎలా కనిపిస్తాడు. నువ్వు అబద్దం చెబుతున్నావు కదూ?” అన్నది. “తాను నిన్న అర్ధరాత్రి తన కళ్ళారా – తమ తండ్రి సిగరెట్ కాలుస్తుండగా చూసాడు. మరి, నిన్నరాత్రి ఆ సమయంలో ఆయన ఇంట్లో లేడని తన తల్లి చెబుతున్నది. మరి, తనకు కనపడిన ఆ వ్యక్తి ఎవరు?” – అన్న ప్రశ్నలు బాలుడైన అమీర్ మెదడుని తీవ్రంగా వేధించాయి. అంతటితో ఆ విషయం ముగిసిపోయింది.

అమీర్‌కి రంగులు వేసిన కోడిపిల్లలంటే చాలా ఇష్టం. దాంతో, అతడు ఒకరోజు మధ్యాహ్నం, బజారులో 6 కోడిపిల్లల్ని కొనుక్కొచ్చి డ్రాయింగ్ రూంలో ఉన్న ఒక బోనులో ఉంచి వాటికి ఆహారం పెట్టాడు. మర్నాడు ఉదయం నిద్రలేచి చూసిన అమీర్‌కి ఆ బోనులో కోడిపిల్లలు కనపడలేదు. అవి ఏమైనాయా? అని వెతికిన అతడికి ఆ ఫ్లాట్ ఉత్తర బాల్కనిలో, బాగా నొక్కి చంపబడిన ఆ కోడిపిల్లలు కనిపించాయి. వాటిలో ఒక చుక్క రక్తం కూడా లేదని అమీర్‌కి అనిపించింది. దాదాపు 500 కేజీల బరువైన ఒక రాయితో నొక్కితే ఎలా అణిగిపోతాయో, ఆ కోడి పిల్లలు అలా అణిగిపోయి చచ్చిపడి ఉన్నాయి. కొన్ని సమయాలలో ఆ ఇంట్లో ఒకరు మాత్రమే ఉన్నప్పుడు ఆ ఇంటి లోపలి గోడలమీద మనుషుల నీడలు కదులుతున్నట్లుగా కనపడేవి. అలా ఎందుకు జరుగుతుందో? ఆ సమయంలో అక్కడ ఉన్నవారికి అర్ధమయ్యేదికాదు. అంతే కాకుండా, అమీర్ తల్లికి మానసిక ఆరోగ్యం చెడిపోయింది. అమీర్ తండ్రికి కనీసం రోజుకి ఒక్క యాక్సిడెంట్ అయినా జరిగేది. ఆ ఫ్లాట్‌లోఉండే ఏదో క్షుద్రశక్తి కారణంగానే తమకి ఈ సమస్యలు వస్తున్నాయని చాలా ఆలస్యంగా గ్రహించిన అమీర్ తండ్రి ఆపై ఏమాత్రం ఆలస్యం చెయ్యకుండా ఆ ఫ్లాట్‌ని ఖాళీచేసి తన కుటుంబంతో సహా తన సొంత గ్రామానికి వెళ్ళిపోయాడు.

**సముద్రంలో స్త్రీ ప్రేతాత్మ :**

క్రీ.శ. 1480వ సంవత్సరంలో, అట్లాంటిక్ సముద్రం తీరంమీద ఉన్న స్కాట్‌లాండ్ సముద్ర ప్రాంతంలో (యునైటెడ్ కింగ్‌డమ్ దేశంలోని అతి పెద్ద భాగమైన స్కాట్‌లాండ్

దేశం) స్కాట్‌లాండ్‌కి చెందిన ఒక ఓడ ఎబర్‌డీన్ రేవు నుండి కిర్క్‌వాల్ రేవుకి ప్రయాణిస్తున్న సమయంలో ఒక భయంకరమైన తుఫాను ప్రారంభం అయ్యింది. ప్రచండమైన గాలులు వీచటం మొదలయ్యింది. దానికి తగినట్లుగా కుండపోతగా వర్షంకూడా కురుస్తున్నది. మధ్య ఎండాకాలంలో ఏనాడూ అలాంటి ప్రచండ తుఫానుని చూడని ఆ ఓడ కెప్టెన్ మరియు ఇతర నావికులు ఎంతో ఆశ్చర్యపోయారు. ఆ తుఫాను అంతకంతకీ అధికం అయిపోయింది. ఆ ఓడ సముద్రం మధ్యలో అటు,ఇటు ఊగిపోవటం ప్రారంభించింది. ఇక, తాము ఆ ఓడతోపాటుగా సముద్రంలో మునిగిపోయి చనిపోక తప్పదని అర్థంచేసుకున్న ఆ ఓడలోని సిబ్బంది భయంతో గజ గజా వణికిపోయారు. సరిగ్గా, అదే సమయంలో ఆకాశంలో అతి ప్రకాశవంతమైన ఒక మెరుపు మెరిసింది. దాంతో, వాళ్ళ ఓడ ఉన్న ప్రాంతంలో ఒక బంగారు రంగు ప్రకాశం కొద్ది నిమిషాలపాటు వ్యాపించింది. ఆ వెలుగులో వాళ్ళ ఓడ ప్రక్కనే సముద్రం మీద తేలుతున్న ఒక పడవ కనిపించింది. ఆ పడవలో చాలా వికృతమైన ఆకారంలో ఉన్న ఒక స్త్రీ కూర్చుని ఉన్నది. ఇంతలో, ఇంకొక ప్రకాశవంతమైన మెరుపు ఆకాశంలో మెరిసింది. ఆ వెలుగులో ఆ పడవలోని ఆ స్త్రీ పెద్ద స్వరంతో ఓడలో ఉన్న వారితో ఇలా అన్నది. “మీ ఓడ క్షేమంగా ఒడ్డుకి చేరాలంటే మీలో ఒకడు నా దగ్గరకు వచ్చి నా బాధను తీర్చాలి”. ఆ పడవలో కనిపిస్తున్నది ఒక స్త్రీ ప్రేతాత్మ అని ఆ ఓడ కెప్టెన్‌కి చాలా తొందరగానే అర్థమయ్యింది. ఆపై అతడు తన ఓడలో ఉన్న వ్యక్తుల్లో, ఎవరు ధైర్యంగా ఆ పడవలోకి వెళ్ళగలడు? అని ఆలోచించాడు. అదృష్టవశాత్తు, ఆ సమయంలో ఆ ఓడలో ఒక ప్రీస్ట్ (క్రైస్తవ మత పూజారి) ఉన్నాడు. ఆ ప్రేతాత్మను సమాధాన పరిచే శక్తి, కేవలం ఆ ప్రీస్ట్‌కే ఉంటుందని అర్థం చేసుకున్న ఆ ఓడ కెప్టెన్ తన ఓడలోని ఆ ప్రీస్ట్‌ని తన దగ్గరకు పిలిచి అతడికి అసలు విషయం చెప్పాడు. ఆపై, ఆ ప్రీస్ట్ ఏమాత్రం ఆలస్యం చెయ్యకుండా ఆ ఓడ పై భాగం నుండి, ప్రక్కనే సముద్ర జలాలపైన తేలుతున్న పడవలోకి దూకాడు. అలా పడవలోకి దూకిన ఆ ప్రీస్ట్‌కి ఆ పడవ మధ్యభాగంలో కూర్చుని ఉన్న భయంకర రూపం కలిగిన ఒక స్త్రీ కనిపించింది. ఆ ప్రీస్ట్ తన ముందుకు రాగానే ఆ స్త్రీ ఒక్కసారిగా బిగ్గరగా రోదించింది. ఆ తరువాత ఏడుపుని ఆపుకుని, ఆపై వికృతమైన స్వరంతో ఆ ప్రీస్ట్‌తో ఇలా చెప్పింది. “నేను, కొన్ని వందల సంవత్సరాల క్రితం చనిపోయిన ఒక అందమైన స్త్రీని. ఆ కాలంలో ఈ సముద్రంలో నేను ప్రయాణిస్తున్న ఓడలో నుండి కొందరు వ్యక్తులు నన్ను సముద్రంలోకి తోసేసారు. నేను ఈ సముద్ర జలంలో మునిగిపోయి, నికృష్టమైన చావుని పొందాను. ఆ తరువాత నేను పిశాచిగా

మారి, ఆపై ఇటువైపు వచ్చే ఓడలలోకి ప్రవేశించి, ఆ ఓడలలో నాకు నచ్చిన పురుషుల్ని అనుభవించి, వాళ్ళ రక్తాన్ని త్రాగేసి వాళ్ళని చంపేస్తున్నాను. కానీ, ఇప్పుడు నాకు – నేను చేసిన పాపాల గురించి పశ్చాత్తాపం ఏర్పడింది. నేను ఎలాగైనా సరే దైవ లోకానికి వెళ్ళాలి. అందుకోసం నేను నా ఈ పిశాచి జన్మని, ఈ ఓడలో ప్రయాణిస్తున్న మానవుల్ని రక్షించటం ద్వారా వదిలించుకోవాలని ఆశపడుతున్నాను. నీవే నా పాపాలకు క్షమాపణ ప్రసాదించాలి".

ఆ పిశాచి, అప్పటిదాకా తాను చేసిన పాపాలకు మనస్ఫూర్తిగా పశ్చాత్తాప పడుతున్నదని అర్థంచేసుకున్న ఆ ప్రీస్ట్ ఆ స్త్రీ పిశాచి మీద జాలి పడ్డాడు. ఆపై ఆయన, ఆ పిశాచి యొక్క పాప పరిహారం కోసం ప్రార్థనలు చేసాడు. ఆ ప్రార్థనలు పూర్తి అయిన కొద్ది నిమిషాలలోనే ఆ స్త్రీ పిశాచి, నల్లటి దట్టమైన పొగ రూపంలోకి మారిపోయి ఆకాశంలోకి ఎగిరిపోయింది. ఈ సంఘటన జరిగిన ఐదు నిమిషాలలోగా ఆ ప్రాంతంలో తుఫాను దాదాపు చాలా వరకు తగ్గిపోయింది. ఆపై ఆ ఓడ కెప్టెన్ ఒక తాడు సహాయంతో సముద్రంలో ఓడ ప్రక్కనే ఉన్న పడవలోని ప్రీస్ట్‌ని ఓడలోకి లాగాడు. ఆ తరువాత ఆ ఓడ క్షేమంగా ప్రయాణించి తాను చేరవలసిన ప్రదేశానికి చేరుకున్నది. (ఈ సంఘటన జరిగినప్పుడు ఆ ఓడలోనే ఉన్న ఒకవ్యక్తి ఆ తరువాత కాలంలో ఈ సంఘటన గురించి తన గ్రంధంలో వ్రాసాడు.)



## 4. మరణానంతర జీవితంపై జిప్సీల విశ్వాసాలు?

ప్రపంచంలోని చాలా దేశాలలో జిప్సీ జాతికి చెందిన ప్రజలు నివసిస్తున్నారు. ఒక విశేషం ఏమంటే, ఈ జాతి వారికి ఒక ప్రత్యేక మత విధానంకాని లేదా దైవంగాని ఉండదు. అయితే, వీళ్ళకి అన్నిరకాల తాంత్రిక సంబంధమైన విశ్వాసాలు ఉన్నాయి. చనిపోయిన వ్యక్తులలో కొందరు దయ్యాలుగా మారతారని, ఆ దయ్యాలు మానవులను పీడిస్తాయని జిప్సీలు బలంగా నమ్ముతారు. అందువల్ల ఒకవ్యక్తి చనిపోయినప్పుడు అతడికి చాలా శ్రద్ధతో అంత్యక్రియలు చెయ్యటం జరుగుతుంది. ఒకవ్యక్తి చనిపోయినప్పుడు అతనియొక్క వస్తువులు కూడా అపవిత్రంగా మారతాయని భావించే జిప్సీలు ఒక వ్యక్తి మృతదేహాన్ని సమాధి చేసేటప్పుడు ఆ వ్యక్తికి చెందిన

అన్ని వస్తువుల్ని ఆ సమాధిలో ఉంచటం జరుగుతుంది. కొన్నిసార్లు ఆ వ్యక్తి పెంచుకున్న కుక్కని లేదా మేకని కూడా ఆ వ్యక్తి మృతదేహంతో పాటు సమాధి చెయ్యటం జరుగుతుంది.

కొన్ని సమయాలలో చనిపోయిన వ్యక్తియొక్క ఆత్మ, అతడి సమాధిలోని అతని మృతదేహంలో ప్రవేశించి, ఆపై ఒక రక్త పిశాచిగా మళ్ళీ సమాజంలోకి రావటం జరుగుతుందని జిప్సీలు భావిస్తారు. అలా తిరిగివచ్చే రక్తపిశాచిని 'ముల్లో' అనే పేరుతో పిలుస్తారు. ఏ పరిస్థితుల్లో ఒకవ్యక్తి మృతదేహం రక్తపిశాచిగా మారుతుందో జిప్సీలయొక్క మత గ్రంధాలలో చెప్పబడి ఉన్నది. అది ఎలాగంటే...

నేలపై లేదా ఒక బల్లపై ఉంచబడిన ఒకవ్యక్తి మృతదేహాన్ని ఒక సర్పం, కుక్క, కోడి, ఎద్దు, గొర్రెపొట్టేలు – అనే ఏదోఒక జీవి దాటినట్లయితే (అనగా ఆ మృతదేహం మీదుగా దూకినట్లయితే) ఆ మృతదేహం తప్పనిసరిగా రక్తపిశాచిగా మారుతుంది.

కోర్కెలు తీరకుండా చనిపోయిన వ్యక్తులు రక్తపిశాచాలుగా మారతారు.

జీవించి ఉండగా అనేక దుర్మార్గ కార్యాలు, పాపాలు చేసినవాళ్ళు – చనిపోయిన తరువాత రక్తపిశాచాలుగా మారతారు.

బ్రతికి ఉండగా, తొందరగా గాయాలు తగ్గని శరీరాలు కలవాళ్ళు మరణించిన తరువాత రక్తపిశాచాలుగా మారతారు.

ఇతరులచేత వంచనకు లేదా దౌర్జన్యానికి గురై మరణించిన వ్యక్తులు కూడా రక్తపిశాచాలుగా మారతారు. ఈ రక్తపిశాచాలు – చూడటానికి మంచుతో ఏర్పడిన మానవ ఆకారాలులాగా కనిపిస్తాయి.

బ్రతికి ఉండగా విపరీతమైన స్త్రీ వ్యామోహం కలిగిన పురుషులు చనిపోయిన తరువాత అతి భయంకరమైన రక్త పిశాచాలుగా మారతారు. అలా మారిన తరువాత కూడా వారిలో కామవాంఛ చావదు. అందువలన వాళ్ళు, తమకు దొరికిన స్త్రీలను బలవంతంగా అనుభవించి ఆపై వాళ్ళ రక్తం త్రాగివెయ్యటం జరుగుతుంది.

సమాధి చెయ్యటానికి ముందు ఉబ్బిపోయిన మృతదేహాలు కూడా రక్తపిశాచాలుగా మారతాయి.

కారణం ఏదైనప్పటికీ, 'ముల్లో' అనే రక్త పిశాచిగా మారిన ప్రేతాత్మ అతి భయంకరమైన స్వభావాన్ని కలిగి ఉంటుంది. దీనిలో ద్వేషం, ప్రతీకార వాంఛ, విపరీతమైన ఆగ్రహం చెలరేగుతూ ఉంటాయి. అందువలన, ఏ మృతదేహమూ ముల్లోగా మారకుండా ఉండటానికి జిప్సీలు తమకు వీలైనన్ని ప్రయత్నాలు చేస్తారు.

ఇంకొక విశేషం ఏమంటే, ఈ ముల్లోలు విపరీతమైన కామవాంఛను కలిగి ఉంటాయి. అందువల్ల ఈ ముల్లోలు మానవ స్త్రీలను లేదా పురుషులను అప్పుడప్పుడూ అనుభవించటం జరుగుతుంది. తనను, ఒక ముల్లో అనుభవించింది అన్న విషయాన్ని ఒక స్త్రీ లేదా పురుషుడు, ఆ విషయాన్ని ఎవరికైనా చెబితే ముల్లో, వాళ్ళని తప్పనిసరిగా చంపివేస్తుందని జిప్సీలు విశ్వసిస్తారు.

వివాహం అయిన ఒకవ్యక్తి మరణించి, ఆపై ముల్లోగా మారినట్లయితే ఆ వ్యక్తి మృతదేహాన్ని సమాధి చేసిన 7వ రోజు రాత్రి ముల్లో తన భార్య వద్దకువచ్చి ఆమెను అనుభవిస్తుందని చెబుతారు. ఒకవేళ, పెళ్ళికాకుండా మరణించిన పురుషుడు ముల్లోగా మారినట్లయితే ఆ ముల్లో 7వ రోజు రాత్రి ఏదో ఒక అందమైన స్త్రీని లేదా భర్త చనిపోయిన స్త్రీని సమీపించి ఆమెతో సంభోగం జరుపుతుంది.

ఒక జిప్సీ స్త్రీకి మరియు ఒక ముల్లోకి జన్మించిన బిడ్డలకు ముల్లోలను అనగా రక్తపిశాచాలను చంపగలిగే శక్తి ఉంటుందని భావిస్తారు. అంతేకాకుండా, చాలా సమయాలలో అదృశ్య రూపంలో ఉండే ముల్లోలను కళ్ళారా చూడగలిగే శక్తి కూడా ఈ బిడ్డలకు ఉంటుంది.

ఐరోపా ఖండంలోని దక్షిణ యుగోస్లేవియా మరియు అల్బేనియా ప్రాంతాలలో నివసించే సాంప్రదాయ జిప్సీలు, తమకు సంబంధించిన వ్యక్తులు తీవ్రమైన వ్యాధితో చనిపోయినప్పుడు ఒక ప్రత్యేకమైన ఆచారాన్ని పాటిస్తారు. అది ఏమిటంటే, తమకు సంబంధించిన ఒకవ్యక్తియొక్క మృతదేహం దగ్గర ఒక గ్లాసును ఉంచి, ఆ గ్లాసులో బ్రాందీని కాని, వైన్‌ని గాని నింపుతారు. ఇక, దాని ప్రక్కనే ఇంకొక గ్లాసును ఉంచి దాంట్లో బ్రెడ్ ముక్కలు మరియు ఉప్పు ఉంచుతారు. ఆపై, దాని ప్రక్కన ఇంకో గ్లాసును ఉంచి దాని నిండా నీళ్ళు పోస్తారు. మర్నాడు ఉదయం ఆ మృతదేహాన్ని సమాధి చెయ్యటానికి వాళ్ళు సిద్ధపడుతున్న సమయంలో, నిన్న రాత్రి ఉంచిన మూడు గ్లాసులను పరిశీలిస్తారు. ఆ మూడు గ్లాసులలో ఉంచిన పదార్థాలు మాయం

అయిపోయినట్లయితే చనిపోయిన వ్యక్తి రక్తపిశాచిగా మారినట్లుగా నిర్ణయిస్తారు.

రక్తపిశాచాలకు కూడా అధిపతి అయిన ఒక దైవం ఉంటాడని జిప్సీలు నమ్ముతారు. అందువలన, ఎవరైనా వ్యక్తి, రక్తపిశాచిగా మారినప్పుడు ఆ రక్తపిశాచియొక్క ఆత్మశాంతికోసం జిప్సీలు, అన్నం ముద్దలను మరియు చిన్న పాత్రలో రక్తాన్ని లేదా పాలును ఆ రక్తపిశాచాల దైవానికి నైవేద్యంగా పెడతారు.



# 5. కుక్కలకు అదృశ్యశక్తులను చూసే శక్తి ఉంటుందా?

ఈ ప్రపంచంలోని చాలా ప్రదేశాల్లో కనపడే జంతువు కుక్క. సాధారణంగా కుక్క, సాధు జీవిగానే ఉంటుంది. ఆ కారణంగానే, దాన్ని పెంపుడు జంతువుగా చేసుకోవటం జరిగింది. కుక్కకి తన యజమానిపట్ల ఎంతో విశ్వాసం ఉంటుందని చెబుతారు. కుక్కవల్ల దాని యజమానికి చాలాసార్లు అనేక విషయాల్లో రక్షణ కలిగినట్లుగా తెలుస్తున్నది. అయితే, ఈ కుక్కలకు అదృశ్య రూపంలో ఉండే పిశాచాలను చూసే శక్తి ఉన్నదని అనాది కాలం నుండి నమ్ముతున్నారు. మనిషి భౌతిక నేత్రాలకు కనపడని ప్రేతాత్మలు మరియు కొన్ని నకారాత్మక శక్తులు (నెగటివ్ ఎనర్జీస్) కుక్కల కళ్ళకు చాలా స్పష్టంగా కనిపిస్తాయి. ఇంకొక విశేషం ఏమంటే, 'మృత్యుదేవత' అని పిలువబడే ఒక అతి భయంకరమైన శక్తిని చూడగలిగే శక్తి కుక్కలకు ఉన్నది. ఏ ఇంట్లో అయినా ఒక వ్యక్తికి మరణం సంభవించబోతున్న సమయంలో ఆ ఇంటి సమీపంలో మృత్యుదేవత సంచరిస్తుంది. ఆ మృత్యుదేవతను చూసిన కుక్క, తీవ్రమైన భయభ్రాంతులకుగురై రోదించటం జరుగుతుంది. ఇక్కడ, మనం గ్రహించాల్సిన ఒక ముఖ్య విషయం ఏమంటే, దయ్యాలు, భూతాలు లాంటి తక్కువస్థాయి శక్తులు కనపడినప్పుడు కుక్కలు వికృతంగా అరుస్తాయి. అదే, మృత్యుదేవత లాంటి అసాధారణమైన శక్తి కనిపించినప్పుడు అవి ఏడుస్తాయి లేదా రోదిస్తాయి. ఆ కారణంగానే, పూర్వకాలంలో ఏ గ్రామంలో అయినా కుక్కలు - అకారణంగా ఏడుస్తూ ఉంటే ఆ గ్రామంలో ఎవరో ఒక వ్యక్తి, అతి తక్కువ కాలంలో మరణించబోతున్నాడని భావించేవాళ్ళు. ఆ విశ్వాసం ఈనాటికీ ప్రపంచంలోని చాలా దేశాల్లో ప్రచారంలో ఉండటం విశేషం.

ఇంకొక విశేషం ఏమంటే, కుక్కలకు జరగబోయే విషయాలను ముందుగా తెలుసుకునే శక్తి ఉంటుంది. అయితే, కొన్ని జాతుల కుక్కల్లో మాత్రమే ఈ దివ్యదృష్టి ప్రదర్శితమవుతూ ఉంటుంది. కొంతకాలం క్రితం అమెరికాలో ఒక పరిశోధన జరిగింది. ఆ పరిశోధనలో భాగంగా కొంతమంది పరిశోధకులు, దాదాపు వెయ్యిమంది కుక్కల యజమానులకు ఫోన్‌చేసి వారియొక్క కుక్కల దివ్యదృష్టికి సంబంధించిన సమాచారాన్ని చెప్పమని అభ్యర్థించారు. ఆ సందర్భంలో దాదాపు 47%మంది కుక్కల యజమానులు ఇలా చెప్పారు. "మాకు, ఏదో ఒక చెడు జరగబోటానికి కొద్ది గంటల ముందుగానే మా కుక్కలు విచిత్రంగా మొరగటం లేదా మా దగ్గరకు వచ్చి మమ్మల్ని నాకుతూ ఆందోళనగా ప్రవర్తించటం లాంటివి జరిగాయి. అవి, ఎందుకు ఇలా అకారణంగా చేస్తున్నాయో? మాకు మొదట్లో అర్థంకాలేదు. కానీ, కొద్ది గంటల తరువాత మాకు ఎదురైన ప్రమాదాలను లేదా కష్టాలను బట్టి, కొంతసేపటి క్రితం మా కుక్కలు ఎందుకలా ప్రవర్తించాయో మాకు స్పష్టంగా అర్థమయ్యింది".

ఇంకొక విచిత్రం ఏమంటే, ఏదైనా ప్రమాదం వస్తుంది అని ముందుగానే తెలిసినప్పుడు అది, ఏదైనా ఇరుకు ప్రదేశంలోకి వెళ్ళి దాక్కోవటం, స్వరాన్ని తగ్గించి కుయ్, కుయ్ మని చిన్నగా మొరగటం లాంటివి జరుగుతుంది. ఇంకొక విశేషం ఏమంటే, కొంతమంది వ్యక్తులు తమ పెంపుడు కుక్కను తీసుకుని కొన్ని ప్రదేశాల మీదుగా నడిచి వెళుతున్నప్పుడు కుక్కలు అకారణంగా మొరగటం జరిగింది. అందుకు కారణం, ఆయా ప్రదేశాలలో ఆ కుక్కలకు కనపడిన ప్రేతాత్మలే అని గుర్తించాలి.

**సముద్రతీరంలో ప్రేతాత్మ :**

దాదాపు మూడు దశాబ్దాల క్రితం, కేరళలోని సముద్ర తీరంలో ఉన్న ఒక మధ్యస్థాయి పట్టణంలోని ఒక ప్రైవేటు కాలేజీలో మాథమెటిక్స్ లెక్చరర్‌గా పనిచేస్తున్న చంద్రమీనన్‌కి ఆ పట్టణ పొలిమేరల్లో ఒక మంచి ఇల్లు దొరికింది. ఆ ఇంటికి దగ్గరలో ఒక చెరువు ఉన్నది. అప్పటికి ఆ పట్టణంలో రియల్‌ఎస్టేట్ వ్యాపారం పూర్తిగా వికసించలేదు. అందువల్ల, తక్కువ ధరలోనే అతనికి నచ్చిన మంచి ఇల్లు దొరికింది. విశేషం ఏమంటే, ఆ ఇంటికి కొంచెం దూరంలోనే అతను పనిచేసే కాలేజీ కూడా ఉన్నది. చంద్రమీనన్ దగ్గర – చాలా చురుకుగా మరియు బలంగా ఉండే ఒక కుక్క ఉండేది. దానిపేరు 'లామ్‌డా'. వాతావరణం ప్రశాంతంగా ఉన్నప్పుడు చంద్రమీనన్ తన కుక్కతో కలిసి అక్కడకు దగ్గరలో ఉన్న అనేక ఏకాంత

ప్రదేశాలకు వెళ్ళివస్తూ ఉండేవాడు. లామ్‌డా కూడా చంద్రమీనన్‌తో కలిసి షికార్లు చెయ్యటానికి ఎంతో ఇష్టపడుతూ ఉండేది.

ఒక సమయంలో చంద్రమీనన్, ఆ పట్టణానికి చెందిన సముద్ర తీరంలో తన కుక్కతో కలిసి నడుస్తున్నప్పుడు హఠాత్తుగా ఆ కుక్క బీచ్‌కి కొన్ని అడుగుల దూరంలో ఉన్న ఒక పొదవైపుచూసి 'గుర్, గుర్' మని మొరగటం ప్రారంభించింది. కొంతసేపు అలా మొరిగిన ఆ కుక్క హఠాత్తుగా పైకి ఎగిరి చంద్రమీనన్ లాల్చీ కొసల్ని తన నోటితో పట్టుకుని, ఆపై, అతడిని ఆ పొద దగ్గర నుండి కొన్ని అడుగుల దూరం వరకు బలవంతంగా లాక్కుంటూ వెళ్ళింది. దోవలో కనపడిన ఒక పొదనుచూసి తన పెంపుడు కుక్క అలా విచిత్రంగా మొరగటం మరియు తన లాల్చీ పట్టుకుని అక్కడ నుండి దూరంగా లాక్కు వెళ్ళటం చంద్రమీనన్‌కి చాలా ఆశ్చర్యాన్ని, అంతకు మించిన కుతూహలాన్ని కలిగించాయి. "అందుకు కారణం ఏమిటో?" తెలుసుకోవాలని చంద్రమీనన్, రెండు మూడు రోజుల పాటు ఆ ప్రాంతంలోనే తిరిగి, అక్కడ కనిపించిన వాళ్ళని ఆ పొదకు సంబంధించిన విశేషం గురించి ప్రశ్నించాడు. చివరికి మూడవ రోజున ఒక వృద్ధుడు ఆ మార్గంలో కనిపించినప్పుడు చంద్రమీనన్ ఎప్పటిలాగానే ఆ వృద్ధుడిని కూడా అక్కడ ఉన్న పొద గురించి ప్రశ్నించాడు. అప్పుడు ఆ వృద్ధుడు ఒకసారి చంద్రమీనన్ వైపు పరిశీలనగా చూసి, ఆపై చంద్రమీనన్‌తో ఇలా అన్నాడు. "దాదాపు 15 రోజుల క్రితం ఒక స్టూడెంట్ ఆ పొద దగ్గర చచ్చి పడి ఉన్నాడు. అతడు ఎవరిచేతైనా చంప బడ్డాడా? లేదా అక్కడ ఆత్మహత్య చేసుకున్నాడా? అన్న విషయం ఇంతవరకు ఎవరికీ తెలియలేదు". (అక్కడ చనిపోయిన ఆ స్టూడెంట్ ఆత్మ కొద్దిరోజుల పాటు ఆ పొదను ఆవహించి ఉన్నది. ఆ ఆత్మను చంద్రమీనన్‌యొక్క పెంపుడు కుక్క చూసింది. అందువల్లే అది ఆ ఆత్మను చూసిన భయంతో అరిచింది అన్నమాట.)



## 6. ఫిలిప్పైన్స్ దేశంలో నేటికీ సంచరిస్తున్న 'అశ్వాంగ్' పిశాచాల విశేషాలు?

అనేక దీవులతో ఏర్పడిన దేశం ఫిలిప్పైన్స్. గతంలో, ఆ దేశంలో మంత్ర, తంత్రాలను, భూత, ప్రేతాలను నమ్మే విగ్రహారాధకులు అత్యధిక సంఖ్యలో ఉండే

వాళ్ళు. కాలక్రమంలో ఫిలిప్పైన్స్ దేశంలో క్రైస్తవ మతం బాగా ప్రచారంలోకి వచ్చింది. ఆ మత ప్రచారం కారణంగా, ఆ దేశ ప్రజలలో దయ్యాలకు, భూతాలకు సంబంధించిన నమ్మకాలు చాలావరకు తొలగిపోయాయి. అయితే, 'అశ్వాంగ్' అనే ఒక అమానుష శక్తి, కొన్ని వందల సంవత్సరాల నుండి ఫిలిప్పైన్స్ దీవులలోని అనేక ప్రాంతాలలో అప్పుడప్పుడూ కనిపించటం మరియు మనుషుల్ని చంపుకుని తినటం జరుగుతున్నది. అశ్వాంగ్ అంటే ఒకే ఒక పిశాచి కాదు. అవి చాలా సంఖ్యలో ఉంటాయని గుర్తించాలి.



ఐరోపా ఖండంలోని స్పెయిన్ దేశస్తులు కొన్ని వందల సంవత్సరాల క్రితం ఫిలిప్పైన్స్ దేశంలోకి ప్రవేశించి, ఆ దేశంలోని విగ్రహారాధకులైన ఆటవిక ప్రజల్ని జయించి ఆ దేశంపై తమ అధికారాన్ని స్థాపించారు. ఆ తరువాత కాలంలో స్పెయిన్ నుండి ఫిలిప్పైన్స్ దేశానికి స్వతంత్రం లభించింది అన్నమాట వేరే విషయం. ఏది ఏమైనా, క్రైస్తవ మతస్థులు మరియు సైన్స్‌ని నేర్చుకున్న స్పెయిన్ దేశస్తులకు ఫిలిప్పైన్స్ దేశంలోని అరణ్యాలలో, నిర్మానుష్య ప్రాంతాలలో అశ్వాంగ్‌లు కనిపించాయి. కొంతమంది స్పెయిన్ అధికారులు ఈ అశ్వాంగ్‌ల కారణంగా ప్రాణాలు కోల్పోవటం కూడా జరిగింది.

ఫిలిప్పైన్స్‌లో ఆధునిక ఆంగ్ల విద్యను అభ్యసించిన అనేకమంది ఆధునికులు కూడా తమ జీవితకాలంలో ఏదోఒక సమయంలో అశ్వాంగ్ అనే పిశాచికి సంబంధించిన వృత్తాంతాలను వినటం జరిగింది. అలాగే 'దేవుడు లేడు–దయ్యం లేదు' అని బలంగా నమ్మే అనేకమంది హేతువాదులు కూడా తమ జీవితంలో ఏదోఒక సందర్భంలో – ఫిలిప్పైన్స్ దేశంలోని ఏదోఒక ప్రదేశంలో అశ్వాంగ్‌ని తమ కళ్ళారా చూడటం జరిగింది. "ఫిలిప్పైన్స్" దేశంగా పరిగణించబడే వేలాది దీవులలో దాదాపు అన్నిచోట్లా అశ్వాంగ్‌లు ఉన్నట్లుగా గుర్తించారు. అయితే, ఆ దేశంలోని

లోకోస్ అనే ఒక్క ప్రాంతంలో మాత్రమే ఇప్పటివరకు అశ్వాంగ్‌ల ఉనికి బైటపడలేదని చెబుతారు. అనేక ఆధారాలు ఉన్న కారణంగానే, ఫిలిప్పైన్స్ దేశంలో అశ్వాంగ్ అనే క్షుద్రశక్తులు లేదా పిశాచాలు ఈనాటికీ సంచరిస్తున్నాయి అని పాశ్చాత్య దేశాలకు చెందిన పారాసైకాలజిస్టులు నిర్ధారిస్తున్నారు. అంతేకాదు – అమెరికా, స్పెయిన్, ఫ్రాన్స్ దేశాలకు చెందిన కొందరు పారాసైకాలజిస్టులు ప్రత్యేకంగా ఫిలిప్పైన్స్‌కి చేరుకుని, అక్కడ కొన్నాళ్ళు ఉండి, "అశ్వాంగ్‌లు నిజంగా ఉన్నాయని" ఉద్ఘాటించారు. అసలు, ఈ అశ్వాంగ్‌లు ఎలా ఉంటాయి?, వీటి ప్రవర్తన ఎలా ఉంటుంది? – అన్న విషయాలు తెలుసుకుందాం...

ఒక విశేషం ఏమంటే, ఈ అశ్వాంగ్ అనే ఫిలిప్పైన్ భాషా పదం, భారతదేశానికి చెందిన 'అసుర' అనే సంస్కృత భాషాపదం నుండి పుట్టింది. 'అసుర' అనగా భూతం లేదా పిశాచి అని అర్థం. బహుశా, 'అశ్వాంగ్' అన్నా 'భూతం' అనే అర్థం చేసుకోవచ్చు. చూడటానికి కొంతవరకు మానవ రూపంలో ఉండే అశ్వాంగ్‌లు, అవసరమైతే తమ రూపాన్ని కోరినవిధంగా మార్చుకోగల "ఇచ్ఛారూపధారణ"శక్తిని కలిగి ఉంటాయని తెలుస్తున్నది. అశ్వాంగ్‌లు, రెండుగా చీలి ఉండే తమ నాలుకల్ని తరచుగా గాలిలో ఆడిస్తూ ఉంటాయి. ఫలితంగా, "టిక్,టిక్,టిక్" అనే శబ్దాలు పుడతాయి. ఆ కారణంగానే కొందరు గ్రామీణ ప్రాంతాల ప్రజలు, అశ్వాంగ్‌లను 'టిక్,టిక్'లు అనే ఇంకొక పేరుతో కూడా పిలుస్తున్నారు.

సాధారణంగా, అశ్వాంగ్ అని పిలువబడే క్షుద్రశక్తి, కొంతవరకు మనిషి ఆకారంలో కనపడుతుంది. దీనికి గబ్బిలానికి ఉన్నట్లుగా ముక్కు ఉంటుంది. దీని శరీరంపై ఉండే చర్మం పాలిపోయి ఉంటుంది. దీని ముఖంలో స్పష్టమైన మానవ లక్షణాలుగాని, జంతు లక్షణాలుగాని కనపడవు. ఒక విశేషం ఏమంటే, దీని కళ్ళు తక్కువ ప్రకాశం ఉన్న బల్బులు లాగా కనిపిస్తాయి. ఈ అశ్వాంగ్‌లకు నోట్లో కోరలు, చేతులకు వంకర తిరిగిన పదునైన గోళ్ళు ఉంటాయి. ఇంకొక విశేషం ఏమంటే, వీటికి త్రాచుపాముకి ఉన్నట్లుగా పొడవైన మరియు రెండుగా చీలిన (ఫోర్క్) నాలుకలు ఉంటాయి. అశ్వాంగ్‌లు తమ నాలుకను మానవుల శరీరాల్లోకి దూర్చి, ఆపై, ఆ శరీరంలో ఉండే మాంసాన్ని ఆ నాలుకతో బైటకు గుంజి ఆరగిస్తాయి. అంతేకాదు, ఇవి తమ నాలుకలతో బరువైన వస్తువులను లేదా రాళ్లను పక్కకి నెట్టివేయగలవు. ఇవి చాలా వేగంగా పరుగెడతాయి. అంతేకాదు, ఎత్తైన గోడలను, చెట్లను నిమిషాలలో ఎక్కేస్తాయి. ఇవి, బల్లులు లాగా ఇంటికప్పు (రూఫింగ్) లోపల

భాగాన్ని తమ కాళ్ళతో మరియు చేతులతో పట్టుకుని, లోపలవైపు ఉన్న ఇంటి కప్పుమీదుగా ప్రాకి వెళ్ళిపోగలవు. ఇన్ని విశేషాలు ఉన్న ఈ అశ్వాంగ్ చాలా తక్కువ బరువు ఉంటుందని చెబుతారు. సాధారణంగా, అశ్వాంగ్‌లు అందమైన స్త్రీ రూపంలో లేదా ఒక వృద్ధుడి రూపంలో మనుషులకు కనిపిస్తాయని గుర్తించాలి. అశ్వాంగ్‌లు కొన్నిసార్లు పందులు, కుక్కలు లాంటి జంతువుల రూపాలతో మనుషుల మధ్యలో తిరగటం జరుగుతుంది. అలా తిరుగుతూ, అవకాశం దొరికినప్పుడు ఏదోఒక మనిషిని పట్టుకుని, ఆపై అతడి రక్తమాంసాలను ఆరగిస్తాయి.

ఫిలిప్పైన్స్ దేశంలో అతిగొప్ప మంత్రవాదిగా గుర్తించబడిన 'డెనియో' అనే ఒక వృద్ధుడు తెలియజేసిన సమాచారం ప్రకారం చూసినట్లయితే, అశ్వాంగ్‌లు చాలా సమయాలలో మానవ సమాజాలలో కలిసిపోయి, ఏదోఒక సాధారణమైన వృత్తిని చేస్తూ ఉంటాయి. ముఖ్యంగా, మాంసానికి సంబంధించిన వ్యాపారాన్ని ఈ అశ్వాంగ్‌లు చేస్తూ ఉంటాయి. సహజంగా, అశ్వాంగ్‌లు మానవ సమూహాలకు దూరంగా ఉండటానికి ఇష్టపడతాయి. అందువల్ల అవి పట్టణాల, గ్రామాల పొలిమేరల్లో ఉండే పాడిపడిన భవనాలలో లేదా కొండల్లో నివసిస్తూ ఉంటాయి. కొన్ని సమయాలలో అవి సాధారణ ప్రజలతో కలిసి ఉన్నప్పటికీ వాటిని కొంచెం పరిశీలనగా చూస్తే ఆ అశ్వాంగ్‌లని గుర్తించవచ్చు. చూడటానికి అశ్వాంగ్‌లు మామూలు మనిషిలాగా కనిపించినప్పటికీ, వాటి కళ్ళు మాత్రం ఎర్రటి రక్తపు రంగులో కనిపిస్తాయి. అలాంటి కళ్ళు మనుషులకు ఉండవు కనుక ఆ కళ్ళు ఉన్న మానవులు, అశ్వాంగ్‌లని తేలిగ్గా గుర్తించవచ్చు.

ఫిలిప్పైన్స్ దేశంలోని కాపిజిలేస్ అనే ప్రాంతంలో నివసించే ప్రజలు, తమను మరియు తమ బిడ్డలను అశ్వాంగ్‌ల బారి నుండి రక్షించుకోవటంకోసం వెల్లుల్లిపాయలను, దైవ సంబంధ విగ్రహాలను మరియు తంత్ర సంబంధమైన తావీజులను విస్తారంగా ఉపయోగిస్తున్నారు. రాళ్ళఉప్పు తగిలితే అశ్వాంగ్‌లు కాలిబూడిద అయిపోతాయి. అందువలన అశ్వాంగ్‌ల సంచారం అధికంగా ఉండే గ్రామీణ ప్రాంతాల ప్రజలు తమ ఇళ్ళచుట్టూ రాళ్ళ ఉప్పును ముగ్గులాగా పోస్తారు. పదునుగా ఉండే వస్తువులన్నా, ఇనుపలోహం అన్నా అశ్వాంగ్‌లకు విపరీతమైన భయం ఉంటుంది. ఎందుకంటే, పదునైన వస్తువులు అశ్వాంగ్ యొక్క ఛాతీలో దిగినట్లయితే అవి అంతటితో నిర్జీవంగా పడిపోతాయి. ఆ కారణంగానే ఫిలిప్పైన్స్ దేశంలోని గ్రామీణ ప్రాంతాలలోని ప్రజలు, వెదురు కర్ర చివరి భాగాన్ని ఒక

ములుకు లాగా చెక్కి ఆపై ఆ కర్రను తమవెంట తీసుకువెళుతూ ఉంటారు. ములికి ఉన్న ఆ వెదురు కర్రను చూసిన అశ్వాంగ్‌లు, ఆ కర్రలు కలిగిన ఉన్న వ్యక్తుల వద్దకు వెళ్ళటానికి సాహసించవు. కొన్ని అశ్వాంగ్‌లు, మంచంలో పడి ఉండే దీర్ఘరోగులు, కొద్దిసేపటి క్రితం చనిపోయిన వ్యక్తియొక్క మృతదేహాలు, పాడిపశువుల యొక్క రక్తాన్ని తమ ఆహారంగా తీసుకుంటాయని చెబుతారు. ఫిలిప్పైన్స్ దేశంలోని వివిధ ప్రాంతాలలో అశ్వాంగ్‌లు నిజంగా కనిపించిన అనేక ఉదంతాలు జరిగాయి. అలాంటి వాటిలో కొన్నింటిని గురించి ఇక్కడ తెలుసుకుందాం.

**గర్భస్థ శిశువులను ఆరగించే అశ్వాంగ్‌లు :**

అశ్వాంగ్‌లు మానవుల, జంతువుల రక్తమాంసాలను ఆహారంగా తీసుకునే మాట వాస్తవం అయినప్పటికీ అవి, మానవ స్త్రీల గర్భాలలో ఉండే శిశువులను ఎంతో ఇష్టంగా ఆరగిస్తాయని తెలుస్తున్నది. అర్ధరాత్రి దాటిన తరువాత అశ్వాంగ్‌లు తమ ఆహార సంపాదనకోసం బయలుదేరతాయి. అలా వెళ్ళే అశ్వాంగ్‌కి దోవలో ఏ గృహంలో అయినా గర్భిణీ స్త్రీ ఉన్నట్లయితే, ఒక ప్రత్యేకమైన వాసన ఆ గృహంలోంచి రావటం తెలుస్తుంది. ఆపై, అది ఆ ఇంటి కప్పు పైభాగం నుండి నేరుగా – ఆ గృహిణి పడుకుని ఉండే మంచం దగ్గరకు లేదా పడక దగ్గరకు చేరుకుంటుంది. అశ్వాంగ్, తమ ప్రక్కనే ఉన్న సమయంలో గర్భిణీ స్త్రీలు గాఢ నిద్రలోకి జారుకోవటం లేదా ఒక విధమైన మైకంలోకి వెళ్ళటం జరుగుతుంది.



అప్పుడు అశ్వాంగ్ తన నాలుకను ఆ గర్భిణీ స్త్రీయొక్క పొట్టమీద ఉంచి ఆపై దానిని ఆమె గర్భ సంచిలోకి పంపిస్తుంది. ఆ గర్భ సంచిలో శిశువు చుట్టూ ఆవరించి

ఉండే "ఉమ్మినీరు"ను తన నాలుకతో జుర్రుకుని, ఆపై చాలా నేర్పుగా ఆ గర్భసంచిలోని శిశువును బైటికి లాగేసి అక్కడ నుంచి ఆ శిశువుతో సహా వెళ్ళిపోతుంది. ఆ తరువాత ఆ శిశువును ఆహారంగా తీసుకుంటుంది. కొన్ని సమయాలలో అశ్వాంగ్‌లు, గర్భిణీ స్త్రీల పొట్టల్లోకి తమ నాలుకను పంపించిన సమయంలో ఎవరైనా మనుషులు అక్కడకు వచ్చినట్లయితే, అశ్వాంగ్‌లు ఆ మనుషుల బారి నుండి తప్పించుకోవటానికి అక్కడ నుండి పారిపోతాయి. కానీ, అప్పటికే అశ్వాంగ్ తన నాలుకను ఆ గర్భిణీ స్త్రీయొక్క పొట్టలోకి దించిన కారణంగా ఆ స్త్రీ, గర్భసంచిలో ఉన్న శిశువు చనిపోవటం జరుగుతుంది. కొన్ని సమయాలలో గర్భిణీ స్త్రీల గర్భసంచిలోని పిండాలు, అశ్వాంగ్‌లయొక్క నాలుకల పోటు కారణంగా విచ్ఛిన్నం చెందిపోతాయి. ఫలితంగా ఆ గర్భిణీ స్త్రీలకు గర్భస్రావాలు అవుతాయి.

కొంతమంది ఫిలిప్పైన్స్ మంత్రవాదుల అభిప్రాయం ప్రకారం చూసినట్లయితే, సాధారణంగా మానవ స్త్రీలు మాత్రమే అశ్వాంగ్‌లుగా మారతాయి. ఒక స్త్రీ, అశ్వాంగ్‌గా మారిన తరువాత ఆమెకు పుట్టే పెద్ద కొడుకు, తన భార్య కడుపున ఉన్న మొదటి శిశువును అశ్వాంగ్ అయిన తన తల్లికి సమర్పిస్తాడు. అనగా, ఆడ అశ్వాంగ్ తన కోడలి గర్భంలో ఉన్న మొదటి శిశువును ఆహారంగా తీసుకుంటుంది అన్నమాట. ఇలా జరగటానికి కారణం ఏమంటే, తన కుమారుడి తొలి సంతానమైన శిశువును ఆహారంగా తీసుకునే అశ్వాంగ్‌కి ఒక వంద సంవత్సరాల ఆయుర్దాయం అధికంగా అభిస్తుంది. ఇతరుల శిశువుల్ని తీసుకోవటం వల్ల వాటికి ఆకలి తీరుతుందేగాని, ఆయుర్దాయం పెరగదని గుర్తించాలి.

**అశ్వాంగ్‌లకు సంబంధించిన ఒక యదార్థ వృత్తాంతం :**

ఫిలిప్పైన్ దేశ రాజధాని అయిన మనీలా నగరంలో షిజా అనే పేరుగల ఒక 20 సంవత్సరాల అమ్మాయి ఉండేది. ఫిలిప్పైన్స్ దేశంలోని విసియాస్ ప్రాంతంలో ఉన్న బారియో పట్టణంలో ఆమె అక్క తన అత్త మామలతో కలిసి నివసిస్తూ ఉంటుంది. ఒక వేసవికాలం షిజా, తన అక్కగారి ఇంట్లో గడపాలని నిర్ణయించుకున్నది. అయితే, దురదృష్టవశాత్తు 6 నెలల క్రితం ఆ అమ్మాయి యొక్క అక్కయ్య మరణించింది. ఏదిఏమైనా, షిజా ఆ వేసవికాలం బారియోకి వెళ్ళి, ఆపై అక్కడ ఉన్న తన అక్కయ్య సమాధి మీద పూలు ఉంచి, ఆ తరువాత తన అక్కయ్య యొక్క అత్త మామలను, అక్క కూతురు లిజాను పలకరించి, ఆపై కొద్ది రోజులు వాళ్ళ దగ్గరే ఉండి రావాలని నిర్ణయించుకున్నది. ఆపై, షిజా తన అక్కయొక్క

అత్తమామలు ఉంటున్న 'బారియో' పట్టణానికి వెళ్ళింది. ఆ అత్తమామలు ఆ అమ్మాయినిచూసి ఎంతో సంతోషించి ఆమెకు ఎంతో మర్యాదలు చేసారు. ముఖ్యంగా, షిజా అక్క కూతురు అయిన లిజా ఆ అమ్మాయినిచూసి ఎంతగానో సంతోషించింది. ఒక విశేషం ఏమంటే, షిజాకు మరియు ఆమె అక్కకు వయస్సులో చాలా తేడా ఉన్నది. అందువలన ఆమె అక్క కూతురు లిజా మరియు షిజా దాదాపు ఒకే వయస్సువాళ్ళుగా ఉన్నారు.

ఏదిఏమైనా షిజా, మనీలా నగరంలో ఉంటుంది కనుక, ఆమె వస్త్రధారణ అత్యాధునికంగా ఉంటుంది. ఇక, బారియో పట్టణంలోని ప్రజలు, సాంప్రదాయ దుస్తులను ధరిస్తారు. ఏదిఏమైనా, మనీలాకు చెందిన షిజా – వేషభాషలు, దుస్తులు ధరించిన తీరు కారణంగా షిజా తన అక్కయ్య అత్తవారింట్లో ఒక ప్రత్యేక గౌరవం లభించింది. షిజా ఆ ఇంటికి వెళ్ళిన రెండు రోజులపాటు ఆమె అక్కడ విషయాలు ఏమీ పట్టించుకోలేదు. ఆ తరువాత అక్కడవాళ్ళ ప్రవర్తన ఎలా ఉంది? అన్న విషయాన్ని పరిశీలించటం మొదలుపెట్టింది షిజా. ఆ ఇంట్లోని వాళ్ళు, రోజంతా ఆమెతో చాలా మర్యాదగా ఉండి, ఆమెకు కావలసినవి అన్నీ ఇస్తూ ఉంటారు. అయితే, వాళ్ళు ఎవరూ కూడా షిజా కళ్ళల్లో కళ్ళుపెట్టి చూసే వాళ్ళు కాదు. అంతేకాదు, ఆమె బావగారు (చనిపోయిన ఆమె అక్క భర్త) కూడా ఆమె ముఖంలోకి కళ్ళుపెట్టి చూసేవాడు కాదు. వాళ్ళ ప్రవర్తన ఎందుకు అంత విచిత్రంగా ఉన్నదో?, ఆ అమ్మాయికి అర్ధం కాలేదు. అయితే, ఆ అమ్మాయి అక్కయ్య కూతురు అయిన లిజా మాత్రం ఆమెతో చాలా దగ్గరగా ఉండి, ఆప్యాయంగా ప్రవర్తిస్తూ ఉండేది. దాంతో ఆ అమ్మాయికి ఆ ఇంట్లోని ఇతర వ్యక్తులయొక్క ప్రవర్తన గురించి అంతగా ఆలోచించాల్సిన అవసరం ఉండేదికాదు.

ఇక, చిన్న పట్టణం అయిన బారియోలో రాత్రి అయితే చాలు, ప్రతి వాళ్ళు చాలా తొందరగా రాత్రి భోజనాలు ముగించుకుని, తలుపులు మూసుకుని నిద్రపోయేవాళ్ళు. ఇక, షిజా అక్కయ్యయొక్క అత్తమామలు, రాత్రికాగానే ఆ అమ్మాయిని తీక్షణంగా చూస్తూ ఉండేవాళ్ళు. అయితే, ఆ అమ్మాయి అవేమీ పట్టించుకోకుండా తన అక్క కూతురు లిజాతో కలిసి తన పడక గదిలో కబుర్లు చెప్పుకుంటూ పడుకునేది. ఆ ఇల్లు అంత పెద్దది కాకపోవటంవల్ల షిజాకి ఆ ఇంట్లో వేరే గది ఇవ్వటం కుదరలేదు. అందువల్ల, షిజా తన అక్క కూతురు లిజాతో కలిసి ఒకే గదిలో

ఉండేది. ఒకరోజు రాత్రి లిజా, షిజాతో ఇలా అన్నది. “పిన్నీ! ఈ రోజు రాత్రి అందరూ పడుకున్న తరువాత నేను, నువ్వు పెట్టుకున్న చెవి రింగులు, నక్లెస్, గాజులు, ఉంగరాలు తీసుకుని నేను కూడా ఒకసారి పెట్టుకుని చూస్తాను ఏమంటావ్?” షిజా చిన్నగా నవ్వి ‘సరే’ అన్నది. ఆ తరువాత ఆ ఇంట్లోని అన్ని గదుల్లోని లైట్లు ఆర్పివేయబడ్డాయి.

సరిగ్గా అర్ధరాత్రి సమయంలో ఆ ఇంట్లో ఏ మూల నుండో ఎవరో గుస గుసగా మాట్లాడుకున్నట్లుగా వినిపించింది షిజాకి. అంతేకాదు, షిజాకి ఆ ఇంట్లో ఏదో మూల నుండి మాంసం కుళ్ళిపోయిన దారుణమైన వాసన వస్తున్నది. తాను ఉన్న గదిలోకి ఎవరో వచ్చినట్లుగా అలికిడి వినిపిస్తున్నది. అయితే, షిజా కదలకుండా అలాగే పడుకుని నిద్ర నటిస్తున్నది. ఆ సమయంలో ఆమె గుండె భయంతో మహావేగంగా కొట్టుకుంటున్నది. ఆమె కళ్ళు తెరచి చూచింది. ఆ గది అంతా చీకటిగా ఉన్నప్పటికీ, బైట ఎక్కడ నుంచో చాలా స్వల్పమైన వెలుతురు ఆ గదిలో పడుతున్నది. ఆ వెలుతురులో ఆమెకు ఆ గదిలో ఒక పురుషుడు మరియు ఇద్దరు వయస్సు మళ్ళిన స్త్రీలయొక్క రూపాలు అస్పష్టంగా కనిపిస్తున్నాయి. వాళ్ళు చాలా విభిన్నంగా, విచిత్రంగా ఉన్నట్లుగా షిజాకి అనిపించింది. దాంతో ఆమెకు విపరీతమైన భయంవేసి, ఒక్కసారిగా పెద్దగా అరవాలని ప్రయత్నించింది. అయితే ఆమె నోట్లోంచి ఒక్కమాట కూడా బైటకు రాలేదు. ఆ తరువాత ఆమెకు, ఎవరో ఇద్దరు రహస్యంగా మాట్లాడు కుంటున్నట్లుగా వినిపించింది. ఆ మాటల్లో, తాను ధరించిన ఆభరణాల గురించి, రిస్ట్‌వాచ్ గురించి వినపడింది.

ఆపై, ఎవరో తన మెడను మరియు చేతి మణికట్టు ప్రాంతాన్ని తడిమినట్లుగా షిజాకు అనిపించింది. మరికొంచెంసేపటి తరువాత తన ప్రక్కనే ఉన్న తన అక్క కూతురు లిజాను ఎవరో వ్యక్తి తీసుకుని వెళ్ళిపోయినట్లుగా ఆమెకు అనిపించింది. ఒక అరగంట తరువాత ఎలాగో ధైర్యం తెచ్చుకుని లేచిన షిజా ఆ గదిలోని తన వస్తువుల్ని తీసుకుని, ఆపై ఏమాత్రం ఆలస్యం చెయ్యకుండా ఆ ఇంటి దొడ్డి తలుపు గుండా బైటకువచ్చి, రోడ్డు ఎక్కి ఆపై ఆ పట్టణం చివర ఉన్న బస్టాండ్ దగ్గరకు చేరుకున్నది. ఆ తరువాత ఒక గంటకే ఆ పట్టణం మీదుగా మనీలాకు వెళ్ళే నైట్ సర్వీస్ బస్సు వచ్చింది. ఆపై, షిజా ఏమాత్రం ఆలస్యం చెయ్యకుండా ఆ బస్సు ఎక్కి కూర్చున్నది. మరుక్షణమే ఆ బస్సు, మనీలావైపు పరుగులు తీసింది. తెల్లవారింది. బారియా పట్టణంలో ఒక వార్త కార్చిచ్చులాగా వ్యాపించింది. అది ఏమిటంటే...

ఆ పట్టణ పొలిమేరల్లో ఉన్న ఒక పాతకాలంనాటి మర్రిచెట్టుక్రింద దాదాపు 20 సంవత్సరాల వయస్సు ఉన్న ఒక యువతి మృతదేహం కనపడింది. ఆ మృతదేహంపైన విలువైన బంగారు ఆభరణాలు, రిస్ట్‌వాచి ఉన్నాయి. ఆ దేహం లోపలి భాగంలో ఉండాల్సిన ఏ అవయవాలూ లేవు. కొంచెం మాంసంకూడా లోపల లేదు. కొన్ని అశ్వాంగ్‌లు నిన్న అర్ధరాత్రి సమయంలో ఆ అమ్మాయిని చంపి తినేసి ఉంటాయని ఆ ప్రాంతం ప్రజలు భావిస్తున్నారు.

షిజా, మనీలా చేరుకునే సరికి అక్కడ బస్టాండ్‌లో ఆమెకు ఒక న్యూస్ పేపర్ కనపడింది. ఆ న్యూస్ పేపర్‌లో ఈ వార్త ఆ అమ్మాయికి కనపడింది. ఆ న్యూస్ పేపర్‌లో, అశ్వాంగ్‌లచేత చంపి తినివేయబడిన అమ్మాయి ఫోటో కూడా ఈమెకు కనపడింది. ఆ ఫోటోలోని మృతదేహాన్ని మరియు ఆ మృతదేహంపైన ఉన్న బంగారు ఆభరణాలనుచూసి షిజా ఒక్కసారిగా ఉలిక్కిపడింది. కారణం, ఆ మృతదేహం సాక్షాత్తూ ఆమె అక్క కూతురు లిజాది. (షిజా ధరించిన నగలమీద ఆశపడిన ఆమె అక్కకూతురు లిజా ఆ రోజు రాత్రికి ఆ నగలు ధరించి పడుకున్నది. షిజాకి తెలియని విషయం ఏమంటే, షిజా అక్క యొక్క అత్తమామలు మరియు బావగారు కొన్ని కారణాలవల్ల అశ్వాంగ్‌లుగా మారిపోయారు. తమ ఇంటికి వచ్చిన షిజాను వీలుచూసుకుని చంపి తినాలని వాళ్ళు భావించారు. అందుకే, ఆ రోజు అర్ధరాత్రి, వాళ్ళు, లిజా ప్రక్కన పడుకున్న షిజాని ఎత్తుకెళ్ళాలనుకున్నారు. అయితే, షిజాయొక్క ఆభరణాలను లిజా ధరించింది. వాళ్ళు, చీకటిలో ఆ గదిలోకి వచ్చి ఆపై, మంచం మీద పడుకుని ఉన్న షిజా మరియు లిజా శరీరాలను తమ చేతుల్లో తడిమారు. ఆ తడిమినప్పుడు వాళ్ళకి ఆభరణాలు ధరించి ఉన్న లిజా శరీరం తగిలింది. దాంతో వాళ్ళు "లిజా"నే షిజాగా భావించి, ఆ చీకట్లో అక్కడ నుండి లిజాను ఊరు చివరికి తీసుకువెళ్ళి, ఆ చీకటిలోనే ఆ లిజాను చంపి తినేశారు. నిజానికి, షిజా ఆ రోజు రాత్రి తన ఆభరణాలను తన వంటిమీదే ఉంచుకున్నట్లయితే ఆమెనే ఆ కుటుంబ సభ్యులు (అశ్వాంగ్‌లు) ఆమెను చంపి ఉండేవాళ్ళు.

నోట్ : శాపం వల్ల లేదా అశ్వాంగ్‌లు కరవటంవల్ల కొంతమంది మానవులు కూడా అశ్వాంగ్‌లుగా మారిపోతారు. వాళ్ళు, పగటిపూట మామూలు మనుషులులాగా జీవిస్తారు. రాత్రి సమయాలలో భయంకర రూపంగల అశ్వాంగ్‌లుగా మారిపోయి ఆపై, మనుషుల్ని రహస్యంగా పీక్కుతింటారు.

# 7. దశాబ్దాల క్రితం రుమేనియాలో యదార్థంగా జరిగిన ఒక రక్త పిశాచి వృత్తాంతం?

రుమేనియాలోని ఒక గ్రామంలో ఒక కుటుంబానికి చెందిన అమ్మాయి మరియు ఇంకొక కుటుంబానికి చెందిన అబ్బాయి పరస్పరం గాఢంగా ప్రేమించుకున్నారు. అయితే, ఈ విషయం వాళ్ళ పెద్దవాళ్ళకు తెలియదు. ఏదిఏమైనా, కొద్ది రోజులు గడిచిన తరువాత ఆ అబ్బాయి తాను ప్రేమించిన అమ్మాయి ఇంటికివెళ్ళి తాను, వాళ్ళ అమ్మాయిని ప్రేమిస్తున్నానని, తాను ఆమెనే పెళ్ళి చేసుకుంటానని ఆ అమ్మాయి తల్లిదండ్రులకు చాలా వినయంగా చెప్పాడు. అయితే, ఆ అబ్బాయి చాలా పేదవాడు కనుక అటువంటి వాడికి తమ కూతుర్ని ఇవ్వమని ఆ అమ్మాయి తల్లిదండ్రులు నిర్మొహమాటంగా ఆ అబ్బాయికి చెప్పారు. తాను ప్రేమించిన అమ్మాయి తనకు దక్కదని అర్థంచేసుకున్న ఆ అబ్బాయి వెంటనే తన ఇంటికి వచ్చి ఆపై తన ఇంటి వెనక ఉన్న ఒక చెట్టు కొమ్మకి ఉరి వేసుకుని చనిపోయాడు. బలన్మరణం పొందిన ఆ అబ్బాయి ఆ తరువాత కొద్ది రోజులకే ఒక భయంకర రక్త పిశాచిగా (వాంపైర్) మారాడు.

రక్తపిశాచికి తాను కోరిన చోటుకి వెళ్ళగలదు. అయితే, రాత్రిపూట మాత్రమే రక్తపిశాచాలు బైట ప్రపంచంలో సంచరించగలవు. ఇలా రక్తపిశాచిగా మారిన ఆ అబ్బాయి ప్రతిరోజూ రాత్రి సమయంలో తాను ప్రేమించిన అమ్మాయి పడక గదిలోకివెళ్ళి ఆమెను అనుభవించి, ఆపై తెల్లవారుఝాము సమయంలో అక్కడ నుండి బయలుదేరి తన సమాధిలోకి వెళ్ళిపోతూ ఉండేవాడు. తనని, గతంలో ప్రేమించిన ఆ అబ్బాయి ఇప్పుడు రక్తపిశాచిగా మారి, రాత్రి సమయాలలో తనని బలవంతంగా అనుభవించటం ఆ అమ్మాయికి ఏమాత్రం నచ్చలేదు. కొద్ది



రోజులపాటు ఆమె ఎలాగో అతడి బాధను భరించింది. రక్తపిశాచిగా మారిన అతడు చేసే శృంగార కార్యాలకు ఆ అమ్మాయి తట్టుకోలేకపోయింది. అతడి హింసను ఎలాగైనా సరే, తప్పించుకోవాలి అని నిర్ణయించుకున్న ఆమె, మంచి తెలివిగలది అయిన ఒక వృద్ధురాలిని కలుసుకుని ఆమెతో ఆ రక్తపిశాచి తనపై చేస్తున్న లైంగిక దాడి గురించి చెప్పింది. ఆ వృద్ధురాలు చాలా శ్రద్ధగా ఆ అమ్మాయి చెప్పింది విని, ఆపై కొంచెంసేపు ఏదో ఆలోచించి ఆ అమ్మాయితో "బిడ్డా! ఈ సారి ఆ రక్తపిశాచి నీ పడక గదిలోకి వచ్చినప్పుడు ఒక సూదికి ఒక పెద్ద దారపు ఉండని కట్టి, ఆపై ఆ సూదిని ఆ రక్తపిశాచి కోటు చివర గుచ్చు. ఆ రక్తపిశాచి నీ గదిలోంచి నడుచుకుంటూ వెళ్ళేటప్పుడు ఆ దారపు ఉండ విచ్చుకుని ఆ రక్తపిశాచి వెనకాలే వెళుతుంది. ఆ రక్తపిశాచి ఏ సమాధి దాకా వెళుతుందో అక్కడదాకా ఈ దారం ఉంటుంది. ఆ దారం వెంటే వెళ్ళి, దారానికి ఉన్న సూది ఏ సమాధి దగ్గర ఉన్నదో చూసి నాకు చెప్పు. ఆపై ఏం చెయ్యాలో నేను చెబుతా" అన్నది. ఆ వృద్ధురాలు చెప్పిన పథకం ఆ అమ్మాయికి బాగా నచ్చింది. ఎప్పటిలాగానే ఆ రక్తపిశాచి అర్ధరాత్రి దాటిన తరువాత ఆ అమ్మాయి గదిలోకి వచ్చింది. అప్పటికే ఆ అమ్మాయి ఒక పెద్ద దారపు ఉండను తీసుకుని ఆ దారపు ఉండకు ఉన్న దారపు కొసకి సూదిని అమర్చి ఆపై ఆ దారపు ఉండను తన ప్రక్కనే ఉంచుకున్నది. ఆ రక్తపిశాచి తనని అనుభవిస్తున్న సమయంలో ఆ అమ్మాయి చాలా నేర్పుగా తన ప్రక్కనే ఉన్న దారపు ఉండయొక్క సూదిని ఆ రక్తపిశాచి కోటు వెనక అంచుకి జాగ్రత్తగా గుచ్చింది. తెల్లవారుఝాము సమయానికి ఆ రక్తపిశాచి ఆ అమ్మాయి పడకమీద నుండి లేచి మెల్లిగా అడుగులు వేస్తూ తన సమాధివైపు వెళ్ళటం ప్రారంభించింది. ఆ రక్తపిశాచి కోటుకి ఉన్న సూదికి గుచ్చబడిన దారపు ఉండ విచ్చుకుంటూ రక్తపిశాచితోపాటు ముందుకు వెళ్ళింది. రక్తపిశాచి తన సమాధిలోకి వెళ్ళి పడుకున్నది. తెల్లవారిన తరువాత ఆ అమ్మాయి తన మంచానికి కట్టి ఉన్న దారపు ఉండ నుండి విడుదల అయిన దారాన్ని అనుసరిస్తూ నడుచుకుంటూ వెళ్ళింది. చివరికి ఊరుకి ఒక ప్రక్కగా ఉన్న చర్చి వెనకాల వరకు ఆ దారపు ఉండ తాలూకు దారం వెళ్ళింది. అక్కడకు కూడా వెళ్ళి చూసిన ఆ అమ్మాయికి ఆ దారం ఒక సమాధిలోకి ఉన్నట్లుగా కనపడింది. అంటే, చర్చి వెనకాల ఉన్న శ్మశానంలోని సమాధిలో తన ప్రేమికుడి రక్తపిశాచి ఉన్నదని ఆ అమ్మాయికి స్పష్టంగా అర్థమైపోయింది.

మర్నాడు అర్ధరాత్రి కావటానికి ముందే అనగా ఆ రక్తపిశాచి సమాధిలోంచి బైటకు రావటానికి ముందు – ఆ అమ్మాయి ఆ చర్చి వెనకాల ఉన్న శ్మశానంలోకి

ప్రవేశించి, ఆపై అక్కడ ఉన్న ఒక పెద్ద చెట్టు వెనకాల నక్కి, ఎప్పుడెప్పుడు ఆ రక్తపిశాచి తన సమాధిలోంచి బైటకు వస్తుందా? అని ఎదురుచూస్తూ నిలబడింది. ఒక పది నిమిషాలు గడిచిన తరువాత ఆ రక్తపిశాచి తన సమాధిలోంచి బైటకువచ్చి ఆపై, కొద్ది రోజుల క్రితం ఆ శ్మశానంలో సమాధి చేయబడిన ఒక వ్యక్తియొక్క సమాధిని తెరచి, ఆపై అందులో ఉన్న మృతదేహంయొక్క గుండెను తన రెండు చేతులతో బైటకుతీసి కరకరా నమిలి మ్రింగింది. ఆ తరువాత అక్కడ నుంచి ఇవతలికి వచ్చి తన ప్రియురాలు ఉన్న గ్రామంవైపు నిదానంగా అడుగులు వెయ్యటం ప్రారంభించింది.

ఆ అమ్మాయి ఇంకొక అడ్డదోవలో చాలా వేగంగా నడుస్తూ తన ఇంటికి చేరుకున్నది. ఆపై తన పడక గదిలోకి ప్రవేశించింది. అప్పటికే ఆ రక్తపిశాచి ఆ పడక గదిలో ఉన్న మంచం దగ్గర నిలబడి ఆ అమ్మాయికేసి క్రూరంగా చూస్తూ గర గర లాడే స్వరంతో “ఏయ్! ఇప్పటిదాకా ఎక్కడికివెళ్ళావ్? ఏం చూసి వచ్చావ్? నిజం చెప్పు? నిజం చెప్పు?” అన్నాడు. అప్పుడు ఆ అమ్మాయి వణుకుతున్న స్వరంతో “నేను ఎక్కడికీ వెళ్ళలేదు, ఏమీ చూడలేదు” అన్నది. అప్పుడు రక్తపిశాచి ఒకసారి తల విచిత్రంగా ఊపి ఆపై క్రోధంతో కూడిన స్వరంతో “నువ్వు ఎక్కడికి వెళ్ళావో, ఏం చూసావో నాకు తెలుసు. నువ్వు, అక్కడ శ్మశానంలో చూసిన విషయాన్ని ఎవరికైనా చెప్పావంటే నీ తండ్రిని చంపేస్తా” అన్నాడు. అయితే, ఆమె ఆ రక్తపిశాచి చేసిన హెచ్చరికను ఏమాత్రం పట్టించుకోలేదు. రక్తపిశాచి శ్మశానంలో ఏం చేసింది? అన్న విషయాన్ని ఆమె, తనకు సలహా ఇచ్చిన ఆ వృద్ధురాలికి చెప్పేసింది. దివ్యదృష్టి ఉన్న ఆ రక్తపిశాచికి ఆ అమ్మాయి చేసిన పని తెలిసిపోయింది. ఆపై, రెండు రోజులకే ఆ అమ్మాయి తండ్రి చనిపోయాడు. ఆ ఊరి సాంప్రదాయం ప్రకారం ఆ అమ్మాయి తండ్రి మృతదేహాన్ని ఆ ఊరి పొలిమేరల్లో ఉన్న శ్మశానంలో సమాధి చేసారు. ఆమె తండ్రిని సమాధి చేసిన కొద్ది రోజుల వరకు ఆ రక్తపిశాచి, ఆ అమ్మాయి దగ్గరకు రాలేదు.

సరిగ్గా ఒక నెల రోజుల తరువాత ఒక పౌర్ణమి అర్ధరాత్రి ఆ రక్తపిశాచి మళ్ళీ ఆ అమ్మాయి పడక గదిలోకి వచ్చి “ఏయ్! మొన్న ఎక్కడికి వెళ్లావు? ఏం చూసావ్? చెప్పు. నిజం చెప్పకపోతే ఈసారి నీ తల్లి చనిపోతుంది” అన్నాడు. ఈసారి కూడా ఆ అమ్మాయి “నేను ఎక్కడికీ వెళ్ళలేదు. ఏమీ చూడలేదు” అన్నది. ఆ రక్త పిశాచి చెప్పినట్లుగానే మరో రెండు రోజులకు ఆ అమ్మాయి తల్లి చనిపోయింది. ఆమె మృతదహం కూడా ఆ శ్మశానంలోనే సమాధి చేయబడింది.

ఆపై, ఒక వారం తరువాత ఒక అర్ధరాత్రి ఆ రక్తపిశాచి ఆ అమ్మాయి పడక గదిలోకివచ్చి “ఆరోజు రాత్రి ఎక్కడికి వెళ్ళావ్? ఏం చూసావ్ చెప్పు?. నిజం చెప్పకపోతే ఈ సారి నువ్వు చనిపోతావ్” అన్నాడు. ఎప్పటిలాగానే ఆమె “నాకేం తెలియదు. నేనేం చూడలేదు” అని గట్టిగా చెప్పింది”. ఆపై ఆ రక్తపిశాచి మరేమీ మాట్లాడకుండా అక్కడ నుండి వెళ్ళిపోయింది. ఆ మర్నాడు ఉదయం ఆ అమ్మాయి ఆ గ్రామంలోని తన బంధువులను అందరినీ ఒకచోట సమావేశపరిచి వాళ్ళతో ఇలా చెప్పింది.

“నేను త్వరలో చనిపోతాను. నేను చనిపోయిన తరువాత నా మృతదేహాన్ని మా ఇంటి తలుపుల మధ్య నుండి బైటకు తీసుకువెళ్ళవొద్దు. మా ఇంటి గోడకి ఒక కన్నం తవ్వి, ఆ కన్నం గుండా నా మృతదేహాన్ని బైటకు తీసుకువెళ్లండి. ఆపై నా మృతదేహాన్ని శ్మశానానికి తీసుకువెళ్ళవొద్దు. మన గ్రామానికి దగ్గరలో ఉన్న అరణ్యంలోకి తీసుకువెళ్ళి అక్కడ ఉన్న చెట్ల మధ్యలో నేలమీద ఉన్న ఒక బొరియలో (కన్నం) నా మృతదేహాన్ని సమాధి చెయ్యండి”. ఆపై కొద్ది రోజులకే ఆ అమ్మాయి చనిపోయింది. ఆమె బంధువులు ఆమె చెప్పినవిధంగానే ఆమె మృతదేహాన్ని గ్రామ పొలిమేరల్లో ఉన్న అరణ్యంలో చెట్ల మధ్య సమాధి చేసారు. కొద్ది నెలలు గడిచిన తరువాత ఆ అమ్మాయి సమాధి మీద ఒక అందమైన పుష్పం ఆవిర్భవించింది. (అనగా ఆ అమ్మాయి ఒక పుష్ప రూపంలో మళ్ళీ జన్మించింది అన్నమాట) ఒక పౌర్ణమిరోజు రాత్రి ఆ ప్రాంతాన్ని పరిపాలించే ఒక రాజుయొక్క కుమారుడు వేటాడుతూ ఆ అరణ్యంలోకి వచ్చాడు. ఆపై, ఆ అరణ్యంలో ఒకచోట ఉన్న సమాధిమీద వికసించిన ఆ పుష్పాన్నిచూసి మైమరచిపోయాడు. అతడు ఆ పుష్పాన్ని ఎంతగానో ఇష్టపడ్డాడు. దాంతో, అతడు ఆ పుష్పాన్ని తన వెంటపెట్టుకుని తనరాజ్యానికి వెళ్ళిపోయాడు. రెండురోజులు గడిచాయి. ఒకరోజు రాత్రి సమయంలో ఆ పుష్పం ఒక అందమైన అమ్మాయిగా మారిపోయింది. ఆ సమయంలో ఆ రాజు కుమారుడు మంచి నిద్రలో ఉన్నాడు. ఆపై, ఆమె ఆ రాజకుమారుడి వద్దకువెళ్ళి అతడి నుదుటిపై ముద్దు పెట్టుకున్నది. ఆ స్పర్శకు ఆ రాజకుమారుడికి మెళుకువ వచ్చింది. తన ఎదురుగా నిలబడి ఉన్న ఆ అందమైన అమ్మాయినిచూసి ఆ రాజకుమారుడు ఆమెను క్షణాలలో ప్రేమించాడు.

ఆ తరువాత కొద్ది రోజులకే ఆ అమ్మాయిని ఆ రాజకుమారుడు పెళ్ళిచేసుకున్నాడు. ఆ జంట తన భర్తతో హాయిగా కాపురం చేస్తూ ఉండేది. కానీ, ఆమె ఏనాడూ రాజభవనాన్ని వదిలిపెట్టి బైటకు వెళ్ళేదికాదు. కారణం, బైటకు వెళితే ఆ రక్తపిశాచి

తనని మళ్ళీ చంపుతుందేమో అన్న భయం ఆమెను వెంటాడుతూ ఉండేది. అలా కొంతకాలం గడిచింది. ఒకరోజు రాత్రి ఆమె భర్త ఆమెను వెంటపెట్టుకుని చర్చికి బయలుదేరాడు. ఆ చర్చి వెనకాల ఉన్న సమాధిలోనే ఆమెయొక్క మాజీ ప్రియుడైన రక్తపిశాచి ఉన్నాడు. ఏదిఏమైనా, ఆమె ఆ చర్చివైపు రావటం గమనించిన ఆ రక్తపిశాచి తన సమాధిలోంచి బైటకువచ్చి ఆమె వెనకాలే నడవటం ప్రారంభించాడు. అది గమనించిన ఆమె, తన భర్తను కూడా వదిలిపెట్టి అతి భయంతో చర్చిలోకి పరుగెత్తింది. ఆపై ఆ చర్చిలో ఒక మూల ఉన్న ఏసుక్రీస్తు చిత్రపటం వెనకాల దాక్కున్నది. అది గమనించిన ఆ రక్తపిశాచి పెద్దగా అరుస్తూ ఆ చర్చిలోకి ప్రవేశించి, ఆపై క్రీస్తు చిత్రపటం వెనకాల ఉన్న ఆమె చెయ్యిపట్టుకుని ఆమెని ఇవతలికి లాగాలని ప్రయత్నించాడు. ఆ సందర్భంలో ఆ చిత్రపటం ఆ రక్తపిశాచి తలపై పడింది. మరుక్షణం ఆ రక్తపిశాచి భయంకరంగా కేకలు వేస్తూ, పొగరూపంలోకి మారి ఆ చర్చిలోంచి బైటకు వెళ్ళిపోయింది. ఆ తరువాత ఏనాడూ ఆ రక్తపిశాచి, ఆ అమ్మాయికి కనిపించలేదని చెబుతారు.

**లిథ్వేనియాలో ఒక రక్తపిశాచి :**

రష్యా దేశానికి చెందిన కెప్టెన్ పొక్రోవిస్కీ అనే ఒక సైనిక అధికారి 1905వ సంవత్సరంలో లిథ్వేనియా ప్రాంతంలో తనకు యదార్థంగా ఎదురైన ఒక రక్తపిశాచికి సంబంధించిన సంఘటన గురించి తెలియజేసాడు. అది ఏమిటంటే...

ఈ కెప్టెన్‌కి లిథ్వేనియా ప్రాంతంలో ఒక పెద్ద ఎస్టేట్ ఉన్నది. ఈ ఎస్టేట్‌కి దగ్గరలో ఒక సంపన్న రైతు తన కుటుంబంతో నివసిస్తున్నాడు. ఈ రైతుకి యుక్తవయస్సుకి వచ్చిన ఒక కొడుకు ఉండేవాడు. ఏ కారణంచేతో, ఆ రైతు కొడుకు మొదటి భార్య చనిపోయింది. ఆ తరువాత ఆ రైతు తన కొడుక్కి రెండో పెళ్ళి చేసాడు. రెండో కోడలు కాపురానికి వచ్చిన దగ్గర నుండి ఆ రైతుకి ఆరోగ్యం పాడైపోయింది. అతడు రోజు రోజుకీ క్షీణించిపోతూ ఉండేవాడు. ఒక విచిత్రం ఏమంటే, ఆ రైతు ప్రతిరోజూ విపరీతంగా ఆహారం తీసుకుంటున్నప్పటికీ రోజు



రోజుకి బక్కచిక్కిపోతూ ఉండేవాడు. అంతేకాకుండా, ఆ రైతు రాత్రి సమయాలలో విపరీతంగా ఏడుస్తూ ఉండేవాడు. ఇంకొక తమాషా ఏమంటే, రెండో పెళ్ళి చేసుకున్న ఆ రైతు కొడుకు కూడా రోజు రోజుకీ చిక్కిపోతున్నాడు. అనుకోకుండా ఈ కెప్టెన్ ఆ రైతు ఇంటికి వెళ్ళాడు. ఆ సందర్భంలో ఆ రైతుని పరిశీలనగా చూసిన ఆ కెప్టెన్ తనకు తెలిసిన ఒక వైద్యుడిని అక్కడికి పిలిపించి ఆ వైద్యుడితో "డాక్టర్! ఈ రైతుని ఒక రక్తపిశాచి పీడిస్తున్నట్లుగా నాకు అనుమానంగా ఉన్నది. మీరు ఈ రైతుని ఒకసారి పరీక్షించండి" అన్నాడు.

ఆ డాక్టరు ఆ రైతుకి అన్నిరకాల పరీక్షలు చేసి ఆపై ఆ కెప్టెన్‌తో "సర్! వైద్యపరంగా చూసినట్లయితే ఈ రైతుకి ఏవిధమైన రక్తలోపమూ లేదు. కానీ అతడు చిక్కిపోయాడు మరియు అతని ముఖం రక్తం లేనట్లుగా పాలిపోయి ఉన్నది. అంతేకాదు అతని మెడమీద ఒకచోట చిన్న కంత కనిపిస్తున్నది. విచిత్రం ఏమంటే, ఆ కంత పచ్చిగా ఉన్నప్పటికీ దాని పరిమాణం పెరగటంలేదు మరియు అది ప్రమాదకరమైన గాయంగా మారలేదు".

ఆ తరువాత ఆ వైద్యుడు ఆ రైతుతో ఇలా చెప్పాడు. "గుండెకు మేలుచేసే అన్ని రకాల ఆహారాలు తీసుకోండి. రెడ్‌వైన్ బాగా త్రాగండి". ఆ రైతు ఆ డాక్టరు చెప్పినట్లే ఆహారం తీసుకున్నప్పటికీ ఆపై వారం రోజులకే చనిపోయాడు. రక్తపిశాచి చేత రక్తం తాగబడే వారికి వారి శరీరంలో రక్తలోపం ఉండదు. కానీ, అలా రక్తం త్రాగటంవల్ల వాళ్ళు ఏదో ఒక సమయంలో చనిపోవటం జరుగుతుంది. ఏదిఏమైనా, ఆ రైతుయొక్క రెండవ కోడలు ఒక రక్తపిశాచి అని ఆ కాప్టెన్‌కి ఆ తరువాత కొంతకాలానికే అర్థమయ్యింది. కానీ, ఆ విషయాన్ని సమాజానికి రుజువుచేసే ఆధారాలు ఆ కాప్టెన్ దగ్గర లేవు మరి.

**సీసం-క్షుద్రశక్తులు :** సీసం (లెడ్), అనే లోహం ప్రేతాత్మలను, క్షుద్రశక్తులను దూరంగా తరిమివేస్తుందని భారతదేశంలో విశ్వసిస్తున్నారు. ఆ కారణంగానే భారతదేశంలోని కొన్ని ప్రాంతాలలో తమ ఇంటి ప్రధాన ద్వారం ప్రక్కన సీసంతో తయారుచేసిన తాంత్రిక యంత్రాలను అమర్చుకోవటం జరుగుతున్నది. ముఖ్యంగా, పున్నమిరాత్రులలో సంచరించే ప్రేతాత్మలు సీసానికి భయపడి ఆ సీసం యంత్రాలు ఉన్న గృహాలలోకి ప్రవేశించవని చెబుతారు.

**జరకాక :** బ్రెజిల్‌దేశ గ్రామీణ ప్రాంతాలలో సర్పరూపంలో ఉండే ఒక రక్తపిశాచి సంచరిస్తూ ఉంటుందని, ఎవరైనా బాలింత స్త్రీలు తమ బిడ్డలకు పాలు ఇస్తున్నప్పుడు

ఈ సర్పరూప రక్తపిశాచి ఆ బాలింత స్త్రీల వద్దకువెళ్ళి, వాళ్ళ దగ్గర పాలు త్రాగుతున్న బిడ్డలకు తన తోకనుచుట్టి ఆపై ఆ బిడ్డల నోట్లో తన తోక కొసను ఉంచి, ఆపై తన నోటితో ఆ బాలింతరాలి స్తనాలను పట్టుకుని వారి పాలను త్రాగివేస్తుందని చెప్పుకుంటారు. ఇందులో ఎంతో కొంత నిజం ఉండిఉంటుందని బ్రెజిల్‌కి చెందిన కొందరు పరిశోధకులు నమ్ముతున్నారు.



# 8. ఫిలిప్పైన్స్ దేశంలో యదార్థంగా జరిగిన ఒక చేతబడి వృత్తాంతము?

అనంతమైన మహా సముద్రంలో 7 వేల చిన్న చిన్న దీవులతో ఏర్పడిన ఒక అద్భుతదేశం ఫిలిప్పైన్స్. ఈ దేశంలో డజన్లకొద్ది విభిన్నమైన భాషలు, విచిత్రమైన సంస్కృతులు ప్రచారంలో ఉన్నాయి. పురాతనకాలంలో ఈ దేశంలో దేవతల్ని, దయ్యాలను పూజించే మతం వాడుకలో ఉండేది. ఆ తరువాతకాలంలో క్రైస్తవ మిషనరీలు ఈ దేశంలోకి ప్రవేశించి, క్రమ క్రమంగా ఈ దేశంలోని వివిధ జాతుల ప్రజలను క్రైస్తవ మతంలోకి మార్చారు. అయినప్పటికీ, ఈనాటికీ ఫిలిప్పైన్స్ దేశంలో మానవాతీత శక్తులకు సంబంధించిన విశ్వాసాలు బలంగా ఉన్నాయి. అంతేకాదు, ఇప్పటికీ ఫిలిప్పైన్స్‌లోని అనేక ప్రాంతాలలో వివిధ రకాల మానవాతీత శక్తులు లేదా క్షుద్ర శక్తులు కనిపిస్తున్నట్లుగా వార్తలు వస్తున్నాయి.

ఫిలిప్పైన్స్ దేశంలోని గ్రామీణ ప్రాంతాలలో, చిన్న చిన్న పట్టణ ప్రాంతాలలో చేతబడులు చేసే మంత్రగత్తెలు నివసిస్తూ ఉంటారు. వీళ్ళు, ఇతరులపై ప్రతీకారంతో కావొచ్చు లేదా డబ్బుకోసం కావొచ్చు, అతి భయంకరమైన చేతబడులను (బ్లాక్ మాజిక్) చేస్తూ ఉంటారు. ఈ చేతబడికి గురైన వ్యక్తులు విచిత్రమైన వ్యాధి లక్షణాలకు గురై, క్రమ క్రమంగా క్షీణించిపోతూ చివరికి మరణించటం జరుగుతుంది. దాదాపు 50 సంవత్సరాల క్రితం ఫిలిప్పైన్స్ దేశంలోని ఒక రాష్ట్రానికి చెందిన ఒక చిన్న గ్రామంలో జరిగిన ఒక యదార్థ సంఘటన ఇది. ఈ యదార్థ వృత్తాంతాన్ని కళ్ళారా చూసిన మెలిండా అనే యువతిని మనీలా నగరానికి చెందిన ఒక యువకుడు పెళ్ళి చేసుకున్నాడు. ఆ తరువాత ఒకరోజున మెలిండా, కొద్ది సంవత్సరాల క్రితం తన చిట్టి చెల్లెలు ఎమిలీ జీవితంలో జరిగిన ఒక భయంకర సంఘటన గురించి తన భర్తకు

తెలియజేసింది. ఆ భర్త, తన భార్య ద్వారా తెలిసిన ఆ భయానక వృత్తాంతం గురించి మనకు ఇలా తెలియజేస్తున్నాడు...

నా భార్య మెలిండా ఆఖరి చెల్లెలు పేరు ఎమిలి. ఆమె వయస్సు దాదాపు ఒక సంవత్సరం ఉంటుంది. కొసతేలిన అందమైన ముక్కు, అందమైన కళ్ళు, ఆకర్షించే శిరోజాలతో ఆ బిడ్డ చూసిన వాళ్ళని ఇట్టే ఆకట్టుకుంటూ ఉండేది. ఆమెను చూసిన ఆ గ్రామంలోని ప్రజలు 'అబ్బ! ఈ బిడ్డ ఎంత అందంగా ఉన్నదో కదా!" అని ఆశ్చర్యపడుతూ ఉండేవారు. 8 మంది అన్నలు మరియు 7 గురు అక్కల చివర ఎమిలి జన్మించింది. అంటే, ఎమిలి తల్లిదండ్రులకు మొత్తం 16 మంది సంతానం. ఆ సంతానంలో రెండవ అమ్మాయి నా భార్య అన్నమాట. సరే, అసలు కథకు వద్దాం...

ఎంతో ఆరోగ్యంగా, నవ్వుతూ అల్లరి చేస్తూ ఉండే ఎమిలీ, హఠాత్తుగా ఏదో తెలియని అనారోగ్యానికి గురి అయ్యింది. అప్పటి నుండి ఆ బిడ్డ పాలు త్రాగిన వెంటనే కక్కేసేది. అలాగే, రాగి గంజి త్రాగగానే ఆ బిడ్డకి వెంటనే వాంతి అయ్యేది. అంతేకాకుండా, ఆ బిడ్డకి రోజూ విపరీతంగా విరోచనాలు అయ్యేవి. ఫలితంగా, ఆ బిడ్డ వంట్లో నీరు విపరీతంగా తగ్గిపోయింది. అంతేకాకుండా రాత్రంతా నిద్రలేకుండా గుక్కపట్టి ఏడుస్తూ ఉండేది. అలా కొద్ది రోజులు గడిచిన తరువాత ఎమిలి తల్లిదండ్రులు ఆ బిడ్డను ఒక వస్త్రంలో చుట్టి, అక్కడికి దగ్గరలో ఉన్న ఒక డాక్టరు దగ్గరకు తీసుకువెళ్ళారు. ఆ డాక్టరు ఆ బిడ్డను పరీక్షించి ఆపై ఏవో కొన్ని మందులు ఆ బిడ్డకు ఇచ్చాడు. ఆ మందులు వాడిన తరువాత ఎమిలీకి కొంచెం రోగం తగ్గినట్లుగా అనిపించింది. ఆ రోజుకి ఎమిలి మామూలుగానే పాలు త్రాగింది కానీ కక్కలేదు. మర్నాడు ఉదయం నుండి మళ్ళీ ఆ బిడ్డ అనారోగ్యానికి గురి అయ్యింది. ఇక చేసేది లేక వాళ్ళు మళ్ళీ ఆ బిడ్డని డాక్టరు దగ్గరకు తీసుకువెళ్ళారు. డాక్టరు మళ్ళీ ఎమిలీని బాగా పరీక్షించి మళ్ళీ కొత్త మందులు ఇచ్చాడు. వాళ్ళు ఇంటికి తిరిగివచ్చి ఎమిలీకి ఆ మందులు ఇచ్చారు. రెండు రోజులు బాగానే ఉన్నది. మళ్ళీ ఎమిలీకి రోగం తిరగపెట్టింది. ఆ బిడ్డ ఎప్పటిలాగానే త్రాగింది త్రాగినట్లుగా వాంతి చేసుకోవటం, రాత్రిపూట నిద్రలేకుండా ఏడవటం మొదలు పెట్టింది.

మర్నాడు ఉదయమే వాళ్ళు ఆ బిడ్డని మళ్ళీ ఆ డాక్టరు దగ్గరకు తీసుకువెళ్ళారు. ఆ డాక్టరు తనకు తోచిన కొత్త మందులు ఆ బిడ్డకు ఇచ్చాడు. ఆ మందులు వాడిన రెండు రోజులపాటు ఎమిలీకి ఆరోగ్యం బాగానే ఉన్నది. మళ్ళీ 3వ రోజు నుండి ఆ

బిడ్డకి అనారోగ్యం మొదలయ్యింది. మళ్ళీ ఎమిలీని డాక్టరు దగ్గరకు తీసుకువెళ్ళారు. ఆయన బాగా ఆలోచించి కొన్ని సరికొత్త మందులు ఆ బిడ్డకు ఇచ్చాడు. ఈసారి నాలుగు రోజులపాటు ఎమిలి ఆరోగ్యంగా ఉన్నది. ఐదవ రోజు నుండి మళ్ళీ ఆ బిడ్డకి అనారోగ్యం ప్రారంభం అయ్యింది. మళ్ళీ ఆ బిడ్డని డాక్టరు దగ్గరకు తీసుకువెళ్ళటానికి వాళ్ళ దగ్గర ఒక్క పైసాకూడా మిగలలేదు. ఎమిలీ తండ్రి, తనకు ఉన్న కొద్దిపాటి వ్యవసాయ భూమిలో చాలా కష్టపడి కొన్ని బస్తాల వరి ధాన్యాన్ని పండిస్తాడు. ఆపై, ఆ ధాన్యంలో కొంత భాగాన్ని తమ ఇంటి ఆహార అవసరాలకోసం ఉంచుకుని, మిగిలిన ధాన్యాన్ని సంతలో అమ్మి కొంత సొమ్ము సంపాదిస్తాడు. అలా సంపాదించిన దానిలో కొంత డబ్బుని భవిష్యత్తు అవసరాలకోసం దాచాడు.

ఇప్పుడు వాళ్ళ దగ్గర అవసరంకోసం దాచుకున్న ఆ కొద్దిపాటి డబ్బుకూడా ఎమిలీ వైద్యానికి అయిపోయింది. కానీ, ఎమిలీ మళ్ళీ అనారోగ్యంతో బాధపడుతున్నది. ఏదిఏమైనా, ఆ బిడ్డకి ఇప్పుడు మళ్ళీ వైద్యం చేయించాలి. కానీ, వాళ్ళ దగ్గర ప్రస్తుతం డబ్బులేదు. డబ్బుకోసం ఏం చెయ్యాలా? అని ఎమిలీ తండ్రి బాగా ఆలోచించాడు. ఎమిలీ తండ్రికి కొద్దిపాటి వ్యవసాయ భూమి ఉన్నది. ఆ భూమిని దున్నటానికి ఎమిలీ తండ్రి ఒక దున్నపోతుని ఉపయోగిస్తూ ఉంటాడు. ఎమిలీ తండ్రి దగ్గర ఉన్న ఏకైక ఆస్తి ఆ బర్రె మాత్రమే అని గుర్తించాలి. ఆ బర్రెను అమ్మేస్తే తాను, ఇక వ్యవసాయం చెయ్యటం వీలుకాదు. అనగా, తమకు ఇక వడ్లు లభించవు. అంటే, తమ కుటుంబం ఆకలితో మాడిపోవలసి ఉంటుంది. అయినా సరే, తన బిడ్డకన్నా ఆ దున్నపోతు ఎక్కువ కాదు అని భావించిన ఎమిలీ తండ్రి, తాము నివసిస్తున్న గ్రామానికి దగ్గరలో ఉన్న సాన్‌మిగల్ అనే చిన్న పట్టణంలో జరుగుతున్న సంతలో ఆ మర్నాడు ఉదయం ఆ దున్నపోతుని అమ్మి, అలా వచ్చిన సొమ్ముతో ఎమిలీకి వైద్యం చేయించాలని నిర్ణయించుకున్నాడు.

ఎమిలీ కుటుంబం ఉంటున్న గ్రామానికి ఆనుకుని ఒక దట్టమైన అడవి ఉంటుంది. ఆ అరణ్యంలో చాలా పెద్ద పరిమాణంలో ఉండే బల్లులు విస్తారంగా తిరుగుతూ ఉంటాయి. అవి, సూర్యాస్తమయం కాగానే 'టుక్, టుక్, టుక్' అని వికృతంగా అరుస్తూ ఉంటాయి. వాటి అరుపులు ఆ అడవి అంతా భయంకరంగా ప్రతిధ్వనిస్తూ ఉంటాయి. అంతేకాదు, ఆ భయంకరమైన బల్లుల అరుపులు ఊరి చివర ఉన్న ఎమిలీ కుటుంబం నివసిస్తున్న పూరి ఇంటిదాకా వినిపిస్తూ ఉంటాయి.

ఆ రోజుల్లో ఎమిలీ తండ్రి ఉంటున్న గ్రామంలో కరెంటులేదు, టి.వి.లు లేవు. కనీసం, లాండ్‌లైన్ ఫోన్‌కూడా లేదు. బైట ప్రపంచానికి ఆ గ్రామంలో నివసిస్తున్న

ఎమిలీ కుటుంబానికి మధ్య అనుసంధానంగా ఒక చిన్న రేడియో ట్రాన్సిస్టర్ మాత్రం ఉండేది. ఆ చిన్న రేడియో ద్వారా ఎమిలీ కుటుంబ సభ్యులు, బైట ప్రపంచంలో ఏం జరుగుతుందో తెలుసుకుంటూ ఉండేవాళ్ళు. ఆ గ్రామం నుండి ఎక్కడికి వెళ్ళాలన్నా కాలి నడకన లేదా దున్నపోతులు లాగే బండిలో వెళ్ళాల్సి వచ్చేది. ఏదిఏమైనా, ఆ రోజు రాత్రి ఎమిలీ ఇంట్లో ఒక భయంకరమైన సంఘటన జరిగింది. అది ఏమిటంటే…ఎమిలీ కుటుంబం నివసిస్తున్న పూరిల్లు ఒక విశాలమైన స్థలంమధ్యలో ఉంటుంది. ఆ ఇంటిచుట్టూ ఏవో జాతికి చెందిన ముళ్ళ చెట్లతో వెయ్యబడిన కంచె ఉంటుంది. ఆ ఇంటికి దాదాపు 100 గజాల దూరంలో వెదురు కర్రలతో చెయ్యబడిన మెయిన్‌గేటు ఉంటుంది.

ఏదిఏమైనా, మర్నాడు ఉదయం సాన్‌మిగల్ పట్టణానికివెళ్ళి అక్కడ తన దున్నపోతును అమ్మాలని నిర్ణయించుకున్న ఎమిలి తండ్రి, రాత్రి కాగానే తన బిడ్డను తన వొళ్ళో కూర్చోపెట్టుకుని తన పూరింట్లోని ముందు గదిలో కూర్చున్నాడు. ఆ గదిలోనే రెండు కొవ్వొత్తులు వెలిగించి ఆ ఇంట్లోని సభ్యులందరూ కూర్చుని ఎమిలీని ఆందోళనతో చూస్తున్నారు. ఆ రోజు అర్ధరాత్రి అయినా ఎమిలీ కుటుంబ సభ్యులు ఎవరూ నిద్రపోలేదు. ఇంతలో, ఆ ఇంటి మెయిన్‌గేటు బైట నుండి వికృతమైన ఒక పిల్లి అరుపులు చాలా పెద్ద స్థాయిలో వినిపించటం మొదలయ్యింది. మొదట్లో ఎమిలీ కుటుంబ సభ్యులు ఆ విషయాన్ని పెద్దగా పట్టించుకోలేదు. కారణం, వాళ్ళ ఇల్లు, ప్రక్కనే ఉన్న అడవికి దాదాపు ఆనుకుని ఉన్నట్లుగా ఉంటుంది. అందువల్ల అప్పుడప్పుడూ ఏవో వికృతమైన జంతువులు, ఆహారంకోసం ఆ ఇంటి పరిసరాల్లో తిరగటం, ఆ సందర్భంలో వాటి ఆహారం అయిన ఎలుకలు లేదా చుంచులు లాంటివి కనిపించినప్పుడు అవి అరవటం జరుగుతుంది. అలా ఆహారంకోసం వచ్చే జంతువులలో అడవి పిల్లులు కూడా ఉంటాయి. అందువల్ల ఎమిలీ కుటుంబ సభ్యులు తమకు వినిపిస్తున్న అడవిపిల్లి అరుపులను పెద్దగా పట్టించుకోలేదు. అయితే, ఆ అరుపుల స్థాయి క్రమక్రమంగా పులిగాండ్రింపు ఏ స్థాయిలో ఉంటుందో ఆ స్థాయిలోకి చేరటంతో ఎమిలీ తండ్రికి ఏదో అనుమానంవచ్చి తాను ఉన్న గది కిటికీ తలుపులు తెరచి బైటకు చూసాడు. బైట, ఒక పెద్ద కుక్క అంత పరిమాణంలో ఉన్న ఒక నల్లటి పిల్లి కనపడింది. దాని కళ్ళు రక్తవర్ణంలో మెరిసిపోతున్నాయి. ఇంటి బైటకువెళ్ళి ఆ పిల్లి విషయం ఏమిటో తేల్చుకుందామని నిర్ణయించుకున్న ఎమిలీ తండ్రి తన ఇంటి తలుపుతీసాడు. అంతే, ఒక్కసారిగా సుడిగాలిలాగా ఆ భయంకరమైన పిల్లి ఆ ఇంట్లోకి ప్రవేశించింది. ఆ పిల్లిని చూడగానే ఎమిలీ తండ్రికి ఒక విషయం హఠాత్తుగా

అర్థమయ్యింది. అది ఏమిటంటే....

ఆ పిల్లి ఒక సాధారణ అడవిపిల్లి కాదని, ఆ రూపంలో ఉన్న ఒక మనాంగ్గల్ అనగా ఒక మంత్రగత్తె అని అతనికి తెలిసిపోయింది. ఫిలిప్పైన్స్‌లో ప్రచారంలో ఉన్న నమ్మకాల ప్రకారం మనాంగ్గల్ అని పిలువ బడే అతి క్రూరమైన మంత్రగత్తెలు తమకు అవసరమైనప్పుడు, చనిపోయిన ఏదైనా జంతువుయొక్క మృత దేహాన్ని ఆవహించి, ఆ జంతువు రూపంలో తాము వేటాడాలనుకున్న మనుషులు ఉండే ఇళ్ళ ల్లోకి వెళతాయి. ఇప్పుడు, తమ ఇంట్లోకి వచ్చిన పిల్లిని ఏదో ఒక మంత్రగత్తె ఆవహించి ఉన్నదని గ్రహించిన ఎమిలీ తండ్రి, తాను అడవి గుండా వెళ్ళేటప్పుడు జంతువుల నుండి తనను రక్షించుకోవటంకోసం ఉపయోగించే ఒక ఇనుప కర్రని చేతిలోకి తీసుకుని, ఆపై పెద్ద స్వరంతో “ఓ పిశాచీ! నేను ఇక్కడ ఉన్నంతవరకు నా బిడ్డ ఎమిలిని నువ్వు తాకలేవు” అని అరిచి ఆపై ఆ ఇనుప కర్రతో ఆ పిల్లిని బలంగా ఒక దెబ్బ కొట్టాడు. ఆ దెబ్బకు బెదిరిన ఆ దయ్యంపిల్లి వికృతంగా అరుస్తూ ఆ ఇంట్లో నుండి బైటకువచ్చి ఆపై ప్రహరీ గేటుదాటి – ప్రహరీ గేటుకి అవతలవైపు నుంచుని పెద్దగా అరుస్తూ ఆ ఇంటివైపు చూస్తున్నది. అది గమనించిన ఎమిలీ తండ్రి తన ఇంట్లోని సభ్యులందరితో ఇలా చెప్పాడు.



“మీరు ప్రతిరోజూ ధరించే రబ్బరు చెప్పులన్నింటినీ మన ఇంటి ప్రహరీగేటుకి ఇవతల ఒక కుప్పగావేసి మంట పెట్టండి. ఆ రబ్బరు చెప్పులు తగలబడేటప్పుడు వచ్చే పొగ అంటే మనాంగ్గల్‌కి చచ్చేభయం. మీరు ఏమాత్రం ఆలస్యం చెయ్యకుండా నేను చెప్పిన పని చెయ్యండి”.

అతడు చెప్పిన మాటవిన్న అతడి కుటుంబ సభ్యులు, తమ తమ రబ్బరు చెప్పులను తీసుకుని ప్రహరీగేటుకి ఇవతల ఒకచోట కుప్పగాపోసి, ఆ చెప్పులకు నిప్పు అంటించారు. కన్నుమూసి తెరిచేలోగా ఆ చెప్పులు అంటుకుని పెద్దగా మంటలు లేచాయి. ఆ మంటలతోపాటుగా దట్టమైన పొగలు కూడా గాలిలోకి లేచింది. ఆ పొగనుచూసి బెదిరిపోయిన ఆ దయ్యంపిల్లి ఒక్కసారి వికృతంగా అరిచి అక్కడ నుండి ప్రక్కనే ఉన్న అడవిలోకి వేగంగా పారిపోయింది. ఇంత జరుగుతున్నా ఎమిలీ తల్లిమాత్రం ఎంతో గుండె నిబ్బరంతో పసిబిడ్డ అయిన ఎమిలిని తన గుండెకు హత్తుకుని ఇంట్లోనే కూర్చున్నది. ఇంతలో తెల్లవారింది. అప్పటికి పసిబిడ్డ ఎమిలి ఆరోగ్యపరిస్థితి తీవ్రంగా దెబ్బతిన్నది. ఆ బిడ్డ పాలు త్రాగటం పూర్తిగా మానివేసింది. ఉండి ఉండి కొంచెంసేపు గుక్కపట్టి బిగ్గరగా ఏడుస్తున్నది. “ఆమెను మంచి డాక్టరుకి చూపించాలంటే చాలా డబ్బు కావాలి. ఆ డబ్బు కావాలంటే తమ దున్నపోతును అమ్మక తప్పదని” ఎమిలీ తండ్రికి స్పష్టంగా అర్ధమయ్యింది.

ఎమిలీ తండ్రి తన కుటుంబం మరియు తాము అమ్మాలనుకుంటున్న తమ దున్నపోతుతో సహా ప్రక్కనే ఉన్న సాన్‌మిగల్ పట్టణానికి బయలుదేరారు. వాళ్ళు ఆ పట్టణానికి వెళ్ళాలంటే, వాళ్ళు ఉంటున్న గ్రామానికి ఆనుకుని ఉన్న అడవిగుండా ప్రయాణం చెయ్యాల్సి ఉంటుంది. ఎమిలీ కుటుంబం చాలా జాగ్రత్తగా ఆ అడవిని దాటి ఆ అడవికి అటువైపు ఉన్న సాన్‌మిగల్ పట్టణ పొలిమేరల్లోకి చేరుకున్నారు. సరిగ్గా, అప్పుడే ఎమిలీ తల్లికి ఆ పట్టణ పొలిమేరల్లో నివాసం ఉంటుంన్న తన అక్క అయిన ఫెలిసియానా గురించి హఠాత్తుగా గుర్తుకు వచ్చింది. ఆ సమయానికి ఆ అక్కచెల్లెళ్ళు కలుసుకుని దాదాపు 6 నెలలు కావొస్తున్నది. తన అక్క ఒక మంత్రగత్తె కనుక తన బిడ్డ ఎమిలికి వచ్చిన అనారోగ్యానికి కారణం ఏమిటో? – ఆమె చెబుతుందని భావించిన ఎమిలీ తల్లి తన కుటుంబంతో సహా ఫెలిసియానా ఇంటికి వెళ్ళింది. అనేక నెలలు తరువాత తన దగ్గరకు వచ్చిన తన చెల్లెలను చూసి ఫెలిసియానా ఎంతో ఆనందించి, ఆపై ఆమె చేతుల్లో మత్తుగా పడుకుని ఉన్న ఎమిలీనిచూసి కొంచెం బాధపడింది. ఆపై, ఫెలిసియానా ఆదుర్దానిండిన స్వరంతో తన చెల్లెలితో ఇలా అన్నది. “మన ప్రాంతంలో ఒక మనాంగ్గల్ (మంత్రగత్తె) వివిధ జంతువుల రూపాలలో రాత్రి సమయాలలో తిరుగుతున్నది. అది, అందమైన పసిబిడ్డలను చంపి ఆ బిడ్డల శరీరంలో ఉండే కాలేయాన్ని ఆహారంగా తీసుకుంటున్నది. ఆ పసిబిడ్డల కాలేయాన్ని తినటంవల్ల ఆ మంత్రగత్తె మరిన్ని మానవాతీత శక్తులను పొందుతున్నది. బహుశా, నీ బిడ్డను కూడా ఆ మనాంగ్గల్ చంపాలని చూస్తుందేమో జాగ్రత్తగా ఉండు”.

ఫెలిసియాన చెప్పటం పూర్తికాగానే, ఎమిలి తల్లి వణుకుతున్న స్వరంతో "రాత్రి మా ఇంట్లోకి ఒక అడవిపిల్లిరూపంలో ఆ మనాంగ్గల్ వచ్చింది. దాన్ని మా ఇంట్లో సభ్యులందరూ కలిసి ఎలాగో తరిమివేసారు. ఏది ఏమైనా, ఆ మనాంగ్గల్ నా బిడ్డ ఎమిలినీ చంపకుండా వదలదు. నా బిడ్డను ఎలా రక్షించుకోవాలో నువ్వే చెప్పాలి" అన్నది. తన చెల్లెలు చెప్పిన మాట వినగానే ఫెలిసియానా ఒక్కసారిగా ఉలిక్కిపడింది. ఆపై ఆమె కంగారుతో కూడిన స్వరంతో తన చెల్లెలితో ఇలా అన్నది. "ఇప్పుడు ఈ ప్రాంతంలో సంచరిస్తున్న ఆ మనాంగ్గల్ చాలా శక్తివంతమైనది. దాన్ని అడ్డుకోవటం నా వల్లకాదు. ఈ సాన్‌మిగల్ పట్టణం మధ్యభాగంలో ఉన్న పాత చర్చిలో ఒక వృద్ధుడైన మహా మంత్రవాది ఉన్నాడు. ఆయన నా కన్నా ఎన్నోరెట్లు గొప్పవాడు. ఆయన మాత్రమే నీ బిడ్డ ఎమిలినీ ఆ మనాంగ్గల్ బారినుండి రక్షించగలడు. మనం వెంటనే ఆయన వద్దకువెళదాం పదండి".

ఆపై ఎమిలీ కుటుంబాన్ని వెంటపెట్టుకుని ఫెలిసియానా ఆ పట్టణం మధ్యలో ఉన్న పాతచర్చిలో నివసిస్తున్న మంత్రవాది వద్దకు బయలుదేరింది. తనవద్దకు తీసుకురాబడిన ఎమిలీ శిరస్సుపై తన కుడిచేయిని ఉంచిన ఆ మహా మంత్రవాది ఒక్కసారి ఉలిక్కిపడ్డాడు. ఆపై, ఆ బిడ్డ శిరస్సుపై నుండి తన చేయిని తీసి ఆ తరువాత ఎమిలీ తండ్రి తన దగ్గరకుపిలిచి అతడితో గంభీరమైన స్వరంతో "బిడ్డా! నీ బిడ్డను చంపాలని చూస్తున్నది మహా శక్తికలిగిన ఒక మనాంగ్గల్. అది ఇప్పటికే ఎందరో బిడ్డలను చంపి వాళ్ళ కాలేయాలను ఆరగించింది. అతి త్వరలో నీ బిడ్డ ఎమిలీని కూడా ఆ మనాంగ్గల్ చంపాలని వేచి ఉన్నది. నీవేమి భయపడకు. నేను నీ బిడ్డను ఆ మనాంగ్గల్ బారి నుండి తప్పకుండా రక్షిస్తాను. నువ్వు, రేపు ఉదయం బజారుకివెళ్ళి ఒక నల్ల కోడిపెట్టను కొనుక్కుని నా దగ్గరకు తీసుకురా. ఆ తరువాత ఏం చెయ్యాలో నేను చేస్తాను" అన్నాడు.

అదృష్టవశాత్తు ఆ మర్నాడు ఆదివారం కావటంవల్ల తెల్లవారుఝాము సమయానికే బజారులో పెద్ద సంత ప్రారంభం అయ్యింది. ఎమిలీ తండ్రి అప్పటికే బజారుకి చేరుకుని, ఆపై అక్కడ ఒక దుకాణంలో, బలిసిన ఒక నల్ల కోడిపెట్టను కొనుగోలుచేసి ఆపై తన కుటుంబం బసచేసిన ఫెలిసియానా ఇంటికి వచ్చాడు. ఆ తరువాత ఫెలిసియానా తన చెల్లెలు కుటుంబాన్ని వెంటపెట్టుకుని మహా మంత్రవాది నివసిస్తున్న చర్చిలోకి వెళ్ళింది. ఆ మంత్రవాది, ఎమిలీ తండ్రి, తన చేతిలో పెట్టిన కోడిపెట్టను ఒకసారి పరిశీలనగా చూసాడు. ఆ తరువాత ఆయన తన ఎడమ చేతిలోకి ఒక పదునైన చిన్న కత్తిని తీసుకుని, ఆ తరువాత ఒకే ఒక దెబ్బకి ఆ

నల్లకోడిపెట్ట తల నరికాడు. ఆ తరువాత ఆ కోడిపెట్ట మొండెం నుండి వచ్చిన రక్తాన్ని ఒక పాత్రలో పట్టాడు. ఆ తరువాత ఏవో మంత్రాలు పఠిస్తూ ఎమిలీని తన ముందు నుంచోపెట్టుకుని, ఆపై ఆమె నుదుటిమీద, కాళ్ళమీద, చేతులమీద, పొట్టమీద ఆ కోడిపెట్ట రక్తంతో సిలువ గుర్తులువేసాడు. ఆ తరువాత ఒక చిన్న అల్లంముక్కను తీసుకుని దానితో ఎమిలీ శరీరం అంతా మృదువుగా రుద్దాడు. జరుగుతున్న ఈ కార్యక్రమాన్ని ఎమిలీ కుటుంబ సభ్యులు మరియు ఎమిలీ పెద్దమ్మ అయిన ఫెలిసియానా ఎంతో ఆత్రంగా చూస్తున్నారు. ఈ కార్యక్రమం ముగిసిన తరువాత ఆ వృద్ధ మంత్రవాది సన్నటి స్వరంతో ఎమిలీ తండ్రితో "బిడ్డా! నీవు నీ కుటుంబంతో సహా వెంటనే నీ ఇంటికి వెళ్ళిపో. ఈ రోజు మధ్యాహ్నానికి మీరు మీ గ్రామానికి చేరుకుంటారు. ఆ తరువాత మీరు ఈ రోజు సాయంత్రం నుండి రేపు సూర్యోదయం అయ్యేవరకు మీ ఇల్లంతా మీకు వీలైనన్ని కొవ్వొత్తులను వెలిగిస్తూ ఉండండి" అన్నాడు.

ఆ తరువాత ఎమిలీ కుటుంబం, ఫెలిసియానా వద్ద సెలవు తీసుకుని కాలి నడకన ప్రయాణిస్తూ మధ్యాహ్నానికి గ్రామం పొలిమేరల్లో ఉన్న తమ ఇంటికి చేరుకున్నారు. మధ్యాహ్నం ఇంటికి వచ్చిన తరువాత ఎమిలీ తల్లి, ఎమిలీకి కాసిన పాలు త్రాగించింది. ఆ బిడ్డ ఎంతో ఆత్రంతో ఆ పాలను త్రాగింది. ఈసారి ఆ బిడ్డ వాంతి చేసుకోలేదు. సాయంత్ర సమయంలో ఆ బిడ్డకు వరిబియ్యంతో చేసిన గంజి త్రాగించింది ఆ తల్లి. ఒక గంట గడిచినప్పటికీ ఎమిలీ ఏమాత్రం వాంతి చేసుకోలేదు. "సాయంత్రం, వీడ్కోలు తీసుకుంటూ రాత్రికి స్వాగతం చెప్పింది". అప్పటి కొద్ది నిమిషాల ముందే, ఎమిలీ కుటుంబ సభ్యులు తమ ఇంట్లోని ప్రతి గదిలోనూ పెద్ద పెద్ద క్రొవ్వొత్తులు వెలిగించారు. ఫలితంగా, ఆ ఇల్లంతా ప్రకాశవంతమైన కాంతితో మెరిసిపోయింది. రాత్రి 10 గంటలు దాటే సరికి ఎమిలీ హాయిగా నిద్రలోకి జారుకున్నది. అప్పటికీ ఆ బిడ్డ శరీరంమీద ఎండిపోయిన కోడి నెత్తురు చారలు ఉన్నాయి. అనేక నెలలు తరువాత మొదటిసారి ఆ బిడ్డ హాయిగా నిద్రపోవటం గమనించిన ఆ బిడ్డ తల్లిదండ్రులు మరియు ఇతర కుటుంబ సభ్యులు ఎంతో సంతోషించారు.

ఇక, ఎమిలీ తండ్రి తన ఆయుధం అయిన ఇనుప కర్రను చేతిలో ఉంచుకుని ఇంటి ప్రధాన ద్వారం బైట కాపలాగా ఉన్నాడు. ఏ క్షణంలో అయినా మనాంగ్గల్ ఏదో ఒక రూపంలో వస్తుందని, అలా వచ్చిన ఆ భయంకర మంత్రగత్తెను తన దగ్గర ఉన్న ఇనుప కర్రతో కొట్టి చంపాలని ఆ తండ్రి ఆగ్రహంగా ఎదురుచూస్తున్నాడు. అయితే, అతడు ఊహించినట్లుగా ఆ రాత్రికి మనాంగ్గల్ అక్కడికి రాలేదు. తెల్లవారింది.

ఎమిలీ ఎంతో ఉల్లాసంగా ఆడుకోవటమే కాకుండా రెండుసార్లు పాలు త్రాగింది. మధ్యాహ్న సమయంలో బియ్యపు గంజి త్రాగింది. ఆ బిడ్డను దగ్గరకు తీసుకున్న ఆ బిడ్డ తండ్రి తన భార్యను మరియు ఇతర సంతానాన్ని పరిశీలనగా చూస్తూ సంతోషంతో కూడిన స్వరంతో ఇలా అన్నాడు. “నిజంగా ఆ వృద్ధ మంత్రవాది చాలా శక్తివంతుడు. ఆయన చేసిన పరిహారం కారణంగానే, మన ముద్దుబిడ్డ ఎమిలీ, ఆ మనాంగ్గల్ బారి నుండి రక్షించబడింది. ఆయన చేసిన పరిహారం కారణంగానే ఆ మంత్రగత్తె మన బిడ్డను వదిలిపెట్టి ఎటో వెళ్ళిపోయింది. ఇక, మన ఎమిలీ క్షేమంగా ఉంటుంది అని నేను నమ్ముతున్నాను”. ఏదిఏమైనా, ఎమిలీకి ఆ వృద్ధ మంత్రవాది చేసిన పరిహారంతో ఆ బిడ్డ అనారోగ్య బాధ శాశ్వతంగా తొలగిపోయింది. దాంతో, ఆ బిడ్డ వైద్యంకోసం దున్నపోతుని అమ్మాల్సిన అవసరం ఆ కుటుంబానికి తప్పింది.

ఎమిలీ అక్కయ్య మరియు నా భార్య అయిన మెలిండా ద్వారా నాకు, ఎమిలీ కుటుంబంలో జరిగిన ఆ భయానక సంఘటన గురించి తెలిసింది. “ఈ ప్రపంచంలో ప్రతిరోజూ అనేక చీకటి శక్తులు (క్షుద్రశక్తులు) దైవ శక్తులమీద దారుణమైన పోరాటం చేస్తున్న సమయంలో, అలాంటి చెడు శక్తులు లేవని, చేతబడులు అబద్ధమని వాదించటం కేవలం అజ్ఞానమే అని నేను భావిస్తాను. మరి, మీరు ఏమంటారు?”.



# 9. ఫిలిప్పైన్స్ గ్రామీణ ప్రాంతాలలో సంచరించే కొరివి దయ్యం ‘సాంటెల్మో’ విశేషాలు?

తీవ్రమైన తుఫాన్ల సమయంలో అనగా కుంభవృష్టిగా వర్షం కురుస్తున్న సమయంలో ఒక నది లేదా ఒక సరస్సు లేదా ఒక సముద్రతీరంలో – చనిపోయిన మనుషులు ‘సాంటెల్మో’ అనే పేరుగల కొరివిదయ్యాలుగా మారతారని ఫిలిప్పైన్స్ గ్రామీణ ప్రాంతాలలోని ప్రజలు ఈనాటికీ బలంగా నమ్ముతున్నారు. ప్రకృతి భీభత్సం వల్ల హఠాత్తుగా చనిపోయిన మనిషియొక్క ఆత్మకు తనకు ఏం జరిగిందో? అర్థంకాదు. ఫలితంగా, ఆ ఆత్మ – అర్ధరాత్రి సమయాలలో నిర్జన ప్రదేశాలలో ఒక ఫుట్‌బాల్ పరిమాణంలో ఉన్న ఒక అగ్నిగోళం రూపంలో గాలిలో ఎగురుతూ ఉంటుంది. ఆ సమయంలో, అటువైపు ఒంటరిగా వచ్చే మానవుల్ని ఆ కొరివిదయ్యం విపరీతంగా బయపెట్టి ఆ మనుషుల్ని దోవతప్పిపోయేలా చేస్తుంది. ఒక విశేషం ఏమంటే, కొన్ని

కొన్ని కొరివి దయ్యాలు, దోవ తప్పి తిరుగుతున్న మనుషులకు సహాయం చెయ్యటం జరుగుతుంది. కొంతమంది క్రైస్తవ మత బోధకుల అభిప్రాయం ప్రకారం చూసినట్లయితే, దైవ సహాయంకోరే మానవులకు ఆ దైవం, ఆ కొరివి దయ్యాల ద్వారా సహాయం చేస్తాడని తెలుస్తున్నది.



కొన్ని సమయాలలో ఈ కొరివి దయ్యాలు, వికృతమైన జంతువుల రూపం ధరించి, తమ నోటి వెంట మంటల్ని కక్కుతూ గాలిలో ఎగురుతూ కనిపిస్తాయి. అర్ధరాత్రి సమయాలలో చేపలు పట్టుకోవటానికి వెళ్ళిన బెస్తవాళ్ళు, అత్యవసర పనిమీద అర్ధరాత్రి సమయంలో ప్రయాణంచేసే ప్రయాణీకులు, తమకు హఠాత్తుగా కనిపించే ఈ విచిత్ర జీవుల్ని చూసి భయపడి, తమకు కనిపించిన దిక్కులో పరుగులు తీస్తారు. అయినప్పటికీ, ఆ విచిత్ర జంతువులు గాలిలో తేలుతూ వాళ్ళను వెంటాడతాయి, వాళ్ళు వాటి బారిని తప్పించుకోవటంకోసం పరుగెత్తి, పరుగెత్తి చివరికి అతి ప్రమాదకరమైన ముళ్ళ పొదల్లోకో లేదా ఏనుగు సైతం క్షణాల్లో మునిగిపోయే లోతైనా ఊబుల వద్దకు వెళ్లిపోతారు. అలా వెళ్ళిన వారిలో చాలామంది చనిపోవటం జరుగుతుంది. ఒకవేళ, అయినా ఆ వూబిలో లేదా ముళ్ళపొదలో చిక్కుకోకుండా బ్రతికి బైటపడ్డా వాళ్ళకి పిచ్చెక్కటం జరుగుతుంది. ఇలా ఎప్పుడైనా, కొరివి దయ్యాలు వెంటపడ్డప్పుడు మానవులు తమ ఒంటిపైన ఉన్న దుస్తులను తిరగేసి తొడుక్కున్నట్లయితే ఆ కొరివి దయ్యాలు వారిని వదిలిపెట్టి దూరంగా వెళ్ళిపోతాయని, అప్పుడు వాళ్ళకి సరైన దోవ కనిపిస్తుందని, ఆపై వాళ్ళు క్షేమంగా ఆ దోవ కుండా తాము చేరవలసిన ప్రదేశానికి చేరతారని ఫిలిప్పైన్స్‌కి చెందిన ఒక మంత్రవాది తెలియజేసాడు.

సాధారణంగా, అరణ్య ప్రాంతాలలో లేదా నిర్మానుష్యంగా ఉండే గ్రామీణ ప్రాంతాలలో ఒంటరిగా వెళ్ళే మనిషికి గాలిలో వెలుగుతున్న ఒక కాగడాలాగా లేదా ఒక పెద్ద అగ్నిగోళంలాగా ఉండే కొరివి దయ్యం కనిపిస్తుంది. ఆ వెలుగును చూసిన ఆ మనిషి ఒకవిధమైన మైకంలోకి (ట్రాన్స్) వెళ్ళిపోయి, ఆపై మంత్ర ముగ్ధుడిలాగా ఆ వెలుగు వెనకాలే నడుచుకుంటూ వెళ్ళిపోతాడు. అదృష్టం బాగుండి ఎవరైనా ఇంకో మనిషి ఎదురై, ఆపై ఇలా మైకంలో నడిచిపోతున్న మనిషిని పట్టుకుని ఆపితే ఆ మనిషి, కొరివిదయ్యం మాయ నుండి బైటపడతాడు. అలా కాకుండా ఆ సమయంలో ఏ మనిషీ ఉండకపోతే, మైకంలో ఉన్న మనిషి, కొరివిదయ్యం వెనకాలే నడుస్తూ, నడుస్తూ చివరికి ఏ ఊబిలోకో దిగిపోవటం లేదా సముద్రంలో లేదా నదిలోకి దూకి మునిగి చనిపోవటం జరుగుతుంది. ఇటీవల కాలంలో కూడా ఈ కొరివిదయ్యాలు, ఫిలిప్పైన్స్‌లోని కొన్ని రాష్ట్రాలలో అర్ధరాత్రి సమయాలలో కనిపించినట్లుగా ఆ దేశానికి చెందిన కొన్ని వార్తా పత్రికలలో వార్తలు వచ్చాయి.

**కామిగిన్ ద్వీపంలో మన్నాన్‌గల్ (స్త్రీ పిశాచి) యదార్ధ వృత్తాంతము?**

అనేక దీవుల కలయికతో ఏర్పడిన ఫిలిప్పైన్స్ దేశంలో అతీంద్రియ శక్తుల పట్ల విపరీతమైన విశ్వాసం ఈనాటికీ బలంగా ఉన్నది. ఆ ఫిలిప్పైన్స్ దేశంలోని కామిగిన్ అనే చిన్న దీవిలోని (రాష్ట్రం) ఒక చిన్న పట్టణంలో యదార్ధంగా జరిగిన గాథ ఇది. ఒక మధ్యవయస్కుడు, తన తాతగారికి ఎదురైన ఒక స్త్రీ పిశాచికి (మన్నాన్‌గల్) సంబంధించిన అనుభవాన్ని మనతో ఇలా పంచుకుంటున్నాడు...

కామిగాన్ ద్వీపంలోని మిండానో అనే చిన్న గ్రామంలో మా తాత నివసిస్తూ ఉండేవాడు. ఆయన, వృత్తి రీత్యా చేపలు పడుతూ ఉండేవాడు. అనగా, ఆయన ఒక బెస్తవాడు అన్నమాట. సాధారణంగా, ఫిలిప్పైన్స్ దేశంలోని వివిధ దీవుల్లో ప్రతిరోజూ ఏదో ఒక ప్రదేశంలో ఏదో ఒక ఉత్సవం లేదా తిరునాళ్ళు జరుగుతూ ఉంటాయి. ఆ ప్రకారమే, మా తాత నివసిస్తున్న మిండానో గ్రామానికి కొంచెం దగ్గరలో ఉన్న ఇంకొక చిన్న పట్టణంలో ఒకరోజున తిరునాళ్ళు జరుగుతున్నాయి. ఆ సమయంలో కోడి పందాలు జరుగుతాయి. కోడి పుంజుల కాళ్ళకు కత్తులు కట్టి, ఆపై ఒకదానిమీద ఒకటి ఉసికొలుపుతారు. ఆ తరువాత ఆ కోళ్ళమీద తమ శక్తి కొద్ది పందాలు కాస్తారు. ఆపై, ఆ రెండు కోళ్ళు చచ్చేవరకు నెత్తురు కారేలా కొట్టుకుంటాయి. చచ్చిపోయిన కోడిపుంజు ఓడిపోయినట్లుగా లెక్కిస్తారు. ఆ పోరాటంలో బ్రతికిన కోడిపుంజు గెలిచినట్లుగా గుర్తించి, దానిమీద పందెం కాసినవాళ్ళకి ఓడిపోయిన

కోడిపుంజు మీద పందెం కాసినవాళ్ళు డబ్బులు ఇస్తారు. ఫిలిప్పైన్స్ ప్రజలకు ఇష్టమైన ఆటలలో ఈ కోడిపందాలు అతి ముఖ్యమైనదని చెప్పుకుంటారు. మా తాతకి అయితే ఈ కోడి పందాలు ప్రాణం అని చెప్పుకోవచ్చు. ఎప్పటిలాగానే, సంవత్సరంలో ఒకరోజు, ప్రక్కనే ఉన్న చిన్న పట్టణంలో జరుగుతున్న తిరునాళ్ళ సందర్భంలో కోడిపందాలు  మొదలయ్యాయి.

మా తాత మంచి వయస్సులో ఉన్న సమయంలో కామిగాన్ రాష్ట్రం (ద్వీపం)లోని చాలా ప్రాంతాలలో అస్తవ్యస్తంగా ఉండే మట్టి రోడ్లు ఉండేవి. ఒక పట్టణం నుండి ఇంకొక పట్టణానికి కూడా ఇలాంటి మట్టి రోడ్లే ఉండటం విశేషం. ఇంకొక విశేషం ఏమంటే, ఈ రోడ్లు అన్నీ – దాదాపుగా సముద్రం గట్టుకి ప్రక్కన నుండే వెళుతూ ఉంటాయి. ఆ కాలంలోని చాలామంది ప్రజలకు ప్రయాణం చెయ్యటానికి సొంత గుర్రంగాని, బండిగాని ఉండేదికాదు. అందువల్ల ఆ రోడ్లమీదగా కాకుండా అడవులలో ఉండే కొండల మీదుగా వెళ్ళే అడ్డదోవల గుండా నడుస్తూ తాము చేరవలసిన ప్రాంతానికి వెళ్ళటం చాలామంది ప్రజలకు ఒక అలవాటుగా ఉండేది. మా తాతకి కూడా మా రాష్ట్రంలోని వివిధ ప్రాంతాలకు వెళ్ళే అడ్డదోవలు బాగా తెలుసు. అతడు చిన్నప్పటి నుండి ఈ అడ్డదోవల గుండా అనేక ప్రాంతాలకు వెళ్ళాడు. అందువలన కటిక చీకటిలో కూడా ఏమాత్రం పొరపాటు పడకుండా ఏ ప్రాంతానికి వెళ్లాలంటే ఆ ప్రాంతానికి వెళ్ళిపోయే శక్తి మా తాతకి బాగా ఉన్నదని మా ఇంట్లో అప్పుడప్పుడూ చెప్పుకుంటారు. ఏది ఏమైనా, మా తాత మా గ్రామానికి దగ్గరలో ఉన్న చిన్న పట్టణంలో జరిగిన కోడి పందాలలో పాల్గొన్నాడు. ఆ తరువాత అక్కడ తిరునాళ్ళలో దొరికే వస్తువుల్ని కొనుక్కున్నాడు. ఆపై, అక్కడ దొరికే దుకాణాలలో తనకు కావలసిన ఆహారాన్ని కొనుక్కుని కడుపునిండా తిన్నాడు. అప్పటికే చీకటి పడిపోయింది. ఇక, తన గ్రామానికి బయలుదేరాలని నిర్ణయించుకున్నాడు. అవి చీకటి రాత్రులు కావటం మరియు వెలుతురు ఏమాత్రం ఉండని అరణ్య మార్గం గుండా ప్రయాణించాల్సి రావటంతో మా తాత, కొన్ని ఎండిపోయిన కొబ్బరి ఆకుల్ని కట్టలుగా కట్టి, ఆపై, వాటిని తన ఎడమ భుజానికి ఉన్న సంచిలో పెట్టుకున్నాడు. కుడి భుజానికి ఉన్న సంచిలో – తాను తిరునాళ్ళలో కొన్న చిన్న చిన్న వస్తువుల్ని పెట్టుకున్నాడు. ఆ తరువాత వేగంగా నడుస్తూ ఆ పట్టణాన్ని దాటి, ఆపై అడ్డదోవ ఉన్న అరణ్యం సరిహద్దుకి చేరుకున్నాడు. అక్కడ నుండి – దోవ కనపడటం అసలు సాధ్యంకాదు కనుక, వెంటనే తన ఎడమ భుజం నుండి వ్రేలాడుతున్న సంచిలో నుండి ఒక కొబ్బరి ఆకుల కట్టను బైటకుతీసి దానిని వెలిగించాడు. ఆపై, మండుతున్న

ఆ కొబ్బరి ఆకుల కట్టను తన కుడిచేతిలో ఒక కాగడాలాకా ఎత్తిపట్టుకుని ఆ అడవి మార్గం గుండా నడవటం ప్రారంభించాడు. మార్గానికి అటు, ఇటు ఉన్న చెట్లయొక్క కొమ్మలు ఒకదానిని ఒకటి అల్లుకోవటం వల్ల, అవి ఆ మార్గంపైన ఒక దట్టమైన పందిరిలాగా కనిపిస్తున్నాయి. మా తాత ఆ కొబ్బరి ఆకుల కాగడా వెలుగులో ఆ చెట్ల పందిరి మధ్యగుండా వేగంగా నడుస్తూ ముందుకు వెళుతున్నాడు. సగం దూరం వెళ్ళిన తరువాత ఆయనకి ఏదో ఒక విచిత్రమైన శబ్దం వినిపించింది. దాంతో, ఆయన నడక వేగాన్ని తగ్గించి మెల్లిగా అడుగులు వెయ్యటం ప్రారంభించాడు.

ఇంతలో ఆ శబ్దం మరింత ఎక్కువగా వినపడటం మొదలయ్యింది. మా తాతకి ఆ శబ్దం ఎక్కడ నుండి వస్తుందో? తెలుసుకోవాలన్న ఆసక్తి కలిగింది. సహజంగా, ధైర్యవంతుడు అయిన మా తాత ఏమాత్రం బెదరకుండా ఆ శబ్దం ఎటువైపు నుండి వస్తున్నదో అటువైపు నిదానంగా అడుగులు వెయ్యటం ప్రారంభించాడు. కొంతదూరం నడిచిన తరువాత తాను, ఆ అరణ్యంలో ఇంతవరకు వెళ్ళని ప్రదేశానికి వెళుతున్నట్లుగా అర్థం చేసుకున్నాడు. ఇంతలో, ఆయన చేతిలోని కాగడా పూర్తిగా మండిపోవటంతో ఆరిపోయింది. ఆపై, ఆయన వెంటనే సంచిలోంచి ఇంకొక కొబ్బరి ఆకుల కాగడాను తీసి వెలిగించి చేత్తో పట్టుకుని ఆపై ఆ వెలుగులో ఆ ప్రాంతం అంతా పరిశీలనగా చూస్తూ ముందుకు వెళుతున్నాడు. అలా కొంతదూరం నడిచిన తరువాత ఒక చిన్న గుడిసె, కొంచెం దూరం నుండి అస్పష్టంగా ఆయనకు కనిపించింది. ఆపై, ఆయన ఆ గుడిసెకు వంద అడుగుల దూరం వరకు నడిచి ఆపై, పెద్ద స్వరంతో "ఏయ్! ఆ గుడిసెలో ఎవరైనా ఉన్నారా?" అని అరిచాడు. లోపల నుండి ఏ సమాధానమూ రాలేదు. దాంతో, ఆయన మరికొన్ని అడుగులువేసి ఆ గుడిసె దగ్గరకువెళ్ళి చూసాడు. ఆ గుడిసె చుట్టు ప్రక్కల ప్రాంతాలను పరిశీలనగా చూసినప్పుడు అక్కడ ఎవరో ఉంటున్నట్లుగా అనిపించింది. దాంతో, ఆయన ఆ గుడిసె లోపలికి వెళ్ళిచూసాడు. ఆ గుడిసెలో ఒకచోట ఒక పొయ్యి మండుతున్నది. ఇంతలో, ఆ గుడిసె వెనక భాగం నుండి ఎవరో నడుస్తూ ఆ గుడిసె దగ్గరకు వస్తున్నట్లుగా అడుగుల శబ్దం వినపడింది. దాంతో, ఆయన ఆ గుడిసెలోంచి బైటకువచ్చి గుడిసె వెనక్కివెళ్ళి చూసాడు.



అక్కడ అంతా చీకటిగా ఉన్నది. ఆపై ఆయన తన చేతిలో ఉన్న కొబ్బరి ఆకుల కాగడాను కొంచెం ముందుకి ఎత్తిపట్టుకుని ఆ ప్రాంతాన్ని పరిశీలనగా చూసాడు. అక్కడ, ఆయనకు నగ్నంగా ఉన్న రెండు కాళ్ళు మోకాళ్ళదాకా కనిపించాయి. ఆ తరువాత కాగడాని కొంచెం పైకి ఎత్తగానే నున్నగా మెరిసిపోతున్న బలమైన రెండు తొడలు కనిపించాయి. దాంతో, అక్కడ ఒక స్త్రీ నగ్నంగా నిలబడి ఉన్నదని మా తాతకి అర్ధమయ్యింది. ఆపై, ఆయన "ఏయ్! అమ్మాయ్ ఎవరు నువ్వు?" అన్నాడు పెద్ద స్వరంతో. అవతల వ్యక్తి నుండి ఎలాంటి సమాధానం రాలేదు. దాంతో, ఆయన మరికొంచెం దగ్గరకు వెళ్లాడు. అక్కడ కనపడిన దృశ్యంచూసి మా తాతకి కాసేపు నోట మాట రాలేదు. ఆయన గుండె ఒక్కసారిగా ఆగిపోయినట్లుగా అయ్యింది. అందుకు కారణం, కొంచెం దూరం నుండి చూసినప్పుడు పాదాల నుండి తొడలదాకా కనిపించిన ఆ స్త్రీ, దగ్గరకువెళ్ళి చూసేసరికి నడుము దగ్గర నుండి పైభాగం కనపడలేదు. కేవలము తొడలు వరకు మాత్రమే ఉన్నప్పటికీ ఆ తొడల తాలీకు కాళ్ళు, చాలా బలంగా నేలపై నిలబడటమే కాకుండా, అటు ఇటు నడుస్తూ ఉన్నాయి. కొద్దిసేపటి తరువాత మా తాత ఎలాగో తేరుకుని, అక్కడ నుండి తన శక్తికొద్ది పరుగెత్తుతున్నట్లుగా నడిచి తన గ్రామంవైపు వెళ్ళే మార్గానికి చేరుకున్నాడు. ఆ తరువాత చాలా వేగంతో నడుస్తూ మా గ్రామంలోకి వచ్చి, ఆపై మా ఇంట్లోకి ప్రవేశించి మంచంపై పడిపోయాడు. ఆ మర్నాడే మా తాతకి విపరీతమైన జ్వరం వచ్చింది. దాంతో మా అమ్మమ్మ ఒక మంత్రగాడిని మా ఇంటికి పిలిపించింది. ఆ మంత్రగాడు మా ఇంట్లో ఏవో పూజలుచేసి ఆపై మా తాత మెడలో ఒక మంత్రించిన పూసల దండను వేసాడు. అంతటితో మా తాతకి ఆరోగ్యం చక్కబడింది.



# 10. ఫిలిప్పైన్స్‌లో అర్ధరాత్రి తలుపులు తట్టే 'మూడు ప్రేతాత్మల' మర్మం?

ముఖాలకు ముసుగులు ధరించినట్లుగా కనపడే మూడు మానవాకార ప్రేతాత్మలను ఫిలిప్పైన్స్ దేశంలో 'కుమాకటక్' అని పిలుస్తారు. ఈ మాటకు 'తలుపులు

తట్టే ప్రేతాత్మలు' అని అర్థం. అర్ధరాత్రి దాటిన తరువాత ఈ ప్రేతాత్మలు, ఎవరి ఇంటి తలుపునైనా తట్టినట్లయితే అది ఆ ఇంట్లో ఉండే వారికి చెడు శకునం అని భావిస్తారు. ఈ మూడు మానవాకారాలు తమ ముఖాలకు నలుపు రంగు ముసుగులు ధరించి ఉండటంవల్ల వాటి ముఖాలు ఎలా ఉంటాయో? ఈనాటికీ ఎవరికీ తెలియదు. అయితే, ఆ మూడు ప్రేతాత్మలలో ఒకటి ఒక యువతి అని. మిగిలిన రెండు ప్రేతాత్మలు ఇద్దరు వృద్ధులుగా ఉంటారని కొందరు అనుభవజ్ఞులు తెలియజేస్తున్నారు.



సాధారణంగా, ఈ ప్రేతాత్మలు ఎవరి ఇంటి తలుపులు అయినా తట్టినట్లయితే ఆ ఇంట్లో ఉంటున్న, వృద్ధులు అయిన వ్యక్తులు లేదా తీవ్రమైన జబ్బుతో ఉన్న వ్యక్తులు, ఆపై అతి కొద్ది సమయంలోనే మరణిస్తారని ఫిలిప్పైన్స్ దేశంలో బలంగా విశ్వసిస్తారు. ఇంకొక విశేషం ఏమంటే, ఈ ప్రేతాత్మలు ఒక అర్ధరాత్రి – ఎవరి ఇంటి తలుపులు అయినా తట్టినట్లయితే ఆ తరువాత ఇంకొక రెండు అర్ధరాత్రులు వరుసగా ఆ ఇంటి తలుపులు తడతాయని నమ్ముతారు.

ఫిలిప్పైన్స్‌దేశంలోని లూజోన్ మరియు విసియాస్ రాష్ట్రాలలోని అనేక పట్టణాలలో, గ్రామాలలో నివసించే ప్రజలు తమ ఇంటి ప్రధాన ద్వారం తలుపులపైన తెలుపు రంగు సిలువలను చిత్రిస్తారు. ఈ సిలువ బొమ్మలు ఉన్న ఇంటి తలుపుల్ని

తట్టటానికి ఆ మూడు ప్రేతాత్మలు తీవ్రంగా భయపడతాయి. వీటికి, ఏ ఇంటి తలుపులపైన ఈ సిలువ బొమ్మలు కనిపిస్తే అవి, ఆ ఇంటి దగ్గర నుండి దూరంగా పారిపోతాయి. మళ్ళీ పొరపాటున కూడా ఆ తలుపుల దగ్గరకు రావు. ఒక విచిత్రం ఏమంటే, పైన పేర్కొన్న రెండు ఫిలిప్పైన్స్ రాష్ట్రాలలోని అనేక ప్రభుత్వ కార్యాలయాల పైన, ఆసుపత్రుల తలుపులపైన, చివరికి చర్చి తలుపుల పైన కూడా తెల్ల శిలువ బొమ్మలు చిత్రించబడి ఉంటాయి.

ఫిలిప్పైన్స్‌కి చెందిన ఒక పారాసైకాలజిస్ట్ అభిప్రాయం ప్రకారం చూసినట్లయితే – 'కుమాకటక్' అనే మూడు ప్రేతాత్మలు, అర్ధరాత్రి సమయాలలో వీధులలో సంచరిస్తూ, తమకు అక్కడ కనిపించే ఏ ఇంట్లో అయినా ముసలివారు లేదా వ్యాధిగ్రస్తులు ఉన్నట్లయితే ఆ ఇంటి తలుపులు తట్టి, ఆపై ఆ ఇంట్లో వాళ్ళు తలుపులు తీస్తే ఆ ఇంట్లోకి ప్రవేశించి ఆ ఇంట్లో ఉన్న వృద్ధుల లేక వ్యాధి గ్రస్తులయొక్క ఆత్మలను తమతోపాటు తీసుకువెళ్ళిపోవాలని అనగా, వాళ్ళను చంపాలని ఆ ప్రేతాత్మలు ప్రయత్నిస్తాయి. సాధారణంగా, ఈ ప్రేతాత్మలు ఏ ఇంటి తలుపుల్ని అయినా తట్టినట్లయితే మర్నాడు ఉదయానికి, ఆ ఇంట్లో ఉంటున్న వృద్ధులు లేదా వ్యాధిగ్రస్తులు చనిపోవటం జరుగుతుంది.



## 11. ప్రపంచ వ్యాప్తంగా "కొరివి దయ్యాలపై (Spectral lights) ఎలాంటి విశ్వాసాలు ఉన్నాయి?

చనిపోయిన మనుషుల ఆత్మలలో కొన్ని వెలుగుల రూపంలో కనిపిస్తాయని, భారతదేశంతో సహా ప్రపంచంలోని చాలా ప్రాంతాలలో ఈనాటికీ నమ్ముతున్నారు. అలాంటి ప్రేతాత్మలను తెలుగు రాష్ట్రాలలో – 'కొరివి దయ్యాలు' అని పిలుస్తారు. ఇక, పాశ్చాత్య దేశాలలో 'పిశాచదీపాలు' (Spectral lights) అనే పేరుతో పిలుస్తారు. ప్రేతాత్మలు, తమ చేతుల్లో వెలుగుతున్న కాగడాలను లేదా కొవ్వొత్తులను పట్టుకుని ఉంటాయని, అందువల్లే అవి ఉన్నచోట వెలుగులు వస్తూ ఉంటాయని ప్రపంచ వ్యాప్తంగా చాలామంది భావిస్తున్నారు. కానీ, పరిశోధనల్లో తేలిన విషయం ఏమంటే "ఆ ప్రేతాత్మలే వెలుగుల రూపంలో ఉంటాయి" అని. ఇలా, కనపడే వెలుగు దాదాపు 6 అంగుళాల పొడవు, 2 అంగుళాల వెడల్పు ఉంటుంది. కొన్ని సమయాలలో ఈ

వెలుగులు క్రికెట్‌బాల్ పరిమాణంలో అనగా గుండ్రటి రూపాలలో కనిపిస్తాయి. ఏదిఏమైనప్పటికీ, ఒక ప్రదేశంలో ఏదైనా కొరివి దయ్యం సంచరిస్తున్నట్లయితే ఆ ప్రాంతంలో, పగటిపూట సూర్యుడు కనిపిస్తున్నప్పుడు ఎంత వెలుతురు ఉంటుందో అంత వెలుతురు ఉంటుంది. కనుక ఇవి, కటిక చీకట్లో కూడా ఎంతో ప్రకాశవంతంగా కనిపిస్తాయి.

ఐరోపా ఖండంలోని అనేక దేశాలలో – చనిపోయిన వ్యక్తులయొక్క ఆత్మలలో కొన్ని, కాంతి గోళాలుగా మారి రాత్రి సమయాలలో నిర్మానుష్య ప్రాంతాలలో గాలిలో ఎగురుతూ కనిపిస్తాయని ఈనాటికీ నమ్ముతారు. పుట్టగానే చనిపోయిన పసిబిడ్డలయొక్క ఆత్మలు ఈవిధంగా వెలుగు గోళాలుగా అనగా కొరివిదయ్యాలుగా మారతాయని ఐరోపాలోని కొన్ని ప్రాంతాలలో చెప్పుకుంటారు. ఇక, డెన్మార్క్, ఫిన్‌లాండ్, స్వీడన్, ఇస్తోనియా, లాథ్వియా – దేశాలలో కొరివిదయ్యాలకు సంబంధించిన విశ్వాసాలు చాలా బలంగా ఉన్నాయని తెలుస్తున్నది. జనసంచారం అంతగాలేని ఏ ప్రదేశంలో అయినా సరే, రాత్రి సమయంలో ఈ వెలుగు గోళాలు లేదా కొరివి దయ్యాలు ఎగురుతూ కనపడినట్లయితే ఆ ప్రాంతంలో, బాగా లోతులో అమృతం లాంటి మంచినీళ్ళుగాని, గుప్త నిధులుగాని ఉంటాయని నమ్ముతారు. ఈ నమ్మకాన్ని ఆధారంగా చేసుకుని ప్రయత్నించిన కొంతమందికి గుప్తనిధులు దొరకటం జరిగింది. ముఖ్యంగా, ఫిన్‌లాండ్ మరియు ఇతర ఉత్తర ఐరోపాదేశాలలో వసంతకాల ప్రారంభ సమయంలో ఎక్కడైతే ఈ వెలుగు గోళాలు ఎగురుతూ ఉంటాయో ఆ ప్రాంతాలలో నేలలో త్రవ్వినట్లయితే నిధులు దొరుకుతాయని నమ్ముతున్నారు. ఇంకొక ముఖ్యవిశేషం ఏమంటే, కొందరు మంత్రగాళ్ళు భూమిలో ఒక ప్రదేశంలో నిధిని పాతిపెట్టి ఆ తరువాత తమ మంత్రశక్తితో, ఆ ప్రాంతంపైన రాత్రి సమయాలలో ఈ కాంతిగోళాలు అనగా కొరివి దయ్యాలు సంచరించేలా చేస్తారు. భవిష్యత్తులో ఎప్పుడైనా ఆ మంత్రగాడుగాని లేదా అతడి వారసులుగాని ఆ నిధులను పొందాలనుకున్నప్పుడు ఈ కొరివిదయ్యాలు ఎక్కడ ఎగురుతున్నాయో అక్కడే నిధులు ఉన్నాయని గుర్తించి అక్కడ త్రవ్వకాలు జరుపుతారు.

ఇక, U.K. (యునైటెడ్ కింగ్‌డమ్) దేశంలోని కొన్ని ప్రాంతాలలో రాత్రి సమయాలలో 'పిశాచ కొవ్వొత్తులు' (Corpse Candles) అనే వెలుగులు కనిపిస్తాయని చెప్పుకుంటారు. ఒక కొవ్వొత్తిని వెలిగించినప్పుడు ఎలాంటి వెలుగు వస్తుందో అలాంటి వెలుగు మాత్రమే కనిపిస్తుంది. దానికి మూలాధారమైన కొవ్వొత్తి లాంటి ఆకారం

కనపడదు. అయినప్పటికీ ఆ వెలుగు, కొవ్వొత్తి వెలుగులాగా ఉన్న కారణంగా ఆ వెలుగులకు "పిశాచ కొవ్వొత్తులు" అనే పేరు పెట్టటం జరిగింది. ఒక విచిత్రం ఏమంటే, ఆ ప్రాంతంలో ఏ గృహంలో అయినా ఒక మనిషి చనిపోయినప్పుడు అతని మృతదేహాన్ని శవపేటికలో పెట్టి, ఒక వాహనంలో ఆ శవపేటికను ఉంచి ఆపై ఆ వాహనాన్ని ఏదో ఒక మార్గం ద్వారా (రోడ్డుద్వారా) శ్మశానానికి చేరుస్తారు. ఒకవిశేషం ఏమంటే, ఈ శవపేటికను ఏ మార్గం ద్వారా అయితే శ్మశానానికి తీసుకువెళతారో, ఆ ముందురోజు రాత్రి, కొన్ని పిశాచ కొవ్వొత్తులు, చనిపోయిన వ్యక్తి ఇంటి నుండి శవపేటికను తీసుకువెళ్ళే రోడ్డుమీదుగా గాలిలో దాదాపు 30 అడుగుల ఎత్తులో ఎగురుతూ శ్మశానందాకా వెళ్ళి అక్కడ అదృశ్యం అయిపోతాయి. అయితే, కొన్నిసార్లు ఈ పిశాచ కొవ్వొత్తులు, పసుపు లేదా నీలం రంగుల్లో వెలిగే కాంతి గోళాల రూపంలో కనిపిస్తాయని చెబుతారు.

యు.కె. దేశంలోని వేల్స్ ప్రాంతంలో ఒక అసాధారణమైన విశ్వాసం ఈనాటికీ ప్రచారంలో ఉన్నది. అది ఏమిటంటే, ఈ ప్రాంతంలో ఏ వ్యక్తి ఇంటి పరిసరాల్లో అయినా, రాత్రి సమయంలో ఈ పిశాచ దీపాలు ఎగురుతూ కనిపించినట్లయితే అతి కొద్ది రోజుల్లో ఆ ఇంట్లో ఎవరో ఒక వ్యక్తి ఖచ్చితంగా చనిపోతాడని తెలుస్తున్నది.

దాదాపు ఒక శతాబ్దం క్రితం ఇంగ్లాండులోని ఒక ప్రాంతంలో నివాసం ఉంటున్న ఫ్రాంక్లిన్ అనే వ్యక్తి, ఒకరోజు ఉదయం ఓడమీద లండన్ నగరానికి వెళ్ళాడు. రాత్రి 9 గంటల సమయంలో అతని భార్య, రాత్రి భోజనం ముగించుకుని ఆపై మేడపైన ఉన్న తన గదిలోకి వెళ్ళిపోయిన నిద్రలోకి జారుకున్నది. సరిగ్గా, అర్ధరాత్రి 12 గంటల ప్రాంతంలో కాలింగ్‌బెల్ మ్రోగటంతో, ఆ భవనం క్రింద అంతస్తులో ఉన్న డ్రాయింగ్ రూంలో/లివింగ్‌రూంలో నిద్రపోతున్న ఆ ఇంటి పని మనిషికి మెళుకువ వచ్చింది. "ఇంత రాత్రివేళ కాలింగ్‌బెల్ ఎవరు కొడుతున్నారా?" అని ఆ పని మనిషి, కొద్దిగా ఆశ్చర్యపోయి ఆపై లేచివెళ్ళి మెయిన్ డోర్ తెరిచి చూసింది. అక్కడ ఎవరూ కనపడలేదు. ఆపై, ఆమె తలుపులు మూసేసి మళ్ళీ లోపలికి వచ్చింది. ఆ తరువాత ఆమె, ఏ కారణంచేతో మెయిన్‌డోర్ ప్రక్కన ఉన్న కిటికీ దగ్గరకువచ్చి కిటికీలోంచి బైటకు చూసింది. విచిత్రం! ఆ ఇంటి పోర్టికోలో చాలా వెలుతురు కనపడింది. అంత వెలుతురు అక్కడ ఎలా ఉన్నదో? అర్థంకాక, ఆమె ఆ కిటికీలోంచి కొంచెంసేపు పరిశీలనగా చూసింది. ఆ వెలుగులో ఆ ఇంటి యజయాని నిలబడి, ఆ ఇంటి మెయిన్‌డోర్‌వైపు పరీక్షగా చూస్తున్నాడు. తన యజమాని

అంత తొందరగా లండన్ నుండి ఎలా తిరిగి వచ్చాడో? ఆమెకు అర్థంకాలేదు. దాంతో, ఆమె మళ్ళీ తలుపు తీసింది. ఆశ్చర్యం! బైట పోర్టికోలో ఏ వెలుగు కనపడటంలేదు. అక్కడ అంతా చీకటిగా ఉన్నది. కీచురాళ్ళ శబ్దం వికృతంగా వినిపిస్తున్నది. తాను ఇంతకుముందు ఏదైనా భ్రమకు గురి అయి ఉంటాను అని, లేకపోతే, ఇందాక పోర్టికోలో కనిపించిన వెలుగులో తన యజమాని కనపడటం ఏమిటి? మరి ఇప్పుడు బైటకు వచ్చినప్పుడు పోర్టికోలో చీకటిగా కనడటం ఏమిటి? అని, తనకు తాను సర్ది చెప్పుకుని ఇంట్లోకి వెళ్ళిపోయింది.

మర్నాడు ఉదయం ఆ ఇంటి యజమానురాలికి లండన్ నుండి ఫోన్ వచ్చింది. ఆ ఫోన్ సందేశం ఏమంటే "నిన్న రాత్రి 11.55కి ఫ్రాంక్లిన్, హఠాత్తుగా గుండెపోటుతో చనిపోయాడు" అని. అంటే, తన ఇంటికి దూరంగా ఎక్కడో చనిపోయిన ఫ్రాంక్లిన్ ఆత్మ, చివరిసారిగా తన వాళ్ళను చూడాలని ఒక పిశాచ దీపం లేదా కొరివి దయ్యం రూపంలో అతని ఇంటికి వచ్చింది అన్నమాట.

దాదాపు 70 సంవత్సరాల క్రితం ఇంగ్లాండులోని ఒక 50 సంవత్సరాల వ్యక్తి ఒక శీతాకాలం అర్థరాత్రి సమయంలో హఠాత్తుగా నిద్రలేచి చూసినప్పుడు అతని గదిలో పట్టపగలు ఎంత వెలుతురు ఉంటుందో అంత వెలుతురు కనిపించింది. దాంతో, అతడు ఎంతో కంగారుకి గురై ఆపై తన ప్రక్కనే బెడ్‌మీద నిద్రపోతున్న తన భార్యను కంగారుగా నిద్రలేపాడు. ఆమె కూడా నిద్రలేచి ఆ వెలుగును చూసి భయానికి గురైంది. పది నిమిషాలు గడిచే సరికి ఆ వెలుగులు మాయం అయిపోయాయి. ఎప్పటిలాగానే, అతి కొద్ది కాంతిని ఇచ్చే జీరోవాల్ట్ బల్బు వెలుగుతూ కనపడింది. అయినప్పటికీ, ఆ వ్యక్తికి ఆ వెలుగులను చూడటం వల్ల కలిగిన ఆందోళన తెల్లవారేదాకా పోలేదు. ఆపై, ఉదయం 8 గంటలకు అతనికి అతని మేనేజరు నుండి ఒక ఫోన్ వచ్చింది. ఆ ఫోను ద్వారా అతనికి తెలిసిన సమాచారం ఏమంటే, "సముద్రంలోకి వేటకు వెళ్ళిన అతడి ఫిషింగ్ బోట్లు (చేపలు పట్టటానికి వెళ్ళే బెస్తవారు ఉపయోగించే, పెద్ద సైజులో ఉండే స్టీమర్లు) నిన్న రాత్రి 10 గంటలకు సముద్ర మధ్యలో మునిగిపోయాయి". ఒకవ్యక్తికి ఏదైనా చెడు జరిగినప్పుడు, కొన్నిసార్లు, అతడు ఉండే ప్రదేశంలో హఠాత్తుగా విపరీతమైన వెలుగు కనిపిస్తుందని పాశ్చాత్య దేశాల్లో విశ్వసిస్తారు. బహుశా, ఈ ఉదంతంలో ఆ వ్యక్తికి చెందిన మరియు మునిగిపోయిన ఫిషింగ్ బోట్లలలో ప్రయాణిస్తూ, ఆపై ఆ ఫిషింగ్ బోట్లతో పాటుగా సముద్రంలో మునిగి చనిపోయిన ఎవరో ఒక బెస్తవాడియొక్క ఆత్మ,

పడవలో మునిగిపోయిన విషయం చెప్పటానికి అతడి గదిలోకి వచ్చిందని ఆ తరువాతకాలంలో అతడు గ్రహించటం జరిగింది.

సహజంగా, ఈ కొరివి దయ్యాలు, అర్ధరాత్రి 12 నుండి తెల్లవారుఝామున 2 గంటల వరకు మధ్య ఉన్న సమయంలో కనిపిస్తాయని నమ్ముతున్నారు. దాదాపు, ఒక శతాబ్దం క్రితం ఐర్లాండ్‌లో ఒక ధనికుడు ఉండేవాడు. అతడు వృద్ధుడు కానీ, అతడి భార్య మంచి యవ్వనంలో ఉన్నది. ఎలాగైనా సరే, వృద్ధుడైన తన భర్తని పైకి పంపించి, ఆపై అతడి ఆస్థిని తాను సొంతం చేసుకోవాలని ఆ యువతి పథకం వేసింది. ఆ పథకం ప్రకారమే ఆమె, విస్కీలో విషం కలిపి ఆపై దానిని వృద్ధుడైన తన భర్తతో త్రాగించింది. ఆ విషం ఫలితంగా ఆమె భర్త, అర్ధరాత్రి సమయానికి రక్తం కక్కుకుని చనిపోయాడు. ఆపై, ఆమె ఇంటికి పోలీసులు వచ్చి, ఆమె భర్త హత్య ఎలా జరిగిందో? చెప్పమని, ఆమెను గుచ్చి గుచ్చి అడిగారు. చిన్న వయస్సులోనే అపారమైన గుండె ధైర్యాన్ని మరియు బరి తెగింపుని కలిగి ఉన్న ఆ యువతి, ఆ హత్య గురించి తనకు ఏమాత్రం తెలియదని చాలా ప్రశాంతమైన స్వరంతో చెప్పింది. ఇక చేసేది లేక, పోలీసులు వెళ్ళిపోయారు. ఆ వృద్ధ ధనికుడికి ఘనంగా అంత్యక్రియలు నిర్వహించింది ఆ యువతి. ఈ సంఘటన జరిగిన 9వ రోజు తెల్లవారుఝామున 2 గంటలకు ఆ యువతికి హఠాత్తుగా మెళుకువ వచ్చింది. ఆపై, ఆమె నిద్రలేచి తన గదిలోంచి మెయిన్ హాల్‌లోకి వచ్చింది. ఆ తరువాత ఒక సిగరెట్ అంటించుకుని తాపీగా పొగపీలుస్తూ బాల్కనిలోకి వచ్చింది. దాదాపు 6 అడుగుల వెడల్పు మరియు 18 అడుగుల పొడవు ఉన్న ఆ విశాలమైన బాల్కనిలో నిలబడి సిగరెట్ కాలుస్తున్న ఆ యువతికి సరిగ్గా 3 అడుగుల దూరంలో క్రికెట్‌బాల్ సైజులో ఉన్న ఒక కాంతిపుంజం కనపడింది. అలా హఠాత్తుగా ఆ కాంతి పుంజం దర్శనమిచ్చే సరికి ఆ యువతి విపరీతమైన భయానికి గురైంది. దాంతో, ఆమె నోట్లోని సిగరెట్ ఎగిరి దూరంగా పడింది. ఆమె భయంతో వణకిపోతూ ఆ కాంతి పుంజంకేసి పరిశీలనగా చూస్తున్నది. ఇంతలో, ఆ కాంతి పుంజం గాలిలో గిరికీలు కొడుతూ ఆ బాల్కనీ అంతా ఐదారుసార్లు తిరిగింది. ఆపై, ఆ కాంతి పుంజం అదృశ్యం అయిపోయి, ఆ స్థానంలో ఆ బాల్కనీ అంతా పట్టపగలు లాగా బాగా వెలుతురు వచ్చింది. అక్కడ జరుగుతున్న మార్పులను చూసి ఆ యువతి నోట మాట రాక శిలా విగ్రహంలాగా నిలబడిపోయింది. ఇంతలో, ఆమె ముందు ఆమె భర్త ప్రత్యక్షం అయ్యాడు. ఆపై, అతడు గర గర లాడుతున్న విచిత్రమైన స్వరంతో “ఏయ్! మనిషి రూపంలోని రాక్షసి! నా ఆస్తిని కాజేయటానికి నన్ను విషం పెట్టి చంపావు. మనిషిగా బ్రతుకుతున్న నన్ను పిశాచంగా

మార్చావు. నిన్ను, నేను ఇవాల్టి నుండి 9 రోజులలోగా ఖచ్చితంగా చంపేస్తాను ఇది నిజం" అన్నాడు. ఆపై, కొద్ది నిమిషాల్లోనే ఆ బాల్కనిలోని వెలుగు అదృశ్యం అయిపోయింది. అలా ఆ వెలుగు మాయం అయిపోయిన మరుక్షణం ఆ యువతి ఒక్కసారిగా స్పృహ తప్పి నేలపై పడిపోయింది. ఆ రోజు ఉదయం 12 గంటలకు ఆమె, పోలీసు అధికారులను కలుసుకుని వాళ్ళతో ఇలా చెప్పింది.

"డబ్బుకోసం ఆశపడి నా భర్తను విషంపెట్టి చంపాను. ప్రస్తుతం, అతడు కొరివి దయ్యంగా మారి నన్ను చంపటానికి ప్రయత్నిస్తున్నాడు. నన్ను అరెస్టుచేసి జైలులో పెట్టండి. అక్కడ అయితేనే నేను ప్రాణాలతో బ్రతుకుతాను అన్న ఆశ ఉన్నది". ఆపై, ఆ పోలీసు అధికారులు ఆమెను అరెస్టుచేసి కోర్టులో ప్రవేశపెట్టారు. ఆమె నేరం ఒప్పుకుంది కనుక, ఆమెకు 10 సంవత్సరాలు జైలుశిక్ష వేసారు. ఆ శిక్ష పూర్తి అయిన తరువాత ఆమె తన ఇంటికి వచ్చింది. ఆపై, ఆ రోజు భోజనం చేసి రాత్రి కాగానే తన బెడ్‌రూంలోకి వెళ్ళి మంచంమీద పడుకుని నిద్రపోయింది. మర్నాడు తెల్లవారినా ఆమె నిద్ర లేవలేదు. కారణం, ఆ రోజు తెల్లవారుఝాము సమయంలో ఆమెను ఆ భర్త ప్రేతాత్మ చంపేసింది.

యునైటెడ్ కింగ్‌డమ్ (యు.కె.) దేశంలోని చాలా ప్రాంతాలలో అర్ధరాత్రి సమయాలలో శ్మశానాలలో ఉండే కొన్ని సమాధులపై కొవ్వొత్తులు వెలుగుతున్నట్లుగా వెలుగులు కనిపిస్తాయి. వీటిని "పిశాచ కొవ్వొత్తులు" (Corpse candles) అంటారు. అయితే, ఈ వెలుగులు ఆయా సమాధుల మీద కదలకుండా నిలబడిపోయి ఉంటాయి. ఆ సమాధులలో ఉండే ఆత్మలే ఆ వెలుగుల రూపంలో ఆ సమాధులపైకి వచ్చి నిలబడుతూ ఉంటాయని పారాసైకాలజిస్టులు అభిప్రాయ పడుతున్నారు.

1984వ సంవత్సరంలోని జనవరి మొదటి వారంలో ఒకరోజున ఒక రష్యన్ పాసింజర్ క్రాఫ్ట్ (ప్రయాణీకులు తీసుకువెళ్ళే విమానం) ఆకాశంలో ఎగురుతున్నప్పుడు దాదాపు 4 అంగుళాల వ్యాసార్ధంగల ఒక ప్రకాశవంతమైన బంతిలాంటి కాంతిపుంజం ఆ విమానంలోకి ప్రవేశించి, ఆపై ఆ విమానంలో వరుసగా, సీట్లలలో కూర్చున్న ప్రయాణీకుల తల భాగం పైన అనగా దాదాపు 12 అంగుళాల ఎత్తులో, సుమారు ఐదు, ఆరు నిమిషాలపాటు ఎగిరి, ఆపై ఆ విమానం తోకభాగం (Tail Section) వైపుకి వెళ్ళాయి. ఆ తరువాత ఆ ప్రాంతంలో ఆ కాంతి పుంజం రెండు అర్ధచంద్రాకారాలుగా విడిపోయి, ఆపై మళ్ళీ కలిసిపోయి ఒక కాంతి పుంజంగా మారింది. ఆ తరువాత ఏమాత్రం శబ్దంలేకుండా, విమానానికి ఉన్న రెండు చిన్న

కంతల ద్వారా బైటకు వెళ్ళిపోయింది. - ఈ కాంతి పుంజం ఏమిటో?, అది ఏ కారణంగా ఆ విమానంలోకి ప్రవేశించిందో?, విమానానికి ఏ హానీ చెయ్యకుండా ఎలా బైటకు వెళ్ళిపోయిందో? ఇప్పటికీ ఏ భౌతిక శాస్త్రజ్ఞుడికి అంతు పట్టటంలేదు. విమాన ప్రమాదంలో చనిపోయిన ఒకవ్యక్తి యొక్క ఆత్మ ఆ కాంతి పుంజం రూపంలో విమానంలోకి ప్రవేశించి ఉంటుందని రష్యాకు చెందిన కొందరు పారాసైకాలజిస్ట్‌లు అభిప్రాయపడ్డారు.

దాదాపు ఒక 70 సంవత్సరాల క్రితం ఇంగ్లాండులోని ఒక కాలేజి ప్రొఫెసర్, బాగా అందంగా ఉండే మరియు తన స్టూడెంట్ అయిన ఒక అమ్మాయిని పెళ్ళి చేసుకుంటానని నమ్మించి, ఆమెతో కొంతకాలంపాటు శృంగార సుఖాలు అనుభవించాడు. ఆ తరువాత ఆమెను మర్చిపోయి ఇంకొక స్త్రీని వివాహం చేసుకున్నాడు. ఈ విషయం తెలుసుకున్న ఆ అమ్మాయి తన ప్రొఫెసర్ ఇంట్లోకివెళ్ళి అతడితో చాలాసేపు తగాదా పడింది. ఆ తరువాత ఆమె ఆ ఇంట్లోంచి బైటకు రాలేదు. ఆ అమ్మాయిని ఆ ప్రొఫెసరే హత్య చేసి ఉంటాడని ఆ ప్రాంతంలోని ప్రజలు అనుమానించారు. అయితే, ఆ అమ్మాయి మృతదేహం దొరకని కారణంగా ఆ అమ్మాయిని ఆ ప్రొఫెసరే హత్యచేశాడని పోలీసులు నిరూపించలేకపోయారు. ఫలితంగా, ఆ ప్రొఫెసర్ నిర్దోషిగా బైట పడ్డాడు.

ఈ సంఘటన జరిగిన కొద్ది రోజుల తరువాత ప్రతిరోజూ అర్ధరాత్రి సమయంలో ఆ ప్రొఫెసర్ గదిలోకి ఒక స్త్రీ రూపం వస్తూ ఉండేది. ఆ రూపం అస్పష్టంగా మాట్లాడుతూ ఉండేది. ప్రొఫెసర్ ఇంట్లో ఉండే పనివాళ్ళు ఆ ప్రొఫెసర్ గది బైట నిలబడి లోపలికి తొంగి చూసినప్పుడు అసంపూర్ణంగా ఉన్న ఒక స్త్రీ రూపం ఆ ప్రొఫెసర్ ముందు నిలబడి ఉన్నట్లుగా కనిపించేది. ఆమె, అతనితో ఏదో చెబుతూ ఉండేది. అతడు భయంతో వణకిపోతూ ఆ రూపంవైపు గుడ్లు మిటకరించి చూస్తూ ఉండేవాడు. తనకు ఇచ్చిన మాటను తప్పి, ఇంకొక స్త్రీని వివాహం చేసుకున్న ఆ ప్రొఫెసర్‌ని శిక్షించటంకోసం ఆ అమ్మాయి ఆత్మ, తరచుగా ఆ ప్రొఫెసర్ గదిలోకి వచ్చి అతడిని భయపెడుతూ ఉండేది. ఒక విచిత్రం ఏమంటే, ఆ ప్రొఫెసర్, తన స్టూడెంట్ అయిన ఆ అమ్మాయిని హత్య చేసిన విషయం ఆ ప్రొఫెసర్‌కి మరియు అతడి చేతిలో హత్యకు గురై, ఆపై ప్రేతాత్మగా మారిన ఆ అమ్మాయికి తప్ప మూడో వ్యక్తికి తెలియదు. అందువలన, ఆ ప్రొఫెసర్ గదిలోకి ప్రతిరోజూ అర్ధరాత్రి సమయంలో వస్తున్నది ఎవరో అమ్మాయి అనుకున్నారేగాని, ఒక అమ్మాయియొక్క

ప్రేతాత్మ అని ఆ ప్రొఫెసర్ ఇంట్లోని పనివారికి తెలియదు. ఏదిఏమైనా, తరచుగా ఆ అమ్మాయి ప్రేతాత్మ, అతడికి కనపడటంతో కొన్నాళ్ళకు ఆ ప్రొఫెసర్‌కి మతిచలించిపోయింది. ఆపై, ఒకరోజు అర్ధరాత్రి ఆ ప్రొఫెసర్ పెద్దగా అరుస్తూ, తన మేడమీదకువెళ్ళి, అక్కడ నుండి క్రిందకు దూకాడు. దాదాపు 50 అడుగుల ఎత్తు ఉన్న ఆ మేడ మీద నుండి క్రింద ఉన్న ఒక పెద్ద బండరాయిమీద పడ్డ ఆ ప్రొఫెసర్ తల పగిలిపోయి అక్కడికక్కడే చనిపోయాడు. ఆ తరువాత ఏ రోజూ ఆ ప్రొఫెసర్ గదిలో ఆ అమ్మాయి రూపం ఎవరికీ కనపడలేదు.

చాలా ఏళ్ళక్రితం ప్రష్యా రాజ్యాన్ని (జర్మనీ), రెండవ ఫ్రెడరిక్ అనే రాజు పరిపాలిస్తున్న కాలంలో ఆయన రాజ్యంలోని క్వారే అనే గ్రామంలో ఒక కాథలిక్ క్రైస్తవ ప్రీస్ట్ నివసిస్తూ ఉండేవాడు. ఆయన దగ్గర, బాగా రుచిగా వంటలు చేసే ఒక వంటవాడు ఉండేవాడు. ఆ వంటవాడు ఆ ప్రీస్ట్ దగ్గర చాలా ఏళ్ళపాటు వంట చేసాడు. దురదృష్టవశాత్తు, ఆ వంటవాడు ఒకరోజు అర్ధరాత్రి గుండె ఆగి చనిపోయాడు. కొద్ది రోజుల తరువాత ఒక మధ్యవయస్సు స్త్రీ, ఆ ప్రీస్ట్ దగ్గర వంట మనిషిగా చేరింది. ఆమెకు రెండు రోజులు అక్కడే బాగానే గడిచింది. మూడవ రోజు అర్ధరాత్రి దాటిన తరువాత వంటవాడియొక్క ఆత్మ, ఆమె దగ్గరకు వచ్చి ఆపై వికృతమైన స్వరంతో ఆమెను ఇలా నిందించాడు. "నీకు ఎంత ధైర్యం. నా ఉద్యోగంలోకి నువ్వు వస్తావా? మర్యాదగా ఇక్కడి నుండి వెళ్ళిపో. లేకపోతే ఖచ్చితంగా నిన్ను చంపేస్తాను". ఈవిధంగా అనేకసార్లు ఆ ప్రేతాత్మ, వెలుగు రూపంలో ఆ గదిలోకి రావటం, ఆపై అస్పష్టంగా ఉన్న మానవ రూపం ధరించి ఆమెను బెదిరించటం జరిగింది. ఆ ప్రేతాత్మ బాధ తట్టుకోలేని ఆ స్త్రీ, ఆపై కొద్ది రోజుల్లోనే వంట మనిషి ఉద్యోగం వదిలిపెట్టి దూరంగా వెళ్ళిపోయింది. ఆ తరువాత ఎంతమంది వంటవాళ్ళు వచ్చినా వాళ్ళందరూ ఆ వంటవాడి ప్రేతాత్మ పెట్టే బాధలు తట్టుకోలేక వచ్చిన రెండు రోజులకే పారిపోయేవాళ్ళు. ఫలితంగా, ఆ కాథలిక్ ప్రీస్ట్ తన వంట తానే వండుకుని తినాల్సి వచ్చింది.

ఆ సమయంలో ఆ ప్రాంతంలో నివసించే ఒక ధనికుడి ఇంట్లో పనిచేసే ఒక వంటవాడు చనిపోయాడు. ఆ వంటవాడు ఆ ఇంట్లోని అన్ని పనులు ఎంతో శ్రద్ధతో చేస్తూ ఉండేవాడు. ఒక సమయంలో ఆ వంటవాడు చనిపోయాడు. ఆ తరువాత ఆ ఇంట్లోకి ఇంకొక వంటవాడు వచ్చాడు. విశేషం ఏమంటే, ఆ వంటవాడు ఉదయం లేచి ఇంట్లో పనులు ప్రారంభించాలి అనుకుంటున్న సమయంలో, ఆ ఇంట్లో – ఒక

వెలుగు గాలిలో తేలుతూ కనిపించేది. ఆ తరువాత 10 నిమిషాలకు ఆ వెలుగు అదృశ్యం అయిపోయేది. ఆ తరువాత ఆ వంటవాడు చిమ్మకుండానే ఆ ఇల్లంతా శుభ్రంగా ఊడ్చినట్లుగా కనిపించేది. పొయ్యిక్రింద మంట ఆ వంటవాడి ప్రయత్నం లేకుండానే మండేది. ఇంట్లో లైట్లు, వాటంతట అవే వెలుగుతూ ఆరుతూ ఉండేవి. తన యజమాని పట్ల తనకు ఉన్న విశ్వాసాన్ని, అభిమానాన్ని వదులుకోలేకపోయిన గత, వంటవాడియొక్క ప్రేతాత్మ ఆ ఇంట్లోకి వచ్చి అన్ని పనులు చేస్తున్నదని కొద్ది రోజుల్లోనే ఆ ప్రాంతంలో తెలిసిపోయింది. దాంతో, కొంచెం ధైర్యం ఉన్నవాళ్ళు ఆ ఇంట్లో జరిగే వింతలు చూడటానికి వస్తూ ఉండేవాళ్ళు.

**జపాన్‌లో కొరివి దయ్యాలు :**

జపాన్ జానపద గాథలలో మరియు మంత్రశాస్త్రంలో చెప్పబడిన సమాచారం ప్రకారం చూసినట్లయితే, కొన్ని సమయాలలో కొంతమంది మానవులు – చనిపోయిన తరువాత వాళ్ళ ఆత్మలు ఆ మనుషులు చనిపోయిన ప్రదేశంలోనే చాలాకాలంపాటు సంచరిస్తూ ఉంటాయి. ఈ ఆత్మలు అర్ధరాత్రి దాటిన తరువాత చిన్న పరిమాణంలో ఉండే కాంతిగోళాల రూపంలో గాలిలో ఎగురుతూ కనిపిస్తాయి. వీటిని జపాన్ భాషలో 'హితోడమా' అని పిలుస్తారు. ఈ పదానికి "మానవ ఆత్మ" అని అర్థం. ముఖ్యంగా, వర్షాకాలంలోని అర్ధరాత్రి సమయాలలో ఈ హితోడమా అనే ఆత్మలు పూర్తి నీలిరంగులో ఉండే కాంతి పుంజాల లాగా కనిపిస్తాయని, కొన్ని శతాబ్దాల క్రితం రచించబడిన అనేక జపాన్ గ్రంథాలలో చెప్పబడి ఉన్నది. జపాన్‌లోని అన్ని రాష్ట్రాలలోను (ప్రావిన్స్) ఈ కాంతిపుంజాలు కనిపిస్తున్నట్లుగా తెలుస్తున్నది. అయితే, కొన్ని ప్రాంతాలలో ఇవి నీలం రంగులోను, మరికొన్నిచోట్ల ఎరుపురంగులోను, మరికొన్నిచోట్ల నారింజ రంగులోను కనిపిస్తున్నాయి. అంతేకాకుండా, కొన్ని ప్రదేశాలలో ఈ కాంతిపుంజాలకు ఒక తోకకూడా ఉన్నట్లుగా తెలుస్తున్నది. కొన్ని కాంతిపుంజాలు, పగటిపూట బాగా మబ్బుపట్టి ఉన్నప్పుడు కూడా కనిపించినట్లుగా చెప్పుకుంటారు.

ఇక, వొకినావా రాష్ట్రంలో ప్రచారంలో ఉన్న ఒక సిద్ధాంతం ప్రకారం చూసినట్లయితే, ఆ ప్రాంతంలో ఏ గృహంలో అయినా ఒక బిడ్డ పుట్టటానికి ముందురోజు అర్ధరాత్రి ఆ గృహానికి చాలా దగ్గరలో దాదాపు 30 అడుగుల ఎత్తులో గాలిలో ఎగిరే ఈ కాంతి పుంజాలు కనిపిస్తాయని చెప్పుకుంటారు. ఇప్పటికీ, జపాన్ గ్రామీణ ప్రాంతాలలో ఇలాంటి విశ్వాసాలు బలంగా ఉండటం విశేషం. ఇంకొక

ముఖ్య విశేషం ఏమంటే, ఈ కాంతి పుంజాలు ఆరు అంగుళాల పొడవు ఉండే, అగ్ని జ్వాలల రూపంలో కనిపిస్తాయని చెబుతారు. ఇలాంటి జ్వాలలను చూసిన వ్యక్తికి త్వరలోనే మరణం సంభవిస్తుందని చెబుతారు.

ఒక ప్రదేశంలో ఉండే ప్రత్యేక వాతావరణ పరిస్థితుల కారణంగా ఈ కాంతి పుంజాలు కనిపిస్తాయని, చాలామంది అనుకున్నట్లుగా ఇవి ఆత్మలు కావని కొందరు హేతువాదులు మరియు సైన్స్‌ని మాత్రమే నమ్మే శాస్త్రజ్ఞులు వాదిస్తూ ఉంటారు. అయితే, ఈ కాంతి పుంజాలపై విస్తారంగా పరిశోధనలు చేసిన కొందరు పారాసైకాలజిస్ట్‌లు ఇలా చెప్పారు. "ఈ కాంతిపుంజాలు, వాతావరణ పరిస్థితుల కారణంగా ఏర్పడినపమాట నిజమే అయితే, అవి ఏదో ఒక ప్రదేశంలో కొంతసేపు కనిపించి ఆ తరువాత అదృశ్యం అయిపోవాలి. కానీ, ఈ కాంతి పుంజాలు, తాము ఎక్కడికి వెళ్ళాలో తెలిసి ఉన్నట్లుగా కొన్ని నిర్ణీత లక్ష్యాలవైపు (అవి గృహాలు కావొచ్చు లేదా బౌద్ధ ఆలయాలు కావొచ్చు.) ప్రయాణిస్తూ ఉంటాయి. అంతేకాదు, ఇవి - ఇళ్ళయొక్క తెరిచిన తలుపుల మధ్య నుండి లేదా తెరిచి ఉన్న కిటికీ ఊచల మధ్య నుండి గృహాలలోకి ప్రవేశిస్తూ ఉంటాయి. అంతేకాదు, వాటికి ఒక ఆలోచన మరియు జ్ఞానం ఉన్నట్లుగా, అవి కొన్ని నిర్ణీత ప్రదేశాలలోకి ప్రవేశించి, అక్కడ కొంతసేపు గాలిలో ఎగిరి ఆపై బైటకు వెళ్ళిపోతాయి".

ప్రాచీన జపాన్ దేశంలోని కవాచి మరియు కాన్‌బా రాష్ట్రాలలోని గ్రామీణ ప్రాంతాలలో రాత్రి సమయాలలో "ఉబగాబి" అనే పేరుగల ఒక కొరివి దయ్యం సంచరిస్తూ ఉండేదని ఆనాటి జపనీస్ చారిత్రక గ్రంధాలలో చెప్పబడి ఉన్నది. జపాన్ భాషలో ఉబగాబి అనగా "వృద్ధురాలియొక్క జ్వాల/ఆత్మ" అని అర్థం. కవాచి రాష్ట్రంలోని హిరోక అనే ప్రాంతంలో ఒక వర్షపురాత్రి ఒకవ్యక్తి నడుచుకుంటూ వెళుతున్నప్పుడు, అతడికి దాదాపు 30 సెం.మీ. వైశాల్యాన్ని కలిగి ఉన్న ఒక అగ్నిగోళం - నేలమీద నుండి 12 అడుగుల



"ఉబగాబి"

ఎత్తులో గాలిలో తేలుతూ కనిపించింది. తొలిసారిగా ఆ ప్రాంతంలో ఆ వెలుగుగోళం అప్పుడే కనిపించింది అని చెబుతారు. అప్పటికి కొద్ది రోజుల క్రితం ఒక వృద్ధురాలు ఆ ప్రాంతంలోని ఒక బుద్ధుడి ఆలయంలో నుండి తన అవసరాలకోసం కొంత నూనెని దొంగతనంగా తీసుకువెళ్ళింది. ఆలయంలో నూనెను దొంగిలించిన కారణంగా ఆమెకు శాపం తగిలింది. ఫలితంగా, ఆమె ఒక జ్వాలగా మారిపోయింది అనగా కొరివిదయ్యంగా మారింది. ఆ తరువాత ఆమె ఎన్నోసార్లు, రాత్రుల సమయాలలో నిర్మానుష్య ప్రాంతాలలో గాలిలో ఎగురుతూ చాలామందికి కనిపించింది.

ఒక సమయంలో కవాచి ప్రాంతంలోని ఒక రోడ్డుమీద అర్ధరాత్రి సమయంలో ఒకవ్యక్తి నడిచి వెళుతున్నాడు. ఇంతలో, హఠాత్తుగా అతని ముందు ఒక వెలుగు గోళం (ఫుట్‌బాల్ పరిమాణంలో ఉన్న ఒక ఎర్రటి వెలుగు) ప్రత్యక్షం అయ్యింది. ఆ వెలుగు గోళాన్ని చూడగానే ఆ వ్యక్తి, నడక ఆపేసి భయంతో వణకిపోతూ అక్కడే నిలబడి పోయాడు. ఇంతలో ఆ వెలుగుగోళం, వికృతమైన ఒక వృద్ధురాలి రూపంలోకి మారిపోయింది. ఆ రూపాన్ని చూడగానే ఆ వ్యక్తి నోట్లోంచి అప్రయత్నంగా “ఉబగాబి” అనే మాట బైటకు వచ్చింది. అంతే, ఆ వృద్ధురాలి ప్రేతాత్మ తన కుడిచేత్తో ఆ యువకుడి ముఖంమీద గట్టిగా కొట్టింది. ఆ దెబ్బకి ఆ యువకుడు నేలపై పడి మూర్ఛపోయాడు. కొన్నిసార్లు, ఈ ఉబగాబియొక్క వెలుగు ఎవరికైనా కనపడి, ఆపై అది ఆ మనిషి దగ్గరకు రాగానే కోడి రూపంలో ఉండే ఒక విచిత్రమైన పక్షిలాగా మారిపోతుంది. ఈ ఉబగాబి, కొన్నిసార్లు మానవులయొక్క వెనకవైపు నుండి వచ్చి ఆపై కొద్ది అడుగుల దూరంలో గాలిలో నిలబడి ఆ వ్యక్తి వీపువైపు తీవ్రంగా చూసి ఆపై అక్కడ నుండి అటే వెనక్కి వెళ్ళిపోతుంది. ఆవిధంగా ఉబగాబి యొక్క “దృష్టికి” గురైన మానవుడు ఆపై మూడు నెలలలోగా చనిపోతాడని చెబుతారు. ఎప్పుడైనా, ఎవరికైనా ఈ ఉబగాబి అనే కొరివిదయ్యం ఎదురై ఆపై ఒక వృద్ధురాలి రూపంలోకి మారి, తనకు ఎదురుగా ఉన్న మనిషిని కొట్టాలని ప్రయత్నించినప్పుడు ఆ మనిషి పెద్ద స్వరంతో “అబురా–సషీ” (ఓ నూనె దొంగా!) అని అరిస్తే, ఆ మరుక్షణమే ఉబగాబి అక్కడ నుండి అదృశ్యం అయిపోతుందని ఆ ప్రాంతంలో విశ్వసిస్తారు.

అమెరికా దేశంలోని చాలా శ్మశానాలలో అర్ధరాత్రి సమయాలలో కొన్ని కాంతిగోళాలు గాలిలో ఎగురుతూ కనిపిస్తాయని చెప్పుకుంటారు. అలాంటి సమయాలలో కొందరు వూడూ మంత్రగాళ్ళు ఆ శ్మశానాలలో తాంత్రిక సాధనలు చేస్తూ ఉంటారని నమ్ముతారు. అమెరికాలోని సిల్వర్‌క్లిఫ్‌సెమెట్రి (శ్మశానం)లో కొరివి

దయ్యాల సంచారం ఈనాటికీ జరుగుతున్నదని ఆ దేశానికి చెందిన కొన్ని పారాసైకాలజీ మాగజైన్లలలో మరియు టి.వి. ఛానళ్ళలో తెలియజేయబడింది. కొందరు పరిశోధకులు, ఆ శ్మశానంలో కనపడే వెలుగులు, కొరివి దయ్యాలు కాదని నిరూపించటంకోసం అనేక అర్ధరాత్రులలో ఆ స్మశానాలలో సంచరించారు. అయితే, వాళ్ళకి ఏవో అదృశ్య హస్తాలవల్ల శారీరక గాయాలు అయ్యాయేగాని, ఆ కొరివి దయ్యాల మర్మం ఏమిటో వాళ్ళకి ఏమాత్రం అర్ధంకాలేదు.

**మాకోలైట్ :**

19వ శతాబ్దం చివరి నుండి 1977 వరకు నార్త్‌కరోలినా (యు.ఎస్.ఏ.)లోని మాకో రైల్వేస్టేషన్ విభాగానికి చెందిన రైలు మార్గంలో – రాత్రి సమయాలలో తరచుగా క్రికెట్‌బాల్ పరిమాణంలో ఉండే ఒక ఆరంజ్ రంగు వెలుగు, రైలు పట్టాలకి ఆరు అడుగుల ఎత్తులో గాలిలో తేలుతూ ముందుకి లేదా వెనక్కి ఎగురుతూ కనిపించేది. ఆ వెలుగు, ఒక లాంతరు ఎంతటి ప్రకాశాన్ని కలిగి ఉంటుందో అంతటి ప్రకాశాన్ని కలిగి ఉండేదని చెప్పుకునేవాళ్ళు. గతంలో ఒక రోజు రాత్రి సమయంలో రైలు పట్టాలను బాగుచేస్తూ ఆ పట్టాల మధ్యగా నడిచి వెళుతున్న ఒక గ్యాంగ్‌మాన్ (రైలు పట్టాలు బాగుచేసే కార్మికుడు) తన వెనక నుండి వేగంగా వస్తున్న రైలుని గమనించకుండా ముందుకు నడిచి వెళుతున్నాడు. అది రాత్రి సమయం కావటంతో ఆ రైలు ఇంజనులో ఉన్న డ్రైవర్‌కి పట్టాల మధ్యలో ముందు నడిచివెళుతున్న ఆ కార్మికుడు కనపడలేదు. దాంతో ఆ రైలు మహా వేగంతో వచ్చి ఆ కార్మికుడిని 'ఢీ' కొన్నది. ఫలితంగా, ఆ కార్మికుడు ముక్కలు ముక్కలుగా మారి ఆ రైలు పట్టాల మధ్యలో పడ్డాడు. ఈ సంఘటన జరిగిన కొద్ది రోజుల తరువాత రాత్రి సమయంలో ఒక వెలుగు గోళం, రైలు పట్టాలపైన ఎగురుతూ అనేక కిలోమీటర్లు ప్రయాణిస్తూ కనపడేది. చనిపోయిన ఆ గ్యాంగ్‌మాన్ యొక్క ప్రేతాత్మ, తాను చనిపోయిన విషయాన్ని తెలుసుకోలేకపోయిందని, బ్రతికి ఉన్నప్పుడు తాను ఏవిధంగా రైలు పట్టాల మధ్యగా నడుస్తూ, నట్లు ఊడిపోయిన పట్టాలకు నట్లు బిగిస్తూ ముందుకు వెళ్లిపోయేవాడో ఆవిధంగానే అతని ప్రేతాత్మకూడా ఆ పట్టాలపై ఎగురుతూ పట్టాలను పరిశీలిస్తూ ఉండేదని భావించటం జరిగింది. మాకో రైల్వే లైనులో ఆనాడు కనిపించిన ఆ వెలుగును "మాకోలైట్" అనే పేరుతో పిలవటం జరిగింది.

మాకోలైట్‌కి సంబంధించిన ఇంకొక విభిన్నమైన వృత్తాంతం కూడా మాకో రైల్వే లైను ప్రాంతంలో ప్రచారంలో ఉంది. అది ఏమిటంటే...మాకో రైల్వేస్టేషన్‌కి

కొంచెం దూరంలో, రైలు పట్టాలపై ఒక రైలు ఆగింది. ఆ రైలులో టిక్కెట్ కలెక్టర్ లాంటి ఉద్యోగం చేస్తున్న 'జోబాల్డ్‌విన్' అనే ఒక ట్రైన్ కండక్టర్ ఆ రైలు దిగి గార్డ్ పెట్టె దగ్గర పట్టాల మధ్య నిలబడి ఆ పెట్టె చక్రాల క్రిందకి పరిశీలనగా చూస్తున్నాడు. అదే సమయంలో అనుకోకుండా అదే రైలు పట్టాలపై వెనక నుండి వచ్చిన ఒక స్టీమ్ ఇంజన్, మహావేగంతో వచ్చి, ముందు నిలబడి ఉన్న రైలు యొక్క గార్డ్ పెట్టెను బలంగా ఢీకొన్నది. ఫలితంగా, ఆ రైలు కండక్టరు, తన రైలు యొక్క గార్డ్‌పెట్టె మరియు వెనక నుండి వచ్చిన స్టీమ్ ఇంజన్ మధ్యలోపడి నలిగి పోయి చనిపోయాడు. ఆ సమయంలో బాగా చీకటిగా ఉన్న కారణంగా మరియు వెనక నుండి వస్తున్న స్టీమ్ ఇంజను హెడ్‌లైట్ వెలగని కారణంగా ఆ ట్రైన్ కండక్టర్‌కి, వెనక నుండి వస్తున్న ఇంజను కనపడలేదు. ఫలితంగా, అతడు దారుణమైన ప్రమాదంలో మరణించాడు. తనలాగానే ఏ రైలు కండక్టరూ అలా చనిపోకూడదని భావించిన ఆ రైలు కండక్టరు యొక్క ప్రేతాత్మ, ఒక వెలుగుగోళం (కొరివి దయ్యం) రూపంలో రాత్రి సమయాలలో ఆ పట్టాలపై ఎగురుతూ ప్రయాణిస్తుందని, ఒకవేళ ఏ ట్రైన్ కండక్టరు అయినా ఆ సమయంలో రైలుదిగి రైలు పట్టాల మధ్యలో నిలవడి ఉన్నట్లయితే, ఆ సమయంలో గాలిలో తేలుతూ కనిపించే ఆ మాకోలైట్‌ని చూసి జాగ్రత్తపడి, ఆపై తన దగ్గర ఉన్న సిగ్నల్ లైట్‌ని ఊపి, వెనక నుండి వచ్చే ఇంజన్‌ని దూరం నుండే ఆపుతాడని, ఫలితంగా ఆ కండర్టరుకి ప్రాణం గండం తప్పుతుందని ఆ ప్రేతాత్మ భావించి ఉంటుందని కొందరు పారాసైకాలజిస్ట్‌లు అభిప్రాయ పడ్డారు.



## 12. ప్రపంచ ప్రఖ్యాత మనస్తత్వశాస్త్రవేత్త C.G. జంగ్ – ప్రేతాత్మ సంబంధ యదార్థ అనుభవాలు?

కారల్‌గుస్తావ్‌జంగ్ (1875, జూలై 26 – 1961 జూన్ 6) స్విడ్జర్లాండ్ దేశానికి చెందిన మరియు ప్రపంచ ప్రఖ్యాతి చెందిన మనోవైజ్ఞానికుడు. ఈయన, సైకియాట్రి (మానసికరోగ చికిత్సా శాస్త్రం)కి అపారమైన సేవ చేసాడని చెబుతారు. ప్రపంచ మనస్తత్వశాస్త్ర చరిత్రలో ప్రథముడుగా సిగ్మండ్‌ఫ్రాయిడ్ గుర్తించబడ్డాడు. ఆ తరువాత స్థానం, సి.జి.జంగ్‌కి ఇవ్వబడింది. ఒకవిశేషం ఏమంటే, సిగ్మండ్ ఫ్రాయిడ్, నాస్తికుడు

మరియు మానవ సంబంధాలపై విశ్వాసం లేనివాడుగా గుర్తించబడగా, జంగ్ మాత్రం పునర్జన్మను, ప్రేతాత్మలను, భారతీయ కర్మ సిద్ధాంతాన్ని సంపూర్తిగా నమ్మాడు. మనిషి మేధస్సుకి అందని ఎన్నో మార్మిక సత్యాలు (Occult facts)ఈ సృష్టిలో దాగి ఉన్నాయని సి.జి.జంగ్ ఉద్ఘాటించాడు.

మనస్తత్వ శాస్త్రజ్ఞులలో ప్రధముడిగా గుర్తించబడిన సిగ్మండ్ ఫ్రాయిడ్, కరుడు కట్టిన నాస్తికుడు. "ఆత్మ" అనేది నిజంగా లేదని, మానవుడు ప్రాధమికంగా జంతు మనస్తత్వాన్ని కలిగి ఉంటాడని, అతడికి కోర్కెలు తీర్చుకోవటమే తప్ప, నిజంగా నైతిక విలువలు ఉండవని తీర్మానించాడు.

ఆ తరువాతకాలంలో అతని శిష్యుడైన కారల్‌గుస్తావ్‌జంగ్ – తనకు చిన్నతనం నుండి తన జీవితంలో ఎదురైన యదార్ధ అనుభవాలను ఆధారంగా చేసుకుని, సిగ్మండ్ ఫ్రాయిడ్ చెప్పిన "ఆత్మ"కు సంబంధించి చెప్పిన సిద్ధాంతాలను సంపూర్తిగా ఖండించటమే కాకుండా తన గురువైన ఫ్రాయిడ్‌ని వ్యతిరేకించి అనేక నూతన మనస్తత్వశాస్త్ర సంబంధ సిద్ధాంతాలను రూపొందించాడు. కాలక్రమంలో C.G. జంగ్ ఒక గొప్ప మనస్తత్వ శాస్త్రజ్ఞుడిగా మాత్రమే కాక పారాసైకాలజి (అతీంద్రియ శక్తులకు సంబంధించిన మనస్తత్వశాస్త్ర విభాగము) శాస్త్రానికి ఆద్యుడిగా గుర్తించబడ్డాడు.


కారల్‌గుస్తావ్‌జంగ్

బాల్యం నుండి జంగ్‌కి స్వప్నాలలో ప్రేతాత్మలు కనపడుతూ ఉండేవి. కొన్నిసార్లు అతడు, మెళుకువతో ఉండి ఒక మంచంమీద పడుకుని ఉన్నప్పుడు లేదా కళ్ళు మూసుకుని ఒక కుర్చీలో కూర్చున్నప్పుడు అతనికి వివిధ రకాల ప్రేతాత్మలు కనిపిస్తూ ఉండేవి. ముఖ్యంగా, భవిష్యత్తులో జరగబోయే సంఘటనలు కూడా జంగ్‌కి కనిపిస్తూ ఉండేవి. అయితే, బాల్యంలో అతనికి పెద్ద జ్ఞానం ఉండేది కాదు కనుక తనకు వచ్చిన కలలకు అర్ధం ఏమిటో అతనికి తెలిసేదికాదు. ఆ సమయంలో జంగ్‌కి ఒకరోజు రాత్రి ఒక భయంకరమైన కల వచ్చింది. ఆ కలలో....అతడికి ఐరోపా దేశాలలో ప్రవహిస్తున్న నెత్తురు నదులు కనిపించాయి. ఈ కల, అతడికి అనేకసార్లు వస్తూ ఉండేది. జంగ్ ఆ స్వప్నాలను, తెల్లవారిన తరువాత కూడా మర్చిపోలేక

తీవ్రమైన ఆందోళనకు గురి అవుతూ ఉండేవాడు. ఆ కలల వెనకాల దాగి ఉన్న సందేశం ఏమిటో మొదట్లో జంగ్‌కి అర్ధంకాలేదు. అతడికి ఆ కలలు వచ్చిన కొంతకాలం తరువాత మొదటి ప్రపంచ యుద్ధం ప్రారంభం అయ్యింది. ఆ యుద్ధంలో ఐరోపా ఖండంలో లక్షలాదిమంది సైనికులు, ప్రజలు చనిపోయారు. అనగా, రక్తం ఆ ప్రాంతాలలో ఏరులై పారింది అని చెప్పుకోవచ్చు. బాగా పెద్ద అయిన తరువాత జంగ్‌కి, గతంలో తనకు వచ్చిన రక్త నదులకు సంబంధించిన స్వప్నాలకు అర్ధం "భవిష్యత్తులో ఐరోపా ఖండంలో మొదటి ప్రపంచ యుద్ధం వల్ల కలిగిన రక్తపాతమే అని అర్ధమయ్యింది".

ఇంకొక ముఖ్య విశేషం ఏమంటే, జంగ్ తల్లి అయిన ఎమిలీజంగ్‌కి కూడా మానవాతీత శక్తుల పట్ల విపరీతమైన నమ్మకం ఉండేదని తెలుస్తున్నది. ఆమె, తన జీవితంలో తనకు ఎదురైన అనేక అసాధారణమైన (పారానార్మల్) సంఘటనల గురించి తన డైరీలో వ్రాస్తూ ఉండేది. ఇక, జంగ్ తండ్రి అయిన సామ్యూల్, బాస్‌లే లోని చర్చిలో, ప్రేతాత్మలచేత ఆవహించబడిన వ్యక్తులకు భూతవైద్యం చేసి, వాళ్ళకు పట్టిన దయ్యాలను వదిలిస్తూ ఉండేవాడు. ఇక, సామ్యూల్ రెండవ భార్య అయిన అగస్టా కూడా తన చిన్న తనం నుండి, భవిష్యత్తులో జరగబోయే వాటిని తన మనసుతో చూడగలిగే శక్తిని కలిగి ఉండేదని తెలుస్తున్నది. ఆమె, ఒక సందర్భంలో దాదాపు 36 గంటలపాటు చనిపోయిన స్థితిలో ఉన్నదని చెప్పుకుంటారు.

ఆత్మలను, అతీంద్రియ శక్తులను నమ్మే కుటుంబంలో పుట్టి పెరిగిన C.G. జంగ్ జీవితంలో ప్రేతాత్మల ఉనికిని రుజువుచేసే అనేక సంఘటనలు జరిగాయి. వాటిలో అతిముఖ్యమైన రెండు సంఘటన గురించి ఇక్కడ తెలుసుకుందాం.

1. క్రీ.శ.1924 – వసంతకాలంలో (ఫిబ్రవరి–మార్చి) సి.జి.జంగ్ ఒక మానసిక రోగికి సంబంధించిన సమాచారాన్ని సేకరించటానికి ఐరోపాలోని బోలిన్‌జన్ ప్రాంతానికి వెళ్ళాడు. ఆ సమయంలో ఒక రోజు రాత్రి జంగ్, తన భవనంలోని పై అంతస్థులో ఉన్న తన పడక గదిలో మంచంమీద పడుకుని దాదాపు నిద్రలోకి జారుకుంటున్న స్థితిలో ఉన్నాడు. ఆ సమయంలో అతని భవనం చుట్టూ అనేకమంది నడుస్తున్నట్లుగా అడుగుల శబ్దం వినిపించింది. అంతేకాకుండా, చాలామంది మాట్లాడుకుంటున్నట్లుగా ఏవేవో మాటలు అస్పష్టంగా వినిపించాయి. ఇంకా, కొంతమంది పాటలు పాడుతున్నట్లుగా, సంగీత వాయిద్యాలను మ్రోగిస్తున్నట్లుగా కూడా వినిపించింది. దాంతో, హఠాత్తుగా జంగ్ కళ్ళు తెరచి చూసాడు. తనకి కల

వస్తున్నదా? లేక నిజంగా ఏవైనా శబ్దాలు వినిపిస్తున్నాయా? అని తీవ్రంగా ఆలోచించాడు. ఆపై, మంచంమీద నుండి లేచి గది కిటికీ తలుపులు తెరచి బైటకు చూసాడు. అక్కడ ఏమీ కనపడలేదు. దాంతో, మళ్ళీ మంచం దగ్గరకువెళ్ళి దానిపై పడుకుని నిద్రలోకి జారుకున్నాడు. అతనికి మళ్ళీ కల వచ్చింది. ఆపై కొద్ది నిమిషాల తరువాత మళ్ళీ అంతకు ముందులాగానే శబ్దాలు వినపడ్డాయి. అంతేకాకుండా, ఈసారి అతనికి నల్లటి దుస్తులు ధరించిన వందలాది మంది వ్యక్తులు కూడా ఆ స్వప్నంలో కనిపించారు. మళ్లీ జంగ్‌కి మెళుకువ వచ్చింది. ఆపై, అతడు దాదాపు నిద్రపోతున్న స్థితిలోనే మంచంమీద నుండి లేచి కిటికీ దగ్గరకువెళ్ళి చూసాడు. కిటికీ తలుపులు తెరచి బైటకు చూసిన జంగ్‌కి అక్కడ ఏమీ కనపడలేదు. ఆపై, వెనక్కి తిరిగివచ్చి తన మంచంమీద కూర్చుని కాసేపు ఆలోచించాడు. ప్రస్తుతం తాను ఉంటున్న భవనం, ఉన్న ప్రాంతంలో గతంలో ఏదో దారుణమైన హింసాకాండ జరిగి ఉంటుందని, ఆ సందర్భంలో – చనిపోయి ప్రేతాత్మలుగా మారిన వారే, ఇప్పుడు తనకి స్వప్నంలో కనిపించారని తీర్మానించుకున్నాడు. ఈ సంఘటన జరిగిన కొద్దికాలం తరువాత ఆ ప్రాంతంలో ఉన్న ఒక లైబ్రరీకి వెళ్ళాడు. ఆ లైబ్రరీలో దొరికిన ఒక గ్రంథంలో అతనికి కావలసిన సమాచారం దొరికింది. అది ఏమిటంటే...17వ శతాబ్దంలో బోలిన్‌జన్ ప్రాంతంలో అనేకమంది సైనికులు ఉండేవాళ్ళని, వాళ్ళు, శత్రు సైనికులచేత దారుణంగా చంపబడ్డారని మరియు ఆ గ్రంథ రచయిత అయిన రెన్‌వార్ట్‌కి కూడా స్విడ్జర్లాండ్‌లోని ఆల్ప్ పర్వతాలలో ఉన్న ఒక గృహంలో నిద్రపోతున్నప్పుడు సరిగ్గా అలాంటి ప్రేత సంబంధమైన స్వప్నమే వచ్చిందని.

2. అంతకు ముందు, నాలుగు సంవత్సరాల క్రితం అనగా 1920లో వచ్చిన వేసవికాలంలో C.G. జంగ్‌ని ఇంగ్లాండుకి చెందిన కొందరు పారాసైకాలజిస్టులు ఇంగ్లాండుకి ఆహ్వానించారు. అలా ఇంగ్లాండు వెళ్ళిన జంగ్‌కి పీటర్ అనే వ్యక్తిని పరిచయంచేసారు. ఇంగ్లాండులో జంగ్, విశ్రాంతి తీసుకోవటానికి ఒక పాతకాలంనాటి కాటేజిని జంగ్‌కి ఇప్పించాడు పీటర్. ఆ కాటేజి (గెస్ట్‌హౌస్ లాంటిది) బాగా తక్కువ అద్దెకు లభించింది. అది, అవటానికి పాత కాటేజి అయినప్పటికీ బకింగ్‌హామ్‌షైర్ ప్రాంతంలో ఉన్న ఇతర కాటేజీలన్నింటికన్నా చాలా ఆకర్షణీయంగా ఉన్నదని జంగ్‌కి అనిపించింది. జంగ్‌తో పాటుగా పీటర్ కూడా ఆ కాటేజీలోనే, మనస్తత్వ శాస్త్రవేత్త సమావేశం ముగిసేదాకా ఉండాలని నిర్ణయించుకున్నాడు. ఇక, జంగ్ ఆ కాటేజిలోని మొదట అంతస్తులో ఉన్న ఒక గదిని తాను ఉండటానికి తీసుకున్నాడు. మొదటిరోజు

సాయంత్రం వరకు ఆ సమావేశంలో చాలాసేపు ఉపన్యాసం ఇచ్చిన కారణంగా జంగ్ బాగా అలసిపోయాడు. అందువలన, అతడు సమావేశం నుండి కాటేజికి రాగానే తన గదిలోకివెళ్ళి మంచంపై పడుకున్నాడు. అయితే, అంత అలసిపోయి ఉన్నప్పటికీ జంగ్‌కి బాగా నిద్రపట్టలేదు. అందుకు కారణం ఏమంటే, ఆ గదిలో ఒకవిధమైన వాసన వస్తున్నది. అయితే, ఆ వాసన ఎక్కడ నుండి తన గదిలోకి వస్తున్నదో? జంగ్‌కి ఏమాత్రం అంతుపట్టలేదు. ఆ వాసన దేనికి సంబంధించినదో కూడా అతడికి అర్థంకాలేదు. కానీ, ఆ గదిలో ఏదో ఒక అంతుపట్టని అంశం దాగి ఉన్నదని జంగ్‌కి అనిపించింది. అది మంచి వేసవికాలం కావటంవల్ల రాత్రి సమయంలో కిటికీ నుండి లోపలికి మంచి గాలి వీస్తున్నప్పటికీ తన గదిలో ఉన్న ఆ వాసన ఏమాత్రం తగ్గటంలేదు. ఈ సమావేశం జరిగినంతకాలమూ – జంగ్‌కి తన గదిలో రాత్రిపూట సరిగ్గా నిద్రపట్టలేదు. "తనకి రాత్రిపూట ఆ గదిలో నిద్రపట్టటంలేదు" అన్న విషయాన్ని, అదే భవనంలోని ఇంకొక గదిలో ఉంటున్న పీటర్‌కి చెప్పాడు. "రాత్రి పడుకోవటానికి ముందు ఒక సీసాడు చల్లటి బీరు త్రాగు. నిద్ర, నువ్వు వద్దు అన్నా వస్తుంది" అని జంగ్‌కి సలహా ఇచ్చాడు పీటర్. జంగ్ ఆ సలహాను పాటించాడు. బీరు త్రాగిన తరువాత కొంచెంసేపు మాత్రమే జంగ్‌కి మంచి నిద్ర పట్టేది. ఆపై, వెంటనే మెళుకువ రావటం, ఆ గదిలోని విచిత్రమైన వాసనకి నిద్రపట్టకపోవటం జరుగుతూ ఉండేది. ఇక చేసేదిలేక జంగ్ తన మంచంమీద పడుకుని "ఈ గదిలోకి వస్తున్న వాసన దేనికి సంబంధించి ఉంటుంది?" అని తీవ్రంగా ఆలోచిస్తూ ఉండేవాడు. అలా చాలాసేపు ఆలోచించిన మీదట, మూడవ రోజున జంగ్‌కి ఆ వాసన గురించిన సమాచారం గుర్తుకు వచ్చింది.

అది ఏమిటంటే...జంగ్, కొద్ది సంవత్సరాల క్రితం తన హాస్పటల్‌లో ఒక వృద్ధురాలికి ముఖ సంబంధ క్యాన్సర్ వ్యాధికి (Carcinoma)శస్త్ర చికిత్స తాను చేయించిన విషయం గుర్తుకు వచ్చింది. ఆమె, తన హాస్పటల్‌లో ఉన్న సమయంలో ఒక గదిలో ఉంచబడింది. ఆ గదిలోకి తన ఎప్పుడు వెళ్ళినా ఒక విచిత్రమైన వాసన తన ముక్కు పుటాలకు ఆ గదిలో సోకుతూ ఉండేది. ముఖ్యంగా, ఆమె ఆ హాస్పటల్ గదిలో ఉన్న ఐదవ వారం చివరి రోజున ఆ వాసన జంగ్‌కి భరించలేనంత దారుణంగా ఉన్నది. బహుశా, ఎక్కడో ఉన్న ఆ వృద్ధురాలు కొద్ది వారాల క్రితం చనిపోయి ఉంటుందని, ఆ వృద్ధురాలి ఆత్మే, తనకి ఏదో చెప్పాలన్న ఉద్దేశంతో, అంత దూరం నుంచి ఇగ్లాండులో ఉన్న తన గదిలోకి వస్తున్నదని, తను ఆ వృద్ధురాలి ఆత్మని గుర్తుపట్టాలి అన్న ఉద్దేశంతో, హాస్పటల్‌లో ఆమె ఉన్న గదిలో ఏ వాసన అయితే

ఉండేదో అలాంటి వాసనను జంగ్ ముక్కుపుటాలకు తగిలేలా చేసిందని – జంగ్‌కి అర్ధమయ్యింది.

ఆ మర్నాడు రాత్రి జంగ్, మధ్యస్థాయి నిద్రావస్థలో ఉన్నాడు. ప్రక్కన ఏం జరుగుతుందో తెలుసుకునే స్థితిలో కొంత వరకు ఉన్నాడు. ఆ సమయంలో అతడి మంచానికి కొంచెం దూరంలో ఒక వృద్ధురాలు నిలబడి ఉన్నది. ఆమె తన కుడి కన్నుని బాగా తెరచి జంగ్‌వైపు తేరిపార చూస్తున్నది. ఇక, ఆమె ముఖంయొక్క ఎడమవైపున, అనగా ఎడమ కన్ను క్రింద భాగం కనపడటంలేదు. అలాంటి భయంకరమైన రూపం కనపడగానే జంగ్, హఠాత్తుగా కళ్ళు తెరచి ఆపై మంచంమీద నుండి ఒక్క గెంతులో కిందకు దిగి నుంచున్నాడు. ఆపై, ఆ గదిలో ఒక కొవ్వొత్తి వెలిగించి, ప్రక్కనే ఉన్న కుర్చీలో తెల్లవారే దాకా, ఆ వృద్ధురాలి గురించి ఆలోచిస్తూ కాలం గడిపాడు. ఏదిఏమైనా, ఆ గదిలో తన మేధస్సుకి అందని ఏదో ఒక మానవాతీతశక్తి ఉన్నదని జంగ్‌కి అర్ధమయ్యింది. ఆ మర్నాడు ఉదయమే జంగ్ ఆ గదిని ఖాళీచేసి ప్రక్కనే ఉన్న ఇంకొక గదిలోకి మారాడు. ఆ తరువాత ఆ గదిలో ఉన్న వారం రోజులలో ఏ రోజూ కూడా జంగ్‌కి ఏవిధమైన వాసనలు రాలేదు, ఆ వృద్ధురాలి ప్రేతాత్మ కనపడలేదు. దాంతో ఆ వారం రోజులూ తృప్తిగా నిద్రపోయాడు.

ఆ తరువాత కాలంలో అనగా 1950వ సంవత్సరంలో ఫానీమోజర్ అనే పారాసైకాలజిస్ట్, ప్రేతాత్మల గురించి వ్రాసిన ఒక గ్రంధంలో జంగ్‌కి ఇంగ్లాండ్‌లో ఎదురైనా ఈ సంఘటన గురించి వ్రాయబడింది. ఇంకొక విశేషం ఏమంటే, ఈ పుస్తకానికి సి.జి.జంగ్ “తొలిమాట” వ్రాసాడు.

1960లో అనగా సి.జి.జంగ్ మరణించటానికి ఒక సంవత్సరానికి ముందు అతడు ఒక గ్రంధంలో తన జీవిత అనుభవాల గురించి ఇలా వ్రాసాడు...కొంతమంది వ్యక్తులకు సహజసిద్ధంగానే మానవాతీత శక్తులయొక్క ఉనికిని పసిగట్టే శక్తి వస్తుంది. వాళ్ళు ఎలాంటి జ్ఞానాన్ని కలిగి ఉండకపోయినప్పటికీ వాళ్ళకి తమకి, ఎదురయ్యే మానవాతీత శక్తులయొక్క ప్రభావాన్ని గ్రహించే అవకాశాలు వస్తాయి. బహుశా, ఆ కారణంగానే నాకు జీవితంలో ఎన్నోసార్లు “మానవాతీతశక్తులు నిజంగా ఉన్నాయని” అనుభవం అయ్యింది. ఆ కారణంగానే, నా గురువైన “సిగ్మండ్ ఫ్రాయిడ్ సిద్ధాంతాల” పట్ల నాకు ఎంత గౌరవం ఉన్నప్పటికీ, అతీంద్రియ శక్తుల విషయంలో ఆయనను వ్యతిరేకించి ఆపై ఆయన నుండి దూరంగా వెళ్ళిపోయాను. “ఎవరు అంగీకరించినా? అంగీకరించకపోయినా? మనిషి కళ్ళకు కనపడని మహా శక్తివంతమైన ఇంకొక

లోకం మన మధ్యనే ఉన్నది. ఈనాడు కాకపోయినా భవిష్యత్తులో ఏదో ఒక రోజు ఆ లోకంలోని శక్తుల ఉనికిని శాస్త్రీయంగా నిరూపించటం ఖచ్చితంగా జరుగుతుంది".

**సి.జి.జంగ్ చెప్పిన గొప్ప సూక్తులు :**

♦మనిషి, నిజమైన జీవితం 40వ సంవత్సరం నుండి ప్రారంభం అవుతుంది. అప్పటి వరకు అతడు తన జీవితం గురించి పరిశోధన చేస్తూ ఉంటాడని గుర్తించాలి.

♦ఒక మనిషికి ఇతరుల కన్నా ఎక్కువ విషయాలు తెలిసినట్లయితే ఆ వ్యక్తి వంటరివాడిగా మిగిలిపోతాడు లేదా ఒంటరి వాడు అవుతాడు.

♦ఆలోచించటం చాలా కష్టం. అందుకే చాలా మంది తీర్పులు చెబుతూ ఉంటారు.

♦నువ్వు ఏం చెయ్యగలవో అది చెయ్యి. నువ్వు ఏది చెప్పవలసిన పనిలేదు.

♦ఒక మనిషి ఏమిటి, అనేది అతడు చేసే పనులు నిర్ణయిస్తాయి.



# 13. భారతదేశంలోని వివిధ ప్రాంతాలలో యదార్ధంగా జరిగిన పిశాచ సంబంధ వృత్తాంతాలు?

**1. బావి దగ్గర స్త్రీ ప్రేతాత్మ :**

భారతదేశంలోని అన్ని రాష్ట్రాలలోను ప్రేతాత్మకు సంబంధించిన విశ్వాసాలు బలంగా ఉన్నాయి. ముఖ్యంగా, కేరళ మరియు తమిళనాడు రాష్ట్రాలలో ఈ నమ్మకాలు చాలా అధికంగా ఉన్నాయి. తమిళనాడు విషయానికి వచ్చినట్లయితే అక్కడ - చనిపోయిన కొందరు మంచి వ్యక్తులు దేవతలుగా మారతారని అలాంటి దేవతల్ని పూజించటంవల్ల మానవులకు మేలు జరుగుతుందని ఈనాటికీ విశ్వసిస్తున్నారు. ఒక విశేషం ఏమంటే, ఈనాడు తమిళనాడు ప్రాంతంలోని గ్రామీణ ప్రాంతాలలో పూజించబడుతున్న గ్రామ దేవతలలో చాలామంది – ఒకటి లేదా రెండు శతాబ్దాల క్రితం, హింస కారణంగానో లేక బాధలు భరించలేక ఆత్మహత్య చేసుకున్న కారణంగానో, చనిపోయిన అమాయకమైన స్త్రీలే అని ఒక పరిశోధకుడు

అభిప్రాయపడ్డాడు. ఏదిఏమైనా, చనిపోయిన తరువాత ఆ స్త్రీలయొక్క ఆత్మలు శక్తివంతమైన పిశాచాలుగా మారి ప్రజల్ని తీవ్రంగా హింసిస్తున్నప్పుడు, కొందరు తంత్రశాస్త్ర పండితుల సహకారంతో ఆ పిశాచాలను మంత్రాలతో బంధించి ఆపై వాటిని శాంతిపచేయటంకోసం వాటి విగ్రహాలను ఆలయంలో ప్రతిష్టించి, వాటికి పూజలు చెయ్యటం మరియు రక రకాల బలులు మరియు ఇతర ఆహార పదార్థాలు నైవేద్యంగా పెట్టటం జరిగింది. చనిపోయిన ప్రతి మనిషియొక్క ఆత్మ, ప్రేతాత్మగా లేదా పిశాచిగా మారుతుందని భావించకూడదు. కొన్ని ప్రత్యేకమైన చెడు పరిస్థితులలో చనిపోయిన వ్యక్తులయొక్క ఆత్మలు మాత్రమే పిశాచాలుగా మారతాయని చెబుతారు. ఇక, అసలు కథకు వద్దాం...

తమిళనాడులో ఆలయాల నగరంగా గుర్తించబడిన మధురై పట్టణానికి దగ్గరలో ఉన్న ఎడైపట్టి అనే గ్రామానికి చెందిన ఒక యువకుడు తన గ్రామంలో మరియు ఆ గ్రామ చుట్టు ప్రక్కల ప్రాంతాలలో తనకి మరియు ఇతరులకు ఎదురైన ప్రేతాత్మలకు సంబంధించిన కొన్ని యదార్ధ వృత్తాంతాలను మనతో ఇలా పంచుకుంటున్నాడు....

1. మా గ్రామంలోని ఆలయంలో పూజలు చేసే పూజారి మా ఊరి చివర ఉన్న ఒక ఇంట్లో నివసించేవాడు. ఊరికి బాగా దూరంగా ఉండటంవల్ల ఆ ప్రాంతంలో జన సంచారం చాలా తక్కువగా ఉండేది. ఆ ఇంటికి మూడువైపులా పచ్చటి వరి పొలాలు వ్యాపించి ఉండేవి. ఇక, ఆయన ఇంటి వాకిట్లో ఒక మంచినీళ్ళ బావి ఉండేది. ఆ బావి ప్రక్క నుండి ఒక మట్టి రోడ్డు వెళుతూ ఉండేది. మా గ్రామం నుండి ప్రక్క గ్రామానికి వెళ్ళాలంటే ఆ మట్టి రోడ్డుమీదుగానే వెళ్ళాల్సి ఉండేది. ఒక రోజు అర్ధరాత్రి, దాదాపు 12 గంటల సమయంలో ఆ పూజారి, “లఘుశంక” (మూత్రవిసర్జన) కోసం ఇంటి తలుపులు తెరిచి బైటకు వచ్చాడు. ఆయన ఇంటి అరుగు దిగి దాదాపు ఒక పది అడుగులు నడిచాడో? లేదో? ఆయనకు, ఆ ఇంటి ముందు నుండి వెళ్ళే మట్టి రోడ్డుమీదుగా మెల్లగా నడుస్తూ వెళుతున్న ఒక స్త్రీ కనపడింది. ఆ సమయంలో, అప్పుడప్పుడూ ఒకరో ఇద్దరో ఊళ్ళోంచి ఆ మట్టి రోడ్డుమీదుగా ప్రక్క ఊళ్ళోకి వెళుతూ ఉంటారు. అందువలన ఆ సమయంలో ఒక స్త్రీ ఆ మట్టి రోడ్డుమీదుగా నడుస్తూ వెళుతున్నప్పటికీ ఆ పూజారి ఏమాత్రం భయపడలేదు. ఏదిఏమైనా, ఒక స్త్రీ అంత అర్ధరాత్రి సమయం ఒక స్త్రీ ఒంటరిగా అలా వెళ్లటంతో ఆ పూజారికి చాలా ఆశ్చర్యం కలిగింది. దాంతో ఆయన పెద్ద స్వరంతో “ఎవరమ్మా నువ్వు? ఇంత అర్ధరాత్రి సమయంలో ఎక్కడికి వెళుతున్నావు?” అన్నాడు. ఆయన అలా అరవగానే

ఆ స్త్రీ నడక ఆపేసి ఆ రోడ్డుమీద అలాగే కదలకుండా నిలబడి పోయింది. ఆ తరువాత ఆ పూజారి ఏదో అనేలోగా ఆ స్త్రీ, గాలిలో తేలుతున్నట్లుగా నడుస్తూ, ఆ పూజారి ఇంటిముందు ఉన్న బావి అంచు దగ్గరకు వచ్చి నిలబడింది. బహుశా గ్రామంలోని ఎవరో ఒక స్త్రీ, ఆత్మహత్య చేసుకోవటానికి ఆ బావి దగ్గరకు వచ్చింది అని భావించిన ఆ పూజారి, ఆమెను ఆ బావిలో దూకకుండా అడ్డుకోవటానికి ఆ బావి దగ్గరకు వెళ్లాడు. అవి, వెన్నెల రోజులు కావటంతో ఆ స్త్రీ యొక్క ముఖం స్పష్టంగా కనిపిస్తున్నది. ఆ స్త్రీకి ఆరు అడుగుల దూరంలోకి వెళ్ళి నిలబడిన ఆ పూజారి కళ్ళల్లోకి ఆ స్త్రీ సూటిగా చూసింది ఆమె అలా చూడటంతో ఆ పూజారి మైకం కమ్మి నేలమీద పడిపోయాడు. మర్నాడు ఉదయం సూర్యోదయ సమయంలో ఆ పూజారికి స్పృహ వచ్చింది. ఆపై, ఆయన ఇంట్లోకివెళ్ళి స్నానం వగైరాలు పూర్తి చేసుకుని ఉదయం 8 గంటల ప్రాంతంలో కాలి నడకన ఊళ్ళోని గుడికి చేరుకుని అక్కడ పూజలు ముగించుకుని ఆ తరువాత ఆ ఊరి గ్రామపెద్ద మరియు ఆ ఆలయ ధర్మకర్త అయిన సెల్వం ఇంటికివెళ్ళి ఆయనతో తనకు నిన్న అర్ధరాత్రి ఎదురైన అనుభవం గురించి చెప్పి, అంత రాత్రి సమయంలో ఆ బావి దగ్గరకు వచ్చిన ఆ స్త్రీ ఎవరో? తనకు ఇప్పటికీ అర్ధం కావటంలేదని సెల్వంతో అన్నాడు. పూజారి చెప్పిన మాటలు విన్న సెల్వం కాసేపు మౌనంగా ఉండి ఆపై ఆ పూజారితో "స్వామీ! నువ్వు ఈ గుడిలో పూజారిగా చేరటానికి రెండు సంవత్సరాల ముందు, ప్రస్తుతం నువ్వు ఉన్న ఇంట్లో ఈ ఊరికి చెందిన ఒక భూస్వామి యొక్క కొడుకు, కోడలు ఉండే వాళ్ళు. ఆ భూస్వామి కొడుకు, తన తండ్రికి ఇష్టంలేకుండా ఎవరో తక్కువ కులానికి చెందిన అమ్మాయిని పెళ్ళి చేసుకున్నాడు. అందుకు ఆగ్రహించిన ఆ భూస్వామి తన కొడుకుని, కోడల్ని ఈ ఊరి చివర ఉన్న తన ఇంట్లో ఉండమని, వాళ్లని ఆ ఇంటికి పంపించాడు. గత సంవత్సరం మధ్యభాగంలో వచ్చిన చంద్రగ్రహణం రోజున ఆ భూస్వామి కొడుకు ఏదో పనిమీద పట్టణం వెళ్ళాడు. ఆ రోజు రాత్రి 12 గంటలకు చంద్రగ్రహణం ప్రారంభం అయ్యింది. సరిగ్గా, ఆ సమయంలో ఆ భూస్వామి, ఒంటరిగా, ఊరి చివర ఉన్న ఆ ఇంటికి వెళ్ళి ఆపై తన కోడల్ని గొంతు పిసికి చంపేసి, ఆపై ఆ మృతదేహాన్ని ఆ ఇంటి ఎదురుగా ఉన్న బావిలో పడేసాడు. ఆపై గుట్టు చప్పుడు కాకుండా ఇంటికి వచ్చేసాడు.

మర్నాడు మధ్యాహ్న సమయానికి ఆ బావిలో ఆ అమ్మాయి శవం తేలింది. ఆ సమయంలో అటువైపుగా వెళుతున్నవారు మంచినీళ్ళు తాగుదామని ఆ బావి దగ్గర చూసినప్పుడు బావి నీళ్ళపై తేలుతున్న భూస్వామి కోడలి మృతదేహం కనిపించింది.

"తన కోడలు ఏదో తప్పు చేసి ఉంటుందని, అందువల్లే ఆమె ఆత్మహత్య చేసుకుని చనిపోయి ఉంటుందని" ఆ భూస్వామి గ్రామస్తులను నమ్మించాడు. ఈ సంఘటన జరిగిన 40 రోజుల తరువాత ఆ భూస్వామి తన ఇంటి పెరట్లో ఉన్న బావిలోని మోటారుని బాగుచెయ్యటానికి బావిలోకి దిగాడు. ఆ సమయంలో అతడికి విద్యుత్ఘాతం (కరెంట్ షాక్) తగిలింది. ఫలితంగా, అతడు గుండె ఆగి చనిపోయాడు. ఆ అమ్మాయి ఏ రోజున చంపబడిందో, ఆ రోజున ఆ అమ్మాయి ప్రేతాత్మ ఆ బావి గట్టుమీద మరియు ఆ బావికి ప్రక్కనే ఉన్న మట్టి రోడ్డుమీద కాసేపు కనిపిస్తుంది. ఆ తరువాత ఆమె ఆత్మ, ఆ బావిలో ప్రవేశిస్తుంది. అయితే, ఇంతవరకు ఎవరికి కూడా ఆ అమ్మాయి ప్రేతాత్మ, హాని చేసినట్లుగా నాకు తెలియదు". తాను ఉంటున్న ఇంటి ముందు ఉన్న బావిలో ఒక స్త్రీ ప్రేతాత్మ నివసిస్తున్నది అని తెలిసిన తరువాత ఆ పూజారి ఆ రోజు నుండి ఆ ఊళ్ళోనే ఆ గుడికి దగ్గరలో ఉన్న ఒక ఇంటికి తన మకాం మార్చేసాడు.

**2. ఆమెకు దయ్యం పట్టింది :**

ఈ సంఘటన దాదాపు 30 సంవత్సరాల క్రితం జరిగింది. ఒక సంక్రాంతి పండుగకు మా ఊరి పెద్ద భూస్వామి ఇంటికి కేరళ రాష్ట్రంలోని ఒక పట్టణం నుండి కొంతమంది బంధువులు వచ్చారు. ఆ బంధువులలోని 16 సంవత్సరాల ఒక అమ్మాయికి మా రాష్ట్ర భాష అయిన తమిళం ఒక ముక్క కూడా రాదు. ఆమె మా ఊళ్ళో కూడా మళయాళమే మాట్లాడుతూ ఉండేది. వయసు వచ్చిన ఆడ పిల్లలు సాయంత్రం 6 గంటల తరువాత నిర్మానుష్య ప్రదేశాల్లోకి మరియు పంట పొలాల్లోకి వెళ్ళకూడదని మా ఊళ్ళోని పెద్దలు అప్పుడప్పుడూ చెబుతూ ఉంటారు. అందుకు కారణం ఏమంటే, సాయంత్రం 6 గంటల నుండి తెల్లవారుఝామున 4 గంటల వరకు పైన చెప్పిన ప్రదేశాలలో ప్రేతాత్మలు సంచరిస్తూ ఉంటాయని, ఆ సమయంలో అక్కడకు వెళ్ళే ఆడపిల్లల్ని ఆ ప్రేతాత్మలు ఆవహించి పీడిస్తాయిన చెప్పుకునేవాళ్ళు.

ఏది ఏమైనా, ఈ విషయాలు ఏవీ తెలియని ఆ అమ్మాయి తనతోపాటు వచ్చిన కొంతమంది ఆడ పిల్లలతో కలిసి మా ఊరి చివర ఉన్న వరి పొలానికి వెళ్ళింది. అక్కడ ఒక అరగంట సేపు అటు, ఇటు తిరిగి ఆపై తన స్నేహితులతో కలిసి ఇంటికి వచ్చేసింది. అప్పటి నుండి ఆమె ప్రవర్తన పూర్తిగా మారిపోయింది. ఎవరితో మాట్లాడకుండా, ఆ ఇంటి మేడపైన ఒంటరిగా కూర్చుని తనలో తాను ఏదో మాట్లాడుకుంటూ ఉండేది. రెండు రోజులపాటు ఆమె ప్రవర్తనను శ్రద్ధగా గమనించిన

ఆమె మేనత్త, ఆమె దగ్గరకువెళ్ళి "ఏంటి! ఇలా ఒంటరిగా కూర్చుంటున్నావ్? ఏమైంది నీకు?" అని గుచ్చి గుచ్చి అడిగింది. అప్పుడు ఆ అమ్మాయి తమిళ భాషలో తన మేనత్తని తీవ్రమైన బూతులు తిట్టటం ప్రారంభించింది. అసలు ఒక ముక్క తమిళం కూడా రాని ఆ మళయాళం అమ్మాయి, అంత బాగా తమిళ భాషలో మాట్లాడటం ఒక ఆశ్చర్యం అయితే, బాగా చదువుకున్న మరియు సంస్కారవంతమైన కుటుంబానికి చెందిన ఆ అమ్మాయి బూతు మాటలు మాట్లాడటం ఆ ఇంట్లోని వారందరికి విపరీతమైన ఆశ్చర్యాన్ని కలిగించింది. అంతేకాదు, ఆ అమ్మాయి స్నానం చేసేదికాదు. ఆహారం తీసుకునేదికాదు. రోజులో ఒక్క నిమిషం కూడా నిద్రపోకుండా ఎప్పుడూ మెళు కువగానే ఉండేది. అప్పుడు ఆమె మేనత్త, తన భర్త మరియు మా గ్రామ భూస్వామి అయిన రామలింగంతో ఒక రాత్రి సమయంలో ఆ అమ్మాయి గురించి వివరంగా చెప్పింది. ఆమె చెప్పింది శ్రద్ధగా విన్న రామలింగం, కాసేపు ఆలోచించి ఆపై ఆమెతో ఇలా అన్నాడు. "నేను అనుకున్నది అంతా అయ్యింది. మొన్న సాయంత్రం ఆ అమ్మాయి తన స్నేహితురాళ్ళతో కలిసి ఊరి చివర ఉన్న మన పొలాల్లోకివెళ్ళి కాసేపు అక్కడ తిరిగి వచ్చింది. నా ఉద్దేశం ప్రకారం, ఆ పొలాల్లో ఏదో ఒక దయ్యం ఆ అమ్మాయిని ఆవహించి ఉంటుంది. నేను, వెంటనే ఒక భూత వైద్యుడిని ఇక్కడికి పిలిపిస్తాను. వాడే ఆ అమ్మాయికి పట్టిన దయ్యాన్ని వదిలిస్తాడు"

ఆ మర్నాడు ఉదయం ఒక మంత్రగాడు మా గ్రామానికి వచ్చాడు. ఆపై, దయ్యం పట్టిన అమ్మాయి ఉన్న ఇంటికి వెళ్ళాడు. ఆ మంత్రగాడు, ఆ భూస్వామి ఇంటి మధ్య భాగంలో ఒక తాంత్రిక ముగ్గువేసి, ఆపై ఆ ముగ్గు మధ్యలో ఒక బూడిద గుమ్మడికాయను ఉంచి, దానిమీద పసుపు, కుంకుమ చల్లాడు. ఆ తరువాత పాతకాలంనాటి తమిళ భాషలో ఏవేవో మంత్రాలు చదివాడు. ఇంతలో ఆ అమ్మాయి తన గదిలోంచి పరుగెత్తుకుంటూ వచ్చి, ఆ మంత్రగాడి ప్రక్కన నిలబడి ఆపై అతడిని తమిళ భాషలో తిట్టటం ప్రారంభించింది. ఆ సమయంలో అక్కడ గుమిగూడిన మా గ్రామ ప్రజలకు ఆ అమ్మాయి తమిళ భాషలో అంత బాగా తిట్టటం చాలా ఆశ్చర్యం కలిగించింది. ఆమెకు తమిళ భాషలో ఒక్క చిన్న పదం కూడా రాదని వాళ్ళందరికీ తెలుసు. ఆ తరువాత ఆ మంత్రగాడు యేవేవో మంత్రాలు చదువుతూ ఆ అమ్మాయి మీదకి కొంచెం కుంకుమ విసిరాడు. ఆ అమ్మాయి, వళ్ళంతా ఊగిపోయేలా పెద్దగా కేకలు పెడుతూ ఆ మంత్రగాడి గొంతు పట్టుకుని ఆ గొంతుని పిసకాలని ప్రయత్నించింది. ఆ మంత్రగాడు సహజంగా చాలా బలిష్టుడు కావటం వల్ల ఆ అమ్మాయి ఉడుం పట్టు నుండి విడిపించుకుని, ఆపై తన భుజానికి ఉన్న సంచిలోంచి

ఒక వెదురు బెత్తాన్ని బైటకుతీసి ఆ బెత్తంతో ఆ అమ్మాయి వంటిమీద నాలుగైదు దెబ్బలు వేసాడు. అంతటితో, ఆ అమ్మాయిని పట్టిన దయ్యం వదిలిపోయింది. ఆపై ఆ అమ్మాయి స్పృహ తప్పి నేలమీద పడిపోయింది. ఆ మర్నాడు ఆ అమ్మాయి మామూలుగా మారిపోయింది. తన స్నేహితురాళ్ళతో కలిసి మా ఊరు మధ్యలో ఉన్న అమ్మవారి గుడికి వెళ్ళింది.



# 14. ప్రాచీన జపాన్‌లో జరిగిన ప్రేతాత్మ సంబంధ యదార్థ గాథలు?

**వృషభ కాలం (Ox hour) :**

చైనా జ్యోతిషశాస్త్ర విధానాన్ని జపాన్ కూడా అనుసరిస్తుంది. అందువల్ల, చైనా జ్యోతిష పద్ధతిలో ఏ అంశాలైతే ఉంటాయో జపాన్ జ్యోతిషశాస్త్రంలో కూడా అవే ఉంటాయి. ఇక, జపాన్ జ్యోతిషవిధానంలో 12 రాశులకు, 12 రకాల జంతువులు చిహ్నాలుగా ఉంటాయి. వాటిలో ఎద్దు (Ox) ఒకటిగా గుర్తించబడింది. అటు చైనా, ఇటు జపాన్ జ్యోతిష విధానాలలో – ప్రతి రోజుని ఆ 12 రాశుల పేరుమీదుగా రెండు రెండు గంటల చొప్పున విభజించారు. అందువలన తెల్లవారుఝామున 1 నుండి 3 గంటల వరకు మధ్య ఉన్న కాలాన్ని "వృషభ కాలం" (Ox hour) అని పిలుస్తారు. ఈ సమయంలో – మంత్రగాళ్ళు క్షుద్ర ప్రయోగాలు చేస్తారని, అదేవిధంగా యొకాయ్, యురే, యుబుమే లాంటి వివిధ రకాల ప్రేతాత్మలు మానవ లోకంలో సంచరిస్తాయని జపాన్ తంత్రశాస్త్రంలో చెప్పబడి ఉన్నది.

**1. నరకం నుండి తిరిగి వచ్చిన ఆత్మ :**

దాదాపు రెండు శతాబ్దాల క్రితం 'యమాటో' రాష్ట్రంలో ఒక వ్యక్తి నివసిస్తూ ఉండేవాడు. అతడికి ఒక కూతురు ఉండేది. యుక్త వయస్సుకు వచ్చిన ఆ అమ్మాయి, కవాచి రాష్ట్రానికి చెందిన ఒక యువకుడిని ప్రేమించింది. ఆ యువకుడు పిల్లనగ్రోవి(ఫ్లూటు) వాయించటంలో అపారమైన ప్రావీణ్యాన్ని కలిగి ఉండేవాడు. కొంతకాలం తరువాత ఆ అమ్మాయి, ఆ యువకుడిని పెళ్ళి చేసుకున్నది. వాళ్ళిద్దరూ దాదాపు రెండు సంవత్సరాలపాటు చాలా ఆనందకరమైన జీవితాన్ని గడిపారు.

దురదృష్టవశాత్తు, మూడవ సంవత్సరం ప్రారంభంలో ఆ యువకుడికి హఠాత్తుగా తీవ్రమైన అనారోగ్యం వచ్చింది. ఫలితంగా, కొద్ది రోజులకే అతడు మరణించాడు. తాను ఎంతగానో ప్రేమించిన తన భర్త తనని అలా వదిలిపెట్టి వెళ్ళిపోయే సరికి ఆ యువతి తీవ్రమైన మనోవేదనతో కృంగిపోయింది. ఆమె ఎల్లప్పుడూ తన భర్తను తలచుకుంటూ కుళ్ళి కుళ్ళి ఏడుస్తూ ఉండేది. చాలా అందంగా ఉండే ఆ యువతిని పెళ్ళిచేసుకుని ఒక మంచి జీవితాన్ని కల్పించాలి అన్న సదుద్దేశంతో అనేకమంది యువకులు ఆమె దగ్గరకు వెళ్ళి ఆమెను పెళ్ళి చేసుకుంటామని అడిగారు. అయితే, ఆమె తన భర్తను తప్ప ఇంకొక పురుషుడిని తన జీవిత భాగస్వామిగా ఊహించుకోలేనని వాళ్ళకి చెప్పింది. ఆపై, మూడు సంవత్సరాలు కాలగర్భంలో కలిసిపోయాయి. ఆ తరువాత వచ్చిన ఒక వేసవికాలంలోని ఒక పౌర్ణమిరోజు అర్ధరాత్రి సమయంలో ఆ యువతి తన ఇంటి మేడమీద కూర్చుని తన భర్తను తలచుకుంటూ మనసులో తీవ్రమైన వేదన పడుతున్నది. ఆ సమయంలో ఆమెకు చాలా దగ్గర నుండి ఒక వేణుగానం అస్పష్టంగా వినిపించింది. తన భర్త బ్రతికి ఉన్నప్పుడు అలాంటి వేణుగానాన్నే తనకు వినిపించేవాడని, ఆ సమయంలో ఆమెకు గుర్తుకు వచ్చింది. ఆపై, ఆమె ఆ వేణుగానం వస్తున్నవైపు వెళ్ళింది. అంతలో ఆ వేణుగానం మేడమీద నుండి ఇంటి లోపలి భాగంలోకి వెళుతున్నట్లుగా ఆమెకు వినిపించింది. దాంతో ఆమె ఆ వేణుగానాన్ని అనుసరిస్తూ మేడ దిగి ఇంట్లోకి వెళ్ళింది.

ఆపై, ఆ వేణుగానం ఆ ఇంట్లోని ఒక గదిలోకి వెళ్ళింది. ఆమె ఆ గది దగ్గరకు వెళ్ళేసరికి ఆ గది తలుపులు వాటంతట అవే మూసుకున్నాయి. అప్పుడు ఆమె ఆ గది తలుపులు తడుతూ “దయచేసి తలుపులు తియ్. నన్ను లోపలికి రానియ్” అని పెద్ద గొంతుతో అరిచింది. ఆ తలుపులు తెరుచుకోలేదు. అప్పుడు ఆమె ఆ తలుపుకి ఉన్న ఒక కంతలో నుండి లోపలికి తొంగిచూసింది. లోపల, ఒక బల్లమీద ఆమె భర్త కూర్చుని వేణువుని వాయిస్తున్నాడు. అతడు బ్రతికి ఉన్నప్పుడు ఏవిధంగా కనిపించేవాడో



సరిగ్గా, ఇప్పుడు కూడా అలాగే కనిపిస్తున్నాడు. నాలుగేళ్ళ క్రితం చనిపోయిన వ్యక్తి అలా హఠాత్తుగా కనిపించే సరికి ఆమెకు ఒక్కసారిగా విపరీతమైన భయం వేసింది. ఒక్కసారిగా వళ్ళు ఝల్లుమన్నది. ఆపై, కొద్ది నిమిషాలకు ఆమె గుండెలు చిక్కబట్టుకుని మళ్ళీ ఆ కంతలోంచి లోపలికి చూసింది. ఆమె భర్త ఆ బల్లమీద నుండి లేచి బల్లకి కొంచెం ప్రక్కన నిలబడ్డాడు. అప్పుడు అతడు ధరించిన పాంటు నుండి విచిత్రమైన పొగ, అలలు అలలుగా బైటకు వస్తూ కనిపించింది. ఇంతలో ఆ తలుపు హఠాత్తుగా తెరుచుకున్నది. ఆపై, ఆమె అప్రయత్నంగా ఆ గదిలోకివెళ్ళి తన భర్తకి ఆరు అడుగుల దూరంలో నిలబడి అతడిని విచిత్రంగా చూస్తున్నది. అప్పుడు అతడు మాట్లాడటంకోసం నోరు తెరచాడు. ఆ నోట్లోంచి పొగ వస్తూ కనపడింది. అప్పుడు ఆమె వణుకుతున్న స్వరంతో తన భర్తతో ఇలా అన్నది. "ఏమిటి?, నీ వస్త్రాల నుండి మరియు నోటి నుండి పొగ వస్తున్నది?". అప్పుడు ఆ భర్త బొంగురుగా ఉన్న పెద్ద స్వరంతో ఇలా అన్నాడు. "నేను చనిపోయి నాలుగేళ్ళు అయినప్పటికీ, నువ్వు నన్ను మర్చిపోలేక అనుక్షణం రోదిస్తున్నావు. నువ్వు నాకోసం అలా బాధపడుతూ ఉండే నా ఆత్మకు శాంతి ఎలా ఉంటుంది?. నిన్ను ఓదార్చటానికి నీ దగ్గరకు వచ్చిన నన్నుచూసి భయంతో వణికి పోతున్నావు? నీ కోసం ఎంతో దూరం నుండి వచ్చిన నాకు, నువ్వు ఇచ్చే స్వాగతం ఇదేనా?. నేను నీ దగ్గరకు రావటంకోసం భయంకరమైన వేడిని అనుభవిస్తున్నాను. నువ్వు నన్నుచూసి భయపడుతున్నప్పుడు నేను ఇక్కడ ఉండటంలో అర్థంలేదు".

ఆవిధంగా ఆమెతో చెప్పిన ఆమె భర్త, కన్నుమూసి తెరిచేలోగా అదృశ్యం అయిపోయాడు. (నోట్ : జపాన్ దేశంలో ప్రచారంలో ఉన్న సిద్ధాంతాల ప్రకారం చూసినట్లయితే – ప్రేతలోకంలో ఉన్న ఆత్మ ఏ కారణంచేతైనా మళ్ళీ భూమిమీదకు వచ్చినట్లయితే ఆ ఆత్మని ప్రేతలోకం తాలీకు అగ్ని దహించి బాధపెడుతుంది. ఆ బాధను తట్టుకోలేని ఆత్మ, మళ్ళీ ప్రేతలోకానికి వెళ్ళిపోయి ఆ బాధ నుండి విముక్తి పొందుతుందని చెప్తుకుంటారు. ఈ యదార్ధ వృత్తాంతంలో తన భార్యను ఓదార్చటం కోసం ఆమె, భర్త ఆత్మ ఈ లోకానికి వచ్చింది. అలా వచ్చిన ఫలితంగా అతడి ఆత్మని నరకలోక అగ్ని దహించింది. అయినా అతడు ఆ బాధను భరిస్తూ కొంచెంసేపు అక్కడే ఉన్నాడు అన్నమాట.)

**2. ఏడుగురు ప్రేతాత్మ–యాత్రికులు :**

ప్రాచీన జపాన్‌లోని కగావా రాష్ట్రంలో 250 సంవత్సరాల క్రితం యదార్ధంగా జరిగిన గాథ ఇది...ఆ సమయంలో ఏడుగురు యాత్రికులు తమ ప్రాంతానికి

దాదాపు 200 కి.మీ. దూరంలో ఉన్న ఒక ప్రాచీన కాలంనాటి బౌద్ధ ఆలయాన్ని దర్శించటంకోసం ప్రయాణం ప్రారంభించారు. వాళ్ళు అలా నడుస్తూ వెళుతున్న సమయంలో, ఒకరోజు రాత్రి సమయంలో ఆకాశంలో నల్లటి దట్టమైన మేఘాలు కమ్ముకున్నాయి. కొద్దిసేపట్లోనే కుండపోతగా వర్షం మొదలయ్యింది. ఆ సమయంలో తల దాచుకోవటానికి వాళ్ళకి ఒక చెట్టుకూడా కనపడలేదు. దాంతో వాళ్ళు ఇక చేసేది లేక తమ నడకని కొనసాగించారు. ఆ సమయంలో ఆకాశం గర్జించింది. ఆకాశంలోని ఒక ప్రాంతంలో ఎర్రటి ఎరుపురంగులో ఒక పెద్ద వెలుగు కనిపించింది. ఆపై, ఒకటి, రెండు నిమిషాలలో మహా ప్రమాదకరమైన ఒక పిడుగు, భీకర శబ్దంతో గర్జిస్తూ ఆ యాత్రికులపైన పడింది.



ఫలితంగా, ఆ ఏడుగురు యాత్రికులు కాలి బూడిద అయిపోయారు. అక్కడ ఎముక కుప్ప మాత్రమే మిగిలింది. ఈ సంఘటన జరిగిన వారం రోజుల తరువాత ఒక యువకుడు ఒక అర్ధరాత్రి సమయంలో ఆ మార్గం గుండా నడిచి వెళుతున్నాడు. ఆ సమయంలో అతడికి, చేతుల్లో వెలుగుతున్న కాగడాలు పట్టుకుని ఒకరివెంట ఒకరు నడుచుకుంటూ వెళుతున్న ఏడుగురు యాత్రికులు కనిపించారు. వాళ్ళు నిజమైన యాత్రికులని భావించిన ఆ యువకుడు వాళ్ళతోపాటు కలిసి వెళితే తనకు ఆ అరణ్యంలో ఏవిధమైన భయం ఉండదని భావించి వేగంగా నడుస్తూ వాళ్ళ దగ్గరకి వెళ్ళాడు. ఈ యువకుడు వాళ్ళ దగ్గరకి ఇలా వెళ్ళాడో లేదో ఆ యాత్రికులు కన్నుమూసి

తెరిచే లోగా అదృశ్యం అయిపోయారు. తన కళ్లముందే జరిగిన ఆ విచిత్రాన్ని చూసి ఆ యువకుడు ఆశ్చర్యపోయాడు. ఆ తరువాత అతడు ఎలాగో తన గ్రామానికి చేరుకున్నాడు. ఆ తరువాత అతడికి తెలిసింది ఒక భయానక విషయం. అది ఏమిటంటే, తనకి కొద్ది రోజుల క్రితం అర్ధరాత్రి సమయంలో కనిపించిన ఆ ఏడుగురు యాత్రికులు నిజమైన మనుషులు కాదని, కొంతకాలం క్రితం చనిపోయిన ఏడుగురు యాత్రికుల యొక్క ప్రేతాత్మలు అని.

ఒక విశేషం ఏమంటే, ఈ ఏడుగురు యాత్రికుల ప్రేతాత్మలు, అందరికీ కనపడవని చెప్పుకుంటారు. ఎవరైతే, తమ చెవుల్ని జంతువుల్లాగా అటు ఇటు ఊపగలరో వాళ్ళకి మాత్రమే ఈ ఏడుగురి ప్రేతాత్మలు కనిపిస్తాయని చెబుతారు. (గేదెలు, మేకలు లాంటి జీవులు తమ చెవుల్ని ముందుకి, వెనక్కి ఊపగలవు. కానీ కొంతమంది మానవులు కూడా తమ చెవుల్ని అటు, ఇటూ ఊపగలిగే శక్తిని కలిగి ఉంటారని చెబుతారు.) "ఇతరులు ఎవరైనా ఈ ప్రేతాత్మలను చూడాలి" అనుకుంటే – ఆ ప్రేతాత్మలు సంచరించే ప్రాంతానికి రాత్రి సమయాలలో ఒక ఆవును తీసుకువెళ్ళి ఒకచోట దానిని నిలబెట్టాలి. ఆ తరువాత, వాళ్ళు అటువైపుగా వస్తున్నారని తెలిసినప్పుడు ఆ ఆవు నాలుగు కాళ్ళ మధ్య నుండి చూసినట్లయితే, అటువైపుగా వెళుతున్న ఈ యాత్రికుల ప్రేతాత్మలు కనిపిస్తాయి. ఎందుకంటే, ఆవులకు ఈ ఏడుగురు యాత్రికుల ప్రేతాత్మలను చూడగలిగే శక్తి ఉన్నదని ఈ ప్రాంతంలో విశ్వసిస్తారు. ఈ ప్రాంతంలో తరచుగా అనేక విచిత్రమైన పరిస్థితుల్లో ఈ యాత్రికుల ప్రేతాత్మలు కొంతమంది మనుషులకు కనపడటం జరుగుతుంది.

అది ఎలాగంటే...ఉదాహరణకి – ఒక రైతు తన ఆవులను సాయంత్ర సమయంలో పచ్చిక బయలు నుండి తన ఇంటికి తోలుకు వస్తున్న సమయంలో ఆ ఆవులు, నాలుగు మార్గాలు కలిసే ప్రదేశం మీదుగా నడుస్తున్నప్పుడు వాటికి ఎదురుగా గాలిలో తేలుతూ వస్తున్న ఆ ప్రేతాత్మల ఆత్మలు కనిపిస్తాయి. దాంతో అవి నడకను ఆపేసి ఆపై ఆ మార్గానికి కొంచెం ప్రక్కగా వచ్చి నిలబడతాయి. ఆవులు అలా హఠాత్తుగా ఆగిపోయాయి అంటే అటువైపుగా యాత్రికుల ప్రేతాత్మలు వస్తున్నాయని ఆ రైతు అర్ధం చేసుకుంటాడు. ఆపై, తన ప్రక్కనే ఉన్న ఏదో ఒక ఆవు కాళ్ళ మధ్య నుండి చూసినప్పుడు అతడికి గాలిలో తేలుతూ వరుసగా వెళ్ళిపోతున్న యాత్రికుల ప్రేతాత్మలు కనిపిస్తాయి. నాలుగు రోడ్లు కలిసే ప్రాంతంలో ఈ యాత్రికుల ప్రేతాత్మలు కొంచెంసేపు నిలబడిపోయతాయి. ఆ సమయంలో ఎవరైనా మనిషి, వాటి దగ్గరగా

వెళితే అతడి ఆయుర్దాయం ఆ క్షణంతో ముగిసిపోతుందని చెబుతారు. ఆ కారణంగానే, కగావా రాష్ట్రంలోని చాలా ప్రాంతాలలో ఉన్న నాలుగు రోడ్లు కలిసే కూడలి ప్రాంతాలలో సాయంత్రం దాటిన తరువాత నిలబడటానికి ఏ మనిషీ సాహసించడని చెప్పుకుంటారు.

ప్రాచీన జపాన్‌లోని కోచి రాష్ట్రంలో ఇంకొక కథ ప్రచారంలో ఉన్నది. అది ఏమిటంటే, ఆ ప్రాంతంలో పౌర్ణమి రాత్రులలో ఏడుగురు వ్యక్తులు ఒకరి వెనకాల ఒకరు గాలిలో తేలుతున్నట్లుగా వెళుతూ ఉంటారు. ఒక విచిత్రం ఏమంటే, ఒక పూల దండలోని దారానికి పూలు వరుసగా ఎలా గుచ్చబడి ఉంటాయో, అలాగే ఈ ఏడుగురు వ్యక్తులూ ఒక పొడవాటి గొలుసుకి ఒకరి తరువాత కట్టబడి ఉంటారు. నిజానికి, ఈ ఏడుగురు వ్యక్తులూ మనుషులుకాదు. ప్రేతాత్మలని గుర్తించాలి. ఈ ఏడుగురు ప్రేతాత్మలను 'సప్త మిసాకి' (ఏడుగురు మిసాకీలు) అని పిలుస్తారు. సముద్రంలో పడిపోయి, అప్పుడప్పుడూ కొంతమంది ఆత్మహత్య చేసుకుని చనిపోతూ ఉంటారు. అలా చనిపోయిన ప్రతి ఏడుగురు ఆత్మలను నరకలోకానికి చెందిన ఒక మహాశక్తి ఒక గొలుసుకి వరుసగా బంధిస్తుంది. అనగా, ఆ ఆత్మలను స్వర్గానికి వెళ్ళకుండా ఆ గొలుసు అడ్డుకుంటుంది అన్నమాట. అనగా, తమ జీవితాలను బలవంతంగా ముగించుకున్న పాపానికి ఈ లోకంలోనే, బంధించబడి ఉండే నరకలోక శిక్ష ఆ ఆత్మలకు వెయ్యబడింది అని గ్రహించాలి. ఆ ఆత్మలు ఆ గొలుసుతోనే తమకు తోచిన దిక్కులో, పౌర్ణమి రాత్రులలో ప్రయాణిస్తూ ఉంటాయి. (ఒక రైలు ఇంజను వెనకాల వరుసగా అమర్చబడి ఉండే రైలు పెట్టెలు ఏవిధంగా ఒక దానికి ఒకటి అనుసంధించబడి ఉంటాయో, అదేవిధంగా ఒక గొలుసుకి ఈ ఏడుగురి ప్రేతాత్మలు సంధించబడి ఉంటాయి. ఇక్కడ ఇంకొక విశేషం ఉన్నది. అది ఏమిటంటే, ఒక సందర్భంలో లేదా ఒక సంఘటన జరిగినప్పుడు ఆ గొలుసుకి కట్టబడి ఉండే ఈ ఏడుగురి ప్రేతాత్మలలో ఆ వరుసలో ముందు ఉన్న ప్రేతాత్మకి ఆ గొలుసు నుండి విముక్తి కలుగుతుంది. అనగా, ఆ గొలుసుకి బంధించబడి ఉండే శిక్ష నుండి విముక్తి కలుగుతుంది అన్నమాట. ఆ సంఘటన ఏదంటే, కొత్తగా ఎవరైనా మానవుడు సముద్రంలో పడి చనిపోయి ప్రేతాత్మగా మారినప్పుడు ఆ గొలుసుకి మొదట ఉండే ప్రేతాత్మకి ఆ నరక శిక్ష తొలగిపోతుంది. ఆపై, ఆ ప్రేతాత్మ స్వర్గానికి వెళ్ళిపోతుంది. ఇక, కొత్తగా వచ్చిన ప్రేతాత్మ ఆ గొలుసుకి చివర కట్టివేయబడుతుంది. అనగా, ఏడవ స్థానంలో కట్టివేయబడుతుంది. ఎందుకంటే, మొదటి స్థానంలో ఉన్న ఆత్మ వెళ్ళిపోయిన కారణంగా, రెండవ ఆత్మ, మొదటి స్థానానికి చేరుతుంది. కనుక, ఏడవ

స్థానంలో ఉన్న ఆత్మ, ఆరవ స్థానానికి వెళుతుంది. ఫలితంగా, ఏడవ స్థానం ఖాళీ అవుతుంది కనుక, ఆ స్థానంలోకి కొత్తగా వచ్చిన ప్రేతాత్మ చేరుతుంది.

ఆ వరుసలో ముందు ఉండే ప్రేతాత్మ, కొంతకాలంపాటు ఆ గొలుసుకి బంధించబడి ఉన్న తరువాత తీవ్రమైన విసుగును పొందుతుంది. దాంతో అది, తమ బృందానికి ఎదురైన ఎవరో ఒక మనిషిని చంపివేస్తుంది. ఫలితంగా, ముందు ఉన్న ఆత్మకి విముక్తి లభిస్తుంది. అనగా, అది అప్పటికప్పుడే అక్కడ నుండి స్వర్గానికి ఎగిరిపోతుంది. ఇక, ఆ ముందు ఉన్న ప్రేతాత్మచేత చంపబడిన వ్యక్తియొక్క ఆత్మ, ఏడవ స్థానంలో కట్టివేయబడుతుంది. (మొదటి ఆత్మ ఎప్పుడైతే వెళ్ళిపోయిందో మిగిలిన ఆత్మల స్థానాలు ముందుకు వెళతాయి. అనగా 7వ ఆత్మ, 6వ స్థానానికి వెళుతుంది. కొత్తగా వచ్చిన ఆత్మ 7వ స్థానంలో చేరుతుంది).

నోట్ : ఇలా గొలుసుకి వరుసగా కట్టబడి ఉండే ఏడుగురు ప్రయాణీకుల ఆత్మలను జపాన్ భాషలో 'షిరియో' అని పిలుస్తారు. ఈ మాటకు అర్థం "ప్రేతాత్మలు" అని.

**3. పిశాచి బిడ్డ :**

దాదాపు 300 సంవత్సరాల క్రితం ఆనాటి జపాన్‌లోని క్యోటో నగరానికి దగ్గరలో ఉన్న ఎడో అనే పట్టణంలో కెన్‌హీ అనే ఒక దుకాణ యజమాని ఉండేవాడు. అతడు సంవత్సరానికి ఒకసారి 'క్యోటో' నగరానికివెళ్ళి అక్కడ ఒక పెద్ద దుకాణంలో తనకు కావలసిన సరుకులను కొనుక్కుని తన పట్టణానికి తిరిగి వస్తూ ఉండేవాడు. ఆపై ఆ సరుకులను సంవత్సరం అంతా తన దుకాణంలో అమ్ముతూ ఉండేవాడు. ఈ క్యోటో నగరంలో ఒక వితంతు స్త్రీ, నడిపే ఒక పెద్ద టోకు దుకాణం నుండి (హెూల్‌సేల్ దుకాణం) కెన్‌హే తనకు కావలసిన సరుకులను తెచ్చుకుంటూ ఉండేవాడు. ఆ దుకాణ యజమానురాలు అయిన ఆ వితంతు స్త్రీకి ఒక అందమైన కూతురు ఉండేది. ఈ కూతురు, ఒకసారి కెన్‌హేని చూసింది. అలా చూసి చూడగానే అతడి హృదయాన్ని దోచుకుంది. అంతేకాకుండా, ఆ హృదయాన్ని తిరిగి అతనికి ఇచ్చే ఉద్దేశం కూడా ఆమెకు లేదు. ఏదిఏమైనా, ఆ వ్యాపారస్తురాలి కూతురు మరియు కెన్‌హే ఒకరిని ఒకరు గాఢంగా ప్రేమించుకున్నారు. ఆ తరువాత ఒకరోజు ఆ అమ్మాయి, తాను కెన్‌హేని ప్రేమిస్తున్న విషయం తన తల్లికి చెప్పింది. కెన్‌హే గురించి అప్పటికే బాగా తెలిసి ఉన్న ఆ తల్లి, కూతురి ప్రేమకు తన అంగీకారాన్ని తెలిపింది. ఆ తరువాత కెన్‌హే, ఆమెను దగ్గరకు తీసుకుని ఆమెతో ఇలా చెప్పాడు.

"నేను ఎడో పట్టణంలో నివసిస్తున్నాను. అందువలన నీవు కూడా నాతో పాటు అక్కడే ఉండాలి. నేను, మొదట మా ఊరికి వెళ్ళి అక్కడ నీవు ఉండటానికి కావాల్సిన ఏర్పాట్లుచేసి ఆపై ఇక్కడకు తిరిగి వచ్చి నిన్ను తీసుకుని వెళతాను. సరేనా?". కెన్‌హే అన్న మాటలకు ఆమె అంగీకరించింది. ఆపై ఆమె, అతడితో ఇలా అన్నది. "ప్రస్తుతం ఎడోలో కాపురం పెట్టటానికి తగినంత డబ్బు నీ దగ్గర లేదని నాకు తెలుసు. అందువలన, నేను ఈ సంవత్సరం అంతా ఇక్కడే నీ కోసం వేచి ఉంటాను. నువ్వు, వచ్చే సంవత్సరం మొదట్లో నీ దుకాణానికి అవసరమైన సరుకులు కొనటానికి వచ్చినప్పుడు నన్ను కూడా నీ వెంట మీ ఊరికి తీసుకువెళ్ళు". ఆమె అన్న మాటలకు కెన్‌హే అంగీకరించాడు. ఆపై, అతడు వచ్చే సంవత్సరం ఆమెను ఎడోకి తీసుకువెళతానని ఆమెకు చేతిలో చెయ్యివేసి మాట ఇచ్చాడు. ఆపై, కెన్‌హే ఎంతో సంతోషంతో, తన సరుకులను బళ్ళలో వేసుకుని తన నివాస ప్రాంతం అయిన ఎడోకి బయలుదేరాడు. అయితే, మార్గమధ్యంలో కెన్‌హేకి తీవ్రమైన అనారోగ్యం వచ్చింది. దాంతో అతడు ఆ సరుకులను ఇతరులకు అప్పగించి అతి కష్టంమీద ఎడోకి చేరుకుని మంచంమీద కూలిపోయాడు. కొద్ది నెలలపాటు కెన్‌హే ఆ అనారోగ్యంతో మంచంమీదే ఉన్నాడు. అయినప్పటికీ అతని వ్యాధి తగ్గలేదు. ఆపై, రెండు సంవత్సరాలు గడిచాయి. అక్కడ – తన ప్రియుడైన కెన్‌హే రాకకోసం ఎంతో ఆత్రుతతో ఎదురు చూస్తున్న ఆ అమ్మాయి, రెండేళ్ళు దాటిపోయినా కెన్‌హే తిరిగి రాకపోవటంతో ఎంతో బాధపడింది. తనను, కెన్‌హే మోసం చేసాడని, తీవ్రంగా క్రుంగిపోయింది. ఆమె ఈ మానసిక వేదనతో మంచం పట్టింది. ఆపై, రెండు నెలలు పూర్తి అయ్యే సరికి ఒకరోజు రాత్రి సమయంలో మానసిక బాధతో ఆమె గుండె ఆగిపోయి చనిపోయింది. ఇక, అక్కడ ఎడో పట్టణంలో ఉంటున్న కెన్‌హే, క్యోటో నగరంలో తనకోసం ఆ అమ్మాయి ఎదురుచూస్తూ



ఉంటుందని రోజూ అనుకుంటూ ఉండేవాడు. అతనికి అప్పుడప్పుడే ఆరోగ్యం చక్కబడుతున్నది. ఇంకా కొద్దిరోజుల్లో ఎలాగైనా సరే, క్యోటో వెళ్ళి ఆమెను వెంటపెట్టుకుని ఇక్కడికి తీసుకురావాలని కెన్‌హే నిర్ణయించుకున్నాడు. ఆపై మూడు రోజులు గడిచాయి. నాల్గవ రోజున అకస్మాత్తుగా వాతావరణం మారిపోయింది. ఆకాశం కారు మబ్బులతో నిండిపోయింది. ఉదయం నుండి రాత్రి వరకు ఆగకుండా వర్షం కురుస్తూనే ఉన్నది. కెన్‌హే, ఆ వర్షంలో ఇంట్లోంచి బైటకు రాలేక ఇంట్లోనే ఉండి కాలక్షేపం చేస్తున్నాడు. ఇంతలో అర్ధరాత్రి అయ్యింది. కెన్‌హే తన మంచంమీద దుప్పటి కప్పుకుని నిద్రపోతున్నాడు. ఇంతలో వాకిట్లో ఎవరో నిలబడి, వాకిటి తలుపులు తడుతున్నారు. ఆ శబ్దానికి కెన్‌హేకి మెళుకువ వచ్చింది. ఆపై అతడు దుప్పటి ముసుగుతీసి మంచంమీద కూర్చున్నాడు. అప్పుడు అతనికి బైట వైపు నుండి ఒక స్త్రీ అంటున్న మాటలు ఇలా వినిపిస్తున్నాయి. "ఇది కెన్‌హే గారి ఇల్లేనా?". ఎవరో స్త్రీ, అందునా అర్ధరాత్రి సమయంలో తన తలుపులు తడుతూ మరియు ఆ ఇల్లు తనదేనా? అని బైట నుండి పదే పదే అడగటంతో కెన్‌హేకి చాలా ఆశ్చర్యంగా అనిపించింది. ఆపై అతడు ఆ మంచం మీద నుండి దిగి వేగంగా అడుగులు వేస్తూ వాకిటి తలుపులు దగ్గరకు వెళ్ళి తలుపులు తీసి చూసాడు. బైట ఇంకా వర్షం కురుస్తూనే ఉన్నది. సరిగ్గా, అప్పుడే హఠాత్తుగా ఒక మెరుపు మెరిసింది. ఆ మెరుపు తాలీకు వెలుగు, కెన్‌హే వాకిట్లో కొద్ది సెకన్లపాటు ప్రసరించింది. ఆ వెలుగులో అతడి ప్రియురాలు కనిపించింది. ఆమెను చూసి కెన్‌హే చాలా ఆనంద పడ్డాడు. ఆపై ఆమెను కౌగలించుకుని ఆమెతో ఇలా అన్నాడు. "నిన్ను ఇక్కడ చూడటం నాకు ఎంతో సంతోషంగా ఉన్నది".

అతడిని చూడగానే ఆమె ఆనందంతో పొంగిపోయింది. ఆపై ఆమె, ఆనందం నిండిన స్వరంతో అతడితో "త్వరలో మళ్ళీ వస్తానని చెప్పి వెళ్ళిన నీవు మూడేళ్ళు గడిచినా రాలేదు. ఏ కారణంగా నీవు ఇక్కడే ఉండిపోయావు?" అన్నది. అప్పుడు కెన్‌హే, తనకి తీవ్రమైన అనారోగ్యం వచ్చిందని, ఆ కారణంగానే మూడేళ్ళపాటు ఇంట్లో నుండి బైటకు రాకుండా ఉండిపోయానని ఆమెకు చెప్పాడు. చాలాకాలం తరువాత కలుసుకున్న ఆ ప్రేమికులు ఇద్దరూ, తెల్లవారేదాకా ఏవేవో విషయాలు మాట్లాడుకుంటూ ఉండిపోయారు. తెల్లవారిన తరువాత కెన్‌హే, ఆమెను అక్కడికి దగ్గరలో ఉన్న ఒక బౌద్ధ ఆలయానికి తీసుకువెళ్ళి అక్కడే ఆమెను శాస్త్రోక్తంగా పెళ్ళి చేసుకున్నాడు. ఆపై వాళ్ళిద్దరూ ఆ ఎడో పట్టణం మధ్యలో ఉన్న ఒక ఇంట్లో కొత్త కాపురం ప్రారంభించారు. కొద్ది రోజులు గడిచాయి. ఆపై ఒకరోజు ఆమె, కెన్‌హేతో

ఇలా అన్నది. "క్యోటోలో మా అమ్మ ఒక్కతే ఉంటున్నది. ఆమె ఈ వయస్సులో అక్కడ ఏం వ్యాపారం చేస్తుంది?. ఆమెను కూడా ఇక్కడకు తీసుకువద్దాం. మనతోపాటు ఉంచుకుందాం". ఆమె మాటలు విన్న కెన్‌హే కొంచెం ఇబ్బంది పడ్డాడు. ఆపై చిన్న స్వరంతో ఆమెతో ఇలా అన్నాడు. "నా దగ్గర ఇప్పటికీ సమృద్ధిగా డబ్బులేదు. ఇంకొక రెండు మూడు ఏళ్ళు ఓపిక పట్టు. అప్పటికి నేను బాగా డబ్బు సంపాదిస్తాను. అప్పుడు మీ అమ్మని కూడా తీసుకువచ్చి ఇక్కడ ఉంచుకుందాం సరేనా". కాలక్రమంలో రెండేళ్ళు గడిచాయి. ఆమె గర్భవతి అయ్యింది. ఆపై కొద్ది నెలలకు, బాగా అందంగా ఉన్న ఒక మగబిడ్డ ఆమెకు పుట్టాడు. ఆ బిడ్డకి మూడు సంవత్సరాల వయస్సు వచ్చిన తరువాత ఒకరోజు కెన్‌హే తన భార్యతో ఇలా అన్నాడు. "గతంలో నీకు ఇచ్చిన మాట ప్రకారం, మీ అమ్మని తీసుకురావటానికి క్యోటోకి ఇప్పుడే బయలు దేరుతున్నాను. రెండు, మూడు రోజులలోగా మీ అమ్మను తీసుకుని ఇక్కడకు తీసుకువస్తాను. ఆమెను కూడా మనతోపాటు ఆమె శేష జీవితాన్ని గడుపుతుంది". ఆపై కెన్‌హే, తన అత్తగారు నివసిస్తున్న క్యోటో నగరానికి బయలుదేరాడు. అక్కడికి చేరుకున్న తరువాత నేరుగా తన అత్తగారింటికి వెళ్ళాడు. ఆపై ఆమెను చిరునవ్వుతో పలకరించాడు. అయితే ఆమె కొద్ది నిమిషాలపాటు ముఖంలో ఏ భావమూ ప్రదర్శించకుండా గంభీరంగా ఉండిపోయింది. ఆపై, ఆమె వణుకుతున్న స్వరంతో అతడితో ఇలా అన్నది. "నువ్వు, నాలుగేళ్ళక్రితం ఇక్కడ నుంచి వెళుతూ, మళ్ళీ కొద్ది రోజుల్లోనే వచ్చి నా కూతుర్ని పెళ్ళి చేసుకుని, ఆపై ఆమెను మీ ఊరికి తీసుకువెళతానని అన్నావు. కానీ, నీవు సంవత్సరం గడిచినా రాలేదు. నీ మీద దిగులు పడిన నా కూతురు మనో వ్యధతో కృంగిపోయి చనిపోయింది. ఇప్పుడు నేను ఒక అనాధని. నాకంటూ ఎవరూ లేరు. ఇప్పుడు నువ్వు వచ్చినా నాకేం ప్రయోజనం".

ఆమె అన్న మాటలు విన్న కెన్‌హే ఒక్కసారిగా నిర్ఘాంతపోయాడు. కొంచెం సేపు మాట్లాడలేకపోయాడు. ఆ తరువాత ఎలాగో తేరుకుని, ఆపై వణుకుతున్న స్వరంతో ఆ వృద్ధురాలితో ఇలా అన్నాడు. "ఏమిటి నువ్వు చెబుతున్నది?. మూడు సంవత్సరాల క్రితం నీ కూతురు నా ఇంటికి వచ్చింది. ఆమెను నేను వెంటనే పెళ్ళి చేసుకున్నాను. మా ఇద్దరికీ ఇప్పుడు రెండు సంవత్సరాల మగ బిడ్డ ఉన్నాడు. వాడు ప్రస్తుతం వాళ్ళ అమ్మతో కలిసి మా ఇంట్లోనే ఉన్నాడు. మరి, నీ కూతురు చనిపోయిందని చెబుతున్నావు. నాకేమీ అర్థం కావటంలేదు". కెన్‌హే చెప్పిన మాటలు విన్న ఆ వృద్ధురాలు మరేమీ మాట్లాడకుండా కెన్‌హే కుడిచేయి పట్టుకుని అతడిని తన ఇంటి మధ్య గదిలోకి తీసుకువెళ్ళింది. అక్కడ, ఒక బల్లమీద ఆమె కూతురి చిత్రపటం

మరియు ఆమె జననం మరియు మరణ వివరాలను తెలియజేసే ఒక చిన్న శిలాఫలకం కెన్‌హేకి కనిపించాయి. దాంతో, కెన్‌హేకి తల తిరిగినట్లు అయ్యింది. అంటే, “ఆ వృద్ధురాలి కూతురు నాలుగేళ్ళ క్రితం చనిపోయిన మాట నిజమే. మరి, మూడేళ్ళ క్రితం నా దగ్గరకు ఆ అమ్మాయి ఎలా రాగలిగింది?. అంటే, నా దగ్గరకు వచ్చింది ఆ అమ్మాయి కాదు. ఆమె ప్రేతాత్మ, నా మీద ప్రేమను చంపుకోలేక మానవ రూపంలో ఆమె నా దగ్గరకు వచ్చింది అన్నమాట. అంతేకాదు, నా ద్వారా ఒక బిడ్డను కూడా కన్నది అన్నమాట”.

ఈవిధంగా ఆలోచించుకున్న కెన్‌హేకి అసలు విషయం అర్ధమయ్యింది. ఆమె ఆత్మకు పరిపూర్ణమైన శాంతి కలిగితే గాని ఆమెయొక్క ప్రేత రూపం పోదని అర్ధంచేసుకున్న కెన్‌హే ఆ తరువాత రోజున ఒక బౌద్ధమత పూజారి సహాయంతో ఆమె ఆత్మశాంతికోసం అనేక రకాల పరిహారాలు చేయించాడు. ఆ తరువాత ఆ వృద్ధురాలిని వెంటపెట్టుకుని ఎడో పట్టణానికి చేరుకున్నాడు. కెన్‌హే ఆ వృద్ధురాలితో తన ఇంటికి వెళ్ళే సరికి అక్కడ అతని భార్యలేదు. కేవలం, అతని కొడుకు మాత్రమే ఉన్నాడు. ఎప్పుడైతే ఆమె ఆత్మకి శాంతి కలిగిందో ఆమె ఈలోకాన్ని వదిలిపెట్టి పై లోకాలకు వెళ్ళిపోయిందని కెన్‌హేకి మరియు వృద్ధురాలైన అతని అత్తగారికి స్పష్టంగా అర్ధమయ్యింది. ఆపై, ఆ వృద్ధురాలు, అమాయకంగా మరియు దీనంగా తనవైపు చూస్తున్న తన కూతురి బిడ్డను అశ్రునయనాలతో తన దగ్గరకు తీసుకుని బలంగా తన గుండెలకు హత్తుకున్నది. తండ్రి మరియు అమ్మమ్మల పెంపకంలో పెరిగి పెద్దవాడైన ఆ బిడ్డ ఆ తరువాతకాలంలో ఆ ప్రాంతంలోనే గొప్ప పండితుడిగా మరియు సంస్కారవంతుడిగా గుర్తించబడ్డాడు. ఒక స్త్రీ ప్రేతాత్మకి మరియు ఒక మానవ పురుషుడికి సంతానం కలిగే అవకాశాలు ఉన్నాయని ప్రాచీన జపాన్‌లో జరిగిన ఈ యదార్ధ గాధ నిరూపిస్తుందని గుర్తించాలి.

**బిడ్డకోసం తల్లడిల్లే తల్లి ప్రేతాత్మల (ఉబూమే) యదార్ధ గాధలు :**

A) **శ్మశానంలో ఉబూమే ప్రేతాత్మ :**

ఈనాడు టోక్యో (జపాన్) నగరంలోని సుకీజీ ప్రాంతం రణగొణ ధ్వనులతో నిండి ఉండే చేపల మార్కెట్లకు నిలయంగా ఉన్నది గానీ, రెండు, మూడు శతాబ్దాల క్రితం ఆ ప్రాంతం అంతా అనేక షింటో మత మరియు బౌద్ధమత ఆలయాలతో నిండి ఉండేది. ముఖ్యంగా, ఆ ప్రాంతంలో ఉన్న 'హాన్‌కన్-జి' ఆలయం, జపాన్ దేశం అంతటా ప్రఖ్యాతిని కలిగి ఉండేది. ఈ ఆలయ పరిసర ప్రాంతాలలో అనేక

శ్మశానాలు ఉండేవి. ఇక, సుకీజీ ప్రాంతాన్ని ఆనుకుని ప్రవహించే 'సుమిద' నది ఒడ్డున అనేకమంది బెస్తవాళ్ళు నిలబడి అక్కడకు వచ్చిన వాళ్ళకి తాజా చేపల్ని అమ్ముతూ ఉండేవాళ్ళు. ఆ కాలంలో ఆ ప్రాంతంలో జరిగిన కొన్ని పిశాచ సంబంధ ఉదంతాల గురించి ఇక్కడ తెలుసుకుందాం...

ప్రతిరోజూ అర్ధరాత్రి దాటిన నాలుగైదు నిమిషాల తరువాత ఒక స్త్రీ, దాదాపు సంవత్సరం వయస్సు ఉన్న ఒక చిన్నబిడ్డని తన చేతుల్లో పట్టుకుని, ఆపై ఆ బిడ్డను తన హృదయానికి హత్తుకుని కనపడుతూ ఉండేది. ఈ స్త్రీ ఆ నది గట్టున ఉన్న ఒక తీపి పానీయాలు అమ్మే ఒక చిన్న దుకాణం దగ్గరకు వచ్చి, ఆపై ఆ దుకాణంలో ఒక తీపి పానీయాన్ని ఆ బిడ్డకోసం కొని ఆపై ఆ పానీయాన్ని ఆ బిడ్డకి త్రాగమని ఇచ్చేది. ఆ పానీయాలు అమ్మే వ్యాపారి మనసులో ఈ స్త్రీ గురించి ఏదో తెలియని అనుమానం తరచుగా తలెత్తుతూ ఉండేది. దాంతో, ఒకరోజున ఆమె తన దగ్గరకు వచ్చి ఆ తీపి పానీయాన్ని కొనుక్కుని, ఆపై హాన్‌కన్-జి ఆలయం యొక్క ప్రధాన మందిరంవైపు వెళ్ళటం గమనించాడు. ఆపై, అతడు తన దుకాణాన్ని వదిలిపెట్టి చాలా నిశ్శబ్దంగా అడుగులు వేస్తూ ఆమె వెనకాలే వెళ్ళాడు. అలా, ఆలయం ప్రహరీని దాటి కొద్ది అడుగులు లోపలికి నడిచింది. ఆ వ్యాపారి కూడా ప్రహరీ దాటి కొంచెం లోపలికి వెళ్ళాడు. అంతే, అప్పుడు అక్కడ ఒక ఊహాతీతమైన సంఘటన ఎదురయ్యింది. అది ఏమిటంటే, "నోటితో – ఉఫ్ అని ఊదితే ఒక కొవ్వొత్తి ఎలా ఆరిపోతుందో, అలా ఆ స్త్రీ, అతని కళ్ళముందే అదృశ్యం అయిపోయింది. ఇంకొక విశేషం ఏమంటే, ఆమె అదృశ్యం అయిపోతున్న సమయంలోనే అక్కడకు బాగా దగ్గరలో ఉన్న ఒక శ్మశానం నుండి ఒక చిన్న బిడ్డ, కెవ్వుమని ఏడ్చిన ఏడుపు కూడా వినపడింది. అలా పసిబిడ్డ ఏడుపు వినపడగానే ఆ వ్యాపారి, అదృశ్యం అయిపోయిన ఆ స్త్రీ విషయం మర్చిపోయి ఆపై, ఆ ఏడుపు ఎక్కడ నుండి వస్తున్నది? అని తెలుసుకోవాలన్న ఆదుర్దాతో వెనక్కి తిరిగి ఆ శ్మశానంవైపు అడుగులు వేసాడు. దాదాపు ఒక 30 అడుగులు నడిచిన తరువాత అక్కడ సమాధి చెయ్యటంకోసం త్రవ్విన ఒక కొత్త గొయ్యి కనపడింది. ఆ గొయ్యిలోంచి బిడ్డ ఏడుపు వినిపిస్తుంది అని నిర్ధారించుకున్న ఆ వ్యాపారి, వేగంగా అడుగులు వేస్తూ ఆ గొయ్యి దగ్గరకు వెళ్ళాడు. ఆ గోతిలో కనపడిన దారుణమైన దృశ్యంచూసి నిర్ఘాంతపోయాడు. ఏమిటా దృశ్యం...?.

ఆ గోతిలో తెరచి ఉన్న ఒక శవపేటిక ఉన్నది. ఆ శవపేటికలో ఒక స్త్రీ మృతదేహం ఉన్నది. ఆ స్త్రీ గుండెలమీద వెల్లికిలా పడుకుని రోదిస్తున్నాడు ఒక సంవత్సరం వయస్సు ఉన్న మగబిడ్డ. ఆ బిడ్డ శరీరం చుట్టూ ఆ స్త్రీ చేతులు బిగించి

ఉన్నాయి. ఆ వ్యాపారి కొద్ది నిమిషాల తరువాత తేరుకుని ఆపై శవపేటికలో ఆ స్త్రీ మృతదేహం చేతుల మధ్యలో ఇరుక్కుపోయిన ఆ పసిబిడ్డను బైటకు తీద్దామని ఆ గోతిమీదకి వంగాడు. అంతే, ఒక్కసారిగా ఆ స్త్రీ మృతదేహం, వికృతంగా అరుస్తూ ఆ శవపేటికలోంచి ఆ బిడ్డతో సహా పైకి లేచింది. ఆ భయానక దృశ్యాన్ని చూడగానే ఆ వ్యాపారి గుండె ఆగిపోయింది. మరుక్షణమే, అతడి నోటి నుండి, ముక్కు నుండి రక్తం తన్నుకు వచ్చింది.

B) **నది మధ్యలో ఉబూమే పిశాచి :**

దాదాపు ఐదు శతాబ్దాల క్రితం ఆనాటి మినో రాష్ట్రం (నేటి గిఫూ రాష్ట్రం)లోని ఒక నది దగ్గర జరిగిన యదార్ధ గాథ ఇది.... ఆ సమయంలో, ఆ నదిని దాటి అవతల వైపుకి వెళ్ళటానికి ఉపయోగించే, బాగా లోతు తక్కువగా ఉండే ఒక రేవు ప్రక్కన కొంతమంది సైనికులు ఒక రాత్రి సమయంలో బస చెయ్యటానికి ఒక గుడారంవేసి, ఆపై నిద్రపోవటానికి ముందు కాసేపు ఆ గుడారంబైట వెన్నెలలో కూర్చుని, ఆపై నది మీద నుండి వస్తున్న చల్లటి గాలిని పీల్చుకుంటూ ఏవో పిచ్చాపాటి మాట్లాడుకుంటున్నారు. ఆ సమయంలో బాగా చలిగా ఉన్న కారణంగా ఒక సైనికుడు అక్కడ ఒక చలిమంట ఏర్పాటుచేసాడు. ఆపై, ఆ సైనికులు ఆ చలిమంట చుట్టూ కూర్చుని మళ్ళీ మాటలు మొదలు పెట్టారు. ఆ మాటల సందర్భంలో మధ్యవయస్సు ఉన్న ఒక సైనికుడు, తన ప్రక్కనే ఉన్న ఇతర సైనికులతో గంభీరమైన స్వరంతో ఇలా అన్నాడు.

"మిత్రులారా! బహుశా మీకు తెలియదేమో ఈ రేవు పరిసర ప్రదేశాల్లో అతి భయంకరమైన స్వభావం కలిగిన ఒక ఉబూమే నివసిస్తున్నది. ఈ ప్రాంతంలో ప్రచారంలో ఉన్న కథనం ప్రకారం చూసినట్లయితే, ఎవరైనా వ్యక్తి కాలి నడకన ఈ నదిని దాటాలని ప్రయత్నిస్తూ, ఆ మనిషి నదిలోకి దిగి తన నడుము లోతు వరకు చేరిన తరువాత ఆ పిశాచ స్త్రీ (ఉబూమే) ఏడుస్తున్న ఒక బిడ్డని తన చేతుల మధ్యలో ఎత్తుకుని కనిపిస్తుంది. ఎవరైనా మనిషి తనకు ఎదురైతే, అప్పుడు ఆ పిశాచ స్త్రీ, ఆ మనిషితో "అయ్యా! నేను ఈ బిడ్డను ఎత్తుకుని నదిలో నడవలేకపోతున్నాను. దయచేసి ఈ బిడ్డని మీరు కాసేపు పట్టుకోండి. మనం నది దాటి అవతల గట్టుకు వెళ్ళగానే నా బిడ్డను నేను తీసుకుంటాను" అంటుంది. ఆపై, తన చేతిలో ఉన్న బిడ్డని ఎత్తుకోమని ఇస్తుంది. ఆ తల్లి-బిడ్డల్ని నిజమైన మానవులుగా భావించి, ఎవరైనా మనిషి ఆ బిడ్డను ఎత్తుకున్నట్లయితే ఆ బిడ్డ అతి కొద్ది సమయంలోనో విపరీతమైన బరువు

పెరిగిపోతాడు. ఆపై ఆ బరువు తట్టుకోలేక ఆ వ్యక్తి ఆ నదిలో మునిగి చనిపోతాడు".

ఆ మధ్యవయస్సు సైనికుడు, నది మధ్యలో కనిపించే ఉబూమే గురించి అలా చెప్పే సరికి, అతని ప్రక్కన ఉన్న సైనికులలో ఒక్కడు తప్ప మిగిలినవాళ్ళు భయంతో వణికిపోయారు. ఆపై, వాళ్ళు ముక్త కంఠంతో "మేము ఈ నదిని దాటం. కావాలంటే ఇంకో మార్గంలో మనం వెళ్లాల్సిన చోటుకి వెళదాం" అన్నారు. అయితే, ఆ మధ్యవయస్కుడి మాటలను తేలిగ్గా తీసుకున్న ఒక యువ సైనికుడు ఒకసారి పెద్దగా నవ్వి ఆపై తనతోటి సైనికులతో ఇలా అన్నాడు.



"ఈయన చెప్పిన మాటలు ఏదో పిల్లల కథని గుర్తుకు తెస్తున్నాయి. ఈ రోజుల్లో దయ్యాలు, భూతాలు అంటే ఎవరు నమ్ముతారు?. నేను ఇప్పుడే ఈ నదిని ఒంటరిగా దాటి చూపిస్తాను. అప్పుడు తెలుస్తుంది నిజం ఏమిటో?". ఆపై, ఆ యువకుడు తన ప్రక్కనే ఉన్న ధనస్సుని చేతిలోకి తీసుకుని ఆ ధనస్సు తాడుకి ఒక బాణాన్ని ఎక్కుపెట్టి "సర్" మని ఆ బాణాన్ని ఆ నది అవతల గట్టుమీదకి ప్రయోగించాడు. ఆ బాణం కన్నుమూసి తెరిచేలోగా ఆ నది అవతల గట్టుమీద పడింది. ఆపై, ఆ యువసైనికుడు తనతోటి సైనికులతో "మిత్రులారా! నేను ఇప్పుడే ఈ నదిని ఒంటరిగా దాటి, అవతల గట్టుకివెళ్ళి ఆ గట్టుమీద పడి ఉన్న బాణాన్ని తీసుకువచ్చి మీకు చూపిస్తాను. నేను నదిని దాటి అవతల గట్టుకివెళ్ళినందుకు రుజువుగా ఆ బాణం పనిచేస్తుంది" అన్నాడు. ఆపై, ఆ యువ సైనికుడు లేచి నుంచుని నేరుగా నదిలోకి దిగాడు. ఆపై, తన శక్తికొద్ది అడుగులు వేస్తూ ఆ నదిలో నడుస్తున్నాడు. సరిగ్గా, ఆ నది అతడి నడుము లోతుకి వచ్చిందో? లేదో? ఆపై ఆ యువ సైనికుడికి నది మధ్యలో ఒక పసిబిడ్డని ఎత్తుకుని నిలబడి ఉన్న ఒక యువతి కనపడింది. ఆపై, ఆ యువతి విచిత్రమైన స్వరంతో ఆ యువసైనికుడితో ఇలా అన్నది. "అయ్యా! నేను ఈ బిడ్డ బరువుని

మోస్తూ ఈ నదిని దాటలేకపోతున్నాను. దయచేసి ఈ బిడ్డని ఈ నది దాటేవరకు ఎత్తుకోండి. అవతల గట్టుకి చేరుకోగానే నా బిడ్డను నేను తీసుకుంటాను.

ఆమె సాధారణ స్త్రీ కాదని, మానవులపై నిరంతరం పగతో రగిలిపోతూ, వాళ్ళని చంపటానికి ప్రయత్నించే అతి క్రూరమైన ఉబూమే పిశాచి అని అతడికి నిమిషాలలో అర్ధమైపోయింది. ఏదిఏమైనా, తాను ఆ పందెంలో నెగ్గాలంటే అవతల గట్టుకి వెళ్ళితీరాలి అని నిర్ణయించుకున్న ఆ యువ సైనికుడు ఏం జరిగితే అది జరుగుతుంది అన్న మొండి ధైర్యంతో, ఆ యువతి తన చేతికి ఇచ్చిన ఆ బిడ్డని ఎత్తుకున్నాడు. ఆపై, ఆ యువ సైనికుడు ముందుకు నడుస్తున్నాడు. అతని ప్రక్కనే నిశ్శబ్దంగా ఆ యువతి (ఉబూమే) నడుస్తున్నది. ఒక 20 అడుగులు వెళ్ళే లోపే ఆ బిడ్డ విపరీతంగా బరువెక్కిపోయింది. అతడు తన బలాన్ని ఎంతగా ఉపయోగించినా ఆ బిడ్డని మొయ్యటం అతడికి సాధ్యం కావటంలేదు. అతడు మొండి పట్టుదలతో, ఎలాగైనా సరే, అవతల గట్టుకి చేరాలన్న ఏకైక లక్ష్యంతో అలాగే ముందుకు నడుస్తున్నాడు. ఇంతలో, అతని ప్రక్కన ఉన్న ఆ పిశాచి స్త్రీ, ఒక్కసారి వికృతంగా అరిచి ఆపై పెద్ద స్వరంతో “నా బిడ్డను నాకు ఇచ్చేయ్” అన్నది. అయితే, ఆ యువ సైనికుడు ఆ పిశాచి మాటలను ఏమాత్రం పట్టించుకోకుండా మొండి గుండె ధైర్యంతో నది అవతల గట్టువైపుకి తన శక్తి కొద్ది అడుగులు వేస్తున్నాడు. తాను ఎంత అరుస్తున్నా అతడు పట్టించుకోకపోవటంతో ఆ స్త్రీ పిశాచి తన స్వరాన్ని మార్చి అపై వికృతమైన ఏడుపు గొంతుతో “నీకు దణ్ణంపెడతా. నా బిడ్డను నాకు ఇచ్చేయ్” అని అనేకసార్లు అన్నది. అయినా సరే, ఆ యువసైనికుడు ఏమాత్రం చలించకుండా అలా నడిచి నడిచి ఎలాగైతేనే అవతల గట్టుకి చేరుకున్నాడు. ఆపై, ఆ బిడ్డను తన ఎడమ చేత్తో ఎత్తుకుని క్రిందకు వంగి, ఆపై నేలమీద పడి ఉన్న తన బాణాన్ని తన కుడిచేత్తో పట్టుకుని పైకి లేచాడు. అవతల గట్టు వరకు అతడితోపాటు వచ్చిన ఉబూమే గట్టుమీదకు ఎక్కకుండా మాయం అయిపోయింది. ఆమె తనని వదిలిపెట్టి వెళ్లిపోయింది అని అర్ధం చేసుకున్న ఆ యువసైనికుడు ఒకసారి తేలిగ్గా నిట్టూర్చి ఆపై కుడిచేత్తో బాణాన్ని పట్టుకుని, ఎడమచేత్తో ఆ బిడ్డను ఎత్తుకుని మళ్ళీ నదిని దాటి ఇవతల గట్టుకు వచ్చాడు. ఆపై, అక్కడ ఉన్న తనతోటి సైనికులకు “నదిలో తనకి ఉబూమే ఎదురైన విషయం చెప్పటమే కాకుండా, ఆమె బిడ్డ ఇప్పటికీ తనచేతిలోనే ఉన్నాడు అన్న విషయం వాళ్ళకి చెప్పి ఆపై ఆ బిడ్డను వాళ్ళకు చూపిద్దాము అని ఆ బిడ్డని నేలమీదకు దించాడు. విచిత్రం, నేలమీదకి దించబడిన ఆ బిడ్డ స్థానంలో ఎండిపోయిన ఆకులతో కట్టబడిన ఒక మూట కనపడింది.

C) **అరణ్యంలో యూకీ అన్‌బా :**

ప్రాచీన జపాన్‌దేశం – అనేక చిన్న చిన్న భాగాలుగా విభజించబడి ఉండేది. ఒక్కో భాగాన్ని భూస్వామి లేదా జమిందారు లాంటి వ్యక్తి పరిపాలిస్తూ ఉండేవాడు. ఒక జమిందారు ఆధీనంలో ఉండే ప్రాంతంలోకి శత్రువులు రాకుండా ఉండటంకోసం ఆ ప్రాంత ప్రారంభ ప్రాంతంలో మరియు పొలిమేరల్లో కొంత సమూరాయ్ యోధులు ఖడ్గాలు ధరించి కాపలా కాస్తూ ఉండేవాళ్ళు. ప్రాచీన జపాన్‌లో – అన్ని రకాల యుద్ధ విద్యలో ఆరితేరిన మరియు శారీరకంగా మహా బలిష్టులైన వ్యక్తుల్ని జపాన్ భాషలో 'సమురాయ్' అనే పేరుతో పిలిచేవాళ్ళు. ఒక విశేషం ఏమంటే, ఒక జమిందారు ఆధీనంలో ఉన్న ప్రాంతానికి మరియు ఇంకొక జమిందారు ఆధీనంలో ఉన్న ప్రాంతానికి మధ్య దూరం ఒక్కోచోట కేవలము వెయ్యి అడుగులు మాత్రమే ఉండేది. అలాంటి ప్రదేశాలలో అటువైపు రాజ్య సరిహద్దులో ఆ రాజ్యానికి చెందిన సమురాయ్‌లు ఇటువైపు ఉన్న రాజ్య సరిహద్దులో ఈ రాజ్యానికి చెందిన సమురాయ్‌లు కాపలా కాస్తూ ఉండేవాళ్ళు. అలాంటి సమయంలో ఒకసారి, ఒక రాజ్య సరిహద్దులో ఏం జరిగిందంటే...



అక్కడ చలిమంట కాచుకుంటున్న సమురాయ్ యోధులలో ఒకడు, హఠాత్తుగా మిగిలిన వాళ్ళతో ఇలా అన్నాడు. "కొంతకాలంగా ఈ అరణ్యంలో ఒక యూకీ అన్‌బా సంచరిస్తున్నది". అతడు ఆ మాట అనగానే అతడి తోటి సమురాయ్‌లు ఒక్కసారిగా పెద్దగా నవ్వారు. ఆపై, వారిలో ఒకడు "నువ్వు మాకు పిల్లల కథలు చెబుతున్నావా?, నేను చిన్నప్పటి నుంచి ఈ అరణ్యంలో తిరిగాను. నాకు ఎప్పుడూ అలాంటి దయ్యం కనపడలేదు" అన్నాడు. ఇంతలో, ఒక సమురాయ్ మిగిలిన వాళ్ళతో "మిత్రులారా! ఒక్క ఐదు నిమిషాలు అటు వెళ్ళి వస్తాను" అని చెప్పి ఆపై ప్రక్కనే ఉన్న చెట్ల మధ్యలోకి మూత్ర విసర్జన చెయ్యటానికి వెళ్ళాడు. ఆపై, ఆ పని పూర్తిచేసుకుని వెనక్కి తిరిగాడు. అప్పుడు, అతనికి దాదాపు 40 అడుగుల దూరంలో ఒక అమ్మాయి

రూపం అస్పష్టంగా కనపడింది. ఇంకొక విశేషం ఏమంటే, ఆ అమ్మాయి ఒక పసిబిడ్డని తన రెండు చేతులతో పట్టుకుని తన గుండెకు హత్తుకుని ఉన్నది. ఆమె నిజమైన స్త్రీ కాదని, ఒక 'యూకీఅన్‌బా' అయి ఉండవచ్చని ఆ సమురాయ్‌కి అనుమానం వచ్చింది. ఏదిఏమైనా, ఆమెతో కొంచెం జాగ్రత్తగా ఉండాలని నిర్ణయించుకున్నాడు.

ఇంతలో, ఆ అమ్మాయి మెల్లిగా కదులుతూ ఆ సమురాయ్ దగ్గరకు వచ్చింది. అప్పుడు అతనికి ఆ అమ్మాయి స్పష్టంగా కనిపించింది. చాలా అందంగా ఉన్న ఆ అమ్మాయి, చిన్న స్వరంతో ఏడుస్తున్నది. ఆమె ఏడుపు చూడగానే సమురాయ్ ఆమెను అనుమానించటం మానేసి ఆమెతో ఇలా అన్నాడు. "నీకు ఏ సమస్య వచ్చింది? ఇంత అర్ధరాత్రి ఈ అరణ్యంలో ఎందుకు ఉన్నావ్? ఎందుకు అలా ఏడుస్తున్నావ్?". అప్పుడు ఆ యువతి ఏడుపుని నియంత్రించుకుని ఆపై అతడితో ఇలా అన్నది. "నా పసిబిడ్డ చలికి తట్టుకోలేకపోతున్నాడు. అతడిని కాసేపు నువ్వు ఎత్తుకో. బలమైన నీ చేతుల మధ్య ఉంటే నా బిడ్డకి చలి బాధ ఉండదు".

దీనమైన ఆమె పరిస్థితిని చూసి ఆ సమురాయ్ జాలితో కరిగిపోయాడు. ఆపై ఆ పసిబిడ్డని ఎంతో అభిమానంతో తన చేతుల్లోకి తీసుకుని ఎత్తుకున్నాడు. విచిత్రం ఏమంటే, ఆ పసిబిడ్డ శరీరం, మంచుగడ్డ కన్నా చల్లగా ఉన్నది. అంతేకాదు, ఆ బిడ్డ ఆ సమురాయ్ వంటికి బంకలాగా అతుక్కుపోయాడు. దాంతో హడలిపోయిన ఆ సమురాయ్ ఆ బిడ్డని నేలకేసి కొట్టాలని ఎంతగానో ప్రయత్నించాడు. కానీ, అతని ప్రయత్నం ఏమాత్రం ఫలించలేదు. అంతేకాదు, ఆ బిడ్డ అంతకంతకీ బరువెక్కటం ప్రారంభించాడు. ఆ బిడ్డ బరువు తట్టుకోలేకపోయిన ఆ సమురాయ్, మోకాళ్ళమీద కూర్చున్నాడు. అతనికి తల తిరగటం ప్రారంభం అయ్యింది. ఆ సమయంలో అతడు అప్రయత్నంగా, తన ఎదురుగా ఉన్న ఆ అమ్మాయి ముఖంలోకి చూసాడు. ఆమె ముఖంలో ఏడుపు క్రమ క్రమంగా మాయం అవుతున్నది. ఆమె పెదవులపై చిరునవ్వు క్రమ క్రమంగా పెద్దది అవుతున్నది. ఆమె కళ్ళల్లో క్రూరత్వం స్పష్టంగా కనిపిస్తున్నది. అంతే, అతడు నేలపై బోర్లా పడిపోయాడు.

మర్నాడు ఉదయం అతనికోసం వెతుకుతూ వచ్చిన అతని తోటి సమురాయ్‌కి నేలపై గడ్డకట్టుకుపోయి పడి ఉన్న అతడు కనిపించాడు. అంతేకాదు, అతని చేతిలో దాదాపు పాతిక కేజీల బరువు ఉన్న ఒక పెద్ద మంచు ఖండం (ఐస్‌క్యూబ్) కనిపించింది. తమ తోటి సమురాయ్‌ని చంపింది ఆ అరణ్యంలో తిరుగుతున్న యూకీఅన్‌బా అని మిగిలిన సమురాయ్‌లకు క్షణాల్లో అర్ధమైపోయింది. ఆ పిశాచిని నిర్మూలిస్తేగాని, ఆ

అరణ్యంలో ఎవరూ క్షేమంగా తిరగలేరని ఆ సమురాయ్‌లు నిర్ణయించుకున్నారు. దాంతో, దాదాపుగా ఒక పాతికమంది సమురాయ్‌లు పెద్ద పెద్ద ఖడ్గాలను చేతిలో పట్టుకుని ఆ మర్నాడు రాత్రి సమయంలో ఆ అరణ్యం అంతా జల్లెడ పట్టారు. అలా ఆ యూకీఅన్‌బా కోసం ఆ అరణ్యంలో అన్వేషిస్తున్న సమురాయ్‌లలోని ఒకడికి ఒకచోట, చాలా స్వేచ్ఛగా మరియు ఆనందంగా పరుగెడుతున్న ఒక మగ బిడ్డ కనిపించాడు. విచిత్రం ఏమంటే, ఆ మగబిడ్డ పరుగులు తీస్తున్న ప్రదేశం అంతా గడ్డకట్టిన మంచుతో నిండి ఉన్నది. ఆ బాలుడు, యూకీఅన్‌బా కొడుకే అని ఆ సమురాయ్‌కి అర్థమైపోయింది. దాంతో ఆ బాలుడిని చంపాలని ఆ సమురాయ్ ఆ బాలుడిమీదకు దూకాడు. అప్పుడు ఒక విచిత్రం అక్కడ చోటుచేసుకుంది. అది ఏమిటంటే, ఆ సమురాయ్ ఆ బిడ్డని వెంటాడుతున్న సమయంలో ప్రతి రెండు నిమిషాలకు ఒకసారి ఆ బిడ్డ శరీర పరిమాణం పెరగటం ప్రారంభించింది. కొంచెం సేపు గడిచే సరికి ఆ సమురాయ్, నడుము దాకా ఎదిగాడు. మరికొంచెంసేపు గడిచే సరికి సమురాయ్ అంత ఎత్తుకి ఎదిగాడు. ఇంతలో, ఆ బాలుడు వెనక్కి తిరిగి ఆపై వికృతంగా అరుస్తూ ఆ సమురాయ్‌మీదకు దూకాడు. దాంతో ఆ సమురాయ్ తన నడుముకి ఉన్న ఖడ్గాన్ని తన చేతుల్లోకి తీసుకుని ఆపై, తన కన్నా రెండు రెట్లు భారీగా ఉన్న ఆ బాలుడి శరీరాన్ని ఎడాపెడా తన శక్తికొద్దీ నరికేసాడు. అప్పుడు కనపడిన దృశ్యంచూసి ఆ సమురాయ్‌కి తల తిరిగిపోయింది. అది ఏమిటంటే....

సమురాయ్, ఆ బాలుడి భారీ శరీరాన్ని నరికినప్పుడు కాకి ఈక పరిమాణంలో ఉన్న వేలాది మంచు శకలాలు నేలపై పడ్డాయి. వాటిని, అతడు విచిత్రంగా చూస్తున్న సమయంలోనే అవన్నీ కరిగిపోయి ఆ నేలలోనే ఇంకిపోయాయి. ఆ తరువాత కాలంలో ఏనాడూ యూకీఅన్‌బా కాని, ఆమె బిడ్డగాని ఆ అరణ్యంలో కనపడలేదని చెబుతారు.

**D) కోసోడేటే యురే (బిడ్డని మోసుకువెళ్ళే పిశాచి) :**

బిడ్డని కనే సమయంలో లేదా బిడ్డని కన్న కొంతసేపటికి మరణించిన తల్లులకు తమ బిడ్డమీద విపరీతమైన అభిమానం ఉంటుంది. ఆ అభిమానం కారణంగానే, చనిపోయిన ఆ తల్లుల యొక్క ఆత్మలు, మళ్ళీ పిశాచి రూపంలో భూమిమీదకు తిరిగి వస్తాయి. అలా తిరిగి వచ్చిన ఆ ఆత్మలు, మళ్ళీ మామూలు రూపం ధరించి తమ బిడ్డల్ని ఎత్తుకుని, తమకు తోచినవిధంగా ఆ బిడ్డల్ని పెంచటం ప్రారంభిస్తాయి. ఆ కారణంగానే ఈ పిశాచాల్ని "కోసోడేటే యురే" అనగా "తన బిడ్డను పెంచే పిశాచి"

అనే పేరుతో పిలుస్తారు. సహజంగా, యురే అని పిశాచి క్రూరమైన మనస్తత్వాన్ని కలిగి ఉంటుంది. కానీ, ఈ "కోసోడేటే యురే" మాత్రం కొంతవరకు మానవత్వాన్ని కలిగి ఉంటుందని చెబుతారు. సాధారణంగా, ఈ యురేలు – దుకాణదారులకు, ప్రయాణీకులకు రాత్రి సమయాలలో కనిపిస్తాయని చెప్పుకుంటారు. అంతేకాకుండా, ఈ పిశాచాలు ఒకసారి కనిపించిన చోటే పదే పదే కనిపిస్తాయని నమ్ముతారు.

"కోసోడేటే యురే" ఒక ప్రత్యేక లక్ష్యంకోసం మళ్లీ ఈ లోకానికి తిరిగి వస్తుంది. ఆ లక్ష్యం ఏమంటే, తన బిడ్డను తానే స్వయంగా పెంచుకోవటం. ఈ యురే, తన బిడ్డకు ఆకలి తీర్చటంకోసం బెల్లపు పాకంతో చేసిన మిఠాయిని కొనుగోలు చేస్తుంది. ఇలా కొనటానికి యురే దగ్గర డబ్బు ఉండదు. అందువలన, తనకు ఏమి దొరికితే వాటిని తెచ్చి డబ్బుకి బదులుగా ఇస్తుంది. ఒక్కోసారి, ఎండిపోయిన ఆకుల్ని తెచ్చి దుకాణదారుడికి ఇవ్వటం జరుగుతుంది. ఆమె, తన దుకాణంలో మిఠాయి కొనుగోలు చేసి ఆపై అక్కడ నుండి వెళ్ళిపోయే వరకు ఆ ఎండు ఆకులు డబ్బులాగా కనిపిస్తాయి. ఆమె అక్కడ నుండి వెళ్ళిపోయిన మరుక్షణం ఎండు ఆకులు లాగా కనిపిస్తాయి. తన బిడ్డ యొక్క బాధ్యతను ఎవరైనా మనస్ఫూర్తిగా, నిజాయితీగా స్వీకరించినప్పుడు ఆ యురే ఆత్మశాంతిస్తుంది. ఆపై, ఆ పిశాచి ఈ లోకాన్ని వదిలిపెట్టి మృతుల లోకానికి లేదా పుణ్య లోకాలకు వెళ్ళిపోతుందని చెబుతారు. అప్పటి వరకు ఈ యురే తన బిడ్డకోసం ఈ భూమిమీద తిరుగుతూనే ఉంటుంది. ఇలాంటి "కోసోడేటే యురే"కి సంబంధించిన ఒక యదార్ధ వృత్తాంతం గురించి ఇక్కడ తెలుసుకుందాం...

చాలా సంవత్సరాల క్రితం జపాన్‌లోని ఒక చిన్న పట్టణ ప్రాంతంలో మిఠాయి దుకాణం నడిపే ఒక వ్యాపారి ఉన్నాడు. అది వర్షాకాలం కావటంవల్ల ఆ వ్యాపారి రాత్రి 8 గంటలకే తన దుకాణాన్ని మూసివేసాడు. ఆపై, ఆ దుకాణానికి ఆనుకుని ఉన్న తన ఇంట్లో కూర్చుని వేడి వేడి తేనీరు త్రాగుతున్నాడు. ఆ సమయంలో అస్పష్టంగా కనిపిస్తున్న ఒక స్త్రీ, ఆ దుకాణం తలుపులు తడుతున్నది. ఇంత వర్షంలో దుకాణానికి ఎవరు వచ్చారా? అన్న ఆశ్చర్యంతో ఆ వ్యాపారి తన ఇంటి కిటికీ తలుపులు తీసి బైటకు చూసాడు. బైట, వర్షంలో ఒక స్త్రీ నిలబడి ఉన్నది. ఆమెచేతిలో ఒక బిడ్డ కనిపిస్తున్నది. అప్పుడు ఆ వ్యాపారి పెద్ద స్వరంతో "దుకాణం మూసేసా. ఇక నీకు ఏం కావాలన్నా రేపు ఉదయం రా. ఇప్పుడు దుకాణం తెరవటం కుదరదు" అన్నాడు. అప్పుడు ఆమె, మెల్లగా గాలిలో తేలుతున్నట్లుగా కొంచెం ప్రక్కకి వచ్చి ఆపై ఆ దుకాణదారుడి ఇంటి కిటికీకి 10 అడుగుల దూరంలో ఆ వర్షంలో నిలబడింది.

ఆపై ఆమె దీనమైన స్వరంతో "దయచేసి ఒక్క బెల్లపు కేకు ఇవ్వండి చాలు. నా బిడ్డకి చాలా ఆకలిగా ఉన్నది. అది తిని కడుపు నింపుకుంటాడు" అన్నది.



దీనమైన ఆమె ముఖం మరియు ఆమె చేతుల్లో మరింత దీనంగా, అమాయకంగా కనిపిస్తున్న ఆ బిడ్డనుచూసి ఆ వ్యాపారికి చాలా జాలివేసింది. ఆపై, అతడు తన ఇంట్లోంచి బైటకు వచ్చి ఆపై దుకాణం తలుపులుతీసి ఆమె అడిగిన మిఠాయి ఆమె చేతిలో పెట్టాడు. ఆపై ఆమె ఆనాటి జపాన్‌లో అతి తక్కువ విలువ గలిగిన "మోన్" అనే నాణాన్ని ఆ వ్యాపారి చేతిలో పెట్టి ఆ చీకటిలో నడుచుకుంటూ ఎటో వెళ్ళి పోయింది. మరుసటి రోజు రాత్రి కూడా వర్షం బాగా పడుతున్నది. నిన్న రాత్రి ఏ సమయానికి ఆ దుకాణం దగ్గరకు వచ్చిందో మర్నాడు రాత్రికూడా సరిగ్గా అదే సమయానికి ఆ స్త్రీ ఆ దుకాణం ముందుకు వచ్చి నిలబడింది. ఈసారి ఆమె చాలా దీనంగా ఉన్నది. ఆమె జుట్టు చిందరవందరగా గాలిలో ఎగురుతున్నది. ఆమె గొంతు చాలా బలహీనంగా వినపడుతున్నది. ఆమె, నీరసంగా ఉన్న గొంతుతో "దయచేసి ఒక్క బెల్లపు కేకు ఇవ్వు చాలు" అన్నది. ఆ దుకాణదారుడు మరేమీ మాట్లాడకుండా మళ్ళీ దుకాణంతీసి ఒక బెల్లపు కేకుని ఆమె చేతిలో పెట్టాడు. ఆమె నిన్నటిలాగానే ఒక "మోన్" నాణాన్ని అతని చేతిలో పెట్టి వెళ్ళిపోయింది. ఇలా వరుసగా ఆరు రాత్రులు ఆమె, అతని దుకాణానికి రావటం, ఆ దుకాణంలో మిఠాయి కొనటం జరిగింది. ఏడవరోజు రాత్రి, ఆమె దుకాణం దగ్గరకు వచ్చింది. ఈసారి ఆమె దగ్గర నాణం లేదు. ఆ విషయం తెలియని ఆ దుకాణదారు గతంలో లాగానే మిఠాయిని ఆమె చేతిలో పెట్టాడు. ఆపై, ఆమె ఒక గుప్పెడు ఎండు ఆకులను అతడి చేతిలో పెట్టి వీటిని డబ్బుగా భావించి తీసుకోమని ప్రాధేయపడింది. ఆ దుకాణదారుడు కొంచెం ఆశ్చర్యానికి గురై ఆపై "ఆకుల్ని నాణాలుగా భావించి తీసుకోవటం నా వల్లకాదు. ఇలా అయితే నేను వ్యాపారం చెయ్యలేను తెలుసా"

అన్నాడు. అప్పుడు ఆమె, తాను తొడుక్కున్న కోటును విప్పదీసి ఆ వ్యాపారి చేతిలో పెట్టి “పోనీ ఈ కోటుని నేను ఇవ్వవలసిన నాణానికి బదులుగా తీసుకో” అన్నది. వర్షంలో తడిసిన మరియు ఆమె వాడుకుంటున్న ఆ కోటును తీసుకోవటానికి ఆ వ్యాపారి మొదట్లో ఏమాత్రం అంగీకరించలేదు. కానీ, ఆమె విపరీతంగా వత్తిడి చెయ్యటంతో అతడికి ఆ కోటును తీసుకోక తప్పలేదు. అతడు కోటును తీసుకున్న మరుక్షణమే ఆమె తన బిడ్డతో సహా అక్కడ నుండి వెళ్ళిపోయింది.

మర్నాడు సాయంత్రం 6 గంటల ప్రాంతంలో ఆ వ్యాపారి తన దుకాణంలో కూర్చుని ఉన్నాడు. ఆ సమయంలో ఆ దుకాణదారుడికి స్నేహితుడు అయిన ఇంకొక వ్యాపారి, ప్రక్క గ్రామం నుండి ఏదో ప్రాంతానికి వెళుతూ, మార్గమధ్యంలో ఉన్న ఈ వ్యాపారి దుకాణం దగ్గర ఆగి ఆపై ఆ దుకాణంలోకి వెళ్ళాడు. మాటల సందర్భంలో దుకాణదారుడు – గత ఏడు రాత్రుల నుండి తన దగ్గరకు వస్తున్న ఒక బిడ్డ తల్లి గురించిచెప్పి, ఆపై నిన్న రాత్రి ఆమె, మిఠాయికి ఇవ్వాల్సిన సొమ్ముకి బదులుగా ఒక కోటు ఇచ్చిందని తన స్నేహితుడికి చెప్పాడు. ఆపై దుకాణంలోని ఒక గోడకి కొట్టిన మేకుకి వ్రేలాడుతున్న ఆ కోటుని తన స్నేహితుడికి చూపించాడు ఆ దుకాణదారుడు. ఆ స్నేహితుడు కాసేపు ఆ కోటుకేసి పరిశీలనగాచూసి ఆపై, ఒక్కసారిగా భయంతో అరిచి, ఆపై నీరసంగా వణుకుతున్న స్వరంతో ఆ దుకాణ దారుడితో ఇలా అన్నాడు. “మా పట్టణంలో నా ప్రక్క ఇంట్లో నివసిస్తున్న నా స్నేహితుడి భార్య ధరించే కోటు ఇది”. తన స్నేహితుడు అన్న మాట విన్న ఆ దుకాణదారుడు కొంచెం ఆశ్చర్యానికి గురై ఆపై “నువ్వు చెప్పేది నిజమా? ఒకవేళ నువ్వు చెప్పింది నిజమే అయితే గత వారం రోజులుగా రాత్రి సమయాలలో ఒక బిడ్డతోపాటు నా దగ్గరకు వస్తున్న ఆ స్త్రీ నీ స్నేహితుడి భార్య అయి ఉండవచ్చు” అన్నాడు.

దుకాణదారుడు అన్న మాటలు విన్న అతని స్నేహితుడు “నీవు చెప్పింది జరగటం అసాధ్యం. ఎందుకంటే, సరిగ్గా ఏడు రోజుల క్రితం నా మిత్రుడి భార్య చనిపోయింది. చనిపోయిన కొద్ది గంటలకే ఆమె ధరించి ఉన్న ఈ కోటుతో సహా నా కళ్ళముందే ఆమెను సమాధి చేసారు”. ఏదిఏమైనా, చనిపోయిన స్త్రీ, తన దగ్గరకు వచ్చింది అని తెలియగానే ఆ దుకాణదారుడు నిర్ఘాంతపోయాడు. ఇక, చనిపోయిన స్త్రీ తిరిగి లేచింది అన్న విషయం తెలియటంతో ఆ దుకాణదారుడి మిత్రుడు భయంతో వణికిపోయాడు. ఆపై ఒకరిని ఒకరు విచిత్రంగా చూసుకున్నారు. ఆపై వాళ్ళిద్దరూ ప్రక్క గ్రామంలో ఆ స్త్రీని సమాధి చేసిన ప్రాంతానికి చేరుకున్నారు. ఆ సమాధికి

దగ్గరలో ఉన్న ఒక బౌద్ధ ఆలయ పూజారి వద్దకు వెళ్ళారు. అప్పుడు ఆ దుకాణదారుడు గత వారం రోజులుగా తన దగ్గరకు వస్తున్న "కోసోడేటే యురే" (పిశాచస్త్రీ) గురించి ఆ పూజారికి వివరంగా చెప్పాడు. అప్పుడు ఆ పూజారి, కొంచెం కోపంతో కూడిన స్వరంతో ఆ దుకాణదారుడితో ఇలా అన్నాడు. "నీకు అసలు బుద్ధి ఉందా? సమాధి చేయబడిన వాళ్ళు మళ్ళీ తిరిగి రావటం జరుగుతుందా? నీకు ఈ మూఢ నమ్మకాలు ఉండకూడదు". ఆపై ఆ పూజారి ఆ దుకాణదారుడికేసి మరియు అతని మిత్రుడికేసి ఒకసారి పరిశీలనగా చూసి ఆపై, వాళ్ళిద్దరినీ వెంటపెట్టుకుని నిశ్శబ్దంగా, అక్కడికి వెయ్యి అడుగుల దూరంలో ఉన్న శ్మశానంలోకి తీసుకువెళ్ళాడు. ఆపై వాళ్ళని, వారం రోజుల క్రితం సమాధి చేసిన ఆ స్త్రీ సమాధి దగ్గరకు తీసుకువెళ్ళాడు. అప్పుడు, ఊహించటానికి కూడా సాధ్యంకాని ఒక విచిత్రం అక్కడ జరిగింది. అది ఏమిటంటే...

ఆ స్త్రీ సమాధి చెక్కు చెదరకుండా అలాగే ఉన్నది. కానీ, ఆ సమాధి లోపలి నుండి ఒక పసిబిడ్డ ఏడుపు స్పష్టంగా వినిపిస్తున్నది. దాంతో ఆ పూజారి మరియు అతనితో వచ్చిన ఇద్దరూ నిర్ఘాంతపోయారు. కొంచెం సేపటికి తేరుకున్న ఆ పూజారి తానే స్వయంగా ఆ సమాధిని త్రవ్వి, ఆపై గుంటలో ఉన్న శవపేటిక తలుపులు తెరచి చూసాడు. లోపల శాశ్వతంగా నిద్రిస్తున్న ఆ స్త్రీ గుండెలపైన, దాదాపు వారం రోజుల వయస్సు ఉన్న ఒక పసిబిడ్డ బోర్లా పడుకుని గుక్కపట్టి ఏడుస్తున్నాడు. ఆ దుకాణదారుడు ఆ శవపేటికలోకి తొంగి చూసాడు. గత వారం రోజులుగా రాత్రి సమయాలలో తన దుకాణానికి వస్తున్నది ఆ స్త్రీయే అని ఆ దుకాణదారుడికి ఆ క్షణంలో స్పష్టంగా అర్ధమయ్యింది. ఆపై, ఆ పూజారి – ఒక్కసారి ఆకాశంలోకిచూసి మళ్లీ తల క్రిందకు వంచి ఆపై తనతో వచ్చిన ఆ ఇద్దరితో వణుకుతున్న స్వరంతో ఇలా అన్నాడు. "నెలలు నిండిన ఈ స్త్రీ, బిడ్డను కనకుండానే చనిపోయింది. ఈమె చనిపోయింది కనుక ఈమె కడుపులోని బిడ్డకూడా చనిపోయి ఉంటుందని ఈమె భర్తతో సహా మేము అంతా భావించాం. అందుకే ఈమె మృతదేహాన్ని ఏమాత్రం ఆలోచించకుండా సమాధి చేసాం. కానీ, ఈమె మృతదేహం ఈ సమాధిలోనే ఈ బిడ్డను ప్రసవించింది అన్నమాట".

ఆ సమాధిలో తాను ప్రసవించిన బిడ్డకు ఆకలి తీర్చటంకోసం ఆ స్త్రీ యొక్క ఆత్మ, "కోసోడేటే యురే"గా మారి, ఆపై ఆ బిడ్డతో సహా తన దుకాణానికి వచ్చి, తన దుకాణంలో మిఠాయి కొనుగోలుచేసి, ఆ మిఠాయితో తన బిడ్డ ఆకలి తీర్చిందని ఆ దుకాణదారుడికి అర్ధమయ్యింది. ఇంకొక విచిత్రం ఏమంటే, ఆ సమాధిలో మిఠాయిని పొట్లం కట్టిన ఏడు కాగితాలు కూడా కనిపించాయి. ఆ తరువాత ఆ పూజారి ఆ

బిడ్డను తన చేతుల్లోకి తీసుకున్నాడు. ఆపై, ఆ పూజారి ఆ బిడ్డతో సహా ఆ స్త్రీ భర్త ఇంటికి బయలుదేరాడు. అతడి వెనకాలే దుకాణదారుడు మరియు అతని మిత్రుడు నడిచారు. ఎప్పుడైతే ఆ పూజారి తన బిడ్డను తీసుకుని ఆ బిడ్డ తండ్రికి అనగా తన భర్తకి ఇవ్వటానికి బయలుదేరాడో ఆ క్షణంలో ఆ స్త్రీ యొక్క ప్రేతాత్మ శాంతించింది. దాంతో, సమాధిలో ఉన్న ఆ స్త్రీ మృతదేహంయొక్క ముఖంమీద ఒక సన్నటి చిరునవ్వు కనిపించింది. ఆ తరువాత ఏనాడూ ఆ దుకాణదారుడి దుకాణానికి ఆ స్త్రీ ప్రేతాత్మ రాలేదు.



# 15. ఆత్మలకు నిలయమైన “చార్లీ మాన్షన్” (ఛార్లీ భవనము) మర్మం ఏమిటి?

ప్రతి సంవత్సరం, ‘మే’ నెలలో భారతదేశంలోని చాలా ప్రాంతాలలో ఎండలు మండిస్తూ ఉంటాయి. కానీ, హిమాలయ పర్వతాలలో భాగంగా ఉండే పర్వతాల పైన ఉండే సీమ్లా నగరంలో చక్కటి చల్లదనం వ్యాపించి ఉంటుంది. మన దేశాన్ని బ్రిటీషువాళ్ళు పరిపాలిస్తున్న కాలంలో సీమ్లా నగరాన్ని తమ ప్రభుత్వానికి వేసవి రాజధానిగా ఉపయోగిస్తూ ఉండేవారు. ఆ కారణంగా, అనేకమంది ఉన్నతస్థాయి బ్రిటీషు ప్రభుత్వ అధికారులు మరియు మిలటరీ అధికారులు – సీమ్లా నగరంలోని వివిధ భవనాలలో నివసిస్తూ ఉండేవాళ్ళు. అలాంటి అద్భుతమైన సీమ్లా నగరంలో ఒకచోట, ప్రాచీనకాలం నాటి, ఒక పెద్ద భవనం ఉన్నది. దానిపేరు “చార్లీవిల్లే మాన్షన్”. ఆ భవనంలో ఒక ప్రేతాత్మ తిరుగుతూ ఉంటుందని ఆ కాలంలో సీమ్లా అంతటా చెప్పుకుంటూ ఉండేవాళ్ళు. అందువల్ల ఆ భవనంలో ఉండటానికి ఎవరూ సాహసించేవాళ్ళు కాదు. అలాంటి సమయంలో, బ్రిటీషు ప్రభుత్వానికి చెందిన ఒక ఆర్మీ ఆఫీసర్ ఆ భవనంలో కొంతకాలంపాటు ఉండటానికి వచ్చాడు. ఆ భవనంలో అదృశ్య రూపంలో తిరిగే ఒక పిశాచి (Poltergeist) ఉన్నదని ఆ ఆర్మీ ఆఫీసర్‌కి అనుభవ పూర్వకంగా తెలిసింది. ఆయన,దాదాపు రెండు సంవత్సరాలు ఆ భవనంలో నివసించాడు. ఆ సమయంలో ఆ అదృశ్య పిశాచి, ఆయన్ని అనేక రకాల ఇబ్బందులకు గురిచేసింది. అయినప్పటికీ, ఆయన ఏనాడూ ఆ పిశాచికి భయపడలేదు. ఒక విశేషం ఏమంటే, ఆ పిశాచి ఆ భవనంలోని మొదటి అంతస్తులో ఉన్న ఒక గదిలో నివసిస్తున్నదని, ఆ ఆఫీసరు గ్రహించాడు. అందువల్ల ఆ గదిలో మాత్రమే ఆ

పిశాచి చేసే గందరగోళం కనిపిస్తూ ఉండేది. దాంతో, ఆ ఆర్మీ ఆఫీసరు ఆ గదికి తాళంవేసి, తాళం చెవిని తన బీరువాలో భద్రంగా దాచుకున్నాడు. ఆయన ఆ భవనంలో ఉన్న ఏనాడూ ఆ గది తలుపులు తియ్యలేదు. కానీ, ఆయన ఆ భవనంలో చేరిన మూడవ నెలలో ఒకరోజున ఆ గదిలోపల నుండి విపరీతమైన శబ్దాలు చాలాసేపు వినిపించాయి. ఆ శబ్దాలు విని తట్టుకోలేకపోయిన ఆ ఆర్మీ ఆఫీసరు ఆ గది తాళం తీసి లోపలికివెళ్ళి చూసాడు. ఆ గదిలోపల ఉన్న ఫర్నీచర్ అంతా చిందరవందరగా నేలపై పడి ఉన్నది. ఆ గది గోడలకు బిగించబడిన పెద్ద పెద్ద అద్దాలు పగిలిపోయి ఉన్నాయి. ఒకవిధంగా చెప్పాలంటే, ఒక పెద్ద తుఫాను వచ్చి వెళ్ళిన తరువాత జనావాసాలు ఏవిధంగా అయితే నాశనం అయిపోతాయో ఆవిధంగా ఆ గదిలోని వస్తువులు నాశనం అయిపోయాయి. ఇక, ఆ భవనంలో ఉంటే ఏదోఒక రోజున ఆ గదిలోని పిశాచి మిగిలిన గదులలోకి కూడా వచ్చి సర్వనాశనం చేస్తుందని ఆ ఆర్మీ అధికారికి అనుమానం వచ్చింది ఆపై ఆయన ఏమాత్రం ఆలస్యం చెయ్యకుండా ఆ భవనం ఖాళీచేసి వెళ్ళిపోయాడు. ఆయన వెళ్ళిన తరువాత కొద్ది నెలల వరకు ఆ భవనం ఖాళీగానే ఉండిపోయింది. ఆ భవనంలో ఒక ప్రేతాత్మ తిరుగుతున్నదన్న విషయం సీమ్లాలోని ప్రజలకే కాకుండా సీమ్లాకి చుట్టు ప్రక్కల ఉన్న ప్రాంతాలలో కూడా తెలిసిపోయింది. ఆ తరువాత కొంతకాలానికి ఏం జరిగిందంటే...!



అది క్రీ.శ.1913వ సంవత్సరం. మే నెల మొదటి వారం. నాటి హిమాచల ప్రదేశ్ రాష్ట్రంలోని సీమ్లా నగరానికి విక్టర్‌బేలె అనే బ్రిటీష్ జాతీయుడు తన భార్య

మరియు కొడుకుతో వచ్చాడు. ఆనాటి కొన్ని ఉత్తర భారత రాష్ట్రాలకు సంబంధించిన రైల్వే బోర్డుకి అసిస్టెంట్ సెక్రటరీగా విక్టర్‌బేలె నియమించబడ్డాడు. ఇక, రైల్వే అధికారిగా సీమ్లాకు వచ్చిన విక్టర్‌బేలె, తాను మరియు తన కుటుంబం ఉండటంకోసం ఒక మంచి భవనం అద్దెకు కావాలని, తన ఆఫీసులో పనిచేసే ఒక భారతీయ గుమాస్తాకి చెప్పాడు. ఆపై ఆ గుమాస్తా ఒక రోజంతా సీమ్లా పట్టణం అంతా గాలించి చివరికి – విశాలంగా, సౌకర్యవంతంగా ఉన్న ఒక మంచి భవనాన్ని చూసి, ఆపై ఆ విషయాన్ని తన పై అధికారి అయిన విక్టర్‌బేలెకి చెప్పాడు. విక్టర్‌బేలె తన భార్యతో కలిసి ఒక రోజు సాయంత్రం ఆ భవనానికి వెళ్ళి ఆ భవనం లోపల అంతా తిరిగి చూసాడు. ఆ భవనం చాలా అద్భుతంగా ఉన్నది. అంతే కాకుండా, దానికి అద్దె కూడా చాలా తక్కువగా ఉండటంతో విక్టర్‌బేలె ఆ ఇంట్లో ఉండటానికి నిర్ణయించుకున్నాడు. ఆ భవనం పేరే "ఛార్లీవిల్లే మాన్షన్" అనగా "ఛార్లీ యొక్క భవనం" అని అర్థం. అయితే, అంత పెద్ద భవనానికి అద్దె, అంత తక్కువగా ఎందుకు ఉన్నది? అన్న విషయం విక్టర్‌బేలెకి అర్థం కాలేదు. అయినప్పటికీ, అతడు ఆ విషయాన్ని అంతగా పట్టించుకోలేదు. ఆ మర్నాడు సాయంత్రమే విక్టర్‌బేలె తన సామాగ్రి మరియు కుటుంబంతో సహా ఆ భవనంలో దిగాడు.

ఏదిఏమైనా, ఆ భవనంలో చేరిన విక్టర్‌బేలె కుటుంబానికి మొదటి వారం రోజులు, ఏవిధమైన సమస్యలు రాలేదు. కానీ, అతని క్రింద పనిచేసే కొందరు ఉద్యోగులు, ఛార్లీ భవనంలో ఒక ప్రేతాత్మ తిరుగుతున్నదని, అది ఆ భవనంలో ఉంటున్న వాళ్ళని అనేక రకాలుగా బాధలు పెడుతున్నదని విక్టర్‌బేలెకి చెప్పటమే కాకుండా, ఆయన్ని ఆ భవనాన్ని ఖాళీచేసి, ఇంకొక మంచి ఇంటికి వెళ్ళమని ఆయనకి సలహా కూడా ఇచ్చారు. సహజంగా, బాగా విద్యాధికుడు మరియు ధైర్యవంతుడు అయిన విక్టర్‌బేలె తన ఉద్యోగులు చెప్పిన మాటలను నమ్మలేదు. అందుకు కారణం – విక్టర్‌బేలెకి 'దయ్యాలు ఉన్నాయి' అన్న నమ్మకం కొంచెం కూడా లేదు. ఆపై విక్టర్‌బేలె కుటుంబం అక్కడ సంవత్సరం ఉన్నప్పటికీ వాళ్ళకి ప్రేతాత్మలకు సంబంధించిన ఏవిధమైన ఇబ్బందులు రాలేదు. ఇది ఇలా ఉండగా, విక్టర్‌బేలె తన ఇంట్లో పనిచెయ్యటంకోసం స్థానికుడైన ఒక ముస్లిం వ్యక్తిని నియమించుకున్నాడు. విక్టర్‌బేలె ఆ ముస్లిం పనివాడిని ఎంతో ఆదరంతో చూసేవాడు. అందుకు తగ్గట్టుగా ఆ పనివాడు కూడా విక్టర్‌బేలె కుటుంబం మీద ఎంతో విశ్వాసాన్ని చూపిస్తూ ఉండేవాడు. ఇక, విక్టర్‌బేలె, ఉన్నతస్థాయి ప్రభుత్వ అధికారి కావటం వల్ల, ఆ పట్టణంలోని ఇతర ప్రభుత్వ అధికారులు అందరూ – తమ ఇళ్ళలో ఏ ఉత్సవాలు జరిగినా విక్టర్‌బేలెని

తమ ఇళ్ళకి ఆహ్వానించేవాళ్ళు. విక్టర్‌బేలె, సీమ్లా పట్టణంలోని ఇతర అధికారుల ఇళ్ళల్లో రాత్రిపూట జరిగే పార్టీలకు భార్యతో కలిసి వెళ్ళేవాడు. ఆ పార్టీలోనే రాత్రి భోజనం ముగించుకుని, దాదాపు అర్ధరాత్రి 12 గంటల ప్రాంతంలో ఇంటికి తిరిగి వస్తూ ఉండేవాడు.

విక్టర్‌బేలె ఆ భవనంలో చేరి ఒక సంవత్సరం దాటిన, మొదటి వారంలో – ఒక ఆదివారంనాడు ఆయన తన భార్య మరియు కుమారుడితో కలిసి సీమ్లా నగరంలో ఉంటున్న ఒక బ్రిటీష్ డిప్యూటి కలెక్టర్ ఇంట్లో జరుగుతున్న ఒక మ్యారేజ్ రిసెప్షన్‌కి వెళ్లాడు. ఆ ఇంట్లో ఆ పనివాడు ఒక్కడే ఉన్నాడు. వాడు, ఇంట్లో పనులన్నీముగించుకుని ఆపై, తన భోజనం పూర్తిచేసుకుని హాల్‌లోకి వచ్చి గోడ గడియారానికేసి చూసాడు. అప్పుడు సమయంలో అర్ధరాత్రి 12 గంటలు కావొస్తున్నది. తన యజమాని కుటుంబం ఆపై, ఎప్పుడైనా రావొచ్చు, అన్న ఉద్దేశంతో వాడు నిద్రపోకుండా ఆ హాలులోనే మెళుకువగా కూర్చున్నాడు. కానీ, అతడికి కొద్ది క్షణాల్లోనే నిద్ర ముంచుకు వచ్చింది. అయినప్పటికీ, అతను పడుకోకుండా కళ్ళుమూసుకుని కునుకుపాట్లు పడుతున్నాడు. ఇంతలో ఆ భవనం పై అంతస్తులో ఉన్న ఒక గదిలోంచి దాదాపు 6 అడుగుల ఎత్తు మరియు భారీ ఆకారంతో ఉన్న ఒక బ్రిటీషు జాతీయుడు బైటకు వచ్చాడు. ఆపై ఏదో వస్తువు కోసం వెతుకుతున్నట్లుగా ఒక గదిలోంచి ఇంకొక గదిలోకి నడిచి వెళుతున్నాడు. అతడు అలా నడిచి వెళుతున్నప్పుడు అతని బూట్లు "టక్, టక్" అనే శబ్దం చేస్తున్నాయి. క్రింద హాలులో కూర్చున్న ఆ పనివాడికి పై అంతస్తు నుండి బూట్ల శబ్దం వినపడింది. ఆ శబ్దం బాగా ఎక్కువగా వినపడటంతో – "బహుశా తన యజమాని తిరిగి వచ్చి ఉంటాడని, తాను నిద్ర మత్తులో ఉండటం వల్ల ఆయన ఇంట్లోకి రావటం తను గమనించి ఉండడని" ఆ పనివాడు అనుకున్నాడు. ఆపై, ఆ పనివాడు తాను కూర్చున్న చోటు నుండి లేచి మెట్లమీదుగా పై అంతస్తులోకి వెళ్ళాడు. అక్కడ ఒక గదిలోకి ప్రవేశిస్తున్న ఒక వ్యక్తి కనిపించాడు. అప్పటికి ఆ పనివాడికి ఇంకా నిద్ర మత్తు పూర్తిగా దిగలేదు. అందువలన ఆ గదిలోకి వెళుతున్నది తన యజమానే అని భావించి ఆపై పెద్ద గొంతుతో "సాబ్! మీరు వచ్చి ఎంత సేపు అయ్యింది?" అన్నాడు. అయితే, ఆ వ్యక్తి వెనక్కి తిరిగి చూడలేదు. సమాధానమూ చెప్పలేదు. దాంతో ఆ పనివాడు రెండు, మూడు సార్లు తన యజమానిని పిలిచాడు. ఆ వ్యక్తి నుండి ఎలాంటి సమాధానమూ లేదు. అప్పటికీ ఆ పనివాడికి నిద్రమత్తు పూర్తిగా వదిలిపోయింది. ఎవరో కొత్త వ్యక్తి ఆ గదిలోకి వెళుతున్నాడని అర్థంచేసుకున్న ఆ పనివాడు రెండు అంగల్లో ఆ గదిలోకి వెళ్లాడు. ఆ గదిలో అప్పటి వరకు అటు

తిరిగి నిలబడిన వ్యక్తి, ఒక్కసారిగా ఇటు తిరిగాడు. ఆ వ్యక్తి ముఖం అస్పష్టంగా కనిపిస్తున్నది. ఆ ముఖం చూడగానే ఆ పనివాడిలో ఏదో తెలియని భయం తలెత్తింది. ఆపై, వాడు ఏదో అనే లోగా – అతని ఎదురుగా ఉన్న వ్యక్తి, సెకన్లలో అక్కడికక్కడే గాలిలో అదృశ్యం అయిపోయాడు. తన కళ్ళముందే అలా ఒకవ్యక్తి అదృశ్యం కావటంతో ఆ పనివాడికి ఒక్కసారిగా గుండె ఆగినంత పనయ్యింది.

అందరూ అనుకుంటున్నట్లుగా "ఆ భవనంలో నిజంగా ఒక దయ్యం ఉన్నదని" ఆ క్షణంలో ఆ పనివాడికి స్పష్టంగా తెలిసింది. ఆపై, అతడు భయంతో వణికిపోతూ – తడబడుతున్న అడుగులతో అతికష్టంమీద మేడమీద నుండి క్రింద ఉన్న హాలులోకి వచ్చాడు. సరిగ్గా, అప్పుడే విక్టర్‌బేలె మరియు ఆయన భార్య లోపలికి వచ్చారు. భయంతో వణికిపోతున్న పనివాడి భుజంమీద చెయ్యివేసి ధైర్యం చెప్పి ఆపై "ఏం జరిగింది? ఇలా వణికిపోతున్నావ్?" అన్నాడు విక్టర్‌బేలె. అప్పుడు ఆ పనివాడు అతికష్టంమీద ధైర్యం చిక్కబట్టుకుని ఆపై, కొద్దిసేపటి క్రితం మేడమీద తనకు కనిపించిన ఒక బ్రిటీషు జాతీయుడి పిశాచం గురించి చెప్పాడు. ఆ పనివాడు, సహజంగా చాలా ధైర్యవంతుడని విక్టర్‌బేలెకి స్పష్టంగా తెలుసు. అలాంటివాడు అంతగా బెదిరిపోయాడు అంటే, ఖచ్చితంగా ఆ భవనంలో ఏదో ఒక మానవాతీత శక్తి ఉన్నదని ఆ క్షణంలో విక్టర్‌బేలెకి అర్థమయ్యింది. అలాంటి ప్రమాదకరమైన భవనంలో ఉండటం తనకు మరియు తన కుటుంబానికి క్షేమం కాదని విక్టర్‌బేలె ఆ క్షణంలో నిర్ణయించుకున్నాడు. ఆ మర్నాడు ఉదయమే విక్టర్‌బేలె తన కుటుంబంతో సహా ఆ భవనాన్ని వదిలిపెట్టి, అక్కడకు కొంచెం దూరంలో ఇంకొక చిన్న భవనంలోకి వెళ్ళిపోయాడు.

ఆ తరువాత కొంతకాలం "ఛార్లీ విల్లే భవనం" ఖాళీగా ఉండిపోయింది. ఆ తరువాత కాలంలో అప్పుడప్పుడూ కొంతమంది అధికారులు ఆ భవనంలో కొన్నాళ్ళు ఉండటం ఆపై ఆ భవనంలో ఉంటున్న ప్రేతాత్మ పెట్టే బాధలను తట్టుకోలేక ఆ భవనం ఖాళీచేసి వెళ్ళి పోవటం జరుగుతూ ఉండేది.

1947, ఆగష్టు నెలలో భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చింది. ఆ సమయంలో భారతదేశంలోని చాలామంది బ్రిటీషు అధికారులు ఇక్కడ నుండి తమ దేశానికి వెళ్లిపోయారు. ఈ సీమ్లాలోని ఛార్లీవిల్లే భవనానికి యజమానురాలైన ఒక ఆంగ్లేయ స్త్రీ, తానుకూడా ఇంగ్లాండుకి వెళ్ళటానికి ముందు ఆ భవనాన్ని సాధారణమైన ధరకు ఒక భారతీయ కుటుంబానికి అమ్మివేసింది. అప్పటి నుండి ఛార్లీవిల్లే భవనం

సీమ్లాలోని ఒక హైందవ కుటుంబం ఆధీనంలోకి వచ్చింది. ఆ తరువాత రెండు దశాబ్దాలకు ఆ హిందూ కుటుంబ యజమాని, ఆ భవనాన్ని పడగొట్టి ఆ స్థానంలో ఒక కొత్త భవాన్ని నిర్మించాడు. ఎప్పుడైతే "ఛార్లీవిల్లే భవనం" కూల్చబడిందో అప్పటి నుండి ఆ భవనం ప్రాంతంలో ప్రేతాత్మకు సంబంధించిన సంఘటనలు ఏవీ జరగలేదని చెబుతారు.

# 16. ప్రేతాత్మల గ్రామం 'దాగ్‌షాయ్' (సిమ్లా) మర్మం ఏమిటి?

హిమాచల్ ప్రదేశ్ రాష్ట్రంలోని పర్వతాల మధ్యలో ఉండే ఇతర చాలా గ్రామాలలాగే దాగ్‌షాయ్ కూడా ఒక చిన్న గ్రామంలాగా ఉంటుంది. కానీ, ప్రేతాత్మలను మరియు వాటి చర్యలను ప్రత్యక్షంగా చూడాలని భావించేవారికి ఈ గ్రామం ఏనాటికీ ఒక ఆశ్చర్యంగా మిగిలిపోతుందని చెప్పుకుంటారు. "దాగ్–ఈ–షాహి" అనే ఉర్దూ పదానికి "రాజచిహ్నం" అని అర్థం. ఈ పేరు మీదుగానే "దాగ్‌షాయ్" అనే గ్రామం ఏర్పడింది.

ఒక విశేషం ఏమంటే, హిమాచల్ ప్రదేశ్ రాష్ట్రంలో ఉన్న ఈ కుగ్రామం "ప్రేతాత్మలు నిజంగా ఉన్నాయి" అని నిరూపించే ఒక సజీవ సాక్ష్యంగా ఉన్నదని ఆ రాష్ట్రంలోని చాలామందికి తెలియదు. అలాంటిది భారతదేశంలోని మిగిలిన ప్రాంతాల వాళ్ళకి ఆ గ్రామం గురించి తెలియటం దాదాపు అసాధ్యమే అని గుర్తించాలి. హిమాచల్ ప్రదేశ్ రాష్ట్రంలోని 'సోలాన్' అనే పట్టణానికి దాదాపు 11 కి.మీ. దూరంలో ఈ దాగ్‌షాయ్ అనే కుగ్రామం ఉన్నది. (ప్రపంచ ప్రఖ్యాతి చెందిన శూలినీదుర్గ ఆలయం ఈ సోలాన్ పట్టణంలోనే ఉన్నదని గుర్తించాలి.)

మొగల్ రాజులు, ఢిల్లీ సామ్రాజ్యాన్ని పరిపాలిస్తున్న కాలంలో ఈ గ్రామాన్ని "దాగ్–ఈ–షాహి" అనే పేరుతో పిలిచేవాళ్ళు. రాజ గౌరవానికి, దర్పానికి చిహ్నంగా అనగా, రాజరిక చిహ్నంగా ఈ గ్రామానికి "దాగ్–ఈ–షాహి" అనే పేరు పెట్టబడింది. నిజానికి, ఈ గ్రామం – బాధలకు, కష్టాలకు, హింసకు మారు పేరుగా ఆ మొగల్ చక్రవర్తుల పాలనా కాలంలోనే మారిపోయింది. అది ఎలాగంటే...మొగల్ చక్రవర్తులు, తమ రాజ్యంలో తీవ్రమైన నేరాలు చేసిన నేరస్తులను మరియు తమ

అధికారాన్ని, ఇస్లాం మతాన్ని ధిక్కరించిన హైందవ వీరుల్ని ఈ గ్రామంలో, ప్రత్యేకంగా ఏర్పాటుచేసిన అతి పటిష్టమైన కారాగారంలో ఉంచేవాళ్ళు. ఆపై, వాళ్ళని ఈ కారాగారంలో ఉండే సైనికులు, అధికారులు, నరకయాతనలకు గురిచేసేవాళ్ళు. ఒకవిధంగా చెప్పాలంటే, దాగ్–ఈ–షాహి గ్రామంలోని కారాగారం భూలోకంలో నరకంగా గుర్తించబడింది. ఎంతోమంది భారతీయుల ప్రాణాలు ఈ కారాగారంలో గాలిలో కలిసిపోయాయి. మరెంతోమంది భారతీయులు ఇక్కడ చిత్ర హింసలకు గురిచేయబడ్డారు. ఇలా అనేక మంది దారుణంగా చంపబడిన కారణంగా ఈ కారాగారం, ప్రేతాత్మలు సంచరించే శ్మశానంగా మారిపోయిందని చెబుతారు. కాలక్రమంలో దాగ్–ఈ–షాహి అనే పేరు 'దాగ్‌షాయ్' అనే పేరుగా మారిపోయింది. ఈ గ్రామంలో ప్రాచీనకాలంనాటి కొన్ని ఆర్మీ నివాస భవనాలు, రెండు స్కూళ్ళు, ఒక శ్మశానం మరియు స్థానికంగా నివసించే ప్రజలయొక్క కొన్ని ఇళ్ళు మాత్రమే ఉంటాయి.

భారతదేశంలో బ్రిటీషువాళ్ళు ఏర్పాటుచేసిన అతి పురాతనమైన ఆర్మీ నివాస గ్రామాలలో (ఆర్మీ కంటోన్మెంట్ టౌన్)లలో దాగ్‌షాయ్ కూడా ఒకటని చెబుతారు. క్రీ.శ.1847లో ఆనాటి పాటియాల మహారాజైన రాజాభూపేంద్రసింగ్ తన రాజ్యంలోని ఐదు గ్రామాలను ఆనాటి ఈస్టిండియా కంపెనీవారికి ఉచితంగా ఇచ్చాడు. ఆ ఐదు గ్రామాలలో విస్తీర్ణంలో పెద్దది మరియు అధిక జనాభా గలది – దాగ్‌షాయ్ గ్రామం అని చెప్పుకుంటారు. ఈ గ్రామంలోనే బ్రిటీషువాళ్ళు ఒక ఆర్మీ నివాస కేంద్రాన్ని ఏర్పాటుచేసి, ఆపై ఈ గ్రామం పేరుమీదుగానే ఆ కేంద్రానికి "దాగ్‌షాయ్ కంటోన్మెంట్" అనే పేరు పెట్టుకున్నారు. బ్రిటీషువారి పరిపాలనా కాలంలో ఈ గ్రామంలో, ఒక చిన్న మిలటరీ యూనిట్ (సైనిక బృందం) ఎల్లప్పుడూ యుద్ధానికి సిద్ధంగా ఉండేది. బ్రిటీషువారి పరిపాలనా కాలంలో ఈ గ్రామం ఆర్మీకి నివాస స్థలంగా ఉండేది. ఆ సమయంలో ఈ ప్రాంతంలో జరిగిన ఒక భయానకమైన సంఘటన కారణంగా ఈ గ్రామం, ప్రేతాత్మల సంచారానికి నిలయమైన గ్రామంగా మారిపోయింది. అది ఎలాజరిగిందో తెలుసుకుందాం...

ఒక విచిత్రం ఏమంటే, ఆకర్షణీయమైన పరిసరాల మధ్యలో, ప్రకృతి సౌందర్యానికి నిలయమైన కొండల మధ్యలో ఉన్న దాగ్‌షాయ్‌లో ప్రేతాత్మల నిలయం అయిన ఒక శ్మశానం కూడా ఉన్నది. ఆ శ్మశానంలో ఒక స్త్రీ ప్రేతాత్మ ఈనాటికీ అర్ధరాత్రి సమయాలలో సంచరిస్తూ ఉంటుందని ఆ ప్రాంత ప్రజలు చెప్పుకుంటారు. ఆ స్త్రీ

ప్రేతాత్మ ఎవరు?, ఆ శ్మశానంలో ఆమె ఎందుకు సంచరిస్తూ ఉంటుంది? – అనే ప్రశ్నలకు ఆ ప్రాంత ప్రజలు ఇలా సమాధానం చెబుతున్నారు...

బ్రిటీషువాళ్ళు భారతదేశాన్ని పరిపాలిస్తున్న కాలంలో ఈ ప్రాంతంలో నివసిస్తున్న ప్రజలకు మరియు ఈ దాగ్‌షాయ్ గ్రామంలో ఉంటున్న బ్రిటీషు సైనికులకు వైద్యం చెయ్యటంకోసం వైద్యశాస్త్రం చదివిన ఒక మిలటరీ అధికారిని ఈ ప్రాంతానికి పంపించారు. ఆయన పేరు మేజర్‌జార్జివెస్టన్. ఈయనతో పాటుగా ఈయన భార్య కూడా అక్కడకు వచ్చింది. విశేషం ఏమంటే, ఆమె కూడా వైద్య విద్యను అభ్యసించి ఆపై కొంతకాలంపాటు లండన్ నగరంలో డాక్టరుగా ప్రాక్టీసు చేసింది. ఏదిఏమైనా, భర్తకోసం ఆమె తన వృత్తిని మరియు జన్మ స్థలాన్ని వదిలిపెట్టి, కొండల మధ్యలో ఉన్న కుగ్రామం "దాగ్‌షాయ్"కి సంతోషంగా వచ్చింది.

మేజర్‌జార్జివెస్టన్, యుద్ధ సమయంలో తప్ప ఇతర సమయాలలో కేవలం వైద్యుడిలాగానే ప్రవర్తించేవాడు. తన దగ్గరకు వచ్చిన రోగులకు ఎంతో ఆదరంతో వైద్యం చేస్తూ ఉండేవాడు. దురదృష్టవశాత్తు, మేజర్ దంపతులకు సంతానంలేదు. వాళ్ళకి పెళ్ళి అయి, 15 ఏళ్ళు గడిచినా కూడా సంతానం లేదు. ఈ పరిస్థితుల్లో ఒకరోజున పీర్‌బాబా అనే ఒక సూఫీయోగి (ముస్లిం యోగి) మేజర్ నివాసానికి వచ్చాడు. నిజానికి, మేజర్‌కి మంత్ర తంత్రాలమీద, భూత ప్రేతాలమీద ఏమాత్రం నమ్మకం లేదు. 'కంటికి కనిపించేదే నిజమని, కంటికి కనపడనిది నిజం కాదని' ఆ మేజర్ బలంగా నమ్మేవాడు. కానీ, ఆయన భార్య మాత్రం ఎల్లప్పుడూ జీసెస్‌ని ప్రార్థిస్తూ ఉండేది. ఆమెకు మానవాతీత శక్తుల మీద కూడా పూర్తి నమ్మకం ఉండేది. ఏదిఏమైనా ఆ పీర్ బాబా, మేజర్ భార్యకి మంత్రించిన ఒక తావీజుని ఇచ్చి దానిని మెడలో వేసుకోమని, ఆమెకు చెప్పాడు. ఆపై, ఆమె కొద్ది రోజుల పాటు ఆ తావీజుని మెడలో ధరించింది. ఆ తావీజు మహిమో లేక ఆమెకు మంచికాలం వచ్చిందో తెలియదుకానీ ఆమె గర్భవతి అయ్యింది. అయితే, చాలా పెద్ద వయస్సులో అనగా 45 సంవత్సరాల వయస్సులో గర్భం రావటంతో ఆమె తీవ్రమైన శారీరక బాధలకు గురి అవుతూ ఉండేది. ఎలాగో, ఆ బాధల్ని ఓర్చుకుంటూ కాలం గడిపింది. చివరికి 1909, డిసెంబర్ 3వ వారంలో అనగా ఆమెకు 8వ నెల నిండుతున్న సమయంలో ఒకరోజు అర్ధరాత్రి సమయంలో ఆమెకు విపరీతంగా ప్రసూతి నొప్పులు వచ్చాయి. సహజంగా, డాక్టరు అయిన మేజర్ జార్జివెస్టన్, ఆమెకు తానే స్వయంగా కాన్పు చెయ్యాలని (డెలివరీ) ప్రయత్నించాడు. కానీ, కడుపులో బిడ్డ, అడ్డం తిరగటంతో

ఆమె చనిపోయింది. చనిపోయిన సమయంలో ఆమె కళ్ళు తెరుచుకుని ఉన్నది. అనగా, ఆమె ప్రాణం ఆ కళ్ళలోంచి బైటకు వెళ్ళిపోయింది అన్నమాట. (హైందవ తాంత్రిక గ్రంథాలలో చెప్పబడిన సమాచారం ప్రకారం చూసినట్లయితే, ఒకవ్యక్తి ఎంత మంచివాడైనప్పటికీ, అతడు చనిపోతున్నప్పుడు అతని ప్రాణం, అతని కళ్ళల్లోంచి వెళ్ళిపోతే అతడు తప్పనిసరిగా ఒక ప్రేతాత్మగా మారతాడని తెలుస్తున్నది.)

తాను ఎంతగానో ప్రేమించిన మరియు తనతోపాటు ఎన్నో ఏళ్ళు జీవించిన తన భార్య హఠాత్తుగా అలా చనిపోవటంతో ఆ మేజర్, తీవ్రమైన మనోవేదనకు గురి అయ్యాడు. ఆమె మృతదేహాన్ని ఆ గ్రామంలోనే ఉన్న శ్మశానంలో సమాధి చేసాడు. ఆపై, ఆమె సమాధిమీద ఇంగ్లాండు నుండి ప్రత్యేకంగా తెప్పించిన (ఇంగ్లాండులోని చర్చి ఫాదర్లు మంత్రించి పంపించిన శిలా ఫలకం) శిలాఫలకాన్ని ఆమె సమాధిమీద ప్రతిష్టించాడు. ఆ కాలంలో ఆ మేజరు తన భార్య రెబెకాకు పాలరాతితో సమాధి కట్టించాడు. ఆ తరువాత అక్కడ ఒంటరిగా ఉండలేకపోయిన ఆ మేజరు, తనను ఇంగ్లాండు వెళ్ళిపోవటానికి అనుమతించమని ఆనాటి బ్రిటీషు ప్రభుత్వాన్ని అభ్యర్ధించాడు. భార్య పోయిన దిగులుతో కృంగిపోతున్న ఆ మేజరు మీద సానుభూతి కలిగిన ఆనాటి ప్రభుత్వ అధికారులు, మేజర్ జార్జివెస్టన్, ఇంగ్లాండ్‌కి వెళ్ళటానికి అనుమతించారు.

ఆ మేజర్, ఇండియా నుండి వెళ్ళిపోయిన కొద్ది రోజుల తరువాత దాగ్‌షాయ్ గ్రామంలోని ఆ శ్మశానంలో పౌర్ణమి రాత్రులలో ఒక బ్రిటీషు దేశీయురాలి ప్రేతాత్మ సంచరించటం మొదలయ్యింది. ఆ మేజరు భార్య అయిన రెబెక్కా, తన ప్రసవ సమయంలో బలన్మరణం పొందింది కనుక ఆమె, ప్రేతాత్మగా మారి, ఆపై తన సమాధి ఉన్న ఆ శ్మశానంలోనే సంచరిస్తున్నదని ఆ ప్రాంతంలో కథలు కథలుగా చెప్పుకోవటం ప్రారంభించారు. కొన్నాళ్ళు గడిచాయి. ఒకరోజు రాత్రి ఆ శ్మశానంలోకి ఒక స్త్రీ వెళ్ళింది. ఆమెకి పెళ్ళి అయి చాలా రోజులు



గడిచినా సంతానం లేదు. ఆమె నివసిస్తున్న గ్రామంలోని ఆడవాళ్ళు ఆమెను తమకు వీలైనప్పుడల్లా 'గొడ్రాలు' అని హేళన చేస్తూ ఉండేవాళ్లు. కొద్ది రోజులకు ఆమె ఆ అవమానాలను తట్టుకోలేక ఆత్మహత్య చేసుకుందామని తమ ఊరి పొలిమేరల్లో ఉన్న శ్మశానానికి వెళ్ళింది. ఆ శ్మశానంలోనే మేజరు భార్య రెబక్కా సమాధి కూడా ఉన్నది. ఏదిఏమైనా, అర్ధరాత్రి సమయంలో ఆ శ్మశానానికి వెళ్ళిన ఆమెకు ఆ శ్మశానంలో సంచరిస్తున్న రెబెక్కా యొక్క ప్రేతాత్మ కనపడింది. ఆ ప్రేతాత్మ కనపడగానే ఆ స్త్రీ, పిచ్చి పట్టినట్లుగా ఆ ప్రేతాత్మవైపు పరుగెత్తింది. ఆపై ఆ ప్రేతాత్మ, "నా సమాధి నుండి ఒక చిన్న రాయి ముక్కని తీసుకువెళ్ళి ఇంట్లో పెట్టుకో. నీకు తప్పకుండా గర్భం వస్తుంది" అని ఆ స్త్రీకి చెప్పి మాయం అయిపోయింది. ఆపై ఆ స్త్రీ, నేలమీద పడి ఉన్న ఒక చిన్న ఇనుప మేకుతో ఆ పాలరాయి సమాధి మీద గట్టిగా రెండు దెబ్బలు కొట్టింది. ఫలితంగా, ఆ సమాధి మీద నుండి దాదాపు మూడు అంగుళాల పొడవు ఉన్న చిన్న రాయి ముక్క నేలమీద పడింది. ఆపై ఆమె ఆ పాలరాయి ముక్కని తన కళ్ళకు అద్దుకుని ఆపై ఆ రాయితో సహా తన ఇంటికి వెళ్ళిపోయింది. ఆ తరువాత మూడు వారాలు గడిచాయి. ఆ స్త్రీకి గర్భం వచ్చింది. ఆ తరువాత కొన్ని నెలలకు ఆమెకు ఒక అందమైన ఆడ పిల్ల పుట్టింది. రెబెక్కా ప్రేతాత్మ, అనుగ్రహం కారణంగానే తనకి ఆ ఆడపిల్ల పుట్టింది అని బలంగా నమ్మిన ఆ స్త్రీ తన బిడ్డకి "రెబెక్కా" అనే పేరు పెట్టుకున్నది. కాలక్రమంలో ఈ సమాచారం దాగ్‌షాయ్ గ్రామంలోనే కాక, చుట్టు ప్రక్కల గ్రామాలలోకూడా ప్రాకిపోయింది.

ఫలితంగా, సంతానంలేని స్త్రీలు – రాత్రి సమయంలో ఆ శ్మశానంలోకివెళ్ళి ఆపై ఆ శ్మశానంమీద రెండు మూడు దెబ్బలు కొట్టి, అలా కొట్టటం వల్ల వచ్చిన రాయి ముక్కల్ని తమతోపాటు ఇంటికి తీసుకువెళ్ళటం ప్రారంభించారు. విచిత్రం ఏమంటే, అలా రాళ్ళ ముక్కలు తీసుకువెళ్ళిన స్త్రీలందరికీ సంతానం కలిగింది. దాంతో, ఆ ప్రాంత ప్రజలు రెబెక్కాని ఒక దేవతగా భావించారు. అంతేకాకుండా, ఆమెయొక్క సమాధిని "మేమ్‌కి కబర్" (అమ్మగారి సమాధి) అనే పేరుతో పిలవటం ప్రారంభించారు. సంతానంలేని అనేకమంది స్త్రీలు ఆ సమాధి నుండి రాయి ముక్కలు తీసుకోవటంతో కొన్నేళ్ళు గడిచే సరికి అసలు ఆ సమాధే లేకుండా పోయింది. అయినప్పటికీ రెబెక్కా ఆత్మ మాత్రం ఈనాటికీ ఆ శ్మశానంలోనే సంచరిస్తున్నదని ఆ చుట్టు ప్రక్కల ప్రాంతాల ప్రజలు చెప్పుకుంటూ ఉంటారు.

# 17. ప్రాచీన జపాన్‌లో సర్ప సంబంధ ప్రేతాత్మలు/ శాపాలు?

జపాన్ దేశంలో ఈనాటికీ ప్రచారంలో ఉన్న మతపరమైన విశ్వాసాల ప్రకారం చూసినట్లయితే, “కొన్ని రకాల సర్పాలు మానవాతీత శక్తులను కలిగి ఉంటాయి. వాటిని చంపిన వాళ్ళకి నాగశాపం తగులుతుంది. ఆ శాపం తగిలినవాళ్ళు మానసికంగా, శారీరకంగా, ఆర్థికంగా పతనం అయిపోతారు. జీవించి ఉన్నప్పుడు విపరీతమైన క్రూరమైన పనులు, పాపాలు చేసినవాళ్ళు – చనిపోయిన కొద్ది కాలంలోనే దుర్మార్గ స్వభావం కలిగిన త్రాచుపాములుగా జన్మిస్తారని జపాన్ తంత్రశాస్త్రంలో చెప్పబడి ఉన్నది. అదేవిధంగా, తాను తినకుండా, ఇతరులకు పెట్టకుండా దారుణమైన పిసినారి తనంతో జీవించిన వాళ్ళు కూడా, తమ మరణానంతరం సర్పాలుగా మారతారని జపాన్‌లో భావిస్తారు. తాను జీవించి ఉన్నప్పుడు శృంగార సంబంధ కోర్కెలు తీరక బాధపడే పురుషుడు, చనిపోయిన తరువాత ఇచ్ఛాధారి సర్పంగా మారతాడని, అలాగే కోర్కెలు తీరకుండా చనిపోయిన స్త్రీ, ఆడ సర్పంగా జన్మిస్తుందని నమ్ముతారు. ఇలా, కోర్కెలు తీరకుండా చనిపోయి సర్పాలుగా జన్మించిన స్త్రీ, పురుషులకు మానవ రూపం ధరించే శక్తి వస్తుందని చెప్పుకుంటారు. ఈ స్త్రీ సర్పాలు తమకు, ఎవరైనా అందమైన పురుషుడు ఎదురైనప్పుడు – అందమైన స్త్రీల రూపాలను ధరించి ఆ పురుషుడిని తమ శక్తితో వశీకరణ చేసుకుని, ఆపై తమకు తృప్తి కలిగేదాకా ఆ పురుషుడితో శృంగార సుఖాలు అనుభవిస్తాడు. అదేవిధంగా, గతజన్మలో కోర్కెలు తీరక మరణించిన పురుషులు, మానవ రూపం ధరించగలిగే సర్పాలుగా జన్మించినప్పుడు ఆ సర్పాలకు ఎవరైనా అందమైన స్త్రీలు ఎదురైతే, ఆ మగ సర్పాలు అందమైన పురుషుడి రూపం ధరించి ఆపై తమ కంటిచూపుతో ఆ స్త్రీల మనసుని తమ స్వాధీనం చేసుకుని, ఆపై వాళ్ళతో శృంగార సుఖాలు అనుభవించటం జరుగుతుంది.

ఏదిఏమైనా, ఒక మగ సర్పానికి మరియు మానవ స్త్రీకి జన్మించిన బిడ్డ ఒక సర్పం కావొచ్చు లేదా సర్ప సంబంధ లక్షణాలు ఉన్న మానవ శిశువు కావొచ్చు. ఇంకొక ముఖ్యవిశేషం ఏమంటే, ఇలా సర్పాలుగా జన్మించిన స్త్రీ, పురుషులు –

తాము కోరిన సుఖాలను అనుభవిస్తున్నప్పటికీ తాము అతి నికృష్టమైన సర్ప జీవితాన్ని గడుపుతున్నామనే బాధ వాళ్ళని ఎల్లప్పుడూ వెంటాడుతూనే ఉంటుంది. ఆ కారణంగానే, సర్పాలుగా జన్మించిన వ్యక్తులు (వాళ్ళు స్త్రీలు కావొచ్చు లేదా పురుషులు కావొచ్చు) తమ కుటుంబీకులకు స్వప్నాలలో కనిపించి ఆపై వాళ్ళతో ఇలా చెబుతారు. "మేము సర్ప దేహాలలో బంధించబడ్డాము. అనగా సర్పాలుగా జీవిస్తున్నాం. మీరు మా ఆత్మకు శాంతి కలిగేలా తంత్ర సంబంధమైన, దైవ సంబంధమైన పరిహారాలను చేయించండి. అప్పుడు మా గతజన్మ పాపం నశించిపోతుంది. ఆపై మేము ఈ సర్పదేహాలను వదిలిపెట్టి పుణ్యలోకాలకు వెళ్ళిపోతాం".

భారతదేశంలో కూడా ఇలాంటి సంఘటనలు అక్కడక్కడా జరిగినట్లుగా తెలుస్తున్నది. కొద్ది సంవత్సరాల క్రితం నేను, తిరుపతిలో ఉన్నప్పుడు ఒక యువకుడు నా దగ్గరకు వచ్చాడు. అతడు బాగా విద్యావంతుడు అయినప్పటికీ సరైన ఉద్యోగం రాలేదు. అంతేకాకుండా, అతడి ఆస్తులన్నీ దాయాదులు పెట్టిన కోర్టు కేసుల్లో చిక్కుకున్నాయి. అంతేకాకుండా, అతని బొడ్డు చుట్టూతుగా పాము చారల్లాంటి వృత్తాలు ఏర్పడ్డాయి. అతడు, ఎందరో సిద్ధాంతుల్ని సంప్రదించినా అతని సమస్యలు తీరలేదు. ఎంతమంది చర్మ సంబంధ వ్యాధుల చికిత్సా నిపుణులను కలుసుకున్నా అతడి బొడ్డు చుట్టూ వచ్చిన పాము చారలు పోలేదు. నేను వ్రాసిన సర్పసంబంధ గ్రంధాలైన "సర్పసుబ్రహ్మణ్యం, సర్పవేదం" అతడు చదివాడు. ఆ తరువాత అతడు, నన్ను కలుసుకుని తనకు ఎదురవుతున్న సమస్యల గురించి చెప్పాడు. ఆ సమయంలోనే అతడు, తనకి కొంతకాలంగా వస్తున్న ఒక కల గురించి కూడా చెప్పాడు. ఆ కలలో, కొన్నేళ్ళ క్రితం చనిపోయిన అతని తండ్రి, ఒక నల్లత్రాచు పాము రూపంలో కనిపించాడు. అంతేకాకుండా, ఆ నల్లత్రాచుపాము అచ్చుగా అతని తండ్రి స్వరంతో "అయ్యా! నన్ను ఈ నరకం నుండి రక్షించు" అని చెబుతూ ఉండేది. ఈ కల అతనికి చాలాసార్లు వచ్చింది. ఏదిఏమైనా, దైవ నిర్ణయం కావొచ్చు లేదా అతని అదృష్టం కావొచ్చు అతడు, నన్ను తిరుపతిలో కలుసుకున్నప్పుడు నేను, అతడి జాతకాన్ని మరియు అతని అరిచేతుల్ని పరిశీలించాను. అతడికి "నాగబాధ" ఏర్పడింది అని అర్ధమయ్యింది. విచిత్రం ఏమంటే, అతడికి ఏర్పడిన బాధ అతడు చేసిన చెడు కర్మలవల్ల రాలేదు.

అతడి తండ్రి బ్రతికి ఉన్నప్పుడు ఎంతోమందిని నాశనంచేసి, ఆపై ఒక యాక్సిడెంట్‌లో దారుణంగా చనిపోయాడు. అలా చనిపోయిన అతడి తండ్రి ఒక నల్లత్రాచుగా జన్మించాడు. తనకి ఆ సర్పజన్మ పోవాలంటే దైవ సహాయం కావాలని గ్రహించిన అతడి తండ్రి ఆత్మ తన కుమారుడికి తరచుగా కలలో కనినిపించి తనయొక్క దుస్థితిని వివరిస్తున్నదని – ఆ యువకుడు, తనకు వస్తున్న సర్ప సంబంధ కలల గురించి నాకు చెప్పినప్పుడు నాకు, కొంచెం ఆలస్యంగా అయినా సరే అర్థమయ్యింది. ఆ తరువాత నేను, అతడిచేత సర్పదోష నివారణా పరిహారాలను చేయించాను. ఈ పరిహారాలు పూర్తి అయిన కొద్ది రోజుల్లోనే అతడి కోర్టు కేసులు అతడికి అనుకూలంగా మారిపోయాయి. అంతేకాదు, ఒకరోజు స్వప్నంలో అతడి తండ్రి – తెల్లటి పట్టుబట్టలు కట్టుకుని కనిపించాడు. అనగా, అతడి తండ్రి సర్పజన్మకు ముగింపు లభించింది అన్నమాట. ఎప్పుడైతే, అతడి తండ్రి ప్రేతాత్మ, సర్పరూపాన్ని వదిలిపెట్టి పుణ్యలోకాలకు వెళ్ళిపోయిందో, అప్పటి నుండి ఆ యువకుడికి అంతా మంచే జరిగింది. ఇంకొక విచిత్రం ఏమంటే, అతని బొడ్డు చుట్టూ ఉన్న సర్ప మచ్చలు (పాము కుబుసంమీద ఉండే చారలు లాంటివి) పూర్తిగా అదృశ్యం అయిపోయాయి. – రచయిత.)

**సర్పంగా పునర్జన్మ ఎత్తిన ప్రేమికుడి యదార్థ వృత్తాంతము :**

సర్పాలన్నీ చెడ్డవి కాదని, వాటిలో కొన్ని మంచివి కూడా ఉంటాయని ప్రాచీన జపాన్‌లో చెప్పుకునేవాళ్ళు. దాదాపు 3 శతాబ్దాల క్రితం, జపాన్‌లోని ముసాషి రాష్ట్రంలోని సెంజు అనే పట్టణంలో సేకీ అనే పేరుగల ఒక అందమైన యువతి ఉండేది. ఆమెను ఎషిరో అనే పేరుగల యువకుడు ఎంతగానో ప్రేమించాడు. తనను ప్రేమించమని, పెళ్ళిచేసుకోమని యషిరో ఆ యువతిని ఎన్నో రకాలుగా ప్రాధేయ పడ్డాడు. ఎంతోమంది పెద్ద మనుషుల్ని ఆమె వద్దకు పంపించి, ఆమెను తనతో పెళ్ళికి ఒప్పించాలని అనేక రకాలుగా ప్రయత్నించాడు. కానీ, ఆమె ఎషిరోని పెళ్ళి చేసుకోవటానికి ఏమాత్రం ఒప్పుకోలేదు. అలా రెండు నెలలు గడిచాయి. సేకీకి ధనవంతుడు, అందగాడు అయిన ఒక యువకుడితో ఘనంగా పెళ్ళి జరిగింది. పెళ్ళి జరిగిన రాత్రి, సేకీ దంపతులకు మొదటి రాత్రి ఏర్పాటు చేసారు. బాగా అలంకరించిన గదిలోకి సేకీ దంపతుల్ని పంపించారు. మర్నాడు ఉదయం 6 గంటల ప్రాంతంలో

సేకీ యొక్క తల్లి ఆ శోభనం గది తలుపులు దాకా వచ్చి నిలబడింది.

సాధారణంగా సేకీ, ఉదయం 4 గంటలకే నిద్రలేచి ఇంటి పని చూసుకుంటుంది. 6 గంటలు అయినా సేకీ ఇంకా నిద్రలేవకపోవటంతో ఆమె తల్లికి కొంచెం ఆశ్చర్యంగా అనిపించింది. ఆపై ఆమె ఆ తలుపుపై తన చేత్తో చిన్నగా తట్టింది. బహుశా, ఆ నవ దంపతులు నిన్న రాత్రి ఆ గది తలుపులు లోపల నుండి గడియ వేసుకోలేదు కాబోలు, తలుపులు బార్లా తెరుచుకున్నాయి. సేకీ తల్లి మెల్లిగా అడుగులు వేస్తూ గదిలోకివెళ్ళి చూసింది. ఆపై, అక్కడ కనపడ్డ భయంకర దృశ్యంచూసి ఒక్కసారిగా "కెవ్" అని కేకపెట్టింది. ఏముంది అక్కడ? – పూలతో అలంకరించిన ఆ మంచంమీద పెళ్ళికొడుకు నిశ్చలంగా పడి ఉన్నాడు. అతని శరీరం నీలం రంగులోకి మారిపోయి ఉన్నది. అతని నోటి చివర్ల వద్ద ఎండిపోయిన రక్తపు మరకలు కనిపిస్తున్నాయి. ఇక అతడికి కొంచెం ప్రక్కన అదే మంచంమీద స్పృహ లేకుండా పడి ఉన్న పెళ్ళికూతురు సేకీ, నగ్న దేహంమీద ఒక నల్లటి ఆరు అడుగుల త్రాచుపాము మెల్లిగా పాకుతున్నది.

తనని సేకీ పెళ్ళి చేసుకోలేదన్న వేదనతో ఆత్మహత్య చేసుకుని చనిపోయిన ఎషిరో మళ్ళీ నల్లత్రాచుగా జన్మించి, ఆపై తాను ప్రేమించిన సేకీని పెళ్ళిచేసుకుని ఆపై ఆమెతో శృంగారం అనుభవించబోతున్న కొత్త పెళ్ళికొడుకుని దారుణంగా చంపిందని, తాను ఎంతగానో ప్రేమించిన కారణంగా సేకీని మాత్రం చంపకుండా వదిలిపెట్టిందని ఆ ప్రాంతం అంతా అప్పట్లో చెప్పుకున్నారు.

**సర్పశాపం :**

కొన్ని రకాల సర్పాలకు అనగా త్రాచుపాములకు దైవ శక్తి ఉంటుందని, అవి ఎవరికీ అకారణంగా హాని చెయ్యవని, అలాంటి సర్పాలను ఎవరైనా అన్యాయంగా చంపినట్లయితే వాళ్ళకి సర్పశాపం తగులుతుందని జపాన్‌లో ఈనాటికీ బలంగా నమ్ముతున్నారు. సర్పశాపం ఎంత శక్తివంతంగా ఉంటుందో తెలియజేసే ఒక యదార్థ వృత్తాంతం – వంద సంవత్సరాల క్రితం ప్రాచీన జపాన్‌లో జరిగింది. ఆ వివరాలు...

ప్రాచీన జపాన్‌లోని ఉత్తర తోయోషిమా ప్రాంతంలో ఊజి అనే ఒక పట్టణం ఉన్నది. ఆ పట్టణంలో హరుమాచి అనే పేరుగల ఒక ఇనుప సామాన్లు అమ్మే

వర్తకుడు ఉన్నాడు. ఇతడికి ఆ పట్టణ పొలిమేరల్లో ఒక భవనం ఉన్నది. ఆ భవనంలో అతనితోపాటుగా ఐదుగురు కుటుంబ సభ్యులు కూడా నివసిస్తూ ఉండేవాళ్ళు. ఒక సంవత్సరం మార్చి నెలలో ఆ కుటుంబంలోని సభ్యులందరూ హఠాత్తుగా చనిపోయారు. రాత్రి పడుకునే వరకు ఇరుగు పొరుగు వాళ్ళతో చక్కగా మాట్లాడిన ఆ కుటుంబ సభ్యులు, తెల్లవారే సరికి మృతదేహాలుగా కనపడే సరికి చుట్టు ప్రక్కల ఇళ్ళవాళ్ళకి తీవ్రమైన భయం కలిగింది.

ఏదిఏమైనా, ఆ మృతదేహాలకు ప్రభుత్వ అధికారులు అంత్యక్రియలు పూర్తిచేసారు. ఆ తరువాత కొంతకాలం వరకు ఆ ఇల్లు ఖాళీగానే ఉండిపోయింది. ఆ తరువాత ఐదు నెలలకు అనగా ఆగష్టు నెల 2వ తారీఖున ఆ ప్రాంతంలో భారీ వర్షాలు కురిసి వరదలు వచ్చాయి. వరదలు వెళ్ళిపోయిన తరువాత అక్కడ ఇళ్ళు అన్నీ నీళ్ళతో నానిపోయాయి. ముఖ్యంగా, హర్‌మాచి తమ్ముడైన సన్‌మాచి ఇల్లు ఆ వరదల్లో సంపూర్తిగా నేలమట్టం అయిపోయింది. ఎలాగో, అతడు తన కుటుంబ సభ్యులతో ఆ ఇంట్లో నుండి తప్పించుకుని ప్రాణాలతో బైట పడ్డాడు. సరే, ఆ ఇంటికి కొంచెం దూరంలో అతడి అన్న హర్‌మాచి ఇల్లు ఉన్నది. ప్రస్తుతం తన అన్న కుటుంబంలో ఎవరూ బ్రతికి లేరు. అందువల్ల ఆ ఇల్లు ఖాళీగా ఉన్నది.



ఇలా ఆలోచించిన సన్‌మాచి తన భార్యను వెంటపెట్టుకుని ఆ ఇంట్లోకి గృహప్రవేశం చేసాడు. వాళ్ళు ఆ ఇంట్లోకి వెళ్ళిన మొదటిరోజు అర్ధరాత్రి, సన్‌మాచికి భయంకరమైన పీడ కలలు వచ్చాయి. ఆ మర్నాడు రాత్రి అతడి భార్యకు కూడా గుండెలు జలదరించే పీడ కలలు వచ్చాయి. దాంతో సన్‌మాచి ఆ ఇల్లు ఖాళీచేసి ఇంకో ఇంటికి వెళ్ళిపోయాడు. ఆ ఇంటికి నాగశాపం తగిలిందని సన్‌మాచికి ఒక జ్యోతిష్కుడి

ద్వారా తెలిసింది. దాంతో సన్‌మాచి ఆ ఇంటిని పడగొట్టాడు. అసలు, ఆ ఇంటికి నాగశాపం ఎలా తగిలింది? అంటే....

హర్‌మాచి, బ్రతికి ఉన్న సమయంలో అనగా సరిగ్గా మూడు సంవత్సరాల క్రితం ఒకరోజు ఉదయం అతడు తన పెరట్లో అడ్డదిడ్డంగా పెరిగిపోయిన ముళ్ళ పొదలను నరికి ఆ ప్రాంతాన్ని శుభ్రం చేస్తున్నాడు. ఆ సమయంలో అక్కడ ఉన్న ఒక పెద్ద రావి చెట్టును కూడా నరికివేయాలని నిశ్చయించుకున్నాడు. ఆ మర్నాడే కొందరు పనివాళ్ళను అక్కడికి రప్పించాడు. వాళ్ళు, మధ్యాహ్న సమయానికి ఆ చెట్టుని నరికి నేలమీద పడేసారు. ఆ చెట్టు నేలమీద పడిన కొద్ది నిమిషాలలో ఆ చెట్టుకి ఉన్న ఒక తొర్రలో నుండి ఐదు త్రాచుపాములు జరజరా పాక్కుంటూ బైటకు వచ్చాయి. అవి బ్రతికి ఉంటే తమకి ప్రమాదం అని భావించిన హర్‌మాచి ఆ పాములను చంపటానికి ఒక కర్రను తన చేతిలోకి తీసుకున్నాడు. అది గమనించిన అతని భార్య, పెద్ద స్వరంతో "దయచేసి ఆ సర్పాలను చంపవొద్దు. వాటిని చంపితే మన కుటుంబానికి నాగశాపం తగులుతుంది. మన కుటుంబం సర్వనాశనం అయిపోతుంది" అన్నది. కానీ, హర్‌మాచి ఆమె మాటలను ఏమాత్రం పట్టించుకోలేదు. ఒక్కో కర్ర దెబ్బకి ఒక్కో పాముని చంపేసాడు. ఆ తరువాత ఒక గొడ్డలితో ఆ సర్పాల తలలను నరికాడు. ఆ తరువాత ఆ తలలను మరియు మొండాలను ఒక మూటగా కట్టి, ఆపై అక్కడికి దగ్గరగా ప్రవహిస్తున్న కేషిన్ నదిలో ఆ మూటను పడేసాడు. ఆ నదీ ప్రవాహంలో ఆ మూట కొట్టుకుపోయింది. ఆ తరువాత మూడు రోజులకు ఒక అమావాస్య రాత్రి వచ్చింది. గాఢ నిద్రలో ఉన్న హర్‌మాచి హఠాత్తుగా నిద్రలేచాడు. అతనికి ఏదో ఉద్రేకం ఆవహించింది. ఆపై అతడు తన భార్యను మరియు ముగ్గురు బిడ్డలను అదే గొడ్డలితో రెండేసి ముక్కలుగా నరికి, ఆపై తన మెడని కూడా అదే గొడ్డలితో నరుక్కుని చనిపోయాడు.

హర్‌మాచి, అకారణంగా సర్పాలను చంపిన కారణంగా అతడి కుటుంబానికి మరియు అతని ఇంటికి నాగశాపం తగిలిందని, ఆ కారణంగానే హర్‌మాచి తనతో పాటుగా తన కుటుంబాన్ని కూడా అంతం చేసుకున్నాడని ఇరుగు పొరుగు వాళ్ళకు స్పష్టంగా అర్థమైపోయింది.

ప్రాచీన జపాన్‌లోని చాలా ప్రాంతాలలో సర్పశాపానికి సంబంధించిన అనేక ఉదంతాలు కనిపిస్తాయి. వంద సంవత్సరాల క్రితం జపాన్‌లోని ఒక వార్తా పత్రికలో ఒక విచిత్రమైన వార్త ఇలా ప్రచురించబడింది. “తాచిమోరి” అనే గ్రామ పొలిమేరల్లో ఒక పది సంవత్సరాల బాలుడు తన ఇంట్లో పెరుగుతున్న గుర్రానికి కావలసిన గడ్డిని కోస్తున్నప్పుడు ఒక త్రాచుపాము ఆ బాలుడిని కరిచింది. ఫలితంగా, ఆ బాలుడు క్షణాల్లో నురుగులు కక్కుకుంటూ చనిపోయాడు. ఇందుకు ఆగ్రహించిన ఆ గ్రామంలోని ప్రజలు, ఊకుమ్మడిగా ఆ ఊరి పొలిమేరల్లోకివెళ్ళి ఆపై అక్కడ చెట్ల తొర్రల్లోను మరియు పుట్టల్లోను ఉన్న వందలాది త్రాచుపాముల్ని తమకు తోచినవిధంగా చంపేసారు. ఆ తరువాత వాటిని అన్నింటినీ మూటలుగా కట్టి దూరంగా ఉన్న కొండలలో పారేసారు. ఈ సంఘటన జరిగిన రాత్రి నుండి ఆ గ్రామంలోని ప్రజలకు నిద్రలేకుండా పోయింది. అందుకు కారణం ఏమంటే, ఆ గ్రామంలో ఊహ తెలిసిన ప్రతి వ్యక్తికీ కలల్లో గుంపులు గుంపులుగా మీదకు దూసుకు వస్తున్న త్రాచుపాములు కనిపించాయి. అంతేకాకుండా, ఆ త్రాచుపాములు వాళ్ళ శరీరాలను చుట్టుకుంటున్నట్లుగా వాళ్ళకు కలలో కనిపించింది. మానసికంగా బాగా స్థిరత్వం, ధైర్యం కలిగిన వ్యక్తులకు కూడా ఆ కలలు విపరీతమైన భయాన్ని కలిగించాయి. ఫలితంగా, ఆ గ్రామంలోని చాలామందికి ఉన్మాదం వచ్చింది. అలా ఉన్మాదం వచ్చినవాళ్ళు ఆత్మహత్య చేసుకుని చనిపోయారు. చాలామంది అలా చనిపోగా మిగిలిన కొద్దిమంది ఆ గ్రామాన్ని వదిలిపెట్టి వెళ్ళిపోయారు. ఆ తరువాత చాలా ఏళ్ళ వరకు ఆ గ్రామం నిర్మానుష్యంగా మిగిలిపోయింది అని చెబుతారు.



## 18. చనిపోయిన జంతువులు కూడా దయ్యాలుగా మారతాయా?

చాలామంది విద్యాధికులు కూడా జంతువుల్ని చాలా చులకనగా చూస్తారు. ఆ కారణంగానే ఎవరైనా వ్యక్తి, క్రూరంగా లేదా అనాగరికంగా ప్రవర్తిస్తే అతడిని

"జంతువు" అని, "బ్రూట్" (జంతు సమానుడు) అని నిందించటం జరుగుతుంది. కానీ, అతి నికృష్టమైన మనస్తత్వంగల కొందరు మనుషుల్ని – అమాయకత్వం నిండిన జంతువులతో పోల్చటం చాలా దారుణమైన విషయంగా గుర్తించాలి. ఎందుకంటే, ఆకలి వేసినప్పుడు మాత్రమే జంతువు హింసకి పాల్పడుతుంది. జంతువులు మానభంగాలు చెయ్యవు. డబ్బుకోసం అరాచకాలు చెయ్యవు. పైకి ఒకటి చెప్పటం, లోపల ఇంకొకటి ఆలోచించటం జంతువులకు తెలియదు. ముఖంలో నవ్వు, మనసులో విషం – అనే స్వభావం మనిషికి మాత్రమే ఉంటుంది. జంతువులకు ఉండదని అర్థంచేసుకోవాలి.

వన్య మృగాలలో అతి ముఖ్యమైన ఏనుగు – తనతోటి ఏనుగుల మృతదేహాల పట్ల ఒక విచిత్రమైన ప్రవర్తనను ప్రదర్శిస్తుంది. అది ఎలాగంటే, అరణ్యంలో తిరిగే ఏనుగులలో ఒక ఏనుగు మరణించినప్పుడు, ఇతర ఏనుగులు దాని మృతదేహం చుట్టూ చేరి తమ ఆవేదనను మూగగా ప్రదర్శిస్తాయి. ఇంకొక విశేషం ఏమంటే, ఆ తరువాత కొంతకాలానికి ఆ మృతదేహం అస్థిపంజరంగా మారిపోతుంది. ఆ తరువాత అటువైపుగా వచ్చే ఏనుగులు, తమ సహచరి అయిన ఆ ఏనుగుయొక్క అస్థిపంజరాన్ని చూసి, ఆపై తమ తొండాలతో ఆ అస్థిపంజరాన్ని చిన్నగా కొడతాయి. అనగా, ఆ అస్థిపంజరాన్ని అభిమానంతో పలకరించినట్లుగా గ్రహించాలి.

మనిషికి ఏవిధమైన భావాలు, రాగద్వేషాలు (ఎమోషన్స్) ఉంటాయో, జంతువులలో కూడా అవే ఉంటాయి. జంతువులకు కూడా తమ బిడ్డల పట్ల అంతులేని అభిమానం ఉంటుంది. తమ తోటి జంతువులు చనిపోతే జంతువులు ఎంతగానో బాధపడతాయి. ఒక కాకి అకస్మాత్తుగా చనిపోతే, వందలాది కాకులు ఆ కాకి మృతదేహం చుట్టూ తిరుగుతూ చాలాసేపు "కావ్, కావ్, కావ్" అని అరుస్తూ తమ దు:ఖాన్ని ప్రదర్శిస్తాయి.

ఇంకొక విశేషం ఏమంటే, ఇళ్ళల్లో పెంచుకునే పిల్లులు, కుక్కలు లాంటి పెంపుడు జీవులు – తమ యజమానులను చాలా నిశితంగా పరిశీలిస్తూ ఉంటాయి. తమ యజమాని ఆనందంగా ఉన్నాడా?, దు:ఖంతో ఉన్నాడా?, ఆందోళనతో ఉన్నాడా?, కోపంగా ఉన్నాడా?, భయంతో ఉన్నాడా?, ఉల్లాసంగా ఉన్నాడా?, తనపట్ల ప్రేమతో

ఉన్నాడా? – అన్న విషయాలు ఆ పెంపుడు జంతువులకు చాలా స్పష్టంగా తెలుస్తాయి. మనిషిని, మనిషిని నిజంగా కలిపేది ప్రేమ బంధమే అని గుర్తించాలి. అదే ప్రేమ ఒక మనిషి మరియు ఒక జంతువు మధ్య ఉన్నప్పుడు, ఆ జంతువు చనిపోయిన తరువాత కూడా ఆ మనిషి మీద తనకు ఉన్న ప్రేమను ఏమాత్రం కోల్పోదు అన్నమాట వాస్తవం.

కుక్కలు, పిల్లులు, గబ్బిలాలు మరియు కొన్ని రకాల పక్షులు – "త్వరలో రాబోతున్న తుఫానునిగాని లేదా భూకంపాన్నిగాని ముందుగానే గుర్తించి, ఆపై ఆ విపత్తుల బారి నుండి తప్పించుకోవటానికి, తమకి క్షేమంగా ఉండే ప్రదేశాలకు తాత్కాలికంగా వెళ్ళిపోతాయి. కొన్నిరకాల జంతువులు, మనిషి కంటికి కనపడని అతి నీలలోహిత కిరణాలను (ఆల్ట్రావైయొలెట్ రేస్) చూడగలవు. అదేవిధంగా, మనిషి కంటికి కనపడని విద్యుదయస్కాంత తరంగాలను (ఎలక్ట్రోమాగ్నటిక్ వేవ్స్)ని పసిగట్టగలవు. మనిషి కన్నా జంతువులు చాలా విషయాల్లో ప్రత్యేకమైన శారీరక మరియు మానసిక శక్తుల్ని కలిగి ఉన్నాయని – ఈ అంశాల్ని బట్టి మనం అర్థం చేసుకోవచ్చు. ఇన్ని ప్రత్యేకతలు ఉన్న జంతువులకు ఆత్మ ఉండదని భావించటం మూర్ఖత్వమే అవుతుంది. పాపాలు చేసి చనిపోయిన మనిషి, తన పాప కర్మలను అనుభవించటంకోసం జంతువుగా పుడతాడని బౌద్ధమతంలో, హైందవ మతంలో చాలా స్పష్టంగా చెప్పబడి ఉన్నది.

ప్రాచీన ఈజిప్టును పరిపాలించిన ఫారో చక్రవర్తులు చనిపోయినప్పుడు వారి మృతదేహాలను సమాధి చేసేవాళ్ళు. అందుకు కారణం, చనిపోయిన మనిషియొక్క ఆత్మ, మొదట తన దేహాన్ని వదిలిపెట్టి వెళ్ళిపోయినప్పటికీ, భవిష్యత్తులో మళ్ళీ తిరిగి వచ్చి తన దేహంలో ప్రవేశించి, మానవ రూపంలో మళ్లీ జీవించటం జరుగుతుందని ఆనాటి ఈజిప్టులో నమ్మేవాళ్ళు. ఆ ఫారో రాజుల సమాధులలో వాళ్ళకు సంబంధించిన అనేక వస్తువులను ఉంచేవాళ్ళు. వాటితో పాటుగా ఆ రాజులయొక్క బానిసలను మరియు పెంపుడు జంతువులను కూడా చంపి, ఆపై ఆ మృతదేహాలను కూడా ఆ రాజుల సమాధిలో ఉండేవాళ్ళు. అందుకు కారణం ఏమంటే, ఆ బానిసల యొక్క మరియు ఆ రాజుల పెంపుడు జంతువుల యొక్క ఆత్మలు కూడా ఆ రాజుల ఆత్మలతో

కలిసి పై లోకానికి వెళతాయని నమ్మటం జరిగేది. ఆనాటి ఫారో రాజులు – పిల్లుల్ని మరియు కుక్కల్ని పెంచుకుంటూ ఉండేవాళ్ళు. అందువలన ఆ రాజులు చనిపోయినప్పుడు వాళ్ళు పెంచుకునే పిల్లుల్ని లేదా కుక్కల్ని చంపి వాటి మృతదేహాలను కూడా ఆ రాజుల సమాధులలో ఉంచడటం జరిగేది. అనగా మనుషులతో పాటుగా జంతువులకు కూడా ఆత్మలు ఉంటాయని ప్రాచీన ఈజిప్టులో విశ్వసించారని అర్ధం చేసుకోవచ్చు.

ప్రపంచంలోని చాలా ప్రాంతాలలో జరిగిన పరిశోధనలలో – చనిపోయిన జంతువుల యొక్క ఆత్మలు కూడా ప్రేతాత్మలుగా మారతాయని రుజువు అయ్యింది. ఇంగ్లాండులోని ఒక గ్రామీణ ప్రాంతంలో ఒకవ్యక్తియొక్క పెంపుడు కుక్క ఒక సమయంలో పాము కరిచి చనిపోయింది. ఆ వ్యక్తి ఆ కుక్కను ఎంతగానో ప్రేమించిన కారణంగా ఆ కుక్క మృతదేహాన్ని తన పెరట్లోనే సమాధిచేసి, ఆపై దానిమీద ఒక చిన్న మొక్కను నాటాడు. ఆ కుక్క చనిపోయిన రెండు నెలల తరువాత అతడి ఇంట్లో ముఖ్యంగా, రాత్రి సమయాలలో కొన్ని విచిత్రమైన సంఘటనలు మొదలయ్యాయి. అది ఎలాగంటే...తనని ఏదో ఒక అదృశ్యశక్తి ఎల్లప్పుడూ వెంటాడుతున్నట్లుగా ఆ వ్యక్తికి అనిపించేది. అతడు, రాత్రిపూట మంచంపై పడుకుని నిద్రపోతున్నప్పుడు అతని ముఖంమీద ఏదో ఒక అదృశ్య శక్తి, శ్వాసను వదులుతున్నట్లుగా అనిపించేది. అతడు సాయంత్ర సమయంలో తన భవన బాల్కనీలో కూర్చున్నప్పుడు అతని చేతిని ఏదో ఒక అదృశ్యశక్తి నాలుకతో నాకుతున్నట్లుగా అతనికి భావన కలిగేది. అప్పుడప్పుడూ ఆ ఇంట్లోని ఏదో ఒక మూల నుండి కుక్క మూలుగుతున్నట్లుగా "గుర్" అనే శబ్దం వినపడుతూ ఉండేది. చనిపోయిన తన కుక్క మళ్ళీ ప్రేతాత్మగా మారి తన ఇంట్లో తిరుగుతున్నదని అతనికి అర్ధమయ్యింది. గతంలో, ఆ కుక్క తనకి ఎంతో ఇష్టమైనది అయినప్పటికీ, ఇప్పుడు అది ఒక ప్రేతాత్మ కనుక అది ఏ క్షణంలో అయినా తనకి హాని చేస్తుందేమో అన్న భయం అతనికి ఏర్పడింది. దాంతో అతడు తనకి దగ్గరలో ఉన్న ఒక చర్చి నుండి ఒక కాథలిక్ ప్రీస్ట్‌ని (పూజారి) తన ఇంటికి రప్పించి, అతనిచేత కొన్ని తాంత్రిక ప్రక్రియలు చేయించి, ఆపై తన ఇంట్లో సంచరిస్తున్న ఆ కుక్కయొక్క ప్రేతాత్మని శాంతింపచేసి, ఆపై దానిని పై లోకాలకు పంపించాడు.

జంతువులు, ఏ కారణంచేత చనిపోయినప్పటికీ అవి చాలా కొద్దికాలంలోనే మళ్ళీ ఏదో ఒక జంతురూపంలో జన్మిస్తాయని, హైందవ శాస్త్రాలు తెలియజేస్తున్నాయి. ఒక మనిషి చనిపోయి మళ్ళీ జన్మించటానికి కొన్ని నెలల నుండి, కొన్ని దశాబ్దాల వరకు సమయం పడుతుంది. కానీ, జంతువులు చనిపోయిన కొద్ది రోజుల్లోనే మళ్ళీ జన్మింస్తాయి. ఒక్కో సమయంలో కొందరు వ్యక్తులయొక్క పెంపుడు పిల్లులు లేదా కుక్కలు చనిపోయి, ఆపై కొద్ది రోజుల్లోనే ఇంకొక చోట పిల్లులుగా లేదా కుక్కలుగా పుట్టి, ఆపై చిన్నవయస్సులోనే, తమ గతజన్మ యజమానుల దగ్గరకు చేరుకుని వారి అభిమానాన్ని, ప్రేమని మళ్ళీ పొందటం జరుగుతుంది. అంటే, తమ యజమాని మీద తమకు ఉన్న ప్రేమను చంపుకోలేకపోయిన ఆ పెంపుడు జంతువుల యొక్క ఆత్మలు, మళ్ళీ అతి తొందరలోనే పునర్జన్మలు ఎత్తి తమ యజమానుల దగ్గరకే చేరుకున్నాయి అన్నమాట.

అమెరికాలోని ఒక రాష్ట్రంలో ఉన్న ఒక చిన్న పట్టణంలో ఒక రైతు ఉండేవాడు. అతడి దగ్గర 'యూకాన్' అనే ఒక పెంపుడు కుక్క ఉండేది. ఆ రైతు, ఆ కుక్కని తన బిడ్డ కన్నా ఎక్కువగా ఇష్టపడుతూ ఉండేవాడు. ఆ రైతు ప్రతిరోజూ ఉదయం మార్నింగ్‌వాక్‌కి వెళ్ళేటప్పుడు దానిని తనతోపాటు తీసుకువెళుతూ ఉండేవాడు. రైలు కట్ట ప్రక్కనే ఉన్న మట్టి రోడ్డుమీదుగా ఆ రైతు మార్నింగ్‌వాక్ చేస్తూ ఉండేవాడు. అలా పది సంవత్సరాలు గడిచాయి. ఒకసారి, దురదృష్టవశాత్తు ఆ కుక్కని ఒక రైలు గుద్దింది. ఫలితంగా, ఆ కుక్క అక్కడికక్కడే చనిపోయింది. ఈ సంఘటన జరిగిన తరువాత అనేకసార్లు, ప్రమాదం జరిగిన ప్రదేశం చుట్టు ప్రక్కల, అర్ధరాత్రి సమయంలో ఈ కుక్కయొక్క ఆత్మని అనేకమంది చూడటం జరిగిందని తెలుస్తున్నది. అంతేకాకుండా, ఈ కుక్క యొక్క ఆత్మ, రాత్రి సమయంలో తన యజమాని ఇంట్లో తిరుగుతూ ఉంటుందని చెప్పుకుంటారు.

అమెరికా రాజధాని నగరం అయిన "వాషింగ్‌టన్ D.C."లోని క్యాపిటల్ బిల్డింగ్ అనే (ప్రభుత్వ ముఖ్య కార్యాలయం) అతి పెద్ద భవనంలో – కొన్ని ప్రత్యేక సందర్భాలలో "పిశాచ పిల్లి" (డెమన్ కాట్) అనే ఒక నల్లపిల్లి యొక్క ప్రేతాత్మ కనిపిస్తుందని చెబుతున్నారు. అమెరికాలో – తీవ్రమైన రాజకీయ సంక్షోభం ఏర్పడటానికి

ముందు లేదా తీవ్రమైన ప్రకృతి భీభత్సం జరగటానికి ముందు లేదా అధికారంలో ఉన్న దేశాధ్యక్షుడు (యు.ఎస్.ఏ. ప్రెసిడెంట్) అకస్మాత్తుగా చనిపోవటానికి ముందు ఈ నల్లపిల్లియొక్క ఆత్మ అస్పష్టంగా కనిపిస్తుందని, ఈ క్యాపిటల్ బిల్డింగ్ లోపల అనేక రోజులపాటు సంచరిస్తుందని చెప్పుకుంటున్నారు. ఇప్పటికీ ఆ పిశాచి పిల్లి కనిపిస్తున్నట్లుగా తెలుస్తున్నది.

(ఈ డెమన్‌క్యాట్ ఏవిధంగా కనిపిస్తుంది?, దీనికి సంబంధించిన రహస్యం ఏమిటి? – లాంటి ఆసక్తికరమైన విషయాలు తెలుసుకోవటం కోసం **శ్రీధరన్ కాండూరి** రచించిన **"అర్ధరాత్రి @12pm"** అనే పరిశోధనాత్మక మరియు పిశాచ సంబంధ యదార్ధ వృత్తాంతాలను తెలియజేసే గ్రంధాన్ని చదువ గలరు.)

అమెరికాలోని సెయింట్ లూయిస్ పట్టణంలో ఒక జంతు సంబంధమైన ప్రేతాత్మ, అర్ధరాత్రి సమయాలలో ఒక భవనంలో సంచరిస్తూ ఉంటుందని చెప్పుకుంటారు. దాని వివరాలు ఇలా ఉన్నాయి...సెయింట్ లూయిస్ నగరంలో నివసించే 'లెంప్' కుటుంబం అత్యంత సంపన్నవంతమైన కుటుంబం. బీరు తయారు చేసే ఒక పెద్ద కంపెనీకి ఈ కుటుంబం యజమానిగా ఉన్నది. ఈ నగరంలో లెంప్ కుటుంబానికి ఒక పెద్ద భవనం ఉన్నది. ఈ భవనంలో లెంప్ కుటుంబం జీవిస్తూ ఉంటుంది. ఒక విశేషం ఏమంటే, కొద్ది తరాల క్రితం ఈ కుటుంబానికి చెందిన ఒక వ్యక్తి, అతి పేద స్థితి నుండి – అమెరికాలోనే అత్యంత ప్రఖ్యాతి చెందిన బీరును తయారుచేసే కంపెనీకి యజమానిగా ఎదిగాడు. దురదృష్టం ఏమిటంటే, ఆ కుటుంబంలో తరానికి ఒకడు, ఆత్మహత్య చేసుకుని చనిపోవటం జరుగుతుంది. ఫలితంగా, ఆ భవనంలో అనేక ప్రేతాత్మలు ఈనాటికీ సంచరిస్తూ ఉన్నాయి. ఒక విచిత్రం ఏమంటే, కొన్ని దశాబ్దాల క్రితం లెంప్ కుటుంబానికి యజమాని అయిన చార్లెస్ లెంప్ దగ్గర శర్వా అనే ఒక పెంపుడు కుక్క ఉండేది. తన బిడ్డలు తన దగ్గర లేకపోయినా బాధపడని చార్లెస్, తన పెంపుడు కుక్క శర్వా తన దగ్గర లేకపోతే ఎంతో బాధపడేవాడు.

లెంప్ కుటుంబానికి ఎవరో ఇచ్చిన శాపం కారణంగా వాళ్ళ కుటుంబంలో తరానికి ఒకరు లేదా ఇద్దరు ఆత్మహత్య చేసుకుంటూ ఉంటారు. ఆ ప్రకారమే,

చార్లెస్ లెంప్ కూడా ఒకరోజు అర్ధరాత్రి సమయంలో ఆత్మహత్య చేసుకోవాలని నిర్ణయించుకున్నాడు. అయితే, ఆ సమయంలో శర్వా అతని ప్రక్కనే నిలబడి అతనికేసి ఆందోళనగా చూస్తున్నది. కారణం, చార్లెస్ చేతిలో గన్ ఉన్నది మరియు అతని ముఖంలో ఏదో తీవ్రమైన అశాంతి కనపడుతున్నది. ఎన్నో ఏళ్ళుగా అతడితో కలిసి జీవిస్తున్న శర్వాకి అతడి మనసులో చెలరేగుతున్న భావాలు స్పష్టంగా అర్ధమవుతున్నాయి.



"తాను చనిపోయిన తరువాత తన పెంపుడు కుక్క శర్వా దిగులుపడి చస్తుందని" అప్పటికి చార్లెస్‌కి స్పష్టంగా అర్ధమయ్యింది. ఆపై, చార్లెస్ - తనకేసి దీనంగా చూస్తున్న శర్వాని షూట్‌చేసి, ఆ తరువాత ఆ గన్‌ని తన కణతకి గురిపెట్టుకుని కాల్చుకున్నాడు. క్షణాలలో చార్లెస్‌లెంప్ మరియు అతని పెంపుడు కుక్క శర్వా మృతదేహాలుగా మారిపోయారు. ఈ సంఘటన జరిగిన కొంతకాలం తరువాత, లెంప్ భవనంలో రాత్రి సమయాలలో శర్వా యొక్క ప్రేతాత్మ సంచరించటం మొదలయ్యింది. అంతేకాదు, అతని కుటుంబ సభ్యులు నిద్రపోతున్నప్పుడు, శర్వా ప్రేతాత్మ వాళ్ళ దగ్గరకువెళ్ళి ఆపై వారి ముఖంమీద తన మూతిని ఉంచి ఆ మూతితో వాళ్ళ చెంపల్లి రుద్దుతూ ఉంటుంది. అప్పుడప్పుడూ దీనమైన శర్వా ఏడుపు ఆ భవనంలో వినిపిస్తూ ఉంటుంది.

ముఖ్యంగా, చార్లెస్ లెంప్ మరియు శర్వా - చనిపోయిన రోజున (వర్ధంతి రోజున) ఆ భవనంలో అర్ధరాత్రి సమయంలో దాదాపు అనేక గంటలపాటు అనగా తెల్లవారురుఝామున 4 గంటల వరకు శర్వా యొక్క వికృతమైన ఏడుపు వినిపిస్తుందని

చెప్పుకుంటారు. విచిత్రం ఏమంటే, శర్వాతో పాటుగా చార్లెస్ లెంప్ ఆత్మకూడా ఆ భవనంలో రాత్రి సమయాలలో సంచరిస్తూ, అనేకసార్లు ఆ కుటుంబ సభ్యులకు కనిపించింది. చనిపోయిన తరువాత కూడా శర్వా తన యజమాని చార్లెస్‌లెంప్‌ని వదలకుండా ఆ భవనంలోనే ప్రేతాత్మగా తిరగటం – నేటికీ యదార్ధంగా జరుగుతున్న సంఘటన అని గుర్తించాలి. చనిపోయిన జంతువులు కూడా ప్రేతాత్మలుగా మారతాయని నిరూపించటానికి "శర్వా" అనే ఒక కుక్కయొక్క ప్రేతాత్మ – ఎదురులేని రుజువుగా నిలబడుతుంది.

కొంతకాలం క్రితం యు.కె. దేశంలోని వివిధ ప్రాంతాలలో "బ్లూక్రాస్ సంస్థ" (జంతువుల్ని రక్షించే అంతర్జాతీయ సంస్థ) దాదాపు 2వేల మంది వ్యక్తుల్ని ఇంటర్వ్యూ చేసింది. ఈ వ్యక్తులు ఒక కుక్కనో లేదా పిల్లినో పెంచుకుంటున్నవాళ్ళే విశేషం. వీరిలో 30% మంది, తమ పెంపుడు జంతువుల యొక్క ప్రత్యేకతను గురించి ఇలా చెప్పారు. "మేము ఇంట్లో ఉన్నప్పుడుగాని లేదా ఒంటరిగా ఎక్కడికైనా వెళుతున్నప్పుడు గాని మా పెంపుడు జంతువు మా వెంటే ఉంటుంది. మాకు, చెడుశక్తులు (ప్రేతాత్మలు/ నెగటివ్ ఎనర్జీలు) ఎలాంటి హాని చెయ్యకుండా మా పెంపుడు జంతువే మమ్మల్ని కాపాడుతూ ఉంటుంది. అంతేకాకుండా, రాత్రి సమయాలలో మా ఇంట్లోకి ఏదైనా అదృశ్య శక్తి ప్రవేశిస్తే మా పెంపుడు జంతువు మొరగటం ద్వారా, లేదా పెద్ద శబ్దంతో అరవటం ద్వారా మాకు తెలియజేస్తుంది". పెంపుడు జంతువులకు మానవాతీత శక్తులను చూడగలిగే శక్తి ఉన్నదని తమకి ప్రత్యక్షంగా రుజువు అయ్యిందని ఈ ఇంటర్వ్యూ చెయ్యబడిన వారిలో 50% మంది అభిప్రాయ పడ్డారు. ఇంకొక విశేషం ఏమంటే, ఈ ఇంటర్వ్యూలో ఇంకొక విశేషం కూడా తెలిసింది. అది ఏమిటంటే, ఇంట్లో ఉండే పిల్లి లేదా కుక్క లాంటి పెంపుడు జంతువుకి – బైట నుండి కొద్దిసేపట్లో తన యజమాని ఇంట్లోకి రాబోతున్నాడని కొద్ది నిమిషాల ముందుగానే తెలుస్తుంది. అలాగే, ఇంట్లో వాళ్ళు ముఖ్యంగా, ఆ ఇంట్లో తనకు బాగా దగ్గరగా ఉండే వ్యక్తి బైటకు వెళ్ళటానికి కొద్ది నిమిషాల ముందు ఆ విషయం ఆ ఇంట్లోని పెంపుడు జంతువుకి స్పష్టంగా తెలుస్తున్నది.

♦---ఓం శాంతి: శాంతి: శాంతి:---♦